# రమణీయ రామాయణం





దుగ్గిశెట్టి వేంకట రమణయ్య, B. A.,

నెల్లూరు.

శ్రీ

# ర మ ణీ య
# రా మా య ణ ము



### ఉత్సాహ

మెచ్చిమెచ్చి రామచంద్రమేల్మి మీ చరిత్రమున్
ముచ్చటల్ ఘటించు బాస మోదమొప్ప వ్రాసితిన్
హెచ్చుతగ్గులున్న స్వామి! ఎంచఁబోక నామదిన్
నిచ్చలిచ్చ నిల్చి! నన్ను నెమ్మిఁగాచి ప్రోవుమా!

కర్త :

దుగ్గిశెట్టి వేంకటరమణయ్య, B.A.,

నెల్లూరు.

రెండవ ముద్రణము
కాపీలు : 1000
1989.



" This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to Publish Religious Books "



ప్రాప్తిస్థానము :
శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య
వెంకటరామాపురం (W 15/988/4)
నెల్లూరు - 524 001.

ముద్రణ :
టి. యస్. కుమార్ ప్రింటర్స్
ముంగమూరువారివీధి
నెల్లూరు - 524 001.

# రమణీయ రామాయణము

## నెనరు

---

1971వ సం॥న సుందరకాండముతో నా రామాయణ రచన ఆరంభమాయెను. శ్రీరామచంద్రుని కృపవలన 1975వ సంవత్సరమున ఉత్తరకాండముతో రమణీయ రామాయణమును పూర్తి చేయగల్గితిని. గ్రంథము నంతయు మూడు భాగములుగా 1971, 1973, 1975 సం॥ లలో ముద్రించితిని.

ఇప్పుడు 18 సంవత్సరముల తరువాత మరల రమణీయ రామాయణమును ముద్రించవలయునను సంకల్పము గల్గినది. ఈ గ్రంథమును మరల పరిశీలించగా కొన్ని ఘట్టముల విపులీకరించిన చక్కగా నుండునని తోచినది. అందువలన కొన్ని ఘట్టములను విస్తృత పరచితిని. మరల ముద్రించవలయునన్న అభిప్రాయమును నా సాహితీ మిత్రులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులగారికి తెలుప వారు నన్ను మిక్కిలి ప్రోత్సహించిరి. ఆ విధముగా యీ రెండవ ముద్రణ మారంభింప బడినది.

ఈ ముద్రణకు శ్రీ తిరుపతి తిరుమల దేవస్థానములవారు 10,000 రూపాయలు భూరి విరాళి మొసగిరి. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

సింహపురి వాస్తవ్యులు వదాన్యతకు పేర్గాంచిన దొడ్ల వంశీయులు శ్రీ శేషారెడ్డి Managing Diiector, Circar Paper Mills, యీ గ్రంథమునకు వలసిన కాగితమునొసంగి సహాయపడిరి. వారికి నా కృతజ్ఞతలు.

యీ గ్రంథమును పరిశీలించి రమణీయ నీరాజన మొసగిన నా సాహితీ మిత్రులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారికి తగుసాచివ్యమొసగిన శ్రీ బండ్ల వేంకటరమణయ్యగారికి అభిప్రాయముల నొసగిన కవి పండితులకు నేను మిక్కిలి కృతజ్ఞుడను.

నా రమణీయ రామాయణమునకు పీఠిక నను్గ్రహించి రెండవ ముద్రణకు నాకవకాశము కల్పించిన శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగారికి నాకైమోడ్పులు.

ఈ రెండవ ముద్రణకు వ్రాత ప్రతుల తయారుచేసి యిచ్చిన శ్రీమతులు నా స్నుష శ్రీమతి దుగ్గిశెట్టి జ్యోత్స్న, నాపుత్రిక శ్రీమతి ముల్లంగి అనూరాధలకు సర్వ సౌఖ్యముల పరమేశ్వరు డొసగునుగాక!

ఈ గ్రంథమును చక్కగా ముద్రించిన శ్రీ టి. యస్. కుమార్ ప్రింటర్స్ ప్రొప్రయిటర్ టి. జె. సుందరరాజులుగారికి కృతజ్ఞుడను.

ఇట్లు
దుగ్గిశెట్టి వేంకటరమణయ్య
గ్రంథకర్త.

శుక్ల : శ్రావణ పౌర్ణిమ
గురువాసరము
**17-8-89.**

—o—

# రమణీయ రామాయణము

(రెండవ ముద్రణ)

## విజ్ఞాపనము

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం
యేన సర్వ మిదం తతం;
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః ॥

భ. గీ. 18-46

ఎవని నుండి భూత జాలము వెలుపడుచున్నదో ఎవరు సర్వ వ్యాపియో; అట్టి పరమాత్మను తననైజ కర్మచే నారాధించి మానవుడు పరమసిద్ధిని పొందుచున్నాడు.

'He from whom all beings arise and by whom all this is pervaded by worshipping him through the performance of his own duty does man attain perfection.'

పలుకుల ప్రోడ త్రిలోక సంచారి నారదముని. అతనిని ముని శ్రేష్ఠుడు భూలోకవాసి వాల్మీకి భక్తితో ప్రశ్నించెను. ఈ పుడమి నిప్పుడు పురుషోత్తముడెవడు? అతని చరితము వినగోరుచున్నాను. ఈ ప్రశ్న రామాయణమున కారంభమాయెను.

వాల్మీకి శ్రీరామచంద్రునకు సమకాలీనుడుకదా! ఆయనకు రాముని చరితము తెలియదా! తెలసియు నారదుని అభిప్రాయము తన అభిప్రాయముతో సరిపోవునో లేదో అన్న అనుమానముతో ప్రశ్నించెనా! ఇరువురి అభిప్రాయములు ఏకమైనందున రామాయణ కావ్యము జన్మించెను.

రాముని గాథ మననము చేయుచు స్నానార్థమరిగిన వాల్మీకి సంయమికి ఒక విషాద దృశ్యము కనపడెను. చారు నిస్వనమున రమించు క్రౌంచముల జంట నొక నిషాదుడు ఏకాకి నొనరించెను. ఆ క్రౌర్యము సహించలేని ముని శ్లోకరూపమున తనశోకమును ప్రకటించెను.

శ్లో॥ "మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీ సమాః
యత్ క్రౌంచ మిథునాదేక మవధీః కామ మోహితమ్."

అని శపించెను.

గీ॥ పొందుమా నిషాదుఁడయశంబును; పుడమిని
శాశ్వతంబు గనేక వత్సరము లెలమి
కామ మోహితలైనట్టి క్రౌంచ మిథున
మందు నొకదానిని వధించి నందు కతన;

ముని మదిని పొంగిన శోకము శ్లోకమైనది. శ్లోకము రెండర్థములు గలదై రామాయణమునకు నాందీ శ్లోకమైనది. రామాయణము ముని రచన. పరమేష్ఠి ఆశీస్సులను బొందెను. వాణీశుడు వాల్మీకి నీవిధ ముగా నాశీర్వదించెను.

ఆ॥ తరులు, గిరులు, నదులు, ధాత్రిపై నెందాక
నుండు నంతదనుక; యుర్విపైన
నీవు రచన సేయు నిమపమ రామాయ
ణము ప్రచార మొందు నమల చరిత.

వాల్మీకి మనోనేత్రమున రాముని చరితము నవలోకించుచు రామాయణము రచించెను.

ధర్మబద్ధమైన రాముని చరితము మానవుల కారాధ్యము, అనుసరణీయమాయెను. శ్రీరామచంద్రుడు ఆదర్శమానవుడై, పాల కుడై, మానవ మానస క్షేత్రములలో సుస్థిరత గాంచెను.

శ్రీరామచంద్రుడు సీతను చెరనుండి విముక్తను చేయుటలో అబలల చెరబట్టే బలవంతులు పొందు వినాశము నిరూపించెను. ఆ యత్నములో మానవుల కాదర్శమైన సంకల్పశుద్ధి, కార్యదీక్ష, నిర్భీకత ప్రదర్శించెను. రామ రావణ యుద్ధములో రావణుడు జయించిననూ శ్రీరామచంద్రుడు ప్రశంసనీయుడే.

కేవలము ఆత్మ స్థైర్యముతో శక్తిమంతులైన దుర్మార్గుల నెదుర్కొన్న ధర్మపథ గాములు మనకు ఆదర్శప్రాయులు.

ధర్మాధర్మ ప్రత్యక్ష పరోక్ష పోరాటంలో మానవుని ధార్మికశక్తి, సత్య నిష్ఠ జయించునని మానవచరిత్ర విస్పష్టంగా చాటుచున్నది.

బుద్ధునకే సైన్యముండినది. గాంధీకే శతఘ్నులుండినవి. వారి అహింసా సిద్ధాంతము చిత్త స్థైర్యము వారిని చిరస్మరణీయుల చేసినది. మన ఆర్యసంస్కృతి రామాయణాది మహాకావ్యరూపములంది, మన నాగరికతా చిహ్నములైన పెక్కురు మహనీయుల నీ కాలంలో జన్మింప జేసినది. అట్టి సంస్కృతి స్వరూపము రామాయణము. చిరస్మరణీయము.

ఇట్లు,
దుగ్గిశెట్టి వేంకటరమణయ్య
గ్రంథకర్త.

—o—

# పీఠిక

## శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు

కాంతాసమ్మితమైన కావ్యవాఙ్మయము వేదపురాణ సారస్వతము కంటె విలక్షణమైనది. చిత్తావర్జకమైనది. శబ్దప్రధానములై పరతత్త్వ నిరూపణప్రవణములై అపౌరుషేయములైన వేదములు సామాన్యులకు అసాధ్యము లగుటచే కావ్యేతిహాసాదులు ఆ కార్యము నిర్వహించినవి.

ఆదికవియగు వాల్మీకి వేదప్రతిపాదితమైన పరమార్థస్వరూపము నిరూపించుటకై రామాయణ మహాకావ్యము రచించెను. వేదమే పౌరుషేయమై రామాయణ రూపమున నవతరిల్లినది.

అయత్నోద్భవమైన ఛందమునకు రూపకల్పన గావించుటలో వాల్మీకికి సాయపడినవాడు దేవర్షి నారదుఁడు. వాల్మీకి స్రష్ట. నారదుఁడు సమాధాత. ఈ ఋషిద్వయ సమ్మేళనముచే రామాయణము లౌకికాధ్యాత్మిక భావములకు కూడలియైనది. గుణవంతుడు, వీర్యవంతుఁడు, సత్యసంధుఁడు, ధర్మజ్ఞుఁడు, దృఢవ్రతుఁడు అయిన నాయకుని భవ్యచారిత్రమే శ్రీమద్రామాయణము. ఇది పూరుషార్థప్రదమైన కల్పవృక్షము. ప్రాచేతసుఁడు రామాయణమునుగూర్చి ఇట్లు గ్గడించినాఁడు.

'కామార్థ గుణసంయుక్తం
ధర్మార్థ గుణ విస్తరం
సముద్ర మివ రత్నాఢ్యం
సర్వ శ్రుతి మనోహరమ్.' అని

వేదప్రతిపాదితమైన అధ్యాత్మికసంపద రామాయణములో నిండుగ నిక్షిప్తమై యున్నది. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించిన పూర్వా

చార్యులును, గోవిందరాజీయ వ్యాఖ్యాకారులను, పెరియ వాచ్చాంబిళ్ళ గారును శరణాగత రక్షణరూప విశేష ధర్మసంస్థాపనమే శ్రీరామావతార పరమప్రయోజనమని సిద్ధాంతీకరించిరి. పరమాత్మ నాశ్రయించుటకు శరణాగతియే మార్గము.

'నదర్మ నిష్ఠోస్మి నచాత్మవేది
నభక్తిమాన్ త్వచ్చరణారవిందే
అకించనోఽనన్యగతి శ్శరణ్యః
త్వత్పాద పద్మం శరణం ప్రపద్యే'.

అనెడి భక్తుల కాశ్రయమిచ్చు భగవానుని శరణాగతరక్షణ పరత్వ మీ కావ్యమున విశేషముగ నుండుటచే రామాయణము దీర్ఘ శరణాగతి గ్రంథమని ప్రసిద్ధి పొందినది.

'ప్రాప్యస్య బ్రహ్మణో రూపం
ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః
సదా ప్రాప్తి విరోధిచ'

ప్రాప్తమగు పరబ్రహ్మ, బ్రహ్మను ప్రాపించు ప్రత్యగాత్మ, ప్రాప్తికి ఉపాయము, ప్రాప్తికి ఫలము, ప్రాప్తికి విరోధము అను నర్థపంచక మీ కృతిలో నిమిడియున్నదని శ్రీశైలపూరులు వివరించియున్నారు.

రాముని వర్ణనచే పరబ్రహ్మస్వరూపమును, లక్ష్మణ వృత్తాంత ముచే ప్రత్యగాత్మ స్వరూపము, శరణాగతవర్ణనచే ఉపాయము విభీషణ వృత్తాంతముచే కైంకర్యరూపఫలము, రావణవృత్తాంతముచే విరోధి స్వరూపము తెలుపఁబడినది.

బాలకాండమున శ్రీమచ్ఛబ్దార్థము, అయోధ్యాకాండమున నారాయణార్థము, అరణ్యకాండమున చరణశబ్దార్థము, యుద్ధకాండ

ములో ప్రపద్యే యను నర్థము వెలసియున్నందున 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' అను ద్వయానుసంధానము రామాయణము వలనఁ గలుగున్నది.

ఈరితి శ్రీమద్రామాయణము అధ్యాత్మిక సంపదకు కాణాచి యగుటయేగాక 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు తాదృక్ ధర్మ స్వరూపుని కల్యాణగుణములు వివరించుటచే లోకకల్యాణమునకు కారణమై యొప్పినది. ఇందలి పాత్రల చిత్తవృత్తులు, భ్రాతృపితృ ప్రేమ, ఆదర్శ పత్నీత్వము. అనుపమాన పాతివ్రత్యము, ప్రజా పరి పాలన విధము, సత్యమహిమ ఇత్యాదులు జనసామాన్యమునకు ఉప దేశాత్మకములై యున్నవి. నరవానర రాక్షసరూప భిన్నప్రవృత్తుల కిది సంగమస్థానము. జాతీయ జీవనమునకు మార్గదర్శి. రామాయణమున అధ్యాత్మిక లౌకిక భక్తిభావనలు త్రివేణీ సంగమమువలె చెలువారి భారతీయ ప్రశాంతిజీవనమునకు తోడ్పడుచు ఇష్టకామ్యార్థసిద్ధి నొద వించుచున్నవి.

"లోకత్రాణ రతిన్ తదాదిమ
మహీలోక ప్రవేశోత్కభా
షాకప్త ప్రథమ ద్వితీయపద
గుంజన్మంజు మంజీర శ
బ్దాకల్పామల రామభారత కథా
సర్గంబులన్ మించు వా
ల్మీకి వ్యాసుల గొల్చెదన్ తదుభయ
శ్లేషార్థ సంసిద్ధికిన్"

అని పింగళి సూరనామాత్యుఁడు రాఘవ పాండవీయములో వాల్మీకి వ్యాసుల కంజలి ఘటించినాఁడు. అతఁ డొక్కఁడేమి? తత్పూర్వులైన మహాకవులందఱు శిరము వంచినారు.

భారతీయసంస్కృతి సంప్రదాయములకును, మానవాభ్యుదయమునకును హేతుభూతములైన రామాయణ భారత భాగవతములు రచించిన ఆ మునిద్వయముకంటె నధికులుగాని, సమానులుగాని సృష్టిలో లేరనుట అత్యుక్తిగాదు. రామాయణము ప్రపంచాదరణ పొందిన మహాకావ్యము. భారతీయభాష లన్నింటియందును తత్రాపి తెలుఁగు భాషలోను పండ్రెండవ శతాబ్దినుండి ప్రబంధ శతక ద్విపద యక్షగాన గేయ వచనాది వివిధసాహిత్య ప్రక్రియలలో అవిచ్ఛిన్నముగ వెలువడుచునే యున్నది.

అతివిశాలమైన ఆ రామగాథకు సంగ్రహరూపమై సరిక్రొత్తగా ఈ రమణీయ రామాయణము వచ్చినది. రమణీయ రామాయణమని పేరు పెట్టుటలో 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దమైన కావ్యము' అను ధ్వనితో పాటు రమణకవి కృతమన్న అర్థచమత్కారము గూడఁ గలదు,

కావ్యకర్త శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు. ఈయన రసజ్ఞులైన విక్రమసింహపుర వైశ్యప్రముఖులలో అన్యతములు. పేరు ప్రతిష్ఠలార్జించిన గణక ప్రవరుఁడు (Chartered Accountant) చాల సరసుఁడు; సహృదయుఁడు.

ఈ ప్రబంధమునకు శిల్పసుందర భోగాగార ముఖమండపముగ నున్న గురుస్తుతినిగాని, దానికి స్తంభాయమానములుగ నున్న ఆశ్వాసాంత పద్యములనుగాని తిలకించినచో శ్రీ రమణయ్యగారి సౌశీల్యసంస్కారాదు లేపాటివో గోచరించును. చూడుఁడు:

"భానుసహస్ర దీధితి విభాకలనన్
ముకురంపుముక్కదీ
ప్తానఘ సప్తవర్ణముల నంబర
వీథికిఁ జిమ్మునట్లు నా

మానస భావవీచికలు మంజుల
కావ్యకళాప్రభావళిన్
బూని వెలుంగు టారయ ప్రఫుల్ల
భవన్మతి మిత్ర దీప్తిచేన్."

అని తమ గురువైన మోచర్ల రామకృష్ణకవీంద్రుని ప్రశంసించి యున్నాఁడు. శ్రీ రామకృష్ణయ్య పంతులుగారు సంస్కృతాంధ్ర భాషా ద్వయ కవిత్వమునందు విశారదులు. బహుగ్రంథ ప్రణేతలు. జగత్ప్రఖ్యాతులు. వారి వరివస్యాఫలమున వేంకటరమణయ్యగారికి పాండిత్యముతోపాటు కమనీయకవితాకళ కైవసమైనది. ఈ లబ్ధియొక్కటే నేటి యీతని రామకథారచనకు ప్రేరకమై యుండదు. తానెంత భాషా పండితుఁడైనను, వికంకట కవితావిహారలోలుఁడైనను ఒకానొక సత్త్వాధిక చిత్తప్రవృత్తి గలవాఁడే రామాయణమువంటి పారమార్థిక రచనలపైకి మనసు మరలింపఁగలఁడు. అట్టి అంతరంగ ప్రవృత్తి శ్రీ రమణయ్య గుప్తకు సహజముగ అబ్బినట్లున్నది.

'మానవరూప మెత్తిన రమాధవ!
మంగళమూర్తి! నీకథన్
బూనికమై రచించితిని;
ముగ్ధుఁడ నైతిని నీ ప్రవృత్తికిన్.'—
'ప్రారబ్ధ కర్మదాఁటన్
బ్రారంభించితిని దాశరథి కథవ్రాయన్.'

'సదసద్భేదవిదుండ, గుణజ్ఞుఁడ, పటుతర రామభక్తి పరివర్ధిత సత్త్వుఁడ—'నని ఈయన తన్నుఁగూర్చి చెప్పుకొని యున్నాఁడు.

రమణీయ రామాయణము మూలకథావిధేయమైన స్వతంత్ర రచన. ఎక్కడో ఒకటిరెండు చోట్లఁ దప్ప వాల్మీకిభావము లీయన అనుకరించినట్లు గన్పట్టదు.

విశ్వామిత్రునాజ్ఞచే శ్రీరాముఁడు తాటకను గూల్చిన ఘట్టము లోని పద్యమిది.

"రామమన్మథ బాణంబు రాత్రిచర వ
ధూటి యెద దుస్సహంబయి నాటుకొనఁగ
రక్తగంధాను లేపన రంజితయయి
జీవితేశుని నిలయంబుఁ జేరుకొనియె." బాల. 40

రాముని బాణము హృదయమున గాటముగ నాటుకొనఁగా రక్తమనెడు గంధముచే అనులిప్తయై తాటక యమమందిరముఁజేరునను భావముతో పాటు—మన్మథబాణ విదీర్ణయై, రక్తచందనానులిప్తయై, అనురక్తయై ప్రాణవల్లభుని పాలికరిగిన ఒకానొక అభిసారికావృత్తాంతము గూడ ప్రతీయమాన మగుచున్నది.

"రామమన్మథ శరేణ తాడితా
దుస్సహేన హృదయే నిశాచరీ
గంధవ ద్రుధిర చందనోక్షితా
జీవితేశ వసతిం జగామసా"

అనెడి రఘువంశ మహాకావ్యములోని పదునొకండవ సర్గయందలి శ్లోకమునకు అప్పటమైన అనువాదము. ఇది శ్రీనాథాది ప్రాచీనకవుల పద్ధతి.

'శృంగారీచేత్ కవిః కావ్యే జాతం రసమయం జగత్ స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాత మేవ తత్ — కవి శృంగారి యగుసేని లోకమును శృంగారమయ మొనర్చును. విరాగి యైనచో నీరస పఱచును' అని యానందవర్ధనుఁడు. శ్రీ రమణయ్య శృంగారియైన కవియనుటకు పుస్తకములో పెక్కు నిదర్శనము లున్నవి.

అహల్యా వృత్తాంతములోని ఈ క్రింది పద్యము గమనింపఁ దగినది.

సీ॥ చికుర షట్పదములు జృభించినవి రామ
భద్రు పద్మోపమ ప్రపదసీమ
ముఖచంద్రబింబంబు వొడమెను రఘురామ
పదనఖ తారకల్ పల్కరింప
కుచ హేమకుంభముల్ రుచులీనె శ్రీరాము
నరికాలి మూసయం దవతరిల్లి
జఘన చక్రము దీరెఁ జక్క నృసింహుని
మడమ సమ్మెటను సన్మానమొంది

నీరదమునుండి మెఱుపు జన్మించినట్లు
మించు బోఁణి యహల్య జన్మించె దశర
థాత్మజుని పాదధూళి మహత్తు కతన
విష్ణుపది మున్ను వెల్వడు విధము దనర. బాల. 68

రామభద్రుని పాదములు పద్మములవలె, నఖములు నక్షత్రములవలె, అరికాలు మూసవలె, మడమ ఇనుపసమ్మెటవలె నున్నవి అనుటతోపాటు ఆచరణస్పర్శచే శిలారూపముఁబాసిన అహల్యాదేవియొక్క ముంగురులు తుమ్మెదలవలె, ముఖము చంద్రబింబమువలె, కుచములు బంగరు కలశములవలె, పిఱుదులు చక్రములవలె భాసిల్లెనని అభివర్ణించినాఁడు.

మేఘమునుండి మెఱుపువలె ఘనశ్యాముఁడైన రాముని పాద ధూళినుండి అహల్యపుట్టిన క్రమము అతిమాత్రసుందరముగ, అత్యద్భుతముగ చిత్రింపఁబడినది. జన్మసమయమున శిరము ముందు వెలువడును. పెనుబండయై పడియున్న అహల్యకుఁగూడ తొలుత తల తలసూపినది. ఆ తలనిండ నల్లని కురులు. తనకు శాపవిముక్తి నొసంగిన ప్రభుని పాదములకు ఆమె మోకరిల్లి మ్రొక్కినది. ఆ సన్నివేశ మెట్లున్నది? తుమ్మెదలు తామరలపై ముసిరినట్లున్నది. చుక్కలుం తోచిన పిమ్మటనే చంద్రోదయమగును. రాము నఖస్పర్శ తరువాతనే

అహల్యా ముఖచంద్రబింబము చూపట్టుట! ఆమెవదనమెత్తి రక్షకుఁడైన రాఘవుని ఒక్కసారి తిలకించినదన్నమాట! ఇఁక కుంభాదులు చేయుటకు బంగారము కరగవలెను. దానికి మూస యాధారము రామమూర్తి అరికాలిస్పర్శమూలముననే అహల్యకు కుచహేమకుంభము లేర్పడినవి. శ్రీరాముని చరణారవిందములపై వ్రాలిన అట్టి యహల్య నెమ్మదిగలేచి ఎదుట కూర్చుండెదన్నమాట! సమ్మెటమీఁద తీర్పక చక్రము లేర్పడఁ జాలవుగదా! అహల్యా జఘనచక్రము తీరుటలో— రామవిభుని మడమ తాకు కారణమైనది. కాఁగా కూర్చొనియున్న యహల్యలేచి రాముని మ్రోల నిలుచున్నదన్నమాట! ఆమె మించుబోఁణియఁట! మేఘము చెంత మెఱుపు. చాల యుక్తియుక్తము. ఒక్క అంగిక వర్ణనతో కవి అహల్యను వీడినాఁడా? ఆమెను గంగతో నుపమించినాఁడు. సారస్యమేమి? ఆయమ పావిత్ర్యమునకు, పాతివ్రత్యమునకు లోటు వాటిల్ల లేదని చెప్పక చెప్పుటయే అయినదిగదా? ఇఁక రాముని గూర్చియో! విష్ణుపది మున్ను వెల్వడువిధము దనర—అనుటలోనే యాతఁడు సాక్షాన్నారాయణుఁడే యని వెల్లడించుట జరిగినది. ఈ కవిశేఖరుని ప్రదీప్తప్రజ్ఞామేధాశాలిత్వ మెట్టిదో చాటుటకు ఈ సీసమొక్కటి చాలు!

అరణ్యమున కరుగుచున్న శ్రీరాముఁడు పరితప్తుఁడై నేలఁబడియున్న తండ్రిపాదములకు మ్రొక్కి, సంబరముతో తన్నుఁజూచుచున్న కైకకు వందనము గావించి, భక్తితో గురువులకు నమస్కరించి, తల్లులైన కౌసల్యాసుమిత్రలకు ధైర్యముచెప్పి సత్వరముగ రాజధానిని విడువ సమకట్టెనని ఈ క్రింది పద్యమున నాతని పలు విధములగు చర్యలను కవి వర్ణించెను.

"ధరఁ బరితప్తుఁడై తెరలు తండ్రిపదమ్ములు ముట్టి మ్రొక్కి, సం
బరమునఁ గాంచు కైకకును వందనముం బొనరించి; భక్తితో
గురుల కెఱంగి, తల్లుల కకుంఠిత ధైర్యము గల్గఁజేసి, స
త్వరముగ రాజధాని విడువన్ సమకట్టె రఘూద్వహుండొగిన్."

అయోధ్యా 156

ఇందు 'సత్వరముగ' అన్నుపదము దుష్టశిక్షణ శిష్టరక్షణలో రామునకుఁ గల ఆతురతను సూచించుచున్నది. ఆలసించినచో తల్లు లకుఁగాని యభిప్రాయములుమారి తన యవతార ప్రయోజనమునకు భంగముగలుగు నను సంశయము అతని కుదయించినదేమో యని పించుచున్నది. కనుకనే రాముని రఘూద్వహుఁడని చెప్పుటయు సాభి ప్రాయముగ నున్నది.

"వాసన తైలాల వన్నెలీనెడి కురుల్
జడలుగా శిరమున సంతరించి" అయోధ్యా. 157

జడలు ధరించి, భస్మత్రిపుండ్రములు దాల్చి, నారబట్టలు గట్టుకొని, రుద్రాక్షమాలలు వేసికొని, పావుకోళ్ళు దొడిగి సీతవెంట రాఁగా అరణ్య మునకుఁ బోవుచున్న రాముఁడు భూలోకము దర్శించుటకై పార్వతితోఁ గదలివచ్చిన పరమేశ్వరునివలె నుండెనని జానకీ రాములకు ఉమా శంకరులతో ఔపమ్యము కవి సంఘటింపఁజేసెను. నారాయణస్వరూపుఁ డగు రామచంద్రునకు విభూతి పెండెకట్లు దీర్చి, రుదురాకదండలు తగిలించి కేశవునిలో శివుని జూచుకొని ఈ కవీశుఁడు మురిసిపోవు చున్నాఁడు. రావణ సంహారమునకు శివాంశ మపేక్షితమేగదా!

ఇట్లే యుద్ధకాండమున ప్రతినాయకుఁడగు రావణుని మహే శ్వరునితో నుపమించినాఁడు. చిత్తగింపుఁడు.

సీ॥ భగ్నభర్మ కిరీట భాసుర శకలమ్ము
చిన్నారి జాబిల్లి చెన్ను సూప
సంయుత మూర్ధజస్రవ దురుశ్రమవారి
గంగ జాల్వారిన కరణి దోప
రక్తారుణద్యుతి రంజిత మలికమ్ము
చిచ్చుఱకంటి యచ్చెరువు నీన

చినిఁగి చీలికలైన కనకోత్తరీయంబు
షాఁప జన్నిదపుశోభను వెలార్ప

రక్తసిక్తాంతరీయ మార్ద్రగజచర్మ
సల్లలిత కాంతులను విస్తరిల్లఁజేయ;
రామబాణాగ్ని తప్తుండు రావణుండు
కాలకంఠునివలెఁ గ్రాలెఁ గదనభూమి.

యుద్ధ. 230

మంచి యొడుపుగా ఒయ్యారముగా సాగిన పద్యరచనలో నొకవిశేషము. నాల్గు చరణముల పూర్వార్ధము సంస్కృతము. ఉత్తరార్ధము జాను తెనుఁగు. ఈతఁడు పంచాక్షరీజపపరాయణుఁడు. సుందరకాండ కృత్యాది నరయునది.

అరణ్యకాండమున శూర్పణఖకథ సుమనోమనోరంజకము. విపులము. ఎంత పాకసౌకుమార్యమున్నను, శయ్యాచారుత్వమున్నను,కేవల కథాకథనవైఖరి చవు లూరింపఁజాలదు. ఈమర్మ మెఱింగి వీలున్నంతలో పాత్రలచే సందర్భోచిత సంభాషణలు చేయించినాఁడు. ఈతని రచనాశైలి ఎంత సరళసుందరమో వరుసగ నీ పద్యములు చూచిన స్పష్టమగును.

రాము :

ఎచ్చటినుండి యిచ్చటికి ఏణవిలోచన! యేగుదెంచినా;
వచ్చర లేమవా? అవని యందముఁ జూచెడి కౌతుకంబుతో
వచ్చినదానవా? దనుజవర్గ నివాసము లీ యరణ్యముల్
చెచ్చెర నేగు; మొంటరిగఁ జెల్వని బాసి వసింపరా దిటన్.

శూర్ప :

ఎవ్వతెనైన మఱేమీ?
జవ్వనమును ముడుపుగట్టి సరసుఁడ! నీకై

యివ్వనమున వసియించెద
నెవ్వఁగ దీరంగఁ బ్రియము నింపుము నాపై.

ఒంటరి నెటులైతిని? నా
జంటను నీవుండ నిచట; సఖ! నీవు వినా
కుంటువడు నాదుకోరిక
దంటరితన మవలఁద్రోచి దయఁజూడఁగదే.

రామ :

మగువ! నీవిట్లు గోరంగఁదగునె చెపుమ
ఏకపత్నీవ్రతుండ; నే నితర సతులఁ
జూడనోడుదు; నిన్గూడిమాడు వయసు
కోడెగోవాళ్ళ వెదకుము కోర్కె లలర.

శూర్ప :

చూడవదేమి? నా సొబగు సోగకనుంగవ నల్ల విచ్చి; మా
టాడవదేమి? ప్రేమ దొలుకాడు మృదూక్తుల; నిండుకూరిమిన్
బ్రోడతనంబు వెల్వఱచి పొల్పుగఁ గౌగిలిఁ జేర్పవేమి? ని
న్వేడెద; రమ్ము - నావలపు వీసరసేయకు కోరివచ్చితిన్.

ఏలరసామి! యేటికిటు లెల్లిదమాడఁగ నీకు నాయమా?
బాళినిగొంటి నీపయిని; పంబిన సంబరమొప్ప వేగ న
న్నేలుకొనంగ రాదొ? మదికెక్కిన మక్కువ నిన్నుఁగొల్తురా
తాళగఁజాలరా! మదనతాపము దీఱఁగఁ గౌగిలింపరా?

రామ :

పలుగాకి పలుకు లవురా
తులువతనం బెనయఁబలికి ద్రోహము మాకున్
సలుప నిట కరుగుదెంచిన
పలువవు; మాప్రోల నిలువ వలదిఁకఁ బొమ్మా!

శూర్ప :

మాటకు మాటకున్ బదులు మాటలు వల్కకు వన్నెకాఁడ! నీ
కూటమి గోరివచ్చితిని గోర్కెను దీర్పుము నీటుకాఁడ! నా
గాటపువాంఛఁ ద్రోసి చెలగాటము లాడకు నేర్పుకాఁడ! నా
బోటి వధూటి పొందు పొలపున్ జవిచూడని జన్మమేలరా?

ఈ కాండమున 205 నుండి 227 వరకు నడచిన సీతారావణ సంవాద రచనావేళ ఈ కవితల్లజుని లేఖిని స్వర్లోకవీథుల విహరించినది. ప్రసాద మాధుర్యగుణభరితమైన ఇట్టి శైలీవిన్యాసముతో గ్రంథమాద్యంతము నడిచినది.

రాముని మనసు దోచుకొన నెదుటనిలిచిన శూర్పణఖా ప్రత్యంగ సౌందర్యము కనులకు గట్టునట్లు ప్రదర్శించియున్నాఁడు.

చెక్కులసొంపు, చన్నుఁగవ చెల్వము, కన్నుమతీరు, జాళువా
చొక్కపుమేని సోయగము, సొంపు మిటారపుమోముఁ దమ్మిపై
మక్కువనెక్కు భృంగములమాదిరి ముంగురులున్ దలిర్పఁగాఁ
జక్కఁదనాల కుప్పయగు జవ్వనిరూపముఁ దాల్చె లిప్తలోన్.

ఈ పద్యములో భృంగములు, రూపము, లిప్త అని మూడు సంస్కృతపదములను పరిహరింతుమేని అది పొన్నిగంటి తెలగన, కూచిమంచి తిమ్మనల మేలైన కొన్ని యచ్చతెనుఁగు పద్యములకు ఏ మాత్రము తీసిపోవదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇట్టి కసరత్తులపై మోజు ఈకవికున్నట్లు దోపదు. కాని తనకుఁగల విశేష ఛందోఽలంకార పరిజ్ఞానమునకు మూదలగా కృతిలో విభిన్నవృత్తములు, గేయములు వాడియున్నాఁడు. ఒకచో గర్భకవితారుచియు చూపియున్నాఁడు.

యుద్ధాది భయానకదృశ్యములను శృంగార రసస్ఫోరకములుగా చిత్రించి చమత్కరించుట ఒక గొప్ప దృష్టి. అది యీ కవికి ప్రత్యేకముగాఁ గలదు.

ఖరాదుల యుద్ధఘట్టములోని ఈపద్య మిందుల కుదాహరణ మగును.

త్రిదివద్వేషణ దూషణ త్రిశిర ఉద్వృత్తాశ్వ వక్షోరుహన్
బదవిక్షేప విపక్ష ఘోరఖర శుంభద్వారణ శ్రోణి ఉ
న్మద దైతేయచమూ వరాననను సన్మానించె రాముం డుద
గ్ర దిధక్షాశుగ దీర్ఘ బాహువులఁ జిక్కంజేసి సోత్కరుండై.
అరణ్య. 121

రాక్షససైన్యమును నాయికగాఁజేసి, అశ్వములను ఆమె స్తనములుగ, వారణములను శ్రోణులుగ వర్ణించి అట్టినాయికను వీరరాఘవుఁడు కుతుకముతో తన బాణబాహువులలోఁ జిక్కించుకొనెనని చెప్పినాఁడు. ఇట్లే రావణ జటాయువుల యుద్ధసందర్భములోని

"నెత్తుటఁ దోగుచు నేలపై దొరలిన
శిరములు పూచెండ్ల చెన్నుమీర" అరణ్య. 248

అను పద్యమునందు జటాయువుతోడి పోరాటమున ఉక్కుదక్కిన రావణుఁడు రాక్షసరతిపాలఁపడి చీకాకైన కన్నియయొక్క పాలపముఁ జిందించెనని వర్ణించినాఁడు.

యుద్ధకాండలో లంకాపురసౌధములను గాల్చుచు రాక్షసాంగనలను చుట్టుముట్టిన కపిప్రయుక్తమైన అగ్ని—అలుకదీర్చి, అనుకూల పఱచుకొనుటకై ప్రియురాండ్ర వెంటనంటు ప్రియునివలె నున్నదనుచు-

ముంగురులొత్తి, ఫాలమును మూర్కొని,
చెక్కుల ముద్దులాడి, క
న్నుంగవ దాకి......దైత్యాంగనలన్ -
విభీత హరిణాక్షుల వెన్నడియంటి మాటికిన్. యుద్ధ. 351

ఒక యుత్పలమాలిక గూర్చియున్నాఁడు. ఇతని లోకోత్తర వర్ణనా నైపుణి కిది నిదర్శన మనవచ్చును. ఈ పద్యములో భాషయు భావనయు ఒకదానితో నొకటి పందెము వేసికొని పరుగెత్తినవి. మారీచుఁడు హతుఁడగుచు 'హా లక్ష్మణా! సీతా!' యని యఱచి ప్రాణములఁ బాసెను. జానకి రామరక్షణార్థ మరుగుమని సౌమిత్రిని తొందరించినది. లక్ష్మణుని సౌమ్యోక్తులు పెడచెవినిబెట్టి నిందలు పల్కినది,

"అనార్యా కరుణారంభ నృశంస కులపాంసన
అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్
రామస్య వ్యసనం దృష్ట్వా తే నైతాని ప్రభాషసే
నైతచ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ యద్భవేత్
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు
సుదుష్ట స్త్వం వనేరామ మేకమేకోఽను గచ్ఛసి
తన్న సిద్ధ్యతి సౌమిత్రే తవవా భరతస్యవా
కథ మిందీవర శ్యామం పద్మపత్ర నిభేక్షణమ్
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనం
సమక్షం తవ సౌమిత్రే ప్రాణాం స్త్యక్షే నసంశయః
రామం వినా క్షణమపి నహి జీవామి భూతలే"

—మూలములో నిట్లుండ కర్ణశూలాయమానములగు ఆ వాక్యములు సీతనోట ననిపించుటకుఁగాని వాని ననువదించి లక్ష్మణునకు వినిపించుటకుఁగాని మనసొప్పక

"ఏమేమో యనె సౌమిత్రిన్
భామలకు వివేచనంబు పలుచ తలంపన్"

అని రెండు ముక్కలతో సరిపెట్టినాఁడు.— ఇంచుమించు ఈతని పద్యములెల్ల ధ్వనిగర్భితములు, ఔచిత్య సమంచితములు.

'లేమావి గున్నపై లేఁత కెంగేల్జాపి
బాహు మూలరుచుల బయలుచేసి' అరణ్య. 58

'ధారుణినుండి యాకసముదాక
మహోన్నతమైన మేను పెం
పారినయట్టు లాయెను—' అరణ్య. 13

ఇట్టి భావసందర్భములందు తిక్కన పెద్దనలును,

'ధారుణి రాజ్యసంపదల' యుద్ధ. 425

'మెఱికలవంటి రక్కసులు' యుద్ధ. 164

ఇట్టి పద్యపు టెత్తుగడలందు నన్నయ సూరనలును తలపున మెఱసి ఈతఁడు సమగ్ర ప్రాచీనాంధ్రసాహిత్యము నెట్లు కరతలామలకము గావించుకొనఁగల్గెనో తెలివిడి చేయును.

"పుచ్చపూవు లీలఁ బొడమిన వెన్నెల
నలరులందుఁ గొత్త యంద మొదవె;"

"దైత్యుల నుఱిమెన్
బచ్చెన బొమ్మలను జదుము బాలుని భంగిన్."

"జడిలోఁ జిక్కిన బడలిన
మిడిమేలపు కోడె మాడ్కి."

"ఊరుపు గాడ్పుల నున్నతోరోజము
లూర్ములవోలె పైకుబికి తఱుగ."

దేసితనము పుణికిపుచ్చుకొన్న ఇట్టివెన్నో మంచి భావచిత్రణలు కావ్యములో కొల్లలుగా నున్నవి.

"రాజమౌళిని వెలుఁగొందు కాంచన
కిరీటము ముండ్లకిరీట మారయన్."

"ధర్మపరాయణాత్ములకుఁ దప్పవు
కష్టము లివ్వసుంధరన్."

"దారుణవర్తనుల నేల ధాత సృజించెన్."

"కాకి కోకిలాలాపము సేయ నెంచిన
కళామధురామృత కంఠ మబ్బునే?"

"పరుని యాలి కొఱకు పరుగులేల?"

"అతివల కెన్నంగనాథు లసువులు గారే!"

"కులకాంతలఁ గనఁగఁదగునె కులటల రీతిన్."

"మరణముతోడ వైరములు మాయును."

—భాషలో స్థిరపడిపోగల శక్తిగల సూక్తులు ఈ కృతిలో కుప్పతిప్పలు.

ప్రామిడి, ప్రేఁగు, ఇగ్గు, తత్తబడ, పెఱఁగు, మేడము- ప్రవాహ వేగమున దొరలిన ఇట్టిపదము లొకటిరెండు పట్టుకొని లాక్షణికులు, సరసులైన కవులను అతినవ్యులు అన్యాయముగ తిట్టుచున్నారు. కావున 'ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధ మేవ పదం' అను నన్నపార్యుని అనుశాసనము తు, చ తప్పక శిరసావహింపఁదగినది.

అతివిస్తరము అనపేక్షితము. ఇది యొక గొప్ప కావ్యము. ఈతఁడొక గొప్ప కవి. శ్రీనివాసకటాక్షవీక్షణమున శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు దీర్ఘాయుష్మంతులై కీర్తిమంతులై యలరుచు ఇతోధికామూల్య కావ్యాలంకారములచే నాంధ్రసరస్వతిని గైసేయుదురుగాక!

**M. KONDAMACHARYA,**
Sri Venkateswara Temple Buildings,
Gudur. D/ 4-4-1973.

# సహృదయ భూమిక

## పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

"రమణీయ రామాయణము" రామకథవలెనే గ్రంథనామమును రమ్యముగానున్నది. రచయిత సార్థకజన్ముడు దుగ్గిశెట్టి వేంకట రమణయ్యగారు. సింహపురి తిక్కన్నవైదగ్ధ్యమునకుఁ దలపాలమైన తెలుగుతోట. వేంకటరాయశాస్త్రులుగారు - హుంకరించినచోటు. దీపాల పిచ్చయ్యగారివంటి సరసమనీషులు దిరుగుపాలము. వేంకటరమణయ్య గారు వృత్తితోఁ బ్రవర్తనతో - పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్నారు. దీనికితోడు పుణ్యాలబ్ధమైన కవితావాసన "పటుతర రామభక్తి పరివర్ధిత సత్త్వమైన మనస్సు. తల్లిదండ్రులు రామసేవనొర్చిన భక్తులు. వారి నుండి సంక్రమించినదీభక్తి అగుటచే - దానికి బలమెక్కువ. తాను - రామకథా సౌందర్యలోలుఁడు. ఉత్కటకవితా కుతూహల వికస్వర మానసుఁడు. ఈసమాసమున - 'కుతూహల' శబ్దము ఆణిముత్తెము వంటిది. ఆపదముతో సమాసమునకు గొప్ప వినయమబ్బినది. రామా యణరచనమునకు గావలసిన ప్రధానగుణములలో వినయమొకటి. ఈ రచయిత దానిని సాధించుకొన్నాఁడు. వీని కవితాగురువులు శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు. వారెంతటిపండితులో అంతటిసరసులు వారిరచన ఆర్భాటములేని శరత్కాలప్రవాహము. శిష్యునకుగూడ ఆగుణ మబ్బి నది. ఈకావ్యమున నెచ్చటఁ జూచినను - ప్రసన్నలలితమైన శైలి గనిపించుచుండును. ఈ కావ్యము నావిష్కరించినవారు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు. బంగారునకు తావి యబ్బినది. ఆయన జగ మెఱిఁగిన సహృదయుఁడు. ఆడంబరములేని మనీషి. "విశ్వకవి" టాగూరు హృదయమును జీర్ణించికొన్న కవితాలోలుఁడు.

వేంకటరమణయ్యగారికి - నవీనమార్గములపై ఏవగింపులేదు. ప్రాచీనతపై ఆదరమెంతో. నవీనతపై సానుభూతి యంతటిది. వారిరచనలో మొన్నమొన్న వచ్చిన ముత్యాలసరాలు వాడిరి. గేయముల నుపయోగించిరి. తోటకము - రథోద్ధతము. వనమయూరము మొదలగు విశేష వృత్తములగూడ నాదరించినారు. కొందరికి దాముచెప్పినదంతయు గ్రొత్తగా నుండవలయుననుపిచ్చి. నూత్నత యెంతవఱకు? తాము జూచినంతవఱకు. ఈయఖండ కావ్యసంసారములో నెవ్వఁడో - ప్రతి భావమును-ఎక్కడో స్పృశించియే యుండును. అందుకేఆలంకారికులు.

"తాయేవపదవిన్యాసాః తయేవార్థవిభూతయః
తదాపినూత్నంభవతి - కావ్యం - గ్రథనకౌశలాత్"

అన్నారు. అందువలన కావ్యములోఁ బ్రధానముగ నిలచునది "గ్రథనకౌశలమే" ఆకౌశల మొక్కరిలో నొక్కొక్కరీతిగానుండును. ఈరచయితకు ప్రబంధవాసన అంతగాఁ బట్టినట్టులేదు. కవిత్రయమువా రక్కడక్కడ నగుపించుచుందురు.

సీ॥ సారసాక్షినిగూడ సరగున నడుగుల
 వడివైచి చొచ్చును పర్ణశాల
పడఁతిచెంతనుజేర జడదారివెఱపున
 వెన్నిచ్చి నొచ్చితావెచ్చనూర్చు
చీఁకటిముసుఁగునఁ జెంతకుఁజేరినఁ
 జెలియకన్గొనదని చింతనొందు.
భీతియు మోహంబు పెనఁగొన, దేహంబు
 తిపురంగఁ గాలూని దిటవుఁదాల్చు

గీ॥ గుండె దడదడలాడ. మక్కువ రహింప
గౌతముని గేహిని యహల్య, కామనీయ

కమునకు నిదానమగుచెల్వ, కానుపింపఁ
జేరె నత్తన్విశయ్యకుఁ జిత్తమదుర॥

పైదానిలోఁ దిక్కన విరాటపర్వములోని కీచకుఁడున్నాడు. ఇట్టి పద్యములే శ్రీరామచంద్రుని విరహవర్ణనలోని యీ క్రిందివి—

సీ॥ సెలయేటి గలగల కలికి నవ్వులటంచుఁ
జెంతకుఁ జని దరస్మిత మొనర్చు,
జలజాతమును గాంచి చెలి ముద్దుమోమని
మోవిచెంతకుఁ జేర్చి ముద్దులాడు
మృగిబిత్తరపుఁజూపు మృగనేత్రదని యెంచి
చూపులం గలుపంగఁ జూచుచుండు
కరిణి నడలుగాంచి కాంతయే యనుకొని
ఆస యుప్పొంగ వెన్నంటిపోవు.

గీ॥ ధరణిజాతను గనలేక - ధాత్రిమీఁద
పన్నెచిన్నెలు భూపుత్రివన్న యూహ
భ్రమసి మతిమాలి దీనుఁడై రాముఁడకట!
మలఁగి తిరుగుచు నుండెను మందుని వలె॥

సీ॥ పద్మాకరమునుండి పద్మగంధము పర్వఁ
జెలిమేని తావి యంచలరి నిలుచు,
సెలయేటిబేడిస మిలమిల మెఱపులు
కలికిచూపులటంచు గలఁగిచూచుఁ
బూరెమ్మ గాలిలోఁ బొలుపుగాఁ జలియింపఁ
బడఁతి పయ్యెద యని పట్టఁబోవు
వన్నెల పురి విప్పి వనమయూరం బాడ
వెసఁజూచు వరవర్ణిని సిగ యనుచు.

గీ॥ ప్రకృతి యంతయు సీతయై పరిఢవిల్లఁ
బొడమె నిచ్చటయని కూర్మిఁబొదువఁబోవు
వెలఁది లేమిని పరికించి విహ్వలించు
వంక వంకల గనుఁగొని భ్రాంతిఁ జెందు.

తిక్కన విరాటపర్వములో —

ఆ॥ పరగు పొదరు పొదరు, పల్లంబు పల్లంబు
మ్రాను మ్రాను, దుర్గమంపు ఁజోటు
దుర్గమంపు జోటు దొనదొన గుహగుహ
యాదిగాగ నెందు నరసి యరసి

అనునాటవెలఁది గలదు. అట్టిదే యీ క్రిందిది.

ఆ॥ పిలిచెపిలిచె నాతఁ డెలుగు రాపడు నట్లు
తిరిగె తిరిగె కాళ్ళుదీయు నటుల
చూచిచూచి యతఁడు సూడకచూచెను
భ్రమసె భ్రమసె నతఁడు భార్యకొఱకు,

పోతన్నగారుకూడ నీకవికిఁ బ్రియమైన కవులలో నొకఁడు, ఈ క్రిందిదానిలో సహజపాండిత్యని ఛాయలు గనుపించును.

చ॥ పలుకుల కొండనుండి నునువన్నెలనీను తెలుంగు రాళ్ళ నే
ర్పొలయఁగ సంతరించి లలితోజ్జ్వల సత్కృతి హర్మ్యమాలికల్
సులభముగా రచించి రసలుబ్ధులు ద్రష్టల మానసంబులన్
విలసితముంబొనర్చిన కవిస్థపతీంద్రుల కేనుమ్రొక్కెదన్.

అట్టిదే మరియొకటి—

మ॥ రటదత్యుజ్జ్వల కింకిణీ కలితమున్ రక్తామిషాసక్తమున్
నిటలాక్షోత్కట శూలశాతము, మహానిర్ఘాత వేగంబు, వి

స్ఫుట దుర్వ్రజ్జన కంటకప్రకటమున్ శూలంబు, క్రవ్యాదుఁడు
ద్భట దోఃశక్తిని రామచంద్రుని యెదన్ భంజింపగావైచినన్

అమరుని శ్లోకమొకటున్నది— అశ్లోకమిది.

శ్లో॥ క్షిప్తోహస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంశుకాంతం
గృహ్ణన్కేశోష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితస్సంభ్రమేణ
ఆలింగన్యోఽవధూత స్త్రిపురయువతిభిస్సాస్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధస్సదహతు దురితం శాంభవోవశ్శరాగ్నిః

అమరుకుఁడు అగ్నిదేవుని అర్ద్రాపరాధుఁడైన కాముకునివలె వర్ణించెను. ఆఛాయలు వేంకటరమణయ్యగారీ క్రింది పద్యములో ననుకరించినారు. కపిసేన లంకలో జొరబడినది. అచటి హర్మ్యకుంజములను దగులబెట్టెను. అయగ్ని యార్భాటము వేంకటరమణయ్యగారిట్లు వర్ణించినారు,

ఉ॥ ముంగురులొత్తి, ఫాలమునుమూర్కొని, చెక్కులముద్దులాడి, క
న్నుంగవఁదాకి, క్రీఁబెదవినొక్కి, గళంబునొకింతమీటి, చ
న్నుంగవనూని, పొక్కిలిని నున్నగజక్కిలిగింతవెట్టి, యు
త్తుంగ నితంబ యుగ్మమును దోయిటబట్టి తెమల్చి,క్రిందికిన్
వంగి కటి ప్రదేశమును బాహువులన్ బలుమాఱుచుట్టి, పై
కొంగును లాగి, ప్రేయసిని గోపముదీర్పగ వేడు భర్తరీ
తిం గననయ్యె, నగ్ని పలుతీరుల శయ్యల వీడి పారు దై
త్యాంగనలన్ విభీత హరిణాక్షుల వెన్బడి యంటి మాటికిన్

కాని అమరుకుని అగ్నిదేవుఁడు - కాముకుఁడు, ఇక్కడ అగ్ని భర్త. ఇచ్చట నగ్నిని భర్తృభావముతో వర్ణించుట రామాయణమున సందర్భోచితమైనదే. ఈ కవి రచనలో జాతీయములు-నుడికారములు-అక్కడక్కడ సుందరముగ సాక్షాత్కరించును. అయోధ్యకాండలో సాయంకాలవర్ణన మొకటున్నది. కైకమ్మ పట్టువదలలేదు. దశరథుఁ

లొకటేయేడుపు. ఇంతలో సాయంకాలమయ్యెను. అప్పటిదీక్రింది పద్యము.

కII పూరిండ్ల నడిమి కొప్పుల
దోరంబుగ రేగు పచన ధూమము లొప్పెన్
నారీగణములు సంధ్యా
శ్రీరమణికి దిద్దు ధూప రేఖల భంగిన్

అంతటియయోధ్యలోగూడ వేంకటరమణయ్యగారెందుకో పూరిండ్లను మఱువలేదే యనుకొన్నాను. కవులను స్థపతులనుగా వర్ణించిన యీ క్రిందిపద్యమెంతో యందమైనది.

చII పలుకులకొండనుండి నునువన్నెలనీను తెలుంగురాళ్ళ నే
ర్పొలయగ సంతరించి, లలితోజ్జ్వలసత్కృతిహర్మ్యమాలికల్
సులభముగా రచించి రసలుబ్ధులు ద్రష్టల మానసంబులన్
విలసితముంబొనర్చిన కవిస్థపతీంద్రులకేను మ్రొక్కెదన్

ఈ రచనలో నార్భాటములేదు. క్లిష్టకల్పనలులేవు ఇతరులను రెచ్చగొట్టు నహంకృతిలేదు. హరిభక్తులకానందమీరచన. రసజ్ఞులకు-ఇంటిలో దయారుచేసికొనువంట. హొటలు తిండిగాదు.

ఇట్లు
పుట్టపర్తి నారాయణాచార్యులు

———

# రమణీయ నీరాజనము

## శ్రీ మొవ్వ వృషాద్రిపతి

---

ఇది రమణీయ రామాయణము "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య" మ్మని జగన్నాథపండితరాయుల తీర్పు, కావున నిది కావ్యమని ధ్వని రాముడు ధర్మవిగ్రహుడు. ధర్మము రమణీయము. రాముడు రమణీయ విగ్రహుడు. అతని కథ రమణీయము రమణీయ విగ్రహము కలిగిన రాముని యొక్క రమణీయగాథ. వాల్మీకి మహర్షి రామాయణమున ఒక్క కాండకు మాత్రమే సుందర కాండమని నామ కరణమొనర్చెను. హనుమంతుడు సుందరుడు. అందలి గాథ సుంద రము. సీత సుందరి. ఆ ఒక్కకాండ మాత్రమే కాదు. నా కావ్య మంతయు రమణీయ బంధురమని ధ్వనింప జేయుట కవి లక్ష్యము. రమణి సీతాదేవి, ఆమె రమణీయ. ఆమెకు సంబంధించిన కథ కావున రమణీయము. అనగా సీతాయాశ్చరితమని నిశ్చయము. యోగుల హృదయములను రమించు వాడు రాముడు. అతడే జగద్రమణుడు. అట్టి రమణుని దైవత్వమును ప్రతిపాదించునది కనుక రమణీయ రామాయణము. వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణమును పట్టాభి షేకముతో పూర్ణమొనర్చెను. అంతటితో రామకథ పూర్తి కాలేదు. ఒక వ్యక్తి జీవితమున సంతానప్రాప్తి జరిగిననే కాని, రమణీయత వ్యక్తము కాదు. కావుననే, రామాయణమునకు ఉత్తరకాండను జోడించి కవి రమణీయతను సాధించెను. అమూలకములైన ఎన్నో గాథలు, ఎన్నో మార్పులు - రంగనాథరామాయణము - అధ్యాత్మిక రామాయణముల నుండి, లోకవ్యాప్తతనుండి గ్రహించి, అన్నింటినీ చేర్చి మాలగా కూర్చి రమ్యత్వము నాపాదించుటచే, ఈ కావ్యమునకు రమణీయరామాయణ మను నామమన్వర్థకము. ఈ రామాయణ కావ్యరచయిత రమణుడు.

రమణుని రచన రమణీయము. కావున కవి పేరుపెట్టుటలోనే ధ్వనిని పాటించి, తన కావ్యము ధ్వని పూర్వకమని, 'కావ్యస్య ఆత్మాధ్వనిః' అను ఆనంద వర్ధనుని సిద్ధాంతాను సారము, తనకవితా లక్షణమును వ్యక్తీకరించినారు.

పూర్వ కవులందఱును, కథాగమనమున నేదో సన్నివేశమున కన్వయించి, తమ కవితా పద్ధతులను వెల్లడించుకొనినారు. ఆమార్గమే ఉత్కృష్టమని, ఈ కవిగారి నిర్ణయముకూడ. కవిత్వమునకు భావము ముఖ్యము. భావరహితమైన, ఎంతటి మంజుల మనోజ్ఞ శబ్దగుంఫిత రచన యైనను, తలలూపింపగలదేమో కాని హృదయములు స్పృశింప నేరదు. అట్టి ఒట్టి శబ్దముల కూర్పు నీరవము. నీరసము. భావములు ప్రాతక్రొత్తల మేలు కలయిక యైనచో, నవి పాఠక హృదయములను త్వరితముగా నాకర్షించును.

"ప్రాఁత భావ మొకటి పరికించు వేళలోఁ
గ్రొత్త భావ మొకటి గొనబు లీన
సంతసించు నట్టి సత్కవి హృదయంబు" 20-103

వలె, జనకుని మనస్సు ఉప్పొంగినదని కవి వాక్రుచ్చెను. విశ్వనాథ వారు, 'క్షణము నిల్వదు నామది భావతీవ్రతన్' అని శ్రీమద్రామాయణ కల్పవృక్షమున చెప్పుకొనినారు. అట్లే యీకవి భావావేశము నిరుప మానము. తనశైలి భావప్రధానము. రామాయణగాథ ప్రాతది. దానిని రచించు కవి మనస్సున నెన్నియో ననాఘ్రాత భావ సుమములు తళుకు లీనినవి. "కావున ఓ ప్రాజ్ఞులారా! కథ ప్రాతది యని యనాదరింప దగదు. ఇందలి భావములు నిత్య నూతనములు. పఠించి ఆనందింపు" డని కవి విన్నవించుచున్నారు. ప్రాఁతపలుకు వేదము. తద్గత భావము వేదధర్మము. తత్ప్రతిపాద్య ధర్మము రామచరితము. అది మాత్రమే సత్కవి హృదయానందదాయకము.

కేవలము భావము క్రొత్తది యైనంత మాత్రమున రసికహృదయములు రసప్లావితములు కాకపోవచ్చును. చమత్కారశోభ కలుగవచ్చును. కావ్యప్రధానగుణము రసము. ఆవిషయమును కవి వ్యంగ్యవైభవమున వివరించుచున్నారు.

"ఆసీనులఁ జేసి రసో
ల్లాసముగా మధుర గళములన్ నవ కవితా
ధ్యాసిత గిరిజాపరిణయ
భాసురముల గేయములను పాడుచులీలన్. 43-73

అను పద్యమున కవితకు నవ్యత అవసరమని కవి భావించుచున్నారు. కవిత మాధుర్యగుణ శోభితము కావలయును. దానిచే పాఠకునకు రసోల్లాసము భావ్యమానమగును. కావున తన కావ్యము నవకవితాధ్యాసితమనియు నూత్న భావ పరిమళములతో సామాజిక మనఃక్షేత్రములను రసనిర్భరము కావించుననని కవిహృదయము. నవకవితకు నిదర్శనముగా నిందెన్నో గేయములు కనువిందొనరించును. కవిత్వమునకు దైవభక్తి యవధియని కవి విశ్వాసముగా నిట ధ్వనించును.

కవులెందరో రామకథను వ్రాసిరి. తద్రచనా హేతువులను కూడ తెలుపుకొనిరి. మురారిభట్టు.

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితం
గుణైరేతావద్భిః జగతి పునరన్యో జయతి కః?"

అని ప్రశ్నించెను. రాముని వంటి గుణవరిష్ఠుడైన నాయకుడు రాముడొక్కడే. రాముని విడిచినచో కవులకు అట్టి నాయకుడు మఱియొకడెచ్చట లభించును? కావున తానును రామకథనే వ్రాయుదు ననెను.

ఉత్తరరామాయణమును వ్రాయుటకుగల కారణమును వివరించుచు, కంకంటిపాపరాజు గారు,

"చారు కవిత్వము నేర్చి జానకీ
జాని కథల్ రచింపక అసత్కథలెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి, వాని కవిత్వ మహత్త్వ మేటికిన్?"
అని ప్రశ్నించిరి.

"తన భక్తి రచనలు తనవి కాన, తలచిన రాముసేతలచెద నే"నని విశ్వనాథవారి నిర్ణయము.

మరి శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు రామాయణమేటికి రచించినట్లు? అవిషయమాయన ఉటంకించలేదు. కాని రామావతార లక్ష్యమును కవి నిశ్చయించినారు.

"భువిలో ధర్మాచరణము
భవపంక నిమగ్నులైన ప్రజలకు నేర్పన్" (3-17), రాముడుద యించెను.

దైవము ధర్మస్వరూపము. ధర్మానుష్ఠానము దైవారాధన. అందులకే జైమిని "అథాతో ధర్మజిజ్ఞాసా" అనిసాయించెను. వ్యాసభగవానుడు ఉత్తమాధ్యాత్మిక జ్ఞానభాండారమగు భగవద్గీతా శాస్త్రమును "ధర్మ క్షేత్రే" అని ధర్మ శబ్దముతో ప్రారంభ మొనరించిరి. పురుషార్థములలో ధర్మము ప్రథమస్థాన మాక్రమించినది. రాముడు ధర్మస్వరూపుడు. "రామోవిగ్రహవాన్‌ధర్మః" అని వాల్మీకి వాక్కు. లోకమున ధర్మా చరణమును నేర్పుటకు రాముడుద్భవించెనట. పెద్ద లాచరించిన దానినే యితరు లాచరింతురు. కేవల మితరులకు చెప్పువారే ఎక్కువ. ఆచరించి చూపువారు తక్కువ. వారే మహనీయులు. "ధర్మో రక్షతి రక్షితః" ధర్మమును మనము రక్షించినచో, అది మనలను రక్షించును. కావున నట్టి ధర్మానుష్ఠానమునకు ధర్మస్వరూపుడైన భగవానుడు రామ రూపమున నవతరించెనని, రమణయ్యగారి నిర్ణయము. వాల్మీకి మహర్షి రాముని ఉన్నత మానవునిగనే చిత్రించెను గాని దైవమని

వ్యక్తీకరింపక ధ్వని మార్గమున సూచించెను. ఈ కవి, "భవపంకే నిమగ్నులైన ప్రజలకు" అనుటలో సంసారమను బురదలో చిక్కుకొనిన ప్రజలను రక్షించుటకు రాముడుదయించెనని ధ్వనింప జేసిరి. భవతారకుడు భగవంతుడు. రాముడుభగవంతుడని. యిట వ్యంగ్యము ధర్మస్వరూపుడైన రాముని గాథ భవపంక నిమగ్న చేతనుల నుద్ధరించు నని కవి భావించి, తన భక్తిని - కావ్యప్రయోజనమును వ్యంగ్య మర్యాదానుసారము వెల్లడించి, అదియే తన కావ్యరచనకు కారణమని నిరూపించుకొనినారు.

వాల్మీకి మహర్షి, ఎన్నో సన్నివేశములలో వివిధశ్లోకములతో రామసౌందర్యము నభివర్ణించెను. కాని యీకవి యొందు రెండుతావు లందు మాత్రమే రామ సౌందర్యమును ధ్వనితము కావించెను.

"పూవు వింటి జోదు పుష్పధనుస్సును
లీలఁ గొనిన రీతిఁ గేలఁ గొనెను" 23-130

మన్మథుడు పూవింటిని గ్రహించి నంత లీలగా రాముడు శివధనుస్సు గ్రహించెనట. రాముడు మన్మథుని వంటి సౌందర్యవంతుడని ధ్వని. మన్మథుడనంగుడు. అంగ సహితమైనది వర్ణనానుకూల మగును గాని, అంగ విరహితము వర్ణనానుకూలము కాదు. రాముడు భగవంతుడు. భగవంతుడు నిరాకారుడు. అట్టి నిరాకారుడైన రాముని వర్ణించుట సాధ్యము కాదని కవి నిశ్చయము. అందులకే కవి వాచ్యముగా రామ సౌందర్యమును వర్ణింపక ఎడనెడ వ్యంగ్య మార్గవిలసిత మొనర్చెను.

శూర్పణఖ రావణుని కడ తనభంగపాటును చెప్పుకొనుచు ప్రసక్తాను ప్రసక్తముగా.

"అందమ్మున కందర్పుడు
చందురు హసియించు మోము - సారసదళమున్

నిందించు కన్నుగవ, మి
న్నందెడి పాడవు - బాహు లౌరా! నిడుపుల్"        96-136

అని రామసౌందర్యము నభివర్ణించును. ఈవర్ణనము పాత్ర స్థానీయమే కాని కవి వాక్కు కాదు.

"................అవని జాత

గుణముచేతను సౌందర్య గుణము చేత" రామున కత్యంత ప్రియము కూర్చినదట. రాముడు ధనుర్ధరుడు. ఈ యవతారమున ఒకే బాణము - ఒకే మాట, రామబాణము వ్యర్థము కాదు. మాట అసత్యముకాదు. సీత గుణముచే, సౌందర్య గుణముచేతను ఆనందము ఘటించినదట. గుణమనగా అల్లెత్రాడు. అది కలిగినది ధనువు. సద్గుణములకు నెలవు సత్యము. గుణసౌందర్యము సత్యమని పిండితార్థము. కావున రాముడు, ఒకేపత్ని - ఒకే బాణము - ఒకే మాట కలిగిన వాడని ఈపద్యమున కవి మనోజ్ఞముగా సూచించుట జూడ, రామశీలమును కవివ్యక్త మొనర్చిన జాడ తోచును.

విశ్వామిత్రయాగ సంరక్షణమున
"కంటిపై రెప్పవేయక
వింటి మీఁదఁ జేయిఁ దీయక రాముండు స్థిరముగాగ"    9-55

జాగరూకుడై యుండెనట. అనవరతానంత ప్రపంచ రక్షాదీక్షాదక్షుడైన భగవానుడు నిద్రించునా? నిద్రించుట కాతడు మానవుడా? భగవంతుడు చైతన్య స్వరూపమను విషయమును, 'కంటిపై రెప్ప వేయక' అను దానిచే నిర్ధరించు చున్నారు. విన్ను అనగా ఆకాశము. ఆకాశమున చేయి తీయక, అనగా, నాకాశము నథఃకరించిన త్రివిక్రమరూపమును ద్యోతక మొనరించుచున్నారు. ఆకాశమనగా అవకాశము. అవకాశము నందెల్ల వ్యాపించియున్నది. అఖండ సచ్చిదానంద చైతన్య స్వరూపము

అట్టి అనంత వ్యాపక చైతన్య సత్యము విశ్వామిత్రుని యాగ సంరక్ష యొనర్చుట యేమి లెక్కయని కవి ఆశయము.

వనజముఖీ వర వాగురు
లను జిక్కి ధరావిభుఁడు విలాప మొనర్పన్
గననేరని యట్లర్కుఁడు
వనజమ్ముల కినుకఁ గాంచి వార్ధినిఁ జేరెన్." 40-55

ఇది యొక రమణీయ పద్యము. సన్నివేశమును ప్రకృతి కన్వయించి వర్ణించుట మహాకవుల లక్షణము. ఇట్టి వర్ణనము లందు తిక్కన సిద్ధ హస్తుడు. ప్రకృతి నుండి మానవుడు వేరు కాదు. ప్రకృతిలో ఒక భాగమే. కైక పన్నిన వాగురులలోబడి దశరథుడు విలాప సాగరమున బడినాడు. ఆమె వనజముఖి. పైమెఱుపులను గాంచి భ్రమించినవారికి విలాపము తప్పదని కవి సూచన. వనజముఖి కోరికను తీర్చుకొనుటకు పూనుకొనిన దశరథుడు దుర్యశముగడించి కనుపింప నేరకున్నాడు. పద్మములు వనజములు వాని కర్కునిపై కినుక కలిగినది. కారణ మాతడు తమను విస్మరించి లోకహితాపాదియై సంచరించుట. నారి కోపము తీర్చుటకు సూర్యుడు సముద్రముననే పడవలసి వచ్చినది. తదుపరి అతని చరిత్రమంధకారమే. తమవంశకర్తకే అస్థితి కలిగి నపుడు, తద్వంశీయుడైన దశరథుడు వనజముఖీ వాగురులలో మును గుట యేమాశ్చర్యమని కవిప్రకటించుచున్నారు, స్త్రీలోలత్వమును విడిచిన వారు భాసింతురే గాని, తల్లోలత కలిగిన వారు ప్రకాశింపలేరని సందేశ మొసంగు చున్నారు.

పురుషులు శోక భరమ్మునఁ
బురుషోత్తము వెంట నంటి పోయిన తఱి ను
ప్పరమున కెగసిన ధూళులు
తరళాక్షుల కంటి నీటి ధారల నణఁగెన్. 58-159

శ్రీరాము డయోధ్యాపౌరుల కెంత ప్రీతిపాత్రుడో కవి వాచ్యమొనరింపలేదు. రాము డరణ్యమునకు బయలు దేరినాడు. ఆయన వెంట బయలుదేరిన పురుషుల సంఖ్యా వివరమును లేదు. కాని రాముని వెంట బయలుదేరిన పురుషుల కాలి త్రొక్కుడుల చేత ధూళి భూమ్యాకాశముల నాక్రమించినదట. రామ వియోగమును భరించలేని, తరలాక్షుల కన్నీటి ధారలతో ఆధూళి అడగి పోయినది. తరళాక్షులనుట సాభిప్రాయము. రాముని ఎడబాటు సహింపనేరని వారికన్నులు క్షుభితము లైనవి. రాముని యందు ప్రజల కెంతటి గౌరవాదరములున్నవో, రాము నెందఱు వెన్నంటిరో, ఎంత ధూళి లేచినదో, ఎందఱు తరళాక్షు లెంతకన్నీరు పరగించిరో ఊహించుకొని, పాఠకుడు ఆర్ద్రీభూత హృదయుడు కావలసినదేకాని, వ్యక్తము చేయుటకు సాధ్యము కాదు. పాఠకుల ఊహకు విడిచి పెట్టి రచన చేయుట మహాకవుల రచనలలోని ఒకానొక శిల్పవిశేషము.

తన వరములను గురించి కైకేయి రామునకు తెలిపినది. రాముని ముఖము వికారమొందలేదు.

"కైకేయి వరములన్ విని<br>
కీకారణ్యముల నుండ కృతనిశ్చయుఁడై<br>
చీఁకటి రాత్రిని వెలిఁగెడి<br>
రాకాశీతాంశు పగిది రాముం డొప్పెన్." 45-84

శుక్లపక్షము నందు క్రమముగా చంద్రుడభివృద్ధిని పొందుట లోక సహజము చీకటిరాత్రి అమావాస్య. అమావాస్యనాడు చంద్ర ప్రవేశమున కవకాశమేలేదు. కాని, అమావాస్యరేయి పూర్ణచంద్రు డుదయించినచో నెట్లుండునో అట్లు రాముడు ప్రకాశించెనట. లోకానుభవమునలేని విషయములను లోకముచే దర్శింపజేసి యనుభవింప జేయుట ఉత్తమ కవితా లక్షణము. చీకటి విషాదమునకు ప్రతీక. అంతటి విషాద

సమయమున రాముడు రాకాచంద్రుని వలె భాసించెనట. వెన్నెల ఆనందమునకు సంకేతము. కవి రాముని శీతాంశుడని ప్రయోగించుట సాభిప్రాయము. శీతాంశుడు తాను చలిచే బాధపడినను, తీవ్ర తాపమున మునిగిని లోకమునకు చల్లదన మొసంగును. కైక తీవ్ర మనో వాంఛా పరితప్తయైనది. ఆమె వాంఛను తీర్చి రాము డామె మనస్సునకు చల్లదనమొసంగి తాపము పోకార్చెనని అభిప్రాయము.

ఇట్లు ఎన్నియో పద్యములను వ్యంగ్య గర్భితములను కావించి, వాచ్య మార్గమున కన్న ధ్వని మార్గము తన కామోద యోగ్యమని కవి చాటించుకొనెను.

కుకవితాఖండన కుఠారధార శ్రీవేంకటరమణయ్యగారి పద్యధార. ఏపద్యమును తీసికొనినను, గంభీర గమనముతో, నొడ్డు లొరుసుకొని, మంద్రధ్వనితో సాగిపోవు గంగాప్రవాహ సదృశముగా సాగును. ధానుష్కుడు విడిచిన బాణమువలె రివ్వున సాగిపోవును. ఈవిషయమున నీకవి, ఏపూర్వకవికిని తీసిపోవువాడు కాడు. పద్యమును పాఠకుడు పఠింప నవసరము లేదు. పద్యమే ఆతనికి చేయూతనిచ్చి ముందునకు త్రోసికొని పోవును. అచ్చతెలుగు పద్యమైనను, సంస్కృత పద బహుళసమాసఘటిత పద్యమైనను, అర్థ గంభీరతతో, సరస పద బంధతతో తలవంచక ఠీవిగా తలపైకెత్తి నడచును. వీరిధారాశుద్ధికి, ఈరామాయణము నందలి ఏపద్యమైనను, ఉదాహరణ ప్రాయమగును.

"కట్టితి వీవు కావి, జడఁ గట్టెను నీతల మీఁది వెంట్రుకల్
బట్టితి వీవు దండమును; పట్టెలుగా వెలిబూది పూఁతలన్
బెట్టితి వీవు; దేహమునఁ బేర్పులుగా రుదురాకపేరులన్
జుట్టితివీవు జోగివలెఁ; జుల్కన పల్కులు పల్క యోగ్యమే?
109-217

పద్యమేకాదు. ద్విపదలు సైతమట్లే నడచును.

కరధృత శర చాప, కాంచన చేల
హరనుత చారిత్ర - హరిదశ్వ తేజ
నేరరు మనుజులు నీతత్త్వ మెఱుఁగ
ధారుణి నీమాయ దాట దుర్లభము. 17-89

ఈకవికి సంస్కృతాంధ్ర సాహిత్యగ్రంథ పరిశ్రమ యెక్కువ రామాయణమును రచించుచు, మధ్య మధ్య తద్భావానుగుణములైన ఎన్నో గ్రంథముల లోని శ్లోకముల ననువదించి, బంగారు భూషణము నందు, రత్నములను పొదిగినట్లు పొదిగినారు. ఆదిశంకరాచార్య విరచిత, శ్రీరామకర్ణామృతము నందలి

"జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః"
అనుశ్లోకమును, సీతారాముల వివాహసందర్భమున

"భూసుత చెందొవ దోసిట ముత్తెముల్
కెంపుల కాంతుల నింపుఁగొలిపె" 25-122

అను సీసపద్యమున ననువదించి, దీప్తిని ఘటించినారు.

కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలము ఉత్తమ నాటకరాజము. అందు దుష్యంతుడు వెంబడించిన లేడిని, అమహాకవి,

"గ్రీవా భంగాభిరామం ముహు రనుపతిత స్యందనే బద్ధ దృష్టిః"
అను చక్కని శ్లోకమున వర్ణించెను.

రాముడు మాయా హరిణమును తరుము చున్నాడు. వేంకటరమణయ్యగారి మనస్సును, కాళిదాసు శ్లోకము తరుమ కవి విడిచి పెట్టునా? అగ్రంథముల నన్నింటిని జీర్ణించు కొన్న వారుకదా! వెంటనే,

"పరుగిడు జింక వేగముగ వాలికలై నురుపుల్ స్రవింపఁగాఁ
గొఱికిన గడ్డి పోచలను గొంకునఁ జార్చును నోటి గ్రేవలన్

దెఅలుచు బాణమెప్డు పరతెంచునొ యంచుఁ గడుం గలంగుచున్
దిరుగు మొగంబు వెట్టి వెనుదృక్కుల ముందుకు సాఁగు భీతిమై
109-182

అని చిత్రించిరి.

ఒకానొక అపరాహ్ణమునందు రామచంద్రుడు సీతాదేవితో విహరించునపుడు కవిగారికి అద్భుత దర్శన మొసంగినారు. స్వయముగా దర్శింపనిదే, ఆవర్ణన మసాధ్యము.

"... ... ... ... ... ... ... ... రాముఁడా
చపలాంగీ సవిధంబునందనరె భాస్వన్నీల మేఘంబునాన్"
89-45

"నీల తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" అను వేదవాక్యమునకిది అద్భుతానువాదము.

అనువాద మొనరించుచునే, అందు తన ప్రతిభను వెలార్చిన తావులీ కావ్యమున తామరతంపర. ఆధ్యాత్మిక రామాయణమున, గుహుడు శ్రీరాముని పాదములను క్షాళన మొనరించుటకు కారణము నిర్దేశించెను.

"క్షాళయామి తవ పాదపంకజం
దేవ! దారు దృషదోః కిమంతరమ్
మానుషీకరణ చూర్ణ మస్తి తే
తవ పాద యోరివ"

ఈ శ్లోకమును కవి యనువదించు చున్నారు. కాదు అనుసరించు చున్నారు. గుహుడాటవికుడు. అతని కార్య భాష అలవాటు లేదు. అతడు నిరంతర మాటవికులతో సంచరించుచు, అదే భాషను భాషించును. ఆ పాత్రోచిత భాషలో శ్లోకము ననువదించుట కవి చూపిన నేర్పు.

"ఉండుండుము సామీ! నిలు!
బండే నీకాళ్ళు దాఁకి పడుచైందఁటగా?
ఎండిన పడవే మగునో
కుండెడు నీటిని పదాల గొబ్బునఁబోతున్." 58-162

రాముడు పడవ నధిరోహింప బోవుచున్నాడు. వెనుక నుండి "ఉండుండు సామీ! నిలు" అను కేక విన్పించినది. రామయ్య వెనుదిరిగినాడు. కుండెడు నీటితో గుహుడు పరువెత్తుకొని వచ్చుచున్నాడు. అతని కన్ను లలో ఆత్రుత, కాళ్ళలో తొందర. రాముని పాదములు సోకి తనపడవ స్త్రీఐనచో తన జీవిక మాట? పైగా నీపె యెవ్వతె యని ఇంట భార్య. ఆవిధముగా పరువెత్తుకొని వచ్చు గుహుని అమాయకత్వము రసహృద యులకు గిలిగింతలు పెట్టును. ఎవని పాదపద్మ ద్వంద్వమున గంగా స్రవంతి యుద్భవించెనో, అట్టివాని పాదములు కుండెడు నీటితో క్షాళ నము చేయ వలయుననుట గుహుని అమాయకత్వమని కవి సూచన.

శైలికి తగినట్లు, సన్నివేశములకు తగిన వృత్తములను వాడుట యందు మహాకవులు సిద్ధహస్తులు. సీతారాముల కల్యాణానంతరము వసంతము వ్యాపించినది. కవి వసంతతిలకా వృత్తద్వయమున తదృతు విశేషములను వర్ణించి, ఔచిత్య దీప్తిని కలిగించిరి. రాముడు పృథ్వి సమస్తమును విడిచి వనవాసమున కేగుచు, తన సర్వస్వమును దాన మొనర్చుటను పృథ్వీవృత్తమున వర్ణించుట సమంజసము.

సీతారామ లక్ష్మణు లత్రిమహర్షి ఆశ్రమమునకు పోవుటను కవి ముత్యాల సరము లందు వ్రాసెను. అనసూయ సీతాదేవికి, హారమును చూడామణియు నీయబోవు విషయమును కవి వృత్తము చేతనే సూచిం చును. సీతారామ లక్ష్మణులను మహామును లాహ్వానించుటను, కవి స్వాగతవృత్తమున రచించుట మనోజ్ఞము. మహా సౌందర్యవతియగు మందోదరినిచూచి సీతగా భ్రమించి ఆంజనేయస్వామి వర్తించిన

తీరును, అంబురుహ వృత్తమున వర్ణించుట ఉచితము. మందోదరి అంబురుహ వదన, సీతయు నంబురుహాననయే.

ఆంధ్ర సాహిత్యమున నిర్వచనోత్తరరామాయణములు-గద్య-పద్య కలిత చంపూరూపములు-కేవల గద్య రామాయణములు-గేయ రామాయణములు - ద్విపద రామాయణములు - దండక రామాయణములు కలవు కవి వీనినన్నింటిని ప్రయోగించి, ప్రాతక్రొత్తల మేలుకలయికగా నీకావ్యమును రూపొందించుట శ్లాఘింపదగినది.

వర్ణనముల నీకవి చేయితిరిగినవాడు. నిరుపమాన మేధాసంపత్తి కలవాడు. ఈయన వర్ణనములు అర్థధర్మాలవాలములు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో జనకుని ఇంటి కేతెంచెను.

"మొట్ట మొదటి మూఁడు పురుషార్థముల వలె
మూడు వహ్నుల వలె పొలుచు చున్న" 19.98

వారిని జనకమహారాజు దర్శించెనట. ఇందు భారతీయ వైదిక ధర్మము ప్రాచీనతత్త్వము వ్యక్తమగుచున్నవి.

"రాముడు రాక్షసాంతకుడు, ప్రజ్వలితాగ్ని యజ్ఞాగ్ని. అది పరమ పవిత్రము. పాప వినాశంకరము. రాముడను పవనాగ్నిలో రాక్షసులను సమిధలు కాలి పవిత్రీభూతు లగుదురను ధర్మమును కవి ప్రదర్శించుచున్నారు.

అనాఘ్రాతపుష్పము లెన్నో, ఈ వర్ణనములలో మనచేతికి చిక్కును. ఆస్వాదింపుమని సమీపించును. అభావపరిమళముతో మత్తెక్కించును.

"ఇందుశిలా వినిర్మితము లింద్రపురంబును దాఁకు మేడలం
దందము చందముంగల యొయ్యారులు భూషితలై నటించుచున్

సుందర మందహాస రుచి సోమునిఁ జూడఁగఁ దత్ప్రభావళిన్
గందును బాసి చందురుఁడు గానబడున్ గను విందుగాఁ బురిన్"
1-3

ఇది అయోధ్యానగర స్త్రీవర్ణనము స్త్రీలకు సౌందర్యము మాత్రమే చాలదు స్వచ్ఛశీలసంపద స్త్రీలకు పెట్టని తొడవు. అందుకే అయోధ్యాపురిలోగల స్త్రీలు అందమునందేకాదు; చందమునందును; పేరెన్నిక గన్నవారు. చందము పద్ధతి, నడవడిక, పరిపూర్ణచంద్రుడు భాసించు చున్నాడు. అచ్చటి స్త్రీలును పరిపూర్ణ భూషణ భూషితలై విహరించుచున్నారు. వనితల ఆననములు చంద్రబింబముతో నుపమించుట సహజము; వారి నవ్వులు వెన్నెలలు అవిస్వచ్ఛమైనవి. వీరి స్వచ్ఛహాసము వలన చంద్రునిలోని కందు మాసిపోయినదట. ఉత్తముల సంగతి వలన పరుల యందలి దొసంగులు సైతము మాసి పోవునని కవియాశయము. ఆపురిలోగల స్త్రీలందఱు చంద్రబింబమును తిరస్కరించు వదన సౌందర్యము కలవారని వ్యంగ్య వైభవము.

పట్టాభిషేకోత్సవ పురస్కారమున వనజనయనలు, శ్రీరామున కభ్యంజన స్నానము చేయించిరి.

"పొనరిన బంగరు గిండ్లను
జనుఁగవ చేరువను నిలిపి జలములు వోయన్
మునుకొనిన వనజనయనలఁ
గననాయెన్ ద్రికుచలైన గతిఁ జూపఱకున్. 44-76

రామచంద్రస్వామికి బంగారు భృంగారువులతో స్నానము చేయించుట వైభవ స్ఫోరకము. వారు బంగారు కుంభములను, తమ స్తనసమీపమున నుంచి, రాముని శిరస్సున నీళ్ళు పోసిరట. అపుడు వారు త్రికుచలు గాగోచరించినది. ఇందు స్త్రీసౌందర్యము ధ్వనితము. అచ్చటి స్త్రీలందఱును శాతకుంభ కుచకుంభలని పిండితార్థము.

# XLII

మూర్తిచిత్రమున, నద్భుత శిల్పప్రదర్శనము చేయగల శక్తి యీ కవికి వెన్నతో పెట్టిన విద్య. భౌతిక రూప ప్రదర్శనముతో అపాత్ర మానసిక స్థితిని ద్యోతకము కావించుట స్తవనీయము. కవి మంథర పాత్రను కుంచెతో చిత్రించుచున్నారు.

> "పంకజ మెట్లు వాతహతి వంగునొ, యట్టుల గూని యొప్పు; నే
> ణాంకునిఁబోలు నీమొగము నందొక మచ్చయు లేక రాజిలున్;
> శంక యొకింతలేదు, కడు చక్కని కుబ్జవు ప్రీతిఁ గొల్పుచున్
> వంకర దానవయ్యును శుభంకర వైతివి నాకు మంథరా! 35-24

ఇది నేరుగా కవి చేసిన వర్ణనము కాదు. కైక మంథరను ప్రశంసించు సందర్భమిది. ఇందు ఆమె గూని - మోము - హృదయము - కుబ్జాత్వము - వక్రత్వము క్రమముగా వర్ణితములైనవి. పంకజము గాలి తాకిడిచే అటునిటు వంగినట్లుగా, ఆమెనడచునపు డామె గూని అటునిటు వ్రాలుచున్నది. యౌగికార్థమున, బురదనుండి పుట్టినది పంకజము. మంథర పాపయోని సంభవయని ధ్వనితము. అది బురద నుండి పుట్టినను, పూజార్హమైనట్లు ఆమె రాజ మర్యాదల కర్హయైనది. కాని పద్మము గాలివాలున వంగినట్లు, ఆమె భావములు గాలివాలున కదలుచుండునని, ఆమె స్థిరత్వము కలిగినది కాదని, తోపింపచేయు చున్నారు. ఏణాంకుడు చంద్రుడు మంథరముఖ మట్టిది. చంద్రుని లోని మచ్చ ఆమె ముఖము నందు లేదు. కాని ఆమె హృదయ మంతయు మచ్చలతో కూడినదియే. మనస్సునకు మచ్చ కల్మషము. ఆమె కల్మష హృదయ యని కవి నిర్ణయము. ఆమె కుబ్జ శారీరకముగనే కాదు, మానసికముగా కూడ నెదుగులేని వంకర స్వభావము కలదని తీర్పు. భౌతిక వర్ణనముతో మానసిక చిత్రణ మొనరించుట హృద్యాతి హృద్యము.

ఇంద్రుడర్ధరాత్రి గౌతమ మునీంద్రుని దూరమంపించి అహల్యను సమీపించి నపుడు కవిచేసిన వర్ణనము సహజసుందరము.

పారసాక్షినిఁ గూడ సరగున నడుగుల
వడివైచి చొచ్చును పర్ణశాలఁ
... ... ... ... ... ... ... ...
జేరె నత్తన్వి శయ్యకుఁ జిత్తమదుర. 13-75

ఇదియొక నీతిబాహ్యుడైన కాముకుని మనస్థితి - భీతి - భీతిని పోద్రోచిన కోరిక, విరహవ్యథ - వెచ్చనూర్చుట మొదలగు కాముకత్వ లక్షణములు, మిక్కిలి సాజముగా వర్ణితములైనవి.

ఇట్లు వర్ణింప దొరకొన్నచో నిందలి సగము పద్యము లైనను ఉదహరింపవలసి వచ్చును. ఈకవికి నాటకీయత చాలయిష్టము. సన్నివేశములను నాటక ఫక్కిలో నడుపుట యందీతడు సిద్ధహస్తుడు.

సన్నివేశమును చదువు చున్నపుడాపాత్రలు - తచ్చేష్టలు - మన కన్నులకు గోచరించి, మనః ఫలకము పైచెఱుగనిముద్ర వేయును.

రామునిచే కొట్టబడిన, వాలి, తనను చంపుట ఎట్లు ధర్మబద్ధమని రాముని ప్రశ్నించును. మూలమున వాల్మీకి తగిన సమాధానములు చెప్పించెను. ఇందు కవి చేసిన కొన్ని సంభాషణములు తర్కసహజములై పాఠకుల హృదయముల నిట్టె ఆకర్షించును. వాలి రాముని,

"కోరిన నాదు సాయమును; కోమలి జాడను లిప్తలోపలన్
నేరిచి నీదు ముందసుర నేతను నిల్పనె? బేలవైకటా!
భీరునిఁ జేరి చంపితివి వీరుని,ఁ జాటున నిల్చి యుండి, యే
వైరము లేక, యిట్టి యెడ పాపఫలంబును బొందకుందువే?
152-102

అని ప్రశ్నించును. అందులకు రాముడొసంగిన సమాధాన మాపాత రమణీయము. తార్కిక సమ్మతము. సహృదయ నైవేద్యము.

"పరకాంతను జెఱ వట్టిన
నరభోజను శిక్షసేయ నలవియె నీకున్

బరదార చోరునకు? నా
కరయన్ నీసాయమెట్టు లర్థింపఁదగున్? 152-107

పడసి యుండ వచ్చు వాలి నీసాయాన
శ్రమము లేక నాదు ప్రాణ సఖిని
కాని యాచకుండఁ గాను నిన్నర్థింప
నీతి హీను చెలిమి నేను గోర. 153-108

తానొక తప్పుచేసి, అదే తప్పు చేసిన వానిని శిక్షించుట కెట్టి వానికిని నైతికి శక్తి యుండదు. వాలి, సోదరుడు భానుజుని భార్య నపహరించి నాడు. రావణుడు రాముని భార్య నపహరించినాడు. అట్టి వాలి ఏమొగముతో, ఈపని దోషమని రావణుని మందలింప గలడు? నీతి హీనుచెలిమి నేను కోరననుటలో రాముని ధర్మవ్యక్తిత్వము వ్యజింత మగుచున్నది. నేను యాచకుడను కాననుటలో ఔన్నత్యము-రాజసము వ్యంగ్య మానములై రసహృదయున కెనలేని ఆనందమును కూర్చును. ఈ సన్నివేశమంతయు చక్కని దృశ్య కావ్యముగా రూపు కట్టినది. రావణుడు రాత్రివేళ సీతా సన్నిధి కేతెంచి తనను వరింపుమని బల వంతపెట్టిన సన్నివేశము, నాటకీయతకు సంభాషణా చాతుర్యమునకు, పాత్ర చిత్రణము నకును నికషోపలము.

తన్నుఁ గాంచి వణఁకి తనువల్లి కుంచించి
యవనతాంగియైన యవని జాత
అందమైన మేని నంటంగఁ దలఁచిన
పంక్తి కంధరుండు పలికె నిట్లు. 178-112

రావణుని గాంచిన సీతాస్థితి చిత్రకార విరచిత రేఖాచిత్రమువలె హృద యంగమ మగుచున్నది. అతడామెను వరుసగా చేసిన సంబోధనలలో నారీరత్నమ! అనునది యొకటి. అదే సంబోధనను స్వీకరించి వైదేహి.

"పరపురుషునితో
పలుకగ నొల్లక తృణమును
నిలిపి యెదుటఁ బలికె" నట. తన అభిజాత్యమును తన సాధ్వీత్వమును గురించి యుగ్గడించి,

"నారీరత్నమ నంటివి
కూరిమితోఁ బరునిఁ గూడి కులికిన యెడలన్
నారీరత్నమ నౌదునె?
నారికిఁ బరపురుష పొందు నాణెమ్మగునే?

అని ప్రశ్నించును. ఇది యెంత ఔచిత్యవంతమో వేరుగా వివరింప నవసరము లేదు. ఈ మాటతో రావణునకు సమాధానమిచ్చు నవకాశమే లేకుండచేసినది. పరపురుషుని జేరిన స్త్రీ నారీరత్నము కాజాలదు. అట్టిచో నేను నీకు వశ్యురాలనైనచో నీసంబోధన కర్థమేమి? అని ఆతనిని నిరుత్తరుని చేయగలిగినది. ఈ సన్నివేశ మంతయు చక్కని రూపకముగా సాగినది.

సామాన్యముగా యుద్ధవర్ణనములు పాఠకునకు విసుగు జనింప జేయును. అందు కథా భాగముండదు. కేవలము కవి ప్రతిభతో ఆసన్నివేశములను ఔత్సుక్య జనకములుగా తీర్చి దిద్దవలయును. మాయాసీతను సంహరించి, రామపక్షము నెల్లవిషాదమున ముంచి, మేఘనాదుడు నికుంభిలయందు జన్నమొనర్ప నమకట్టెను. లక్ష్మణుడు వానరబలములతో నేగి,

"చండకిరణుండు తమముల
తండములన్ జీల్చు నట్లుదగ్రశరములన్
చెండాడెను లక్ష్మణుఁడు
ద్దండుడు రేద్రిమ్మరింద్ర దండును త్రుటిలోన్" 286-386

అనివర్ణించినారు. కిరణ శబ్దమునకు బాణమను నర్థము వ్యంజమాన మగుచున్నది. చండకిరణుడు సూర్యుడు. తీక్ష్ణ బాణములు కలవాడు లక్ష్మణుడు. లక్ష్మణుడు సూర్యకులజుడు. చీకటి తండంబులను సూర్యుడు కిరణములతో చీల్చగా రేయి త్రిమ్మరీంద్రను లక్ష్మణుడు చండబాణములతో చీల్చినాడట. ఇక్కడ కవి సూర్య సౌమిత్రులను ఓంబ ప్రతిబింబ భావమున వర్ణించి, తీక్ష్ణాతప శౌర్యుడు లక్ష్మణుడని ద్యోతక మొనరించెను.

ఇంద్రజిద్వ్యథ మందోదరీ రావణులకు తెలిసినది. వారు బహు విధముల విలపించిరి.

దిక్కు లేలెడి నిర్జరుల్ దిక్కు లేక
వెన్ను జూపిరి కన్నయ్య! నిన్ను గాంచి
దేహ మంతయుఁ గనులుగా దేవ నాథుఁ
డెపుడు జాగ్రత్తతో నుండు నెంచి నిన్ను. 288-399

ఇంద్రుడు సహస్రాక్షుడు. దానికి కారణ మహల్యా వృత్తాంతము. కాని మేఘనాదుని వలన కలిగిన వెఱపు వలన నింద్రుడు దేహమెల్ల కనులుగా జాగ్రత్త వహించి యున్నాడట. దేహమెల్ల కనులుగా అనునది మంచి జాతీయము. మిక్కిలి జాగరూకత కది సంకేతము. ఇంద్రదేహ నేత్రత్వము మౌని శాపఫలము. దానిని కవి యీవిధముగా నన్వయింం చుట అతిలోక సుందరము.

ఈ విషయము దనుజాంగనల చెవి చేరినది.

"నిందించిరి శూర్పణఖను
నిందించిరి పంక్తిముఖుని నిజసుతులు పతుల్
ద్రుందుటకుఁ గారణంబని
గుందుచు రక్కసలు కుప్పకూలిరి నేలన్" 289-405

ఇది లోక స్వభావ చిత్రణము. ఈ రామరావణ సంగ్రామము లంకా వాసుల కందఱకును ఆమోద యోగ్యముకాదు. రావణు డధర్మ మొన రించెననితెలిసి, అతని చర్యను మానసికముగా వ్యతిరేకించు వారెందరో కలరు. వారు బహిరంగముగా ప్రకటించుటకు రావణునకు భయపడు దురు. రావణుని ప్రథమ తనూజుడు, రాక్షసకుల ముఖ్యు డింద్రజిత్తు మరణించినాడు. రావణుడే దుఃఖించుచున్నాడు. ఇకనేమి? తమ మనోభిప్రాయముల వ్యక్తమొనరించుట కవకాశము లభించినది. అంతకు ముందు రణమున, తమసుతులు, పతులు మరణించినను, నోరెత్త జాలక యూరక యున్నారు. అవకాశము లభింపగనే, ఈ యుద్ధమునకు హేతుభూతయైన శూర్పణఖను రావణుని నిందించిరి. ఇప్పుడా నిందావాక్యములు రావణుని చెవి జేరినను, వారిని శిక్షింప నేరడు. ఇది యవకాశముగా, తమవారు మరణించిన దుఃఖమున రక్కెసులు కుప్పకూలి పోయిరట. ఇక్కడ రక్కెస శబ్దము సాభి ప్రాయము. మొండితనమునకు - కాఠిన్యమునకు, మొరటు దనమునకు రక్కెసలు ప్రతీకలు. అట్టివారే కుప్పకూలి రనగా నెందరు మరణిం చిరో అనూహ్యము. యుద్ధము రక్కెసలకే ఆమోదయోగ్యము కాదనగా మానవుల మనస్స్థితిని చెప్ప బనిలేదు. లోకానుభవమును గండూ షించిన కవి లేఖిని మాత్రమే ఇట్టి భావములను ప్రజ్వలింప జేయ గలదు. ఇట్టి మనోజ్ఞ వర్ణనములతో కవి యుద్ధవర్ణనములు విసుగు లేకుండ చేయకలిగినారు. అల్పాక్షరముల ననల్పార్థలను సంధించినారు.

కరుణరసప్లావిత సన్నివేశ చిత్రణమున శ్రీ దుగ్గిశెట్టివారి లేఖిని విశృంఖలముగా కవితా పయోధులను సృజింపగలదు, ఉత్తర కాండ లోని ఎన్నోఘట్టము లిందులకు ప్రబలసాక్ష్యములు. అరణ్యమున లక్ష్మణుడు సీతాదేవిని విడిచినాడు. అపుడు జానకి,

"రాజ్యలక్ష్మి నిరాకృత రాఘువునకు
ఆలి నానాడు, దూరస్థురాల నేఁడు

# XLVIII

శ్లాఘ్య రాజ్య రమా భోగలాలసునకు
ఏక పత్నీ వ్రతంబన నిట్టి దేమొ?" 375-146

సూటిగా హృదయ తంత్రులను మీటి శివరంజని నాలపింప జేయు పద్య మిది. రాము డేకపత్నీ వ్రతుడు. అరణ్యావాసమున రాజ్యలక్ష్మి లేదు తానున్నది. ఇపుడు రాజ్యలక్ష్మి యున్నది. తాను లేదు. ఇదే ఏకపత్నీ వ్రత లక్షణమేమో అని అధిక్షేపించుచున్నది.

"అచ్చటి కేఁగి చెప్పుము శ్రియః పతితో రఘురామమూర్తితో
నిచ్చట దుర్గమాటవిని హేళికులంబున కోపలేని పెన్
మచ్చను గూర్చినట్టి లలనన్ విడివచ్చితి నంచుఁ బెండ్లిలోఁ
జిచ్చును జుట్టి నప్పుడు వచించిన పల్కులు గూలె చిచ్చునన్"
376-147

ఈ పద్యము పైకి సీతాహృదయ వేదనగా గోచరించును. కాని యిం దెంత అధిక్షేపమున్నదో ఆరయుడు. అరణ్యములో పేదరికమున తాను గావలసివచ్చినది. కాని సంపద వచ్చినపుడు తానేల? ధనము చేరి నపుడే వ్యక్తి యొక్క నిజగుణము వ్యక్తమగునని ధ్వని. హేళి సూర్యుడు. సూర్యునకు మచ్చలంటవు. అతని తేజస్సు ముందన్నియు భస్మీభూతములగును. తనశీల మట్టిది. సూర్యవంశమునకు తనవలన తేజోవృద్ధియేగాని మచ్చరాదు. పెండ్లిలో అగ్నికి ప్రదక్షిణము చేసి రాముడు చేసిన ప్రణామము నిప్పుల పాలైనదా? అసత్యదోషము మరి సూర్యవంశమున కంటదా? తాను చిచ్చునకు ప్రదక్షిణించి చిచ్చు చొచ్చినది - బ్రహ్మాదిదేవతలామెశీల సంపద నగ్గించినారు. ఆమాటలు రామునకు స్మృతిపథమునలేవా? అను శోకార్త అధిక్షేపమున కీపద్య మద్దము పట్టి హృదయ కేదారముల నానంద సస్యముల పండించును.

పాత్రచిత్రణౌచిత్య మీయన కవిత్వమునకు ప్రాణతుల్యము. పాత్రలకు దెబ్బ తగులకుండ, కడుంగడు జాగరూకతతో కవితామృత క్షాళన మొనరించి తీర్చిదిద్దును.

రాము డరణ్యమున నేగు తఱి కౌసల్య అనేక విధములుగా దుఃఖించినది. అందు కైకను నిందించిన దూషణ వాక్యములును గలవు. రమణయ్యగారి కౌసల్య విశాల హృదయ. ఉదాత్త స్వభావ గంభీర నిరత.

"పాపము లెట్టివో గతభవమ్మున నేనొనరింపకున్న ది
వ్యాపగఁబోలు కైకమది యగ్గలమౌ పగకగ్గమౌనె? యీ
యాపద నీకు గల్గునె సుతా! గహనమ్ముల కీవు పోవ నే
నీ పగవారి మధ్య మనుటెట్టులొ? ఈవగ యీదు టెట్టులో?
48-102

కైకదివ్యాపగ. దివ్యాపగ గంగ. గంగ కలుషములు హరించును కాని తన కల్మషములను పరుల కంటింపదు. అట్టి కైక యిట్టి కోరిక కోరిన దనగా, నది తన గతజన్మ కర్మ పాపఫలము.

"..................విపిన భూముల నీవు వసించు నట్టులా
కైక యదేల కోరె కొడుకా! అని దుఃఖించినదే గాని కైకను పల్లెత్తు
మాట యనలేదు.
48-101

శ్రీ దుగ్గిశెట్టివారి రమణీయ రామాయణము సంక్షిప్తము. అట్లని మొల్లరామాయణము వంటిసంక్షిప్తము కాదు. గోపీనాథ - వావిలికొలను వారి రామాయణముల వలె యథామూలము కాదు. కొన్నిచోట్ల బహుళ సంక్షిప్తత నందినను, అవసరమగు చోట్ల వాల్మీకిశ్లోకములను కవి యథాతథముగా అనువదించినాడు.

విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్థము రాముని వెంట బంపుమని కోరినపుడు దశరథుని సమాధానమిది.

"ఊన షోడశ వర్షోమే - రామో రాజీవ లోచనః
నయుద్ధ యోగ్యతా మస్య - పశ్యామి సహ రాక్షసైః"

ఈ శ్లోకమును,

ఊన షోడశ ప్రాయమం దొప్పు రామ
చంద్రుఁ డంబుజ పత్ర లోచనుడు; రాత్రి
చరుల నేరీతిఁ ద్రుంపంగ శక్తి కలుగు
సవన రక్షకు నేవత్తు సంయమీంద్ర! 6-31

అని అనువదించెను. పై శ్లోకమున అఖండార్థమున్నది. రామున కప్పటికి పదిరెండు వత్సరములు మాత్రమే. అట్లని చెప్పినచో రాముని చూచి విశ్వామిత్రుడు "ఇంత చిన్న వయస్సునకే ఇంత పెరిగినాడా?" అని భావించ వచ్చు. రామునకు దృష్టి దోషము కలుగును. పోనీ రామునకు పదునారేండ్లని చెప్పినచో, పదునారు లోపల నెన్ని వత్సరములైనా కావచ్చును. దాన నసత్య దోష మబ్బదు. అంబుజ పత్ర లోచనుడనుటలో గూడ నిట్టి సొగసే కలదు. అంబుజము తెల్లవారగనే వికసించి ప్రొద్దు క్రుంకగనే ముకుళించు కొనును. రాముడు కూడ పసితనము వీడియు వీడక ప్రొద్దుక్రుంకగనే కన్నులు మూసికొని, ప్రొద్దు పొడువక మున్నే మేల్కొనునని అభిప్రాయము. రాజీవ లోచను డనుట సౌందర్య స్ఫోరకము. ఈభావములు రావలయునన్న ఆ పదములనే ప్రయోగింప వలయును. ఈ యనువాదము కవిగారి ప్రతిభ కద్దము పట్టుచున్నది.

"అహం వేద్మి మహాత్మానం - రామం సత్య పరాక్రమమ్
వసిష్ఠోఽపి మహాతేజా - ఏచే మే తపసి స్థితాః"

రాము మహిమయు సత్య పరాక్రమమ్ము
నే నెఱుంగుదును వసిష్ఠ మౌని యెఱుఁగు
తాపసు లెఱుంగుదురు సుమ్ము దశరథనృప!
సంశయంబేల రాముని సత్త్వమందు?

ఈ యనువాదమున చివరి పాదము కవి స్వకపోల కల్పితము. మూడు పాదములలో శ్లోక భావము నంతయు వివరించి, నాల్గవ పాదమున రామ పరాక్రమ స్థిరీకరణ మొనరించినారు.

"సత్యేన లోకాన్ జయతి -
దీనాన్ దానేన రాఘవ"

అనుశ్లోకమునకు

సత్యము చే లోకమ్ముల
నిత్యము దానమ్ముచే వనీపక తతులన్
భృత్యత్వమ్మన గురువుల
నత్యంతము వింటి చేత నరులను గెలిచెన్. 40-53

అను చక్కని యథాతథాను వాదమును కూర్చినారు.

"రామం దశరథం విద్ధి - మాం విద్ధి జనకాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి - గచ్ఛ తాత యథాసుఖమ్"

తలంచుము జానకీ సతిని తల్లిగ నావలె; రామచంద్రునిన్
దలంచుము తండ్రిగా దశరథ ప్రభు మాడ్కి; నరణ్య సీమలన్
దలంచు మయోధ్య రీతిగను; ధర్మము వీడక సత్యమూర్తివై
మెలంగుము పోయిరమ్ము సుత! మేలగు నీకు విచార మేటికిన్?
55-143

ఈ యనువాదమున గడుసు దనమున్నది. 'విద్ధి' అనుపదము మూడు పాదములందున్నది గావున 'తలచుము' అనునది మూడు పాదముల ప్రయోగింప బడినది. ధర్మము వీడక సత్యమూర్తివై అనునది మూల మున లేదు. కవి రామకథను సత్య ధర్మ స్వరూపముగా దర్శించుటచే దానిని వాచ్య మొనరించెను.

"వృక్షే వృక్షేచ పశ్యామి - చీర కృష్ణాజి నాంబరం
గృహీత ధనుషం రామం - పాశహస్త మివాంతకం"

చెట్టు చెట్టు నందు చీర కృష్ణాజినాం
బర ధరుండు బాణ పాణి రాము
పాశ హస్తుఁ గాలు వలె భయంకరుని నేఁ
గాంచు చుందు భయము గ్రమ్మ చుండ. 100-158

"రా శబ్దోచ్చార మాత్రేణ - త్రాసం సంజనియంతి మే"

అనుశ్లోకము

రాముని వలన భయంబున
'రా' మొదలుగఁ గల్గు పేళ్ళు రత్నము రథమున్
నా మనమునన్ వెఱపు ను
ద్దామ గతిన్ నిల్పు చుండుఁ దలగక యెపుడున్. 100-159

గా అనూదితమైనది. ఈ అనువాదములు స్వతో ధమ్యములు. అనువాద క్లేశము గాని, అన్వయ క్లిష్టత గాని లేక సొంత తెలుగు పద్యములుగా సాగినవి. అట్టి అనువాదమును బట్టి కవికి సంస్కృతాంధ్రముల యందు గల పట్టు అవగత మగుచున్నది.

ఇట్టి మనోజ్ఞ సుందరానువాదమును పొందిన శోకములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. చాపలమున కొన్నింటిని మాత్రము ప్రదర్శించితిని.

ఉత్తర కాండమున కవి భవభూతి ఉత్తరరామచరితమును వర వడిగా గ్రహించి సన్నివేశములను సృష్టించెను. చిత్రపట సందర్శనము అట నుండియే గ్రహించెను. అందలి రసవత్తర శ్లోకములు కొన్నింటిని అనుకరించి, అనువదించిరి.

ఈ కవికి బహుగ్రంథ పరిచయ మెక్కువ యని ముందే మనవి చేసితిని. ఎన్నో రామాయణముల నామూలాగ్రముగా జీర్ణించుకొని

యుండుటచే, అందలి మనోహరాంశముల నన్నింటిని మాలగా నేర్చి కూర్చి వాగ్దేవి నలంకరించినారు.

గౌతము డహల్యను

"వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేవ న్నివత్స్యసి" అనిశపించెను.

రాతిని కమ్మని శపించినట్లు కొన్ని రామాయణము లందు కలదు. కవి ఆ విషయమునే గ్రహించి,

"రాతిని నాతిఁజేసె ముని నాథుని కోపము రిత్తవోవునే?"

అనివర్ణించెను.

రాముని పై మంథరకు కోపము కలదని, రంగనాథము ననుస రించి "మున్నుకందుక క్రీడాపరాయణుండుగానున్న యలనాటి బాల రాముని చేఁదనకుఁ గలిగిన చరణ తాడన పరాభవ వైర కారణంబు కాగా" అని రచించినారు.

సీతాదేవి శివధనుస్సును కదలించినట్లు వాల్మీకమున లేదు. ఇందు సీత అనసూయాదేవికి తన వివాహ కథ చెప్పు సందర్భమున

"చెలులతో నాడుచు శివుని కార్ము
కము జరిపితి నొక్క కరమున" అని చెప్పుకొనును.

ఉత్తరరామాయణ మెక్కువ భాగము భవభూతి ననుకరించెను. ఈ విధముగా నెన్నో అమూలకములను రమణీయముగ జేర్చినారు. అవి నేటి పాఠకున కానందదాయకము లేకాని, అన్యములు కావు.

నన్నయ 'నానారుచిరార్థ సూక్తినిధి' నని చెప్పుకొనినారు. పాఠకున కెడనెడ ధర్మములు పరమ సత్యములునైన రహస్యములు సందేశా త్మకముగా నందింప వలయును. ఈ కవి ధర్మప్రవణుడు కవితా విశా

రదుడు. సందర్భవశమున నెన్నో సూక్తులను ఆర్యోక్తులను, లోకోక్తులను, జాతీయములను, అర్థాంతరన్యాసములుగా నేర్చి కూర్చి కవితకు దీప్తిని కలిగించుటయే కాక చక్కని చిక్కని సందేశము నందించును.

"ఎవ్వారికి కర్మదీర కెసఁగునె ఫలముల్?"

"సార విహీనంబు బ్రదుకు సంతతి లేమిన్"

"నిప్పున కలుషములు చెనకి నిలుచునె?"

"వగలాడులు మాయలందు వలతులు గారే"

"ఆశ్రయింతు ధర్మమనవరతము"

ఇట్టి ధర్మ సూక్ష్మము లీగ్రంథము నందు తామరతంపర.

ఈ కవి అపూర్వ కవితాశైలితో పాటు మహా పాండిత్య మండితుడు. గర్భ-బంధ కవిత్వములు వ్రాయుటకు భాషా పరిశ్రమ మత్యవసరము. పూర్వ కవులలో కొందరు మాత్రమే అట్టి కవితా విశేషములు నిర్వహింప గలిగినారు. వానిని గూడ అశ్రమమున సాధించి, పండితుల సరసన పెద్దపీట పెట్టించు కొన్నారు రమణయ్యగారు.

ఈయన కవిత్వము లక్షణయుక్తమై పూర్వకవితా వైభవమును జీర్ణించుకొని సాగునదయ్యెను సకృత్తుగా "కాపురించు 'వంటిస్వతంత్ర ప్రయోగములు కానుపించి" నిరంకుశాః కవయః' అను సూక్తిని రమణయ్యగారు సార్థక మొనరించి నారనిపించును,

ప్రతిభ - వ్యుత్పత్తి - అభ్యాసము అను మూడు శక్తులతో పాటు భావయిత్రీ కారయిత్రీ శక్తులు రెండును పుష్కలముగా కలిగిన వారు శ్రీ దుగ్గిశెట్టి వారు. ప్రాచీనకవితా మార్గములతో పాటు అధునిక కవితా మార్గముల నాకళించు కొనిన వారు. పద్యమును నడిపి నంత ఒడుపుగా గేయములను నడుప గలిగిన దిట్ట.

ధ్వనికారుడు చెప్పినట్లు

"దృష్ట పూర్వా అపిహ్యర్థాః కావ్యే రస పరిగ్రహాత్
సర్వే నవా ఇవా భాన్తి మధుమాస ఇవద్రుమాః"

ఈ కవి స్పర్శతో పదములకు క్రొత్త ఊపు కలుగును. భావములు పరిమళించును. రమణీయత అబ్బును. ఈనాడు లోకమునగల ప్రసిద్ధ రామాయణములతోపాటు రమణీయరామాయణమును ఆచం ద్రార్కము రసహృదయులను - భక్తులను - కవులను - పండితులను అలరించుచు కవిగారి కీర్తి కెత్తిన పతాకగా నిలిచిపోగల దనుటలో సందేహము లేదు.

శ్రీ దుగ్గిశెట్టి వేంకట రమణయ్యగారి రామాయణమునకు నీరాజన మెత్తగల, అర్హతగానీ, శక్తిగానీ నాకు లేదు. మిత్రవాక్యము శిరోధార్య ముగా స్వీకరించి, నా చాపలమును బహిర్గత మొనరించు కొనినందులకు ప్రాజ్ఞులు నన్ను మన్నింతురుగాక. ఎంత సంక్షిప్తముగా వ్రాయదలచి నను శ్రీరమణయ్యగారి ప్రతిపద్యమును నన్వాకర్షించి, నాభావములను నిలువ నిచ్చినవి కావు. ఇంకను ఎన్నియో విశేషములు కాలగర్భము నందలి సత్యములవలె, సముద్రాంతర రత్నముల వలె దాగి యున్నవి. భావి కాలమున సాహితీ మర్మజ్ఞులైన రసజ్ఞశేఖరులు వానిని వెలికి తీసి పూజార్హము లొనరింతురుగాక.

రామకథ వ్రాయనివాడు కవికాడని పూర్వభావము. ఇంత చిన్న వయస్సులోనే రామాయణము నింతరమణీయముగా నిర్వహించిన శ్రీదుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారి కవితా ప్రజ్ఞకు రమణీయ నీరాజన మెత్తుచు, నింకముందీ కవిలేఖిని నుండి ఉత్తమ కావ్యప్రసూనము లుద్భవించి, వాగ్దేవి గళము నలంకరించ వలయుననియు, కవికి ఆయురారోగ్య సంపత్తులను భగవానుడు శ్రీనివాసుడనుగ్రహించు గావుతమని ఆకాంక్షించు.

సాహితీవాచస్పతి-ఉపన్యాసచతురానన

రేపల్లె
శుక్ల - శ్రావణ -
శుద్ధ-దశమి.

మొవ్వ వృషాద్రిపతి.
ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ డిగ్రీకళాశాల-రేపల్లె

# అభిప్రాయము

"వ్యాకరణ విద్యాప్రవీణ" "భాషాప్రవీణ"

## శ్రీ బండ్ల వేంకటరమణయ్యగారు, M.A.,

శ్రీ మళయాళస్వామి ఓరియంటల్ కాలేజి - ప్రొద్దుటూరు.

ఆర్యా,

మీ 'రమణీయ రామాయణము' ఆమూలచూడము శ్రద్ధగాఁ బఠించితిని. కావ్యమం దచ్చటచ్చట పెక్కు ఘట్టములు హృదయము నలరించుచున్నవి. వానిలో నొండు, రెం డిచ్చట నుదాహరించుచున్నాను.

1. రాముని వనవాసవార్తను విని కౌసల్య కుప్పగూలిపోయినట్లు వర్ణించిన

క॥ ఒడ్డొరసి పారు నది నడి
బొడ్డున నున్నట్టి చెట్టుమూలము వ్రేల్లిన్
గడ్డలు కరుగన్ వ్రాలుచుఁ
బడ్డటు కౌసల్యవగపు వఱదన్ వ్రాలెన్."

పద్యమునఁ జెప్పబడిన సహజమగు నుపమానము మీ రచనా వైదుష్యమునకు నికషోపలం.

2. వనవాసోన్ముఖుఁ డగు రాముఁడు దశరథునిచెంత కరుగ, నాతని యవస్థను వర్ణించు పద్యము పఠితల కరుణరసప్లావితుల గావించుననుట నిస్సంశయము.

సీ॥ నాదుకంటి వెలుంగ! నా బహిఃప్రాణంబ
యీవు చల్లగనేల నిలనుజూడ
కలలెన్నొ కన్నాను, కల్లలే యాయెను
కఠినాత్మురాలు కేకయ తనూజ

నిర్ణయం బొనరించె నీకుఁ దాపసవృత్తి,
ధాత్రీపతినిఁ జేసెఁ దనకొమరుని,
నా పూర్వజన్మపుణ్యము నీవు కన్నయ్య
నా పాపఫలమె యీనాతి యాయె;

గీ॥ మాటయిచ్చితి నాతండ్రి మరలలేను;
దొసఁగు నాయందుఁ గలిగెను; దూఱఁదగదు
అనెడు భావంబు గనుపడునట్లు దన్ను
దైన్యమున జూచు తండ్రిని మాన్యునిగని. (అయోధ్యా కాం.91)

ఇందుఁ గరుణరసస్ఫోరకమగు పదబంధము రచనకు మెఱుఁగులు దిద్దినది. మీ రచనాకౌశలమునకు రసానుబంధశైలి కిదియొక మచ్చుతునక.

3. రావణునిచే నపహృతయగు సీత గౌతమిని, ప్రస్రవణగిరిని, లతకూనల, జటాయువును, సూర్యచంద్రుల, రాముని బేర్కొనుచుఁ బల్కిన పల్కులు ముత్యాలసరములు పోహళించినట్లు కూర్పఁబడి పఠితల హృదయములఁ గరుణ రస తరంగముల ముంచుచున్నవి.

సీ॥ గౌతమీమాత! నాకాంతుని కెఱిగింపు
దురితాత్మ రావణు దుష్టచేష్ట;
ప్రస్రవణగిరి! నాపతి కెఱిగింపుమా
కల్లరి రావణు కపటవృత్తి;
లతకూనలార! నాగతి వివరింపుఁడీ
రాజేంద్రసుతునకు రాఘవునకు
ఇక్ష్వాకు కులసఖా! యెందుఁబోయితివయ్య!
వృక్షంబు విడిచి యో విహగరాజ!

గీ॥ సూర్యహిమకరులార! నన్ జూడరయ్య!
రావణుని బారినుండి నన్ గావరయ్య!
యెందుఁబోతివి నాథ! నన్నిందు విడిచి
ఒంటిదానను స్వామి! నన్నోమరావె! (అరణ్యకాం.241)

4. రణరంగమును బ్రవేశించిన రాక్షసవీరులను విభీషణుఁడు రామునిని కెఱిగించుతఱి రచించిన పద్యములు. (యుద్ధకాండ 167 నుండి 176 వరకు) రంగస్థలమున తోడినటునకు నటుఁడెఱింగించునట్టి వాక్యముల రామణీయకతను గన్నులకుఁ గట్టించుచున్నవి. ఇది కావ్యమున నెలకొన్న నాటకీయత యని నా యభిప్రాయము.

అలఁతియలఁతి తెలుఁగు పదములు, ఎడనెడ నాతిదీర్ఘసమాసములు, "మొలవదె గంజాయికెలన, తులసి మొలక" ఇత్యాది లోకోక్తులు ద్రాక్షాపాకమునఁబడిన మీరచనకుఁ గడుంగడు మాధుర్యమును జేకూర్చుచున్నవి. అమృతభాండమువంటి మీ కావ్యము స్వల్పభాషా పరిజ్ఞానము గలవారికేని ఆస్వాదయోగ్యమై యున్నది. ఇది ఆంధ్ర దేశమున ఇంటింట వెలయఁదగిన కావ్యమని నాదృఢాభిప్రాయము.

భవదీయుడు,
బండ్ల వేంకటరమణయ్య

ప్రొద్దుటూరు, కడపజిల్లా
తే 30-3-73 ది

# గ్రంథకర్త విజ్ఞప్తి

( ప్రథమ ముద్రణ )

వేదనావిచలితమైన నా మనమునకు శ్రీమద్రామాయణ పారాయణము శాంతినొసంగినది. శ్రీరామచంద్రమూర్తి మహనీయగాథను నా పలుకుల విన్నవించిన నెటుల నుండునో యన్న యిచ్ఛాఫలితమే యీ గ్రంథము.

గ్రంథమంతయు ముద్రింప సాహసింపక తొలుత సుందరకాండమును వెలువరించితిని. ఆ భాగమునకు సంబంధించిన పీఠిక, అభిప్రాయములు మొదలగునవి యిందు పొందుపఱచితిని.

నా యీ గ్రంథమంతయు నాతోఁ గూర్చుండి చదివించి, ప్రోత్సహించి, సంస్కరించిన నా కవితాగురుకల్పులగు సరసకవి శ్రీ మోచెర్ల రామకృష్ణయ్యగారికిని; నా సహపాఠియగు, వ్యాకరణవిద్యాప్రవీణ, భాషాప్రవీణ శ్రీ బండ్ల వేంకటరమణయ్య M. A., గారికిని; ఎడనెడ తగుసలహాల నొసంగి ముద్రణార్హమగు చక్కని వ్రాతప్రతి వ్రాసి యిచ్చిన విద్వాన్ శ్రీ జక్కా వేంకటేశ్వరుడుగారికిని; ఈ గ్రంథమునకుఁ జక్కనిపేరు వెట్టిన విద్వాన్ శ్రీ జంధ్యాల జానకీరామశర్మగారికిని; నే నడిగినంతనే సహృదయులై చదివి, పీఠిక ననుగ్రహించిన విద్వాన్ శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగారికిని; అభిప్రాయ మొసంగిన విద్యత్కవి శ్రీ బండ్ల వేంకటరమణయ్యగారికిని నా కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

## శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు

శ్రీయుత దుగ్గిశెట్టి వెంకటరమణయ్యగారు రచించిన రమణీయ రామాయణమును చూచి యెంతో ఆనందించితిని.

ఎంద ఱెవిధముగ రచించినను మిక్కిలి సంపుష్టమైన కథా వస్తువు కలదగుటచేతను, సాక్షాత్కార సౌభాగ్యము వడసిన వేదమగుట చేతను, ధర్మార్థకామమోక్షరూపమగు చతుర్విధ పురుషార్థ సాధనోపాయ భూతమగు మహాకావ్యమగుటచేతను, నిత్యనూతనముగను, రసవత్తరము గను శోభించు కావ్యరాజము - శ్రీమద్రామాయణము.

అయినను అవతారమూర్తులగు సీతారాముల పదార్థ త్యాగమహి తత్త్వము తెలియనివారికి మాత్రము. రామాయణ రచనము మిక్కిలి దుస్సాధ్యము.

అట్టి శ్రీరామాయణ మహాకావ్యమును ఎంతో సుందరముగను, స్ఫూర్తిమంతముగను రచించి తమ భవమును సార్థకమొనర్చుకొనుటే కాక, పఠితలకును, తద్భాగ్యమును గల్గించినారు శ్రీ వెంకటరమణయ్యగారు.

ఈ కావ్యమునందలి యెన్ని ఘట్టములో ఎంతో రసోజ్జ్వలముగను, రుచిమంతముగను, రచింపఁబడియుండుటచే కావ్యపఠనమునకు దొర కొనిన పఠితచే కావ్యము విడువజాలనంతటి తమకముతో కావ్యపఠనము చేయింపజాలిన రసవత్తరమైనది. శ్రీ రమణయ్యగారి రచనా సౌమ నస్యము శూర్పణఖా ఘట్టము. అరణ్యకాండ మందలి శ్రీరామ విలాప ఘట్టము. ఇట్టి వెన్నియో దీనికి నిదర్శనముగ జూపవచ్చును. ఇంత సుందరముగ నీమహాకావ్యమును రచించిన శ్రీ రమణయ్యగారికి నా అభినందనములు.

బాపట్ల, 22-5-73 ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ.

విమర్శకాగ్రేసరులు
## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

---

మిత్రులు శ్రీ దుగ్గిశెట్టి వెంకటరమణకవిగారికి,

ఆర్యా,

మీరు అభిమానపురస్సరముగా - అభిప్రాయార్థ మొసగిన మీ 'సుందర కాండము'ను సాంతముగ చదివినాను.

ఆస్తికత అంతకంతకును అడుగంటుచున్న ఈకాలమున మీరు రామోపాసకులగుటయేకాక, మీకవితాశక్తిని రామకథాకథనమునకే వినియోగించుటయు, కావ్యమును రామునకే యంకితమొనరించుటయు, ప్రశంసింపవలసిన ప్రధానవిషయములు.

సుందరకాండమును యథామూలముగా ఎందరో అనువదించి యున్నారు. మీరట్టిపనిని పెట్టుకొనక, ఆకాండములోని కథాంశమును మాత్రమే కైకొని, స్వతంత్రరచనకు గడంగుట మీయుచితజ్ఞతను తెలుపుచున్నది.

మీకావ్యము కథావస్తువు సీత మహనీయచరిత్రమగుటచేతను, విశేషించి, మీరచనాసారస్యముచేతను, మరలమరల చదువవలెనన్న ఉత్సాహమును గలిగించుచున్నది.

మీభాష సలక్షణము, మీకవితాధార ధారాళము, సామాన్యులకును సుగమమైన సులభశైలిమీది. లలితలలితపదబంధములతోను, అలతిఅలతి సమాసములతోను మీపద్యములు చదువుటకు హాయిగానున్నవి.

ఔచిత్యమును గమనించుచు కథను నిర్వహించుటలో మీకుగల మెలకువ మెచ్చదగినది.

ఇందుకు హనుమంతుడు శ్రీరామునిసందేశమును సీతకందించు ఘట్టమును, రావణునిదురాలాపములకు సీతచేత సమాధానము చెప్పించు పట్టును నిదర్శనములు.

సామీరిసముద్రలంఘనము, లంకాపురవైభవము, లంకాదహనము, చంద్రోదయము, మున్నగువిషయములను పురస్కరించుకొని, మీరు వెలయించిన వర్ణనలు, మీభావనాబలమును తెలుపుచూ వర్ణనీయములై యున్నవి.

"చిరుమామిడి కిరువంకల
విరితీవెలు ప్రాకి కదల వేకువగాలిన్" (89)

ఇందలి ఉత్ప్రేక్ష ముచ్చటగానున్నది.

"సాగరోత్తుంగవీచికాచయమువోలె
మందువేసంగిగాడ్పుల తండమువలె
ఘోరలయకాల వర్షాంబుధారలట్లు
ప్లవగబలములు దండెత్తు లంకమీఁద"

ఇందలి యుపమానములు, వానరసేనలసంఖ్య అనంతమనియే కాక, ఆసేనలధాటి ప్రాణాంతకమన్న భావమును కూడా స్ఫురింపజేయుచూ ఇంపుగా నున్నవి.

ఇట్టిగుణవిశేషములచేత మీరచన సురుచిరమై స్తుతిభాజనమగుచున్నది.

భవిష్యత్తున మీలేఖినినుండి, ఇంతకంటెను గుణవత్తరములైన ఉత్తమకృతులుదయింపగలవని నావిశ్వాసము. అందుకుకావలసిన సాహిత్య సౌహిత్య సంపత్తిని రామచంద్రుడు మీకుప్రసాదించుగాక.

నెల్లూరు, ఇట్లు,
20-5-71 దీపాల పిచ్చయ్యశాస్త్రి.

## శ్రీమాన్ - వానమామలై వరదాచార్యులుగారు

శ్రీయుత దుగ్గిశెట్టి రమణయ్యగారికి,
నమోవాకములు,

ఆర్యా!

తమ రమణీయరామాయణము నందుకొని యందలి సుందర ఘట్టములలోని రసమును చూరకొని ప్రసవసౌరభోన్మత్తునివలె పారవశ్యమునందితిని.

లోహములన్ సువర్ణమెటు
లో యటులే విలువై రహించునీ
దేహములందు మానవత
దీప్తి వహించిన నందునుం కళా
స్నేహమొనర్చు సత్కవియొ
జీవకళాన్వితరత్నప్రోల్లస
న్మోహనభూషగాగ జన
ముల్లలదాల్చ వెలుంగు నెయ్యెడన్

మానవుడై పుట్టి బ్రహ్మానందరసోదరమగు కావ్యరసానందానుభూతిలో మునింగితేలుట అనేకజన్మాల పుణ్యపరిపాకాతిశయమునగాక యబ్బదు.

"నబ్రహ్మవిద్యా నచరాజ్యలక్ష్మీ
తథాయథేయం కవితాకవీనాం"
"సుకవితాయద్యస్తిరాజ్యేనకిం" అను
నార్యోక్తిననుసరించి మీరు లోకోత్తరపదవి నధిష్ఠించిన కవిబ్రహ్మలు.

అందును శ్రీరామచంద్రుని చరిత్రము నభివర్ణించుటలో మీకవిత యన్వర్థమగుటకు మీగురువు శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు మార్గదర్శకులగుట యొకవిశేషము, మీగురుస్తుతిలో మీరు దానిని,

"భానుసహస్రదీధితివిభాకలనన్ ముకురంపుముక్క దీ
ప్తానఘసప్తవర్ణముల నంబరవీధికి జిమ్మునట్లు నా
మానస భావవీచికలు మంజులకావ్యకళాప్రభావళిన్
బూని వెలుంగు టారయ ప్రపుల్లభవన్మతిమిత్ర దీప్తిచేన్"

అని పేర్కొనినారు. మోచర్లవారు మోచాఫలస్వాదు కవితాపాకమొనర్చు సరసకవి శిరోవతంసులు. భ్రమరకీటన్యాయముగా మీరు నట్లే మాఱిపోవుట సహజమే. రామకథ సాంఘిక ధర్మవిజ్ఞాన సర్వస్వమేకాక ఇహపర సాధకము. ఆత్మోత్తారకము, మీకట్టి రామాయణరచనము రమణీయమొనర్చి భాషాయోషకు భూషావళి నర్పించినారు. అట్లే సంఘమునకు నపారసేవ యొనర్చినారు. మీరామాయణము రసానుగుణ్యముగా ప్రౌఢిమ నార్జించియున్నను ప్రసాదగుణ భాసురమై సరస సరళ మృదుపదరీతి నడయాడినది. సంస్కృతాంధ్రములు చక్కని పాళ్ళలో మేళవించబడి రమణీయశైలితో రాజిల్లినది. ఆధునికసుందరి వలె బహుళాలంకారశోభిత కాకున్నను సహజ సౌందర్యమును పంచి పెట్టుచున్నది.

రామాయణరత్నాకరమును రమ్యమానస సరోవరముగా తీర్చి కవిరాజహంసలై రసతరంగడోలల నూయలలూగినారు. కథాగమనము, కవితాధార కుంటువడక చక్కగా సాగినవనుటలో సందేహములేదు. వర్ణనలు పరిసరముల కనులగట్టించుచున్నవి. పద్యములు హృద్యములై విబుధులకుపాయననైవేద్యములై యాస్వాద్యములగుచున్నవి. రామకథ వ్రాసి మీరుతరించుటేకాక పాఠకుల తరింపజేయుచున్నారు. మీజన్మ ధన్యము. మీకావ్యము సమ్మాన్యము. మీసాహిత్యసేవ అనన్యసామాన్యము. నేరామభక్తుడను, నాప్రభువు మీకు ఆయురారోగ్యభాగ్యము లొసంగి యితోధికసరసకావ్య రచనావకాశమును కలుగజేసి రక్షించుగాక.

చెన్నూరు, ఇట్లు, మీవాడు,
9-6-1973. వానమామలై వరదాచార్యులు.

## మోనా

ఆంధ్ర కవీంద్రులు ఎన్నో విధాలుగా రామాయణాన్ని గానంచేసి యున్నారు చేస్తూ ఉన్నారు. వాల్మీకి మూలకథకు భంగం కానటుల మరలా రామకథనే శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు చంపూ పద్ధతిలో సరళంగా ప్రసన్నంగా విరచించారు. మొత్తం కావ్యంలోని పద్య గద్యాలు 1625, ఇది స్వతంత్రకావ్యం. కాండల నామములను వాల్మీకాన్ననుసరించి యుంచారు. యీ కావ్యంలో వాల్మీకిరామాయణము. రఘువంశము. భాస్కర, మొల్ల, కంబ రామాయణములలోని విషయములుకొన్ని అక్కడక్కడా ఉన్నవి. శ్రీ రమణీయ రామాయణమని పేరిడుటలో రమణీయార్థ ప్రతిపాదకమని, శ్రీ రమణకవికృతమని ద్విధా చమత్కృతియున్నది.

శ్రీ రమణయ్యగారు మోచర్ల రామకృష్ణ కవీంద్రుని శిష్యులు. లబ్ధప్రతిష్ఠులైనవారియొద్ద కవితామ్నాయ రహస్యములను ఆకళించుకొని యున్నారు. కావ్య ప్రారంభములో మోచర్ల రామకృష్ణ కవినిగూర్చి చేసిన గురుస్తుతి అమలోదాత్తముగానున్నది.

ఈ కావ్యములోని కుసుమకోమలమైనశైలి, ప్రసన్న కథావిధానము పాఠకుల నాకర్షించగలదు.

'వసుమతి మానవుల్ దురితవర్తనులై యెవి సల్పుచుందురా
దొసగులఁజూచుసాక్షులు విధుండును, సూర్యుడు,
పంచభూతముల్ నిసియు, నహస్సు, నాత్మయుఁ
జలింపని ధర్ముఁవు' (యుద్ధకాండ 513)

ఈ పద్యము నన్నయగారి శకుంతల పల్కులను స్ఫురింపఁజేయుచున్నది. "...నాపదలకే మీరలాపదయని

చేటు చెనకదు మీకని చెప్పినాడ"- దీనివెనుక షేక్స్పియర్ శిల్పమున్నది. (అరణ్య-285) యిట్లే పూర్వకవులందరూ కనుపించి విహరించుస్థలులు యీ రామాయణ నందనారామంలో ఉన్నవి.

"పొనరిన బంగరు గిండ్లను
జనుగవ చేరువనునిలిపి జలములవోయన్
మునుకొనిన వనజ నయనల
గననాయెన్ త్రికుచలైనగతి చూపఱకున్ (అయోధ్య 76)

యీ యుపమ పరమ స్వతంత్రముగా నున్నది. ఈపద్యమొక్కటిచాలు. కావ్యమంతా శృంగారరసం వెల్లివిరిసిందని చెప్పుటకు. రావణుని మృతదేహమునుచూచి విలపించు కాంతలు వలపించు వయ్యారులుగా తీర్చి దిద్దియున్నాడు కవి, (యుద్ధ-474) యుద్ధకాండమున మహార్థస్ఫురణనిచ్చు గంభీర కవితాశిల్పమున్నది.

నాకిక్కడఁ జోటులేదు హృదయేశ్వర నన్గొనిపొమ్ము కానకున్ (అయోధ్య 126) అని అరణ్యావాససందర్భంలో జానకినోట పలికించడం సంగ్రహముగా ఉచితముగానున్నది. ఇక్కడ పాత్రపోషణలో గడుసు పోకడయున్నది.

కౌసల్యా పాత్రపోషణ అద్వితీయముగా మాతృ హృదయానికి దర్పణము పట్టినట్లున్నది. సీతపాత్ర నిర్మాణములో తెలుగువారి ఆడపడుచు జిగేలుమనిపించుచున్నది.

శ్రీ రమణయ్యగారు వృత్తరచనలో కొమ్ములు తిరిగినవారని వారి కావ్యం సాక్ష్యమిస్తుంది. వివిధములైన ప్రాచీన ఛందోరీతులనేగాక, ముత్యాలసరాలు, గేయాలు (వచనగేయాలుకాదు) కూడా ఉపయోగించారు. ఈవిధంగా ప్రాతక్రొత్తల మేలికలయికలు సుభగ సుందరంగాకూర్చిన కలావసంతుడు శ్రీ దుగ్గిశెట్టి. గర్భ కవిత్వం కూడా తనూ ఉన్నానని తలమిట్టబెట్టిందీ కావ్యంలో (యుద్ధ 455) అక్కడ శాస్త్రపాటవం మాత్రమేఉన్నది.

సింహపురి కవులు విరచించిన రామాయణంలో 'శ్రీ రమణీయ రామాయణము'న కొక ప్రత్యేక స్థానమున్నది.

— మోనా.

# పీఠిక

## (సుందరకాండము)

సరసహృదయులైన

సరస్వతీ పుత్రులనదగు మహాకవులకు ప్రకృతియంతయు కథా వస్తువులుగనే కనంబడును. సంగీత సాహిత్యములను సముచితముగా సమన్వయించి, చక్కని కావ్యముగనో నాటకముగనో, నవల రూప మురనో సృజించి లోకమున కందింతురు. అట్లుగాక.

శ్రీయుతులు దుగ్గిశెట్టి వెంకటరమణయ్యగారు ఈకావ్యకర్తలు, రామాయణాంతర్గత సుందరకాండ కథను మనసున భావించి తత్ఫలి తముగా కేవలము భక్తితో రూపొందించినది యీకావ్యము (సుందర కాండము).

దీనికి ఒక చిన్నపీఠిక వ్రాసి యిమ్మని వారు నన్ను కోరిరి. నా మట్టుకు నాకు పీఠిక వ్రాయు నంతటి శక్తియులేదు; నైపుణ్యములేదు; కాని కవిగారి కోరికను మన్నించుట మాత్రము నాకు త్రోసివేయరానిది. కనుకనే యిప్పుడు కలము పట్టితిని.

సుందరకాండ కథను కథామాత్రముగా నిర్మించుటలో ఎవ్వరికిని శ్రమ యుండ నక్కరలేదు. అందలి కథౌచిత్యమును, భావౌచిత్యమును, పాత్రౌచిత్యమును, సంవిధానౌచిత్యమును పెక్కులు పెక్కురీతులుగా భావించుటలో వారి వారి సామర్థ్యములు తేటతెల్లమగును. ఒకరు కథాంశమును యోగశాస్త్రముతో ముడిపెట్టి కొన్నిపద్యములు వ్రాసిరి; అది వారి వివేచనాపటిమ. మరియొకరు సీతా విరహోద్విగ్నుడైన శ్రీరామచంద్రుని ఉదాత్తభావనల నుల్లేఖించిరి. అయ్యది వారిభావన.

కానీ! ఈకవిగారు ఆవేషము లేవియు వేయక ఉన్నదున్నట్లుగా, నున్నదానిలో చాలా భాగము లేనట్లుగా, లేనివి ఒకటి - రెండు అచ్చ టచ్చట కనబడునట్లుగా ఉల్లేఖించిరి. వీరి రచనలో అర్థముగాని పద ములుగాని, భావమున కందని ఊహగానీ కనంబడదు. అదియే వీరి

రచన యందలి విశేషము; చదువరుల కటతటము లదురు దీర్ఘసమాస జటిలముగా కంచుకోట కట్టియుండిన అనిర్మాణము బాగుండునేమో, కానీ సామాన్య జన దుస్సాధ్యముగా కనుపట్టెడిది. కవిగారు తమకే గాక లోకమునకు గూడ శ్రమ తగ్గించిరి. కనుకనే ఈకావ్యము సుల భావ తారముగా కనబడుచున్నది. మచ్చునకు స్త్రీసహజమైన భావము.

క॥ మత్తుడవై కోరితి వు
న్మత్తత మగనాలినన్ను నానాథుడు నిన్
దుత్తునియలు సేయును; నీ
పత్తనము సముద్రమందుఁబడి భగ్నమగున్.

వ్యర్థపదాడంబరము లేక సహజ ధారాళమైనశైలి కనబడును.

కావ్యము నిసర్గ సుందరము; సహజ భావనావిలసితము. ఈకవి ప్రతిష్ఠాకాముకుడు కాడు. అర్థదాసుడునూ గాడు. తాను నమ్మిన దేవుని కథను తాను నేర్చిన పదకుసుమముల (స్వామికి) జానకీ హృదయ సారస మాధురి నాను తేటికిన్, ఇత్యాది వాక్యములతో సమర్పించు కొన్న ధన్యజీవి. "పరగ ఓమ్ నమశ్శివాయ" అని గురుస్తుతి చేయుటచే యీతని గురుతర గురుభక్తి కనంబడుచున్నయది. మోచర్ల వంశలసత్ క్షేమణి అని మహాకవి యగు రామకృష్ణయ్యగారికి నమస్కరించుట పెద్దల యెడ ఈకవిగారి భక్తి వ్యక్తమగుచున్నయది.

అనవసరముగా ఈపీఠికను పెంచుటకంటె ఈకవిగారికి శ్రీరామ చంద్రుడు చతుర్విధఫలపురుషార్థములు ప్రసాదించుగాక అని కోరుచు వీరు ఇట్లే కవితా వ్యాసంగము సేయుటకు పరమేశ్వరి సర్వశక్తుల ప్రసాదించుగాత యని ప్రార్థించుచు దీనిం జదివి యానందింపుడని పాఠకులకు విన్నవించుకొనుచు విరమించుచున్నాను.

ఇట్లు,
(Sd.) గంటి కృష్ణవేణమ్మ.
సరసకవయిత్రి ;

**P. H. Janakirama Sarma,** B.A. (Hons.)
Head of the Department of Telugu
V. R. College, Nellore, 8-3-1971

# అభినందనము

శ్రీమద్రామాయణము మహాఫలప్రదమైన పారాయణ గ్రంథముగా ప్రసిద్ధము. అందును ఆ ప్రశస్తి సుందరకాండమున కధికము. అందలి యర్థమును గ్రహించుచు మననముచేయుచు దానిని తెలియఁజెప్పుట ఐహికాముష్మిక శ్రేయస్సాధకమనుట నిస్సంశయము. కావుననే శ్రీదుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు తమ కవిత్వశక్తి సార్థక మగునట్లు శ్రీరామచంద్ర కరుణాకటాక్షము నర్థించుచు ఆ దేవదేవున కంకితముగా నీ కావ్యమును రచించిరి.

ఇది యనువాదము కాదు, మూలములోని కథావిధానము మాత్రమే గ్రహించి శ్రీరమణయ్యగారు మిక్కిలి సంగ్రహము గాకుండ విస్తృతము గాకుండ 320 పద్య గద్యములతో ఏకాశ్వాస ప్రబంధమును రచించిరి. స్వతంత్ర కావ్యమగుటచేతనే కవికి వర్ణనములందు సొంత భావములకును క్రొత్తకల్పనకును అవకాశ మేర్పడినది. ఇట్టియెడల పెక్కుసందర్భములలో ఇందలి రచనము ప్రాచీనులైన మహాకవుల రీతి విశేషములను స్మరింపఁజేయుచున్నది. లంకలోని పచ్చిక బయళ్ళను అందలి కాలువలను చిన్నపద్యమున కవి యెంతమనోహరముగా వర్ణించుచున్నాడో చూడుఁడు.

క॥ విచ్చిన పూవుల ప్రోవుల
పచ్చని శాద్వలములందుఁ బాఱెడు కుల్యల్
పొచ్చెం బెఱుఁగని వసుమతి
కుచ్చెళ్ళో యన రహించుఁ గొమరారంగన్. 42

చంద్రోదయ వర్ణనమునందలి యీ యపూర్వ కల్పనమును గమనింపుఁడు.

చ॥ నిసి యను వన్నెలాడి కడునేర్పునఁ దూర్పు హసంతిపై
వెసన్, శశి యను వెండికుండఁగల సారపయస్సును గాచు
చుండఁగా, బుసబుస పొంగి భూమిపయిఁ బొల్పున జిందిన
పాల పొంగుగా, మిసమిస వెన్నెలల్ చెలఁగి మేదినిపైవడిఁ
బర్వె సాంద్రమై. 58

లంకాదహన వర్ణనమునందలి యీపద్యమనోజ్ఞతను బరికింపుడు.

సీ॥ కోట కొమ్మకుఁజేరఁ గుప్పించి లంఘింప
నొప్పెఁ దారాజువ్వయోజ నెనసి,
వాలంబు పొడిగించి వలయాకృతిం ద్రిప్పఁ
దనరారెఁ జక్రాయుధంబు మాడ్కి,
నున్నతస్థానంబునుండి దూకగఁ దోక
చూపట్టెనది తోకచుక్క కరణి,
జ్వాలికా మాలికా పరివేష్టితుండయి
యాకృతిం గాంచిన యగ్నిభంగిఁ

గీ॥ దోఁచె మారుతి; మందిరస్తోమములను
హర్మ్య సందోహములఁ గాల్చె; నతనిచేత
బూది చేయంగఁ బడనట్టి దేది గాని
మృగ్యమయ్యె, విభీషణునిల్లు దక్క. 306

ఇట్లు ప్రౌఢకవిత్వలక్షణము లనేకము లీకావ్యమున పెక్కు సందర్భములలో ప్రస్ఫురించుచున్నవి. శ్రీరామచంద్రుని యనుగ్రహమున ప్రతిభాపాండిత్యముల నితోఽధికముగా సంతరించుకొని మహాకావ్యనిర్మాణధురీణుఁడు కాఁగలఁడని ఆశించుచున్నాను,

సుధీవిధేయుఁడు,
(Sd) పోలూరి హనుమజ్జానకీరామశర్మ.

శ్రీ స్వయంపాకుల వేంకటరమణయ్యశర్మ,
రామమూర్తినగర్,
నెల్లూరు, 14-3-71.

శ్రీ డి. వి. రమణయ్యగారు రచించి ఆదరముతో నాకొసఁగిన తెనుఁగు రామాయణ సుందరకాండమును శ్రద్ధతోఁ జదివి మిగుల నానందించితిని.

మహిమోన్నతుఁడగు మహర్షి వాల్మీకి యాది కావ్యమును రచించి మధుమయఫణితులకు మార్గదర్శకుఁ డయ్యెను. అట్టి వాల్మీకికోకిలము సరససంస్కృత సారస్వత వసంత సహకార శిఖరమునెక్కి కమ్మని కాకలీస్వనగానముతో జగమునంతను రామమయ మొనర్చెను. అట్టిది గదా రామాయణ గాథ!

భారతీయ భాషలే గాదు; ప్రపంచ భాషలన్నియు రామాయణ కథా సుధాలహరినిఁ జేమోడ్పులతో స్వీకరించి తమయందు నింపుగ నింపుకొన్నవి. ఇఁక గీర్వాణ భారతీమ తల్లికి నముంగు ముద్దులకుమారి యగు నాంధ్రసరస్వతియందు రామాయణ వైభవము పెక్కు తెఱఁగుల విలసిల్లుచున్నదనుట యెల్లరకు విదితచరము.

శ్రీ రమణయ్యగారు భక్తి పారవశ్యమున సుందర కాండమును 321 గద్య పద్యములతోఁ దెనుఁగున సంగ్రహించి చదువరులకుఁ జవు లూరునట్లు రచించుట శ్లాఘింపఁదగు విషయము. సంస్కృత రామా యణసంహిత 24 వేల పరిమితమగు పవిత్రతమగ్రంథము. అందును సుందరకాండము కొంచె మించు మించుగ 2850 శ్లోకముల గ్రంథ రాజము. అతిమాత్ర సుందరము.

అంతటి గ్రంథము నింతగా సంగ్రహించి తొలకరి మెఱుపులవలె తళుకు తళుక్కను తదీయ వర్ణనాంశముల నటనట మేళవించి కథా

తరంగిణి సూటిగ జాలువారునట్లు వీరిరచన సాగుటచే హృదయంగమముగ నున్నది. వీరి కవిత తత్సమాచ్ఛికపదముల జిగిబిగి పలుకుబడితోఁగూడి చదువరుల డెందముల నాకర్షించునదియై యలరారుచున్నది. ఇట్లే రామాయణము నంతను ద్వరలో నాంధ్రప్రజకు నందఁజేయుభాగ్యము పరదైవతమగు నా శ్రీరామచంద్రుఁడు వీరి కనుగ్రహించుఁగాక.

పటుతర ధర్మ కల్పతరు
    పాలనమున్ బొనరింపఁగా ద్రయీ
స్ఫుట తరమూర్తి రాముఁడను
    భూవరుఁ డయ్యెను; రాముగాథ యా
స్ఫటిక మణిన్ హసించు గుణ
    సాంద్రత; నీకృతి దుగ్గిశెట్టి వేం
కటరమణార్య! సుందరము
    తమ్మని యామెత తెల్గువారికౌ.

ఇట్లు,
స్వా. వేంకటరమణశర్మ.

---

# కృతజ్ఞత

## (సుందరకాండము)

నా యీకృతిని జదివి పీఠికను వ్రాసిపంపిన సరసకవయిత్రి శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారికిని, అభిప్రాయముల ననుగ్రహించిన విద్వత్కవులగు శ్రీ పోలూరు హనుమజ్జానకిరామశర్మగారికిని, శ్రీస్వయంపాకుల వేంకటరమణశర్మగారికిని నాకృతజ్ఞతా పూర్వక నమస్కృతులర్పించుచున్నాను.

—గ్రంథకర్త.

# ముఖ్య విషయానుక్రమణిక

## బాలకాండము



## అయోధ్యాకాండము

## అరణ్యకాండము



## కిష్కింధాకాండము

## సుందరకాండము



## యుద్ధకాండము

# రమణీయ రామాయణము

## గురుస్తుతి



కII శ్రీ మోచర్ల కులాంబుధి
సోమా! శ్రీరామకృష్ణ! సురుచిర కవితో
ద్దామా! సద్గురు సత్తమ!
స్వామీ! కైకొనుము నాదు సాష్టాంగ నతుల్.

కII ధీ చతురానన; ప్రజ్ఞా
వాచస్పతి; సంస్కృతాంధ్ర భాషా యోషా
శ్రీ చిత్తాహ్లాదంబులు
మోచా ఫల సార పూరములుమీ సుకృతుల్.

ఉII భాను సహస్ర దీధితి విభాకలనన్, ముకురంపు ముక్క, దీ
ప్తానఘ సప్త వర్ణముల నంబర వీధికిఁ జిమ్మునట్లు, నా
మానస భావ వీచికలు మంజుల కావ్య కలా ప్రభావళిన్
బూని వెలుంగు టారయ, ప్రపుల్ల భవన్మతి మిత్ర దీప్తిచేన్.

చII సలలిత మామకీన కృతి శైవలినీ చల దూర్మి మాలలన్
విలసితమున్ బొనర్చిన పవిత్రపు టూహల యుత్పలంబులు
జ్జ్వల కవితా కళా మధుర బంధము లౌట భవన్ముఖేందు కాం
తుల కమనీయతన్ గద యనూన రసైకధునీ! దయాఖనీ!

మII అమితోత్సాహ గిరి ప్రభూత రసభావా వేగ వృత్త స్ఫుటో
ద్యమమై నా కవితా ఝరీ వరము, రామాధ్వంబునన్ బాఱ జూ
చి, మనోజ్ఞాయన సూచనా సుమతి సాచివ్యంబు నాకిచ్చిన
ట్టి, మనస్విన్ నిను సద్గురున్, విబుధకోటీరున్, ప్రశంసించెదన్.

చ॥ తలపుల వేడి గాడ్పుల వితాకును గన్న మదీయ కల్పనా
లలిత లతాంత గుచ్ఛము, విలాస మనోజ్ఞ పరిమళమ్ము ది
క్కుల వెదచల్లు టారయగఁ గోమల తావక పూత శీత వాగ్
జలకణ సేచనంబుననె; సార సుధా కవితా విశారదా!

క॥ గంభీర భావ పరిమళ
గుంభిత భవదీయ హృదయ కుసుమ శ్రీకిన్
శుంభ దభినంద నాంజలి
నంభోనిధి కర్ష్య మట్టు లర్పింతు సొగిన్.

ఇట్లు
కృతికర్త
దుగ్గిశెట్టి వేంకటరమణయ్య



శ్రీ ర స్తు

# అ వ తా రి క

## (సుందరకాండము)

చ॥ కనులకుఁ గానిపించెడి జగత్తును సృష్టినొనర్చునెద్ది, భా
వనల సృజింపఁగల్గిన యపారమనంబు నొసంగె నెద్ది, క
ర్మను బొనరింపఁ బ్రేరణము ప్రాణులకున్ గలిగించునెద్ది, దా
నిని భువనంబు సర్వమును నిండిన బ్రహ్మము నాశ్రయించెదన్.

ఆ॥ దేహమిచ్చి పెంచి తీయని కూరిమిన్
దప్పులెల్ల దిద్ది యొప్పుసెప్పు
కన్న పితలుగాదె కనిపించు దేవత,
లట్టి వారిపదములంటి కొలుతు.

ఆ॥ పరఁగ 'ఓం నమశ్శివాయ' మంత్రంబు నే
నుచ్చరించు విధము నోర్పుతోడ
నేర్పె నెవ్వఁ, డామనీషియౌ గురునకు
వందనం బొనర్తు భక్తి యుక్తి.

మ॥ విలసన్నీలపయోదదేహుని తమోవిద్యుల్ల తాంగీ శుభా
కలితస్ఫారవిశాలవక్షుని కటాక్ష శ్రీనిఁగాంక్షించి, ని
ర్మలభావంబున రాముగాథ విరచింపన్ బూనితిన్ నేను, నా
వలనన్ దప్పులు సైపఁగోరెదను విద్వద్గ్రామణి వ్రాతమున్.

మ॥ పలుకుల్ తేనియవాకలై వెలయఁ గావ్యంబుల్ రసశ్రీక
ముల్, సెలువారన్ రచియించి వాణి నెపుడున్ సేవించు
మోచెర్ల వం,శలసద్ధీమణి రామకృష్ణకవి వాత్సల్యంబుతో
నన్ను నిచ్చలు వీక్షించుట కా మనస్వికి నమస్కారంబు
లర్పించెదన్.

ఉ॥ స్వామికి జానకీహృదయసారసమాధురినాను తేటికిన్
నేమముతో రహించు మునినిర్మల మానసరాజహంసకున్
బ్రామిడులైన రాత్రి చరపాదప పంక్తులుగూల్చు దంతికిన్
బాములు దీర్చు రామునకు భానుకులాబ్ది సుధాంశుమూర్తికిన్.

వ॥ సమర్పితంబుగా నే నొనర్పంబూనిన శ్రీ మద్రామాయణాంతర్గత సుందరకాండ కావ్యంబునకుఁ గథావిధానం బెట్లనిన, దేవా యువధరింపుము.



కావ్యకర్త శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య
'రామాయణప్రశస్తి' సాహిత్య కార్యక్రమమున
సరసకవి శ్రీ మోచర్ల రామకృష్ణకవిగారిని సన్మానించుట. (11-4-73)



డా॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు
కావ్యకర్త : శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య (11-4-73)



డా॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు "శ్రీ రమణీయ రామాయణము"ను ఆవిష్కరించుట (11-4-73)



అడ్వకేటు శ్రీ మద్దాళి మల్లికార్జునరావు కావ్యకర్తను సన్మానించుట. (11-4-73)



కృతికర్త - వారి సతి
దుగ్గిశెట్టి వేంకటరమణయ్య - ఆదిలక్ష్మమ్మ.

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# రమణీయ రామాయణము

## ప్రస్తావన

కII శ్రీరామాయణ మహిమన్
బోరాములు గడచు శక్తిఁ బొందగ నస్మత్
ప్రారబ్ధ కర్మ దాటన్
బ్రారంభించితిని దాశరథి కథవ్రాయన్.

కII రాముని పావన చరితము
కోమల పదములను గూర్చ కోరిక గలిగెన్
రాముఁడు సస్మిత ముఖజిత
సోముఁడు నుడికార మిచ్చి శుభమిడు గాతన్.

కII బిస కాంక్ష నేక దంతుఁడు
బుస పుర్వ్వుల నంట నవి భవునిపైఁ బరువన్
వెసఁ బొడమిన గిలిగింతల
హసించు పితను గని నగు గజానను గొలుతున్.

# LXXXII

సీ॥ జట పైని నెలవంక జడ చంద్రవంకయు
సత్త్వ రజో గుణాశ్రయముఁ దెలుప;
తిగకంటి జ్వాలలు తొగకంటి చలువలు
శిక్షను రక్షనుఁ జేర్చి చూప;
దర్వీకర మణుల్ తార హారమ్ములు
సరస సౌజన్య ప్రస్తర మొనర్ప
కాటి బూడిత పూత కస్తూరి మైపూత
సృష్టి పై సమదృష్టి స్పష్ట పరుప;

గీ॥ పచ్చి యేనిక తోల్పును పచ్చడంబు
సన్న వలిపంబు సొగసున సంతరించి;
త్యాగ భోగైక మూర్తియై తనరు చుండు
అర్ధనారీశ్వరుడు దయ నరయుగాక.

ఉ॥ రాజ మరీచికా తరళ రంజిత గాంగ ఝరీ తరంగ వి
భ్రాజిత మౌళి జూటుఁడు; ధరాధర సూతి శరీర భాగ సం
యోజిత పూర్వ దేహుఁడు; పయోధి ముఖోద్భవ కాలకూట కీ
లాఽజిత కాలకంఠుఁడు; పలాయిత కాలుఁడు; నన్ను బ్రోచుతన్

క॥ గరుడధ్వునిఁ బీతాంబర
ధరుడగు వైకుంఠు, హేమ ధరశిఖరముపై
నరుదగు తటి దావృత జల
ధర మోయన నొప్పు వాని దలతును మదిలోన్.

ఉ॥ పుట్టిన మందిరంబు పతిపూత విశాల సుధాంబు రాశి; చే
పట్టిన పూరుషుండు భగవంతుడు; పూవుల తూపులన్ జగం
బట్టిటు సేయు జెట్టి కొమరారు సుతుండయి యొప్పు లక్ష్మి, నా
పట్టున నిల్చి నాకృతి కపార యశం బొనఁ గూర్చుఁగా వుతన్.

# LXXXIII

క॥ తొలిచదువులు నలుగడలన్
నలు వొందగఁ బలుకు చుండి నలు మోములతో
నిలజీవుల సృజియించెడి
పలుకుల పూఁబోణి స్వామి పాలించు ననున్.

క॥ వీణియఁ బ్రేమాలాపము
పోణిమిఁ జేయుచును సృష్టి మునిగిన నాథున్
జాణతనంబున లోగొను
వాణి కృపన్ నాకు వశ్యవాక్కు లొసగుతన్.

క॥ రామా యను మధురాక్షర
మేముని కవి శుకము బాడె నింపుగ కవితా
భూమీరుహ శాఖలపై
నా ముని వాల్మీకి కేను నంజలి మోడ్తున్.

క॥ రామ చరితామృతాబ్ధిని
నే ముని నిరతంబు ద్రావి తృప్తి గనని వాగ్
స్వామిని నకల్మ షాత్ముని
నా ముని ప్రాచేతసునకు నంజలి గూర్తున్.

చ॥ పలుకుల కొండ నుండి నును వన్నెల నీను తెలుంగు రాళ్ళ నే
ర్పొలయగ సంతరించి, లలితోజ్జ్వల సత్కృతి హర్మ్యమాలికల్
సులభముగా రచించి, రసలుబ్ధులు ద్రష్టల మానసంబులన్
విలసితమున్ బొనర్చిన కవి స్థపతీంద్రుల కేను మ్రొక్కెదన్.

క॥ కప్పురపుఁ బలుకులన్ బలె
గుప్పున వాసనలు చిమ్ము గొమరు బలుకులన్
గుప్పింపఁ దలతుఁ గవిత
నొప్పిదమౌ నటుల రసికులో హెూ యనగన్.

## LXXXIV

ఉ॥ భూమిసుతా మనోంబురుహ పుష్కల రాగ మరంద పాన దీ
క్షా మద చంచరీకునఁ గాలపయోద విశాల హారి శో
భా మహనీయ మూర్తికిఁ బ్రభాకర తీవ్ర మయూఖ రేఖికా
స్తోమ నిశాత శస్త్రునకు శోభన మూర్తికి రామ మూర్తికిన్.

వ॥ సమర్పితంబుగా నేను రచియించు శ్రీరామ చంద్రమూర్తి పవిత్ర
చరిత్రమ్మునకుఁ గథాక్రమం బెట్టిదనిన—
దేవా, అవధరింపుము;



శ్రీరస్తు

# రమణీయ రామాయణము

## బాలకాండము

కII శ్రీజానకీ మనోహర,
రాజ కిరీటస్థ మణి విరాజిత పద; శో
భాజిత పుష్ప శరాసన;
రాజీవదళాక్ష; దీన రక్షా దక్షా! 1

మII సరయూ శైవలినీ తటిన్ త్రిభువ నాశ్చర్యం బనూనంబు; భా
స్వర మాణిక్య వినిర్మితోన్నత మహా సౌధ ప్రపూర్ణంబు; భా
స్కర వంశోచిత పాలితంబు; సుమనః శ్లాఘ్యం బయోధ్యా పురం
బు రమావాసము; ధాత్రి నెన్నొసటికిన్ బొట్టై విరాజిల్లెడిన్. 2

ఉII ఇందు శిలా వినిర్మితము లింద్ర పురంబును దాకు మేడలం
దందము చందమున్ గల యొయారులు, భూషితలై నటించుచున్
సుందర మందహాస రుచి సోమునిఁ జూడగఁ దత్ప్రభావళిన్
గందును బాసి చందురుఁడు గాన బడున్ గనువిందుగాఁ బురిన్. 3

కII మార సమానాకారులు
ధీరులు మతిమంతు లధిక ధృతిమంతులు వి
స్తారోదారులు సారా
చారులు సజ్జనులు ప్రియవచను లట పురుషుల్. 4

కII ఆ పురి నేలుచు నుండెను
చూపరి త్రైలోక్య వినుత సూనృత నిధి స
త్తాపసుల పెన్నిధానము
భూపతి దశరథుఁడు లోక పూజ్యుండగుచున్. 5

గీII అతని శౌర్యంబు శత్రు భయంకరంబు,
అతని దానంబు లేమికి నడ్డుకట్ట,
అతని ధర్మంబు దుర్నీతి నవలఁ ద్రోయు,
అతని భాగ్యంబు ధనపతి నతునిఁ జేయు. 6

వ॥ ఆరాజునకు గౌసల్యా, సుమిత్రా, కైకేయీ నామధేయలగు ముప్వుర
భార్యలు గలరు. వారనపత్యతా దోషగ్రస్త లగుటం జేసి. 7

క॥ వారలు గ్రుంకని తీర్థము
పాఱులు చెప్పంగ భక్తిఁ బట్టసి నోముల్
కోరిక నెమకినఁ గాంచము;
సార విహీనంబు బ్రతుకు సంతతి లేమిన్. 8

క॥ ముప్వురు రాణులు గల్గియు
నెవ్విధి జన్నములనెల్ల నేర్పడఁ జేయన్
గవ్వకు సరిగా కుండెను;
ఎవ్వారికిఁ గర్మదీఱ కెసఁగునె ఫలముల్? 9

వ॥ సుతులు లేరని చింతించు రాజుతో నొకనాడు. 10

క॥ నరవర, పుత్ర ప్రాప్తియె
యరుదని చింతింపఁదగునె? యాత్మత భక్తిన్
దిరమున సుతేష్టి సల్పిన
సిరిమగఁడు జనించు నని వసిష్ఠుఁడు పలికెన్. 11

వ॥ అంత నా మహాముని చెప్పిన తెఱంగున శాస్త్ర సమ్మతముగా. 12

క॥ భూవరుఁడు సేసె సవనము
దేవ బ్రాహ్మణులు మెచ్చ, దీప్తాగ్ని జ్వా
లా విర్భూతుఁడు దివ్యుం
డా విభునిం గనుఁ గొనుచుఁ గృపామృత దృష్టిన్. 13

క॥ పాయస భాండ మొసంగెను
ధీయుతున, కతండు పంచెఁ దీయని కూర్మిన్
జాయలకు ముప్వురకు నా
పాయసమును భక్తి యుక్తి భక్షించుటకై. 14

క॥ స్వాతిని ముత్తెపుఁ జిప్పలు
చేతము రంజిల్ల వాన చినుకులు గురియన్
బ్రీతిని గ్రహించి నట్టుల
నా తరళాక్షులు గ్రహించి రా పాయసమున్. 15

క॥ శృంగారవతుల మేనుల
బంగారపు వన్నె పలుచ బాఱంగా, హె
చ్చెం గండఁబుల ధవళిమ
పొంగారుచుఁ జూలు వృద్ధిఁ బొందెడి వేళన్. 16

క॥ భువిలో ధర్మాచరణము
భవపంక నిమగ్నులైన ప్రజలకు నేర్పన్
దివిరి వనమాలి యంశము
భువిపైఁ బొడ సూపె భువన మోహన లీలన్. 17

యజ్ఞము పూర్తియైన తర్వాత ఆరు ఋతువులు గడచెను. పండ్రెండవ మాసమగు చైత్రమాసమున పునర్వసు నక్షత్రయుక్త నవమి తిథియందు ఐదుగ్రహము లుచ్ఛస్థానము లందుండగా అనగా సూర్య, కుజ, గురు, శుక్ర, శనులు, మేష, మకర, కర్కాటక, మీన, తులా రాసు లందుండగా గురుడు చంద్రునితో కలసియున్న కర్కాటక లగ్న మందు కౌసల్య, సర్వలోక శరణ్యుని, సర్వ లక్షణ సంపన్నుని విష్ణు స్వరూపుని శ్రీరామచంద్రుని ప్రసవించెను. * 18

---

* శ్రీరామచంద్రుని జననము :-
హొరానుభవ దర్పణమను జ్యోతిష గ్రంథ ప్రకారము. విళంబి నామ సంవత్సరమున, వసంతమున మేష సంక్రమణ చైత్ర శుక్ల నవమి బుధవాసరము, పునర్వసు నక్షత్రం. మధ్యాహ్న సమయమున కర్కాటక లగ్నములో జరిగెను.

క॥ పుట్టిరి ముప్పూరి కడుపున
నట్టిట్టనరాని పావనాత్ములు పుత్రుల్
పట్టు సడలె వంధ్యా విధికి
ముట్టిరి మోదమున జని ముగుదలు మిన్నున్. 19

గీ॥ కనియె రాముని కౌసల్య, కైక భరతుఁ
గనియె, లక్ష్మణ శత్రుఘ్నులను సుమిత్ర
గనియె, సకల సామ్రాజ్యము కడు ముదంబుఁ
జెందె, సంతస పడిరి జేజేలు మింట. 20

క॥ ఊయలలో నూకొట్టిరి
పోయంగను నుగ్గుపాలు పూపూ యనుచున్
సోయగములఁ జిందించిరి
పాయని కూరుములఁ బెనుపఁ బడుచు నిసుంగుల్. 21

క॥ వలి వెలుఁగు చలువలుం బలె
నొలికించుచు బోసి నగవు లొయ్యన శిశువుల్
తలి దండ్రుల హృదయంబుల
నలరించిరి, రాణి వాస మరుసము నొందన్. 22

క॥ నలువురు పుత్రులు పెరిగిరి
సలలితముగ శుక్లపక్ష చంద్రుని మాడ్కిన్;
కలకల నవ్వుల కాలము
జలజల సెలయేటి నీటి సరవిని సాఁగెన్. 23

సీ॥ పొత్తులలో లీల నొత్తిగిల్లెను వాయు
చలిత నీలోత్పల చందమెనసి;
చివురు కెంగేళుల క్షితిని దోగాడెను
ఆది కూర్మగతుల యందమొప్పి;

అల్ల నల్లన లేచి యడుగుల వేసెను
మూడడుగులువెట్టు పొట్టి పగిది;
తొక్కు పలుకుల బల్కు దోబూచు లాడెను
రా చిల్క పల్కుల రక్తినెసగి.

గీ॥ అంతకంతకుఁ బెంపారి యద్భుతముగ
బరగె రాముండు కన్నుల పండువగుచు
దైత్యకోటుల ధైర్యము దఱుగుచుండ
వేల్పు హృదయములన్ ధృతి పెఱుగుచుండ. 23

వ॥ అంత నా రాజ కుమారులు. 24

క॥ ధరణీ భారము దీర్పఁగ
విరివిగ నేర్వంగఁ బూని విద్యల నెల్లన్
గురువులు నేర్పఁగ నేర్చిరి
వరాస్త్రముల మర్మముల నవారిత పటిమన్. 25

క॥ నాలుగు సంద్రంబుల వలె
నాలుగు దిక్కరుల భాతి, నాలుగు కడలన్
మేలుగ నేలెడి దిక్పరి
పాలుర వలె రాజసుతులు పరఁగిరి కడిమిన్. 26

క॥ పదునైదు వత్సరంబులు
ముదమున భూజాని యతని ముప్వురు సతులున్
గుదురు గడల్కొనఁ గడిపిరి
నుదయార్కపములు పుత్రు లొప్పుగఁ బెరుగన్. 27

వ॥ ఒకనాడు దశరథమహారాజు నిండు పేరోలగంబున నుండి యుక్త
వయస్కులగు పుత్రులకు వివాహ మొనరింపఁ దలంచి సభ్యు
లతో సంప్రదించు నవసరంబున. 28

సీ॥ ఘనమగు బ్రహ్మర్షి తనము సాధించిన
ముని కౌశికుడు వచ్చి పూజలంది,
జననాథునకుఁ జెప్పె జన్నంబు తాఁజేయ
సురవిరోధులు భగ్న పరచి రనుచు,
యజ్ఞ రక్షార్థమై యర్థించె రాజును
రఘురామ చంద్రుని రాత్రిచరులఁ
జక్కాడఁ దనవెంట సత్వరంబునపంప
వనులకు; భూజాని ముని పలుకుల.

గీ॥ వినుచు నిశ్చేష్టు డాయెను; బిడు గడచిన
రీతిఁ; బెంపారు చింతతోఁ గాతరుడయి
కారు కన్నీరు మోమును కలుషితమును
జేయఁ గరములు మొగిడిచి చెప్పె నిటుల. 29

చ॥ మునివర బాలు డొక్కరుడు ముక్కడి మూకల గామ రూపులన్
ఘనబల గర్వితాత్ములను, కాలముఖ ప్రతిమాన భీకరా
ననులను వీరసత్త్వులను, నంజుడుదిండుల ఘోర దైత్యులన్
దునుమ గలాడె? రాక్షసులతో నని సేయగ నేనె వచ్చెదన్. 30

గీ॥ ఊన షోడశ ప్రాయ మందొప్పు రామ
చంద్రు డంబుజ పత్ర లోచనుడు; రాత్రి
చరుల నేరీతి ద్రుంపగ శక్తి గలుగు
సవన రక్షకు నేవత్తు సంయమీంద్ర. 31

గీ॥ ముదిసి ముప్పున గంటిని ముద్దులొలుకు
సుతుల; నేరీతి బంపుదుఁ జూచి చూచి
రక్తమున్ జుఱ్ఱు భీకర రాక్షసులను
జక్క నడపగ; మునివర చలము విడువు. 32

వ॥ పుత్ర వాత్సల్యమున బలుకు రాజుతో విశ్వామిత్రు డిట్లనెను. 33

గీ॥ రాము మహిమయు సత్య పరాక్రమమ్ము
నే నెఱుంగుదును వసిష్ఠమౌని యెఱుగు
తాపసు లెఱుంగుదురు సుమ్ము; దశరథనృప!
సంశయంబేల రాముని సత్త్వమందు. 34

వ॥ ముని పలుకుల వినియూ ధైర్యహీనుడైన దశరథుఁడు రాముని బంపనని మరల మరల వచింప. 35

చ॥ కనలుచు మౌనివర్యుడనె కన్నులు కావిరి జెంద; భూప! నీ
వినయపు పల్కులేల; విన వేడుక యాయెను నీదు ప్రార్థనల్;
చనియెద నన్నఁ దత్క్షణమ సమ్ముని వర్యు వసిష్ఠు నానతిన్
బనిచెను రామలక్ష్మణులఁ బార్థివుడా ముని చంద్రు వెంబడిన్. 36

చ॥ కనులకు విందొనర్చు విహగంబుల గాంచుచు మిన్నునంటు కా
నన తరురాజి నబ్బురమునన్ బరికించుచుఁ, గొండ లందు నె
య్యనఁ బలు కాంతులీను నుదయార్కుని రోచులఁ జూచుచున్ బథం
బున గల వింతలం గనుచు బోయిరి రాజసుతుల్ మునీంద్రుతోన్.

వ॥ రామ లక్ష్మణులు మహాత్ముడగు విశ్వామిత్రుఁడు సాయం సమయమునకు సరయూనదీ తీరముఁ జేరిరి. 38

క॥ మునివర్యుఁడు రాసుతులకుఁ
జనవున ప్రియ భాషణముల సకలాస్త్రములన్
దనుజులఁ బరిమార్పను; స
జ్జనులను బ్రోవంగ నేర్పె సౌశీల్యంబున్. 39

వ॥ సరయూ నదీ తీరమున రాత్రి శయనించిరి. ఉదయముననే విశ్వామిత్రుడు: 40

కII కౌసల్యా తనయ రామా!
భాసుర గుణ! ప్రథమ సంధ్య వర్తిలు నదిగో!
దా సాని పూవు కెంపున;
లే! సవితకుఁ గేలు మోడ్చ లెమ్ము కుమారా! 41

వII ఈ విధమున మునిచే మేల్కొనపబడి శ్రీరామ చంద్రుడు కాల కృత్యములు దీర్చుకొని ముని వెంట నరణ్యమున పయనించెను. మార్గ మధ్యంబున 42

కII పెట పెట దిక్కులు పగులగ
గట గట నార్చుచును బాద ఘట్టనములచే
నటు నిటు ధాత్రి చలింపగ
బట బట రవముల నిశాటి పరువిడి వచ్చెన్. 43

చII గిరగిర దిర్గుచున్ బథము క్రేవల నున్న మహీజ శైలముల్
కరముల లాగి బాలక ముఖంబుగ రివ్వన రువ్వుచున్ నిశా
చరి గననొప్పెఁ దాటక విశాల మహీరుహ గండ జాలముల్
సరసర పైకిఁ జిమ్ము గురు జంగమ భూధర రేఖయోయనన్. 44

కII వాటమగు మార్గణంబుల
వ్రేటులఁ దన పైకి వచ్చు వృక్షాశ్మములన్
గీటునఁ బుచ్చుచు రాముఁడు
వేటిడ దగునా యటంచు వెలఁదిని దలచెన్. 45

కII వెనుదీయు రాఘవునితో
మునివర్యుడు పల్కె వత్స! పాలతి యనుచు డీ
నిని బరిమార్పన్ గొంకకు
దనుజాంగన పాప హృదయ దండింప దగున్. 46

వII మఱియు రామచంద్రా నృపతి వృత్తంబు కడుంగడు కఠినము. 47

ఉ॥ ధర్మమధర్మమో నృపుఁడు తప్పక లోకహితార్థ వృత్తిమై
కర్మ మొనర్పగా నగును; కారుణికత్వము క్రూర భావమో
మర్మ మెరింగి బూనదగు; మానవ నాథుని వర్తనంబునన్
ధార్మిక దృష్టి యుండదగునా! మనుజారి యెడన్ నృపాత్మజా. 48

వ॥ అంతట శ్రీరామ చంద్రు డిట్లనెను. 49

క॥ తప్పైనను - ఒప్పైనను
తప్పక భవదాజ్ఞ నేను తల దాల్తును మా
యప్ప వచించిన యట్టుల;
నిప్పున కలుషములు చెనకి నిలచునె స్వామీ. 50

వ॥ గురువరా మీఆన నాకవశ్యము ఆచరణీయమని 51

క॥ బెడిదంపు మార్గణంబుల
వడి వచ్చెడి వృక్షశైల పంక్తులు ధరపైఁ
బొడియగుచు రాలిపడఁగా
నడఁచెను దాటకను రాముఁ డద్భుతశక్తిన్. 52

గీ॥ రామ మన్మథ బాణంబు రాత్రిచర వ
ధూటియెద దుస్సహంబయి నాఁటు కొనఁగ
రక్త గంధాను లేపన రంజితయయి
జీవితేశుని నిలయంబుఁ జేరుకొనియె. 53

వ॥ తాటక వధానంతరము విశ్వామిత్ర మునీంద్రుఁడు రాసుతుల
వెంటనిడుకొని తన యాశ్రమంబునకుం జని దీక్షతో నారు దివా
రాత్రంబులు యజనం బొనర్చునప్పుడు. 54

గీ॥ కంటిపై ఱెప్పవేయక, వింటిమీఁదఁ
జేయిఁదీయక రాముండు స్థిరము గాను
యజన వేదిక చుట్టు నత్యధిక జాగ
రూకుఁడై యుండెఁ దమ్ముఁడు వీఁక నడువ. 55

వ॥ అంత నొక్కనాఁడు. 56

క॥ బలియురు మారీచ సుబా
హులు, కిలకిల రావములను, హుంకారములన్
బలపల నరుదెంచి, విసర
పలలము, రక్తమును యజ్ఞవాటిక యందున్. 57

ఉ॥ రాముఁడు రాక్షసాంతకుఁడు ప్రజ్వలితాగ్ని సమానతేజుఁడా
భీమ పరాక్రమాన్వితుల భీషణమూర్తుల దుర్మదాంధులన్
శ్యామల కాంతి నిర్జిత చలాంజన పర్వత తుల్య రూపులన్
బ్రామిడులైన రక్కసుల భర్జనఁ జేసె శితాంబకంబులన్. 58

క॥ అలుఁగుల బెడిదపు ప్రేటులఁ
దొలంగి మారీచుఁడు వడెఁ దోయధి నడుమన్
ములుకుల రేఁగెడి మంటలు
మెలఁగ సుబాహుండు సచ్చె మిడుతయుఁ బోలెన్. 59

గీ॥ రాముఁ డీరీతి వధియించి రాక్షసులను
ముని సవనమును సంపూర్ణముం బొనర్చె
అంత గాధేయుఁ డత్యంత సంతసమున
రాము నీక్షించి పలికెను ప్రేమ దొలుక. 60

సీ॥ నీ బాహు బలమున నిర్జింతివి రాక్ష
సానీకములను యశస్వి వగుము;
సిద్ధాశ్రమంచు ప్రసిద్ధి గాంచెను నాదు
యజ్ఞంబు సంపూర్తి యైన కతన;
మనము పోవలయును జనక రాజొనరించు
జన్నంబు గాంచను సత్వరమున;
ఆ రాజు గృహమున నారోపణాతీత
మైనట్టి ధనువింటి వరయవలయు.

గీ॥ అని వచించిన గాధేయు ననుసరించి
పార్థివ కుమారు లరిగిరి పాద చారు
లగుచు; గాంచుచు నడవిలో నద్భుతముల
మార్గ మందొక శూన్యాశ్రమంబు గనిరి. 61

చం॥ అతి రుచిరాగతుం డయిన యర్క కులాబ్ధి సుధాంశు మూర్తి కా
తత పరిచర్య సేసెను లతా లలనల్ సుమ సౌరభానిలం
బతులిత లీల వీచుచు; మదాళి-నినాద మృదూక్తి చాతురీ
గతులను సాధువాదముల కమ్మగఁ బల్కుచు హృద్య రీతులన్ 62

ఆ॥వె॥ కనిన రాఘవుండు గాధేయు నడిగె నో
మౌని చంద్ర, యిందుఁ గానఁ బడరు
మునులుఁ దీని విధము వినఁ గోరెద నటంచు
పృచ్ఛ సేసి మునిని నిటు వచించె. 63

ఉ॥ మావులు లేఁజివుళ్ళ నతి మంజుల మయ్యును లేవు కోయిలల్
పూవులు గల్గు తీవియలఁ బొందవు తేనెల నాన తుమ్మెదల్
రావము రాల్పడంగను ఖురంబులు ప్రాకును శీర్ణ వేణులన్
మోవులు విప్పి నెమ్మలు ప్రమోద భరంబున కూయ వాడవున్
కావుల పేలికల్ దరుల గాలికి నూగును నార్చు పోడిమిన్
జీవము గల్గి తేజము నసించిన దేహము భంగిఁ జూపడున్
భావము లేని పల్కువలె పద్మ విహీన సరోవరంబునా
నీ వనసీమ నిర్జనము - హీన రుచిన్ గన నౌను రమ్యమై. 64

వ॥ అనిన రాముని తోడ మునివర్యుఁడనెను
పతిత పావని యైన కత విను రామ! 65

—o—

చ॥ వినుము విధాత తొల్లికడు వేడ్క నహల్యను సృష్టి సేసె భూ
మిని గలఁ సుందరాంగులను మించు మనోజ్ఞ తనూ శుభ ద్యుతిన్
గనులకుఁ బండువున్ గొలుపు కన్నియ నా తరళాక్షిఁ గాంచి స
న్మునులును వేల్పు మూకలును బూనిక మూఁగిరి యామె పాణికై.

క॥ తన సుత పాణి గ్రహణం
బునకై తాపసులు సురలు మోహావేశం
బున నర్థింపంగా నా
వనజభవుఁడు పందె మొకటి వారల కిడియెన్. 67

క॥ పందెం బిదె వినుడీ, మీ
రందఱు ద్రుతగతిని జుట్టి యవనిని, రండీ,
యందఱిలో లాఘవమున
ముందరుదెంచిన యతండు ముదితన్ బొందున్. 68

క॥ ఈ మాటలు విని నంతనె
ప్రామినుకులు సదివినట్టి ప్రాజ్ఞులు మౌనుల్
ధీమంతులు సుమనస్సులు
కామోద్ధతిఁ బరుగులిడిరి కాశ్యపిఁ జుట్టన్. 69

క॥ కని యీను ధేనువునకున్
వెను ముందల నెసఁగు రెండు వెల్లని మోముల్
ముని గౌతముఁడు ప్రదక్షిణ
మొనరిచి ధరఁ దిరిగినట్టి యుక్తిఁ దనర్చెన్. 70

క॥ విధి యంతట మునివరునకు
విధి విహితంబుగ నొసంగె వెలఁదిని; శక్రుం
డధికంబగు మోహంబున
విధుముఖినిం గనుచు మగిడె విహ్వల మతియై. 71

కII సురపతి యక్కామినిపైఁ
దిరమగు మోహంబు నిలిపె తీరని కోర్కెన్
విరహానలమున గ్రుక్కుచుఁ
దరుణిం గవగూడ వేచెఁ దరుణమ్మునకై. 72

వII అంత నొక రాత్రి 73

కII ముని పర్ణశాల మఘవుఁడు
గొనకొని నడిరేయిఁ గోడి గొంతునఁగూయన్
విని ముని స్నానంబునకై
చన శక్రుండు దాల్చి సన్ముని రూపున్. 74

సీII సారసాక్షినిఁ గూడ సరగున నడుగుల
వడి వైచి చొచ్చును బర్ణశాల,
పడఁతి చెంతకుఁ జేర; జడదారి వెఱపున
వెన్నిచ్చి నొచ్చి తా వెచ్చ నూర్చు
చీఁకటి ముసుగునఁ జెంతకుం జేరినఁ
జెలియ కన్గొన దని చింతనొందు,
భీతియు మోహంబు పెనగొన, దేహంబు
తిమురంగ గాలూని దిటవుఁ దాల్చు.

గీII గుండె దడదడ లాడ, మక్కువ రహింప
గౌతముని గేహిని యహల్య, కామనీయ
కమునకు నిదానమగు చెల్వ, కానుపింపఁ
జేరె నత్తన్వి శయ్యకుఁ జిత్త మదుర. 75

కII చలి యించెడి కెంగేలన్
లలితాంగిని దాఁకినంత, హ్లాదం బొదవన్
గిలిగింత లమరె నామెకు
బొలఁతుక సుర విభుని నెమ్మిఁ బొదివెం దమితోన్. 76

ఉ॥ ఆతతమైన కాంక్ష నసురారి యహల్యను గూడ నామెయున్
బ్రీతి హరిన్ రమించె, సరవిన్ రతిలోలత వార లుండఁగా
గౌతముఁ డేగు దెంచి, కని, కన్నుల నిప్పులు రాలఁ జూచి, యా
నాతిని రాతిఁ జేసె; ముని నాథుని కోపము రిత్త వోవునే? 77

క॥ రాయి యగు నంత లోనన్
జాయను మన్నింపు మయ్య, సంయమి యనుచున్
బాయక యహల్య వట్టె గృ
పాయుతు పాదాంబుజముల నతి దుఃఖముతోన్. 78

క॥ మౌనిఁ గని వణకు వజ్రిని
దీనానను నశ్రు నేత్రు వీక్షాల విభున్
బూని శపించె, నతని మెయి
యోనులతో నిబిడ మగుచు నొప్పఁ దొరంగన్. 79

క॥ కని యేవమైన తనమే
నిని, ముని పాదముల నంటి నిష్ఠురశాపం
బును మరలుపుమని యర్థిం
ప, నముచిసూదనుడు; మౌని పలికెను దయతోన్. 80

క॥ పర సతుల నరయు నెడలన్
మరు తూపులఁ జిక్కి నీవు మఘవా! నీ మే
నరయంబడు వారలచేఁ
బరమ జుగుప్సను ఘటించు భగ భరితంబై. 81

వ॥ అని ముని వరుండు వలుక నింద్రుండు మునినాథుని సన్నుతించి,
యదృశ్యుండయ్యెను. 82

క॥ కరుణ దళుకొత్తు కనులన్
జరణంబుల వ్రాలి యున్న చాననుఁ గని మౌ
ని రఘూత్తముని పదరజము
న రాతి రూపుఁ దొరఁగుదువు నాతీ, యనియెన్. 83

క॥ ఇప్పుడు నీ పద రజమున
నిప్పాలఁతుక తొంటిరూపు నింపున బొందున్
గొప్పలగు ఆమె పాపపుఁ
గుప్పలు భస్మంబులగును గుణరత్న నిధీ! 84

వ॥ అని గాధేయుఁ డామె కష్ట చరిత్రంబును వినిపింప రఘూత్త
ముండు సలక్ష్మణుండై మునీంద్రుని మున్నిడుకొని గౌతమాశ్ర
మంబుఁ బ్రవేశించెను. శ్రీరాముని పాదధూళి యొక గ్రావంబునకు
సోకుట తోడనే. 85

సీ॥ చికుర షట్పదములు జృంభించినవి రామ
భద్రు పద్మోపమ ప్రపదసీమ,
ముఖ చంద్ర బింబంబు వొడమెను రఘురాము
పదనఖ తారకల్ పల్కరింప,
కుచ హేమ కుంభముల్ రుచు లీనె శ్రీరాము
నరికాలి మూసయం దవతరిల్లి,
జఘన చక్రము దీరెఁ జక్క నృసింహుని
మడమ సమ్మెటను సన్మాన మొంది.

గీ॥ నీరదము నుండి మెఱుపు జన్మించినట్లు
మించుఁ బోణి యహల్య జన్మించె, దశర
థాత్మజుని పాద ధూళి మహత్తు కతన
విష్ణుపది మున్ను వెల్వడు విధము దనర. 86

గీ॥ భాస్కరుని కాంతికిన్ విచ్చు పద్మమువలె;
భానుకులు దివ్య తేజః ప్రభావ కలన;
తొంటి రూపంబు నొందెను తోయ జాక్షి;
తొల్లిఁ జేసిన పాపముల్ తొలఁగి పోవ; 87

క॥ అచ్చరల వింత సొగసుల
మెచ్చక సుత్రాము డెవతె మేల్మి సొబగుకై
రచ్చబడె నట్టి యందము
నచ్చెరువున గనిరి దశరథాత్మజు లెలమిన్. 88

ద్విపద॥ రాతి రూపుఁ దొఱంగి రామ యీరీతి
నాతియై విలసిల్లి నగధర ధీరు
రాజీవదళ నేత్రు రమణీయ గాత్రు
తేజో మహోదారు దీన మందారు,
భువనత్రయాధారు మోహనాకారు
కువలయ బాంధవు నువిద గన్గొనుచు
మోదాశ్రువుల తోడఁ బోడిమిఁ గడిగి
పాద పద్మంబులఁ బైట చేఁ దుడిచి
అప్పుడే విచ్చిన యలరులం దెచ్చి
యొప్పారు పూజ తా నొనరంగ సలిపి
వినుతించె నీరీతి విని వేడుకయిన
అనవద్యమగు లీల నత్యంత భక్తి
"నీ పాద రజమున నీరజాతాక్ష,
నా పాపము లడంగె నన్నుఁ బ్రోచితివి
శంకరుం డజుఁడును శర్వాణి వాణి
పంకజాతాక్ష, నీ పావన నామ
జప సుధారసము నిచ్చలు గ్రోలు చుంటు
అపరిమితానంద మనుభవించెదరు.
ప్రమదాశ్రువులు కుచాగ్రములపైఁ జార
కమలజ నీరూపు కరము భావించు
నీవ యాద్యుండవు నీవ పూర్ణుఁడవు
నీవ యీశ్వరుఁడవు నీ వచింత్యుఁడవు.

ఈవ ముజ్జగముల సృష్టి సేయంగ
బ్రోవంగ నణఁప త్రిమూర్తివి దేవ!
తోఁచును తోఁపదు త్రుటిలో జగత్తు
యోచింపఁగా నీవ యోగి సంపూజ్య,
వేర్వేరు రూపాల వెలయుచు నుండి
యుర్విపై మనుజుల నుద్ధరించెదవు.
ఈ జగంబెల్ల నీ యేకమౌ దీప్తి
రాజిల్లు చున్నది రఘురామ చంద్ర,
కరధృత శరచాప, కాంచన చేల,
హర నుత చారిత్ర, హరిదశ్వ తేజ,
నేరరు మనుజులు నీ తత్త్వ మెఱుఁగ,
ధారుణి నీమాయ దాఁట దుర్లభము.
ధర్మ సంస్థాప నార్థము నరాకృతిని
నిర్మల దీక్షతో నెగడు దేవుఁడవు;
వందనం బిదె యిన వంశజ, యనుచు
ఇందిరా సుందరీ హృదయేశుఁడైన
నారాయణాంశంబునన్ బుట్టి నట్టి
శ్రీరాము వినుతించెఁ జెల్వ యహల్య. 89

తే॥ ఔర పదునారు వత్సరా లర్భకుండు
అసురులన్ ద్రుంచు టది యేమి; యవశయైన
పతిత నతి పూత చరితగా బరగ జేయు
శక్తి యదియేమి పరమాత్మ శక్తి దక్క. 90

వ॥ మహా తపస్వి యగు గౌతము మునీశ్వరుండు శ్రీరామా గమన
మును దివ్యదృష్టి నెఱింగి, నిజాశ్రమమ్మునకు విచ్చేసి
యహల్యం గూడి యథావిధి రామభద్రు నర్చించెను. రామ

లక్ష్మణులు గాధేయునితో బయల్దేఱి పయనించి మిథిలా పురముఁ బ్రవేశించిరి. పురంధ్రులు రామచంద్రుని గాంచి తమలోఁ దామిట్లను కొనిరి. 91

## సీతాకల్యాణము

సీ॥ హరినీల కాంతికి హొరువును సమకూర్చు
నిబిడ తనుద్యుతి నెగడు వాఁడు
యజ్ఞరక్షార్థమై యసురులఁ దునుమాడి
విశ్రుతి గాంచిన వీరవరుఁడు,
పురవైరి కార్ముకవర మెక్కు పెట్టంగ
నాజాను బాహుల నడరు వాఁడు,
సీతమ్మ మోమునఁ జెన్నొందు వన్నెకుఁ
దిలకంబు దిద్దంగఁ దివురు వాఁడు.

గీ॥ ఎగు బుజమ్ముల వాఁడు మదేభ గమన
వైభవము వాఁడు సకల దిక్పాలకుండు
భువన మోహన రూపుండు పురుష వరుఁడు
వచ్చుచున్నాఁడు కనరండు వనితలార! 92

క॥ అని పిలుచుచు నొండొరులను
వనజాక్షులు గుములు గూడి ప్రముదిత ముఖులై
కనిరి రఘురామ చంద్రుని
దినకర శుభకాంతి నెసఁగు దివ్యాకారున్. 93

వ॥ అంత వారిట్లనుకొనిరి. 94

క॥ మన సీతమ్మకుఁ దగునీ
మనసిజ రూపుం, డితండు మగువను వలచున్
కనకంపు బొమ్మ వీనిం
బెనఁగొను మేఘాంతరాళ విద్యుల్లతలన్. 95

ఉ॥ పువ్వుల ప్రోవులా సుభగు పొంకపు నవ్వులు హాయి గొల్పెడిన్
దివ్వెల వెల్గులా కనుల దీధితు లార్పగఁ జేయు కెప్పులన్
దవ్వుల నుండియున్ మనకు దగ్గర నున్నటు లొప్పు చున్నదీ
జవ్వను సోయగంబు గని సారసమిత్రుఁడు డాఁగె మబ్బులన్. 96

వ॥ విశ్వామిత్రుని పురస్కరించు కొని రామలక్ష్మణులు జనకుని
యజ్ఞ వాటికనుఁ జేరిరి. 97

ఆ॥ మొట్టమొదటి మూడు పురుషార్థముల వలె
మూడు వహ్నుల వలె వెలుచు చున్న
మూర్తి వంతమైన ముగ్గురు మూర్తులన్
జనక నృపతి గాంచె సంభ్రమమున. 98

వ॥ జనక మహారాజు వారి కెదురేగి సవినయముగా నాహ్వానించెను.
మిథిలేశుఁడు కౌశికుని గాంచి యిట్లనెను. 99

సీ॥ అతులిత సుందరు లారూఢయౌవను
లమర తుల్య పరాక్ర మాన్వితులును;
ఖడ్గ ధనుర్ధరుల్ కమల పత్రాక్షులు
గజ సింహ శార్దూల గమన యుతులు
ఇంగిత చేష్టల నిర్వురు సదృశుల్
సూర్య చంద్రుల వలె చూడ నొప్పు
నీ రాజపుత్రుల నే క్షితీశుడు గనె
పాద చారులగుచు వచ్చుటకుఁ గ

ఆ॥ తం బదేమి యిటుల తాపసేంద్ర యనుచు
జనక నృపతి యడుగ; ముని వచించె
దశరథుని తనయులు దైత్యులను వధించి
నా యజనము బ్రోచి నారు వీరు. 100

కి॥ పురహరుని విల్లు గాంచన్
నరపతి సూను లరుదెంచి నారిటకున్ మీ
రరమరిక లేక చూపుడు
చరణంబున వామనుండు జగతి నలమడే. 101

ఉ॥ రాముని మోము దమ్మి గని రాజు మనంబున నెద్దియో ప్రమో
దామల భావ వీచికల హాసము బర్వె మనో రమమ్ముగా;
కోమల పద్మ కోశములు క్రొందళుకుల్ పచరించునట్లు ప్రా
చీ మిహి రోజ్జ్వల ద్యుతుల శేషముగా ఊవిబ్రాకుచుండగన్. 102

ఆ॥ ప్రాత భావ మొకటి పరికించు వేళలో
క్రొత్త భావ మొకటి గొనబు లీన
సంతసించు నట్టి సత్కవి హృదయంబు
మాడ్కి జనక రాజు మనము పొంగె. 103

సీ॥ తన సుత కీతండు తగినట్టి ధవుడని
మనసులో నొకవాక్కు మలయు చుండ;
అవనిజ కేరీతి నర్హుడౌ భర్తను
తేగల నను చింత తీరి నటుల;
అజ్ఞాన తమమున నటు నిటు చెఱ లాడు
మనుజుండు జ్ఞానమున్ గనిన రీతి;
న్యాసంబు నుంచిన యజమాని కిప్పుడు
అప్పు జెప్పెటి భాగ్య మబ్బి నటుల;

గీ॥ రామచంద్రుని గాంచ నారాజు మనము
పరిపరి విధంబులను పరిభ్రమము చెంది
స్వస్తతను గాంచె శాంత భావంబు బొంది
ఔర దైవత్వ మాహాత్మ్య మద్భుతంబు. 104

వ॥ జనక మహారాజు వారిని రాజ ప్రాసాదంబునకు గొనిపోయి తగిన
విడిది యేర్పాటు గావించెను. మరుసటి దినము సూర్యోదయ
మెట్లున్నదనిన. 105

ఉ॥ తూరుపు దిక్కునన్ బొడమెఁ దోయజ బంధుడు కాంతి మాలికా
పూరముచే దిగంగనల మోముల ముద్దిడుచున్ వచించుచున్
చారు పిక స్వనంబుల; "పినాకి ధనుస్సును వంచి నేడు సీ
తా రమణిన్ వరించును మదన్వయు డద్భుత లీల గాంచుడీ"!

వ॥ ప్రాతః కాలమున విశ్వామిత్ర మునీంద్రుడు, రామలక్ష్మణులు వెంటరాగా. జనకు నా స్థానముఁ బ్రవేశించెను. ఆరాజు వారి నుచితాసనముల నుపవిష్టులజేసి యిట్లు పలికెను. "మునీంద్రా మీకు స్వాగతము మీరు కోరిన రీతి కార్ముకమును దెప్పించెదను" అని సేవకులను శివుని విల్లుఁ దెమ్మని అజ్ఞాపించెను. 107

గీ॥ నీటి మోపరు లెట్లు నింగిపై హరివిల్లు
వాన చిన్కులు రాల వహియించు రీతిని
శ్రమ జలంబులు జార శంకరుని వింటిని
జనకుని సేవకుల్ కొనివచ్చి నిలచిరి. 108

వ॥ జనకుడా వింటినిఁ జూపుచు దాని వృత్తాంత మెఱింగించెను. మా పూర్వ పురుషుఁడు దేవరాతుఁడను మహాత్మున కీవిల్లు శివునిచే న్యాసముగా నీయబడినది. నేనొకనాడు 109

తే॥ జన్న మొనరింప క్షేత్రమున్ దున్నునపుడు
సర్వ లక్షణ సంపన్న సారసాక్షి
అమర మాయయొ యనురీతి నాడుబిడ్డ
పొడమె నాగటి చాలున; పుణ్య ఫలము
అ యయోనిజఁ బెంచితి నాత్మజ వలె
సీత యను పేర నామె ప్రసిద్ధి గనెను
వీర్య శుల్కగ నామె స్థాపిత మొనర్చి
బల పరీక్షకుఁ బెట్టితి భవుని విల్లు. 110

వ॥ ఆమె స్వయంవర మొకనాడు నిర్ణయించితిని. 111

క॥ సీతా స్వయంవరమునకు
భూతలమున నున్న నృపులు భూరి యశుల్ సం
జాత కుతూహల మతులై
యేతెంచిరి నాదు తనయ నెలమి గ్రహింపన్. 112

వ॥ ఒక్క శుభదినంబున సీతా స్వయంవర సభ నేర్పాటు చేసి, స్థాణుని కార్ముకంబు సభాంతరాళమునకుం దెప్పించి యిట్లంటిని. 113

క॥ ఓలగమున నున్న ధరా
పాలకులను గాంచి నేను పలికితి నిటులన్
శూలి విలు వంపు వధువున
కోలియగు నతండు వొందు నువిద కరంబున్. 114

చ॥ అనవిని కూడినట్టి వసుధాధిపు లొయ్యన నొక్క రొక్కరే
ఘనమగు శూలి కార్ముకముఁ గాంచి, యిదెంత యటంచు తీవితో
జని, కదలింపలేక, వడి జారఁగ ఘర్మ జలంబు వింటి తో
బెనఁగిరి హీన సత్త్వులయి ప్రేక్షక లోకము నవ్వుచుండగన్. 115

క॥ కాకలు దీరిన నరవరు
లాకార్ముక మెత్త లేక యటమట నొందన్
రాకేందు ముఖుఁడు రాముం
డీ కార్ముక మెత్త గలడొ యాకించ నగున్. 116

ద్వి॥ అంత విశ్వామిత్రు డవనీశ సుతుని
చిఱునవ్వునన్ గాంచి చెప్పె నీరీతి
కాంచుమా రామ! శంకరు కార్ముకమును
అనవిని రాఘవుం డంజలి పేసి. 117

క॥ సుప్త భుజంగము రీతిన్
గుప్తముగా పేటి యందు గూర్చిన వింటిన్
దృప్తిని రాముఁడు గనె బ్ర
దీప్తిని వెలుగొంద విల్లు దివ్యత్వముతోన్. 118

తే॥ యత్న మొనరింతు మునివారా! అసమ నేత్రు
ధనువు, స్పృశియింప, కదిలింప, గొనము గూర్ప
అనతిండని రాఘవుం డంజలింప
జొదల గదల్చె బ్రహ్మర్షి మోదమంది. 119

ఆ॥ పూవు వింటి జోదు పుష్ప ధనుస్సును
లీల గొనిన రీతి కేల గొనెను
శంభు విల్లు రామ చంద్రు డలంతిని
గొనము గూర్పవంచె ధనువు వెలమి. 120

వ॥ ఆ సమయమున 121

తే॥ మంచు పొర నుండి బాకు క్రొమ్మించు వోలె
పొదవు పొదనుండి వెలి చూచు పూవు పగిది
పొఱు నీటిని మెలగెడి వాలుగ వలె
విరిసె రూపు, హాసము, చూపు, తెర మరుగున. 122

క॥ విరిగె శివ ధనువు పెల్లున
కరికలభము చేతి యిక్షుకాండము భాతిన్
ధరవణకె పరశురాముని
చరణంబులు గదలె రామచంద్రుని జూడన్. 123

సీ॥ ఉదధిలో బడబాగ్ని యువ్వెత్తుగా పొంగి
యుప్పెన వీచులై యుఱుకు భంగి
ఆకాశ వీథుల నంబుద పోతము
లాస్ఫోట మొనరించి యార్చిన గతి

కొండ గుహల లోన మండెడు దావాగ్ని
జొచ్చి పెటేలున వ్రచ్చి నటుల;
సన్నని సందులన్ గ్రన్నన పెనుగాలి
వీచులు పర్వులు వెట్టు రీతి;
పెను పాప యొడయని భీకర ద్రాఘిష్ఠ
పూత్కారముల బుగ బుగల పగిది;
నిర్ఘాతముల చాలు నీలాభ్రముల నుండి
శైలాగ్రముల పిండి సల్పు చవిని;

గీ॥ ధ్వని జనించె విల్ విఱుగగ; దాని వలన
రామ లక్ష్మణులు జనకరాజు సీత
గాధి సూనుండు మిగులంగ కడమ వారు
ఎవరి మూర్ఛిల్లిరి; దనుజు లదిరి పడిరి. 124

వ॥ కొంత సేపటికి జనులు మూర్ఛ దేరిరి. జనక మహారాజు సీతా
దేవిని రామచంద్రుని దగ్గరకు తీసుకొని వచ్చెను. 125

క॥ అంచనడ వల్లనల్లన
జంచత్ స్వాంతమున ధరణి జాత వయస్యా
పంచయము వెంట రాగా
పంచశరోపముడు రాము పజ్జకు నదిగెన్. 126

క॥ కోమల కర పల్లవముల
రామామణి భూమిజాత రాముని మెడలో
పూమాల వైచి ప్రాణ
స్వామిని గనుగొనెను మేను పరవశ మొందన్. 127

క॥ ధరణిసుతా కరకంకణ
తరళరుచులు రామునీల తనువున బర్వన్
బయవిడు మెఱపులు సరవిన్
శరధరమునఁ బర్వినట్టి సరణి ఘటిల్లెన్. 128

వ॥ అంత జనక మహారాజు మంత్రులం బంపి, దశరథునకు శివ దనుర్భంగ వృత్తాంత మెఱింగించి, వివాహమ్మునకు విచ్చేయుండని యాహ్వానించె; దశరథ భూజాని సంతుష్టాంతరంగుడయి, భరత శత్రుఘ్నులతో సముచిత పరివారంబుతో మిథిలా నగరంబునకు విచ్చేయఁగా దశస్యందనున కెదురుగా జనకభూవరుండు సను దెంచి స్వాగత మొసంగి తగిన భవనమున విడియింపంజేసి, యుత్తర ఫల్గునీ నక్షత్ర యుక్త శుభముహూర్తంబునఁ గన కాంబరాభరణ భూషితయైన కల్యాణి జానకీదేవి కరకమలముం గొని, జ్వలించు జాతవేదుని ముందధి వసించిన శ్రీరామచంద్ర మూర్తి కభిముఖిగా నామెను గూర్చుండఁ జేసి. 129

క॥ ఇక్కన్నె సీత నీకగుఁ
జక్కని సహధర్మచరి, యశంబొనఁ గూర్చున్
నిక్కమిది, యీమె పాణిని
గ్రక్కునఁ గైకొనుము శుభము గల్గును నీకున్. 130

వ॥ అని పలికి సీతమ్మ కేలు కెందామర శ్రీరాము కరకమలము నందునిచి సమంత్రకముగాఁ గన్యాదాన మొనరించె, ననంత రంబు లక్ష్మణున కూర్మిళను, భరతునకు మాండవిని, శత్రుఘ్ను నకు శ్రుతకీర్తిని, జనకుం డొసంగి వివాహంబు సలిపె; నవ వధూవరులు ఒండొరులు ముత్తెమ్ముల తలఁబ్రాలు దోయిలించి శిరమ్ములఁ జల్లుకొనిరి. 131

సీ॥ భూసుత చెందొవ దోసిటి ముత్తెముల్
కెంపుల కాంతుల నింపుఁ గొలిపె,
ఉవిద మందస్మితచ్ఛవి సోక నయ్యవి
వజ్రాల పంక్తులై ప్రభలు వఱపె,
శ్యామలాంగుని మేన జారినవై యవి
యింద్రనీలద్యుతి నెసక మెసఁగె,

పసుపుఁ బచ్చడముపైఁ బడి యవి వింతగా
గోమేధికంబుల గొనబులీనె.

గీ॥ ఔర, తలఁబ్రాల సోయగ మ్మద్భుతముగ
నెఱసె, నవరత్న దీధితుల్ నిట్టలముగ
నిండుకొనియెను గల్యాణ మండపమునఁ
బరమ పావన సీతా వివాహ వేళ. 132

క॥ కారణ జన్మల పెండ్లి శు
భారవములు నింగి నిండ నమరులు మోదం
బారఁగ మ్రోయించిన భే
రీరవములు భీతి నింపె రేద్రిమ్మరులన్. 133

క॥ పాడుచు నాడఁగఁ బౌరులు
వాడలలో; సురలు దివిని; భ్రమగొలిపె నవే
వాడలఁ బౌరులు మింటన్
బోడిమితోఁ బ్రతిఫలించి పానదిన రీతిన్. 134

వ॥ వివాహానంతరము గాధేయుడు దంపతుల నాశీర్వదించి తప మొనరింప హిమవంతమున కరిగెను. ఇట్లు నిఖిల జగజ్జనంబులకును నిర్జరులకును సీతారాముల వివాహంబు ప్రమోద కారణంబయ్యె భువనంబు సాహ్లాదంబున నింపు వసంతమ్మావిర్భవించె.

వసంత తిలక :

ఏవంకఁ గన్న మధు వీక్షణ పర్వమాయెన్,
దీవల్ విలాసినులు దీర్చి శిరంబులన్ బూల్,
దావుల్ త్యజించుచు ముదం బెలయున్ మదాళి
భ్రూవల్లరీ చలనముల్ పానరింప హేలన్ 136

వసంత తిలక :

మావుల్ చిగిర్చి వనమధ్యము నందు నిల్వన్
తీవిన్ సువాసనల నింపి, పికంబు లొయ్యన్
రావం బొనర్చు మధురంబుగఁ గూ యటం చౌ
రా, విందొనర్చెఁ జెవి కామని మోద మారన్. 137

గీ॥ ఒక యపూర్వానుభవ మొంది, యొక్క మధుర
భావ లహరీ ప్రసారంబుఁ బరవశులయి
దంపతులు గాంచి రుత్సుకత్వమున; స్పర్శ
కలిగి కలుగక మున్న వెగ్గలపు హాళి. 138

చ॥ కడపిరి నూత్న దంపతులు కమ్మని వాతెఱ తేనె విందులన్;
దొడరెడి కేళి దీర్ఘికలఁ, దూఁగెడి క్రొవ్విరి తీవె డోలలన్;
విడివడ నట్టి కౌఁగిలుల; విచ్చిన మల్లియ పూల సెజ్జలన్;
బొడమెడి కూర్మి యల్కలను; బొంపిరి వోయెడి పేర్మి సేఁతలన్.

వ॥ నవ దంపతు లీ చందంబున నానంద మనుభవించు చుండిరి. ఒక్క సుముహూర్తంబున జనక రాజేంద్రుడు కూతుంద్రకు నల్లుంద్రకు రథ గజ తురగ పదాతులను దాస దాసీ జనంబులను చీనాంబరంబులను రత్నాభరణంబులను అరణంబు లిచ్చి వీడ్కొలిపె; మధ్యే మార్గంబున. 140

ఉ॥ అడ్డము వచ్చె రాఘవున కంగలు వేయుచు దుర్నిరీక్షుఁడై
చెడ్డ ధరాధి నాథులను జెచ్చెర నిర్వది యొక్క మాఱు చే
గొడ్డలి నూని చెండిన ప్రకోపి, మహాత్ముఁడు భార్గవుండు "నిన్
దొడ్డ దురమ్మునం దిపుడె తున్మెద" నంచు మహోగ్రమూర్తియై.

క॥ ఉదయార్కుని వలె రాముఁడు
పదరుచుఁ గ్రుంకంగఁ బోవు భానుని మాడ్కిన్
గొదరెడి భార్గవరాముం
డెదుర్కొరి రణాభిలాష యెస లేఁగంగన్. 142

కII తన్నెదిరి నిలిచి కొంకక
తన్నే మన్నించు రీతిఁ దగు వినయముతో
జెన్నొందు రాముని గని
ప్రన్నని యనుభూతి నొందె పరశువు జారన్. 143

కII తిగకంటి వాని వింటిన్
దెగవేసితి వంచు వింటిఁ దేకువ మీఱన్
దిగి యంగదె యీ వింటిని
మగఁటిమి లేకున్న నిన్ను బ్రమదింతు వెసన్. 144

కII అని చాపము నందింపఁగఁ
గనలుచు భార్గవుఁడు; కార్ముకమ్మును గొనుచున్
వినయమ్మున రఘురాముడు;
ముని సత్త్వంబును సమస్తమున్ గ్రహియించెన్. 145

వII అంత శ్రీరామచంద్రుఁడు వింటి నెక్కు వెట్టి యిట్లనియె. 146

ఆIIవెII చిచ్చుకంటి వాని సింగాణిఁ బెగ లాగి
మచ్చెకంటి మీఁది మమత చేతఁ
ద్రుంచి నాఁడ, మీరు దోర్బలమ్మునఁ బట్టి
యిచ్చినట్టి చాప మెక్కిడితిని. 147

కII ఎక్కిడిన మార్గణం బే
దిక్కున విడువంగ వలయుఁ దిన్నఁగఁ జెపుఁడీ
ముక్కంటి కంటి మంటలు
గ్రక్కెడి నియంబకంబు కారుణ్యనిధీ! 148

వII అని పలికిన రామునితో భార్గవుండు తన పరలోక మార్గంబు
భేదింపుమని చెప్ప, నట్లేయని రామచంద్రుండు బాణంబువిడిచె;

చ॥ పరశు ఖరాగ్ర కీలలను భస్మ మొనర్చితి రూపు మాపితే
నిరువది యొక్క మారు ధరణీ ధవులన్ గుపథ ప్రవృత్తులన్;
దిరముగ ధర్మవర్తనము దీర్పగ ధాత్రిని నాచరించుచున్
నరపతి సూనుడై హరి యనర్ఘళ తేజము నిల్పె నిచ్చటన్. 150

వ॥ అని పరశురాముఁడు తలచి భూలోకంబున తన కార్యంబు పూర్తి యయ్యెనని భావించి రామచంద్రు నాశీర్వదించి తపంబొనర్ప వలిమల కరిగెను. 151

క॥ రాముని మన్ననఁ బొందిన
రాముని తన ప్రాణవిభుని రమ్యాకారున్
శ్యామాంబుధర శరీరుని
రామామణి సీత గనియె రాగం బెసఁగన్. 152

వ॥ అంత శ్రీరామచంద్రుఁడు తండ్రితోఁ దమ్ములతో సపరివారంబుగా నయోధ్యాపురంబును జేరెను. కొంతకాలము గడచిన తర్వాత భరతుని మేనమామ యుధాజిత్తు వచ్చి భరత శత్రుఘ్నులను తన రాజ్యమునకుఁ దీసికొని పోయెను. రామ లక్ష్మణుల యోధ్యలో తండ్రి యాజ్ఞ చొప్పున రాచ కార్యముల నిర్వహించు చుండిరి. 153

తే॥ ప్రీతి గూర్చెను సీతమ్మ పితృకృత సతి
యగుటచే రామమూర్తికి; నవని జాత
గుణము చేతను సౌందర్య గుణము చేత
పతికి నత్యంత ప్రియమౌచు పరిఢవిల్లె. 154

క॥ సీతా హృదయ గ్రాహకు
డై; తద్గతుడై, మనస్వి యారఘుపతి సం
ప్రీతి విహరించె సతితో
నాతన్వి మనస్సెరుంగ నాఖ్యాతమునన్. 155

కII నాక వధూటుల సొబగున
నాకృతినిన్ లక్ష్మి బోలి యవనిజ సేవన్
గైకొనియె రాము హృదయము
శ్రీకరుడౌ విష్ణు రీతిఁ జెలగె నతండున్ 156

కII తనువులు రెండే యైనను
మనసు లొకటి యగుచు మనిరి మధుర పదములం
దెనసెడి భావము పొడిమి
జనకజయును రామమూర్తి సంతస మెలయన్. 157

కII పెదవులు పలుకక మున్నే
హృదయములో తలపులెల్ల హృదయం బెరుగున్
ముదితాంతః కరణంబుల
మెదలుదురా యాలుమగలు మేనులొకటిగన్. 158

కII ఋతువులలో విహరించిరి
సతీపతులు పదియు రెండు సంవత్సరముల్
సతి కూరిమి యిబ్బడియై
పతి కూరిమి కంటె నొప్పె పరితోషమునన్. 159

కII నీరజలోచన, గుణవి
స్తారా; భృగురామ దర్ప దళన వినోదా!
నీరద నీల శరీరా!
నీరధి గంభీర, నిగమ నిగదిత రామా! 160

ఓం తత్సత్



మ॥ సదసద్భేద విదుండ; రాఘవకథా
సౌందర్య లోలుండ; స
మ్మద లక్ష్మీపతి దుగ్గిశెట్టి నరసిం
హ శ్రేష్ఠికిన్ బుత్రుడన్;
ముదమున్ గూర్చు గుణజ్ఞుఁడన్; రమణుడన్
బొంగారు భక్తిన్ రసా
స్పద రామాయణ బాల కాండమును నే
సద్భక్తితోఁ గూర్చితిన్.



శ్రీసద్మ నయన పద్మా,
భాసుర నీరద వినీలభద్ర శరీరా,
కోసలధరాధి నాథా,
వాసవ ముఖ దివిజ వినుత, భాను కులేశా! 1

వ॥ దేవా, యవధరింపుము. 2

క॥ అన్నుల మిన్నలు కోడం
డ్రుదు న్నందనులన్ వివేక రూఢిన్ మెలఁగన్
బన్నుగఁ గడపెను గుణ సం
పన్నుండగు దశరథుండు పంద్రెండేడుల్. 3

ద్విపద॥ ధార్మికుఁ డాతఁడు తనయుని రాము
నిర్మల కాంతి వినిర్జిత సోము
నీలమేఘ శ్యాము నిస్సీమ ధాము
శీల విశాలు నాశ్రిత పరిపాలుఁ
బురుషోత్తముఁ డటంచు బుద్ధి నూహించి
నరనాథుఁ జేయ మానసమునఁ దలఁచె. 4

చ॥ తలఁచిన యంతనే దశరథ క్షితిపాలుఁడు పిల్వనంపె మం
త్రులను ప్రధాన పౌరుల గురు ప్రవరుండు వసిష్ఠునిన్, "గుణో
జ్జ్వలుఁడగు రామభద్రునికి దాంతునికిన్ దగు యౌవరాజ్య మీఁ
దలఁచితి నంచుఁ దెల్ప; దివిఁ దాఁకె జనాళి 'తదాస్తు' శబ్దముల్.

వ॥ శ్రీరామ యౌవరాజ్య పట్టాభిషేకంబున కొక ముహూర్తము నిశ్చ
యింపఁ బడియె. ఈ వార్త కైకేయి దాసి దుస్తంత్ర ధురీణయగు
మంథర విని, మున్ను కందుక క్రీడా పరాయణుండుగా నున్న
యలనాఁటి బాలరామునిచేఁ దనకుఁ గలిగిన చరణ తాడన
పరాభవంబు వైర కారణంబు కాఁగా. 6

గీ॥ కంటిలో ముల్లు విరిగిని గతిని, కైక
దాసి మంథర గాసిలి దాశరథిని
రాజ్య హీనునిగా నొనర్పన్ దలంచి
పట్టరాని క్రోధంబున పలికె నిటుల. 7

క॥ ఎట్టెట్టా రాఘవునకుఁ
బట్టంబా? యెట్లు జరుగు భరతుఁడు గల యి
ప్పట్టున, రాముం డే క్రియ
పట్టంబును గట్టు కొనునొ పరికింతును లే! 8

క॥ అని గొణుఁగుచు మంథర
చనె జనపతి ప్రియపత్ని కైక సదనంబునకున్
వినిపింపఁగ నీవార్తను,
బనిఁగొని చెఱుపంగ రాము పట్టము నీర్ష్యన్. 9

ఉ॥ వంకర మేను మానసిక వక్రత నేర్పడఁ జూపఁ గుంటుచున్
మంకున కేలు నిల్పి విషమంబగు రొండిని; కైకఁ జేరి, తా
టంకము లూగఁగాఁ, గటకటం బడి, వింటివె నేఁటి వార్త, నీ
వంక భవత్ప్రియుం డకట, వైరముఁ బూనఁగ నేమి హేతువో?

క॥ కూరిమి కొమరుని భరతునిఁ
బోరోయుచు రామునకుఁ బ్రభుత్వంబును నీ
గారాబు వల్లభుఁడు తమి
దీరఁగఁ బట్టంబు గట్టుఁ దెలియుమ తెఱవా! 11

క॥ ఇను మిక్కిలి ప్రేముడితో
మనుజేశుఁడు నిన్ను సతము మన్నింపఁగ, నీ
కనుసన్నల వర్తింతురు
వినయంబున, నెల్లవారు వెఱతురు నీకున్. 12

ఆ॥వె॥ రాజు రాముఁడైన రాణియౌ జానకి
రాజమాత యగును రాజసమున
నీదు సవతి; వినుము నీవు వారి మనసు
ననుసరించి మెలఁగ వలవి యగునె? 13

వ॥ కావున భరతునకుఁ బట్టంబు గట్టునట్లు నీ ప్రాణవల్లభుని వేఁడు
మనిన కైకేయి యామెతో నిట్లనియె. 14

క॥ చక్కఁదనమునకు గొనముల
కిక్కయగున్ రాముఁ డతని కినకుల మణికిన్
మక్కువ రాజ్యం బిచ్చినఁ
దక్కువ నాకేమి యగును? దలఁగుము చింతన్. 15

క॥ ముల్లోకము లేలంగల
బల్లిదుఁడు నిజంబు రామభద్రుఁ డయోధ్యా
వల్లభుఁ డైనన్ దేవత
లెల్లన్ వసియింప వత్తు రీపురికి సఖీ! 16

వ॥ అంత మంథర కైకతో నిట్లనియె. 17

క॥ రాణించితి వీపురమున
రాజులమణి రఘుఁఛుఁ, బంక్తిరథునకుఁ బంచ
ప్రాణములు నీవె యగు పూఁ
బోణివి, నీ తెలివి నేఁడు పొల్లయి పోయెన్. 18

గీ॥ నీవు కౌసల్య దాసివై సేవ జేయ
వలయు రాముండు రాజైన, భ్రాంతి మాని
చెలియ, నేఁ జెప్పి నట్టులఁ జేయు మీవు,
భరతునకు నీకు సుఖ మబ్బు, భాగ్య మబ్బు. 19

కII అలనాఁడు నీకు నీపతి
వల నొప్పఁగ నొసఁగి నట్టి వరముల రెంటిన్
కలికీ, కోరుము, పలికిన
పలుకులు రఘువంశ విభులు పాటింతు రొగిన్. 20

వII తొల్లి శంబరాసునితోఁ దారసిల్లిన సంగ్రామంబున దేవేంద్రునికి సాయ మొనర్పఁ బోయిన దశరథ చక్రవర్తి వెంట నీవరిగితివి. శంబరుం డొనర్చిన మాయలకు నీవు ధవళాంగ మహర్షి ప్రసాదలబ్ధ మంత్ర విద్యా ప్రభావంబునఁ బ్రతీకారము గావించితివి. నీ సహకారంబునకు మెచ్చి నీ వల్లభుం డప్పుడు నీకు రెండు వరంబు లిచ్చె, ఆవరము లిప్పుడు నీ వడిగి గైకొనుము. 21

కII భరతునకు రాజ్య మిచ్చెడి
వరమున్, గౌసల్య కొడుకు పదునాల్గేడుల్
పరఁగ నరణ్యావాసము
జరుపు నటుల్ వరము, నీవు సాధింప వలెన్. 22

వII మంథర పలుకులతో నాశా పూరితయై కైక కుబ్జ నిట్లు ప్రస్తుతించెను. 23

ఉII పంకజ మెట్లు వాతహతి వంగునొ యట్టుల గూని యొప్పు; నే
ణాంకుని బోలు నీ మొగము నందొక మచ్చయు లేక రాజిలున్
శంక యొకింత లేదు కడు చక్కని కుబ్జవు ప్రీతి గొల్పుచున్
వంకర దాని వయ్యును శుభంకర వైతివి నాకు మంథరా! 24

గీII విసము కైవడి మంథర వెడ పలుకులు
సొచ్చె కైకేయి మనసును, సొగయఁ జేసె
నామె సువివేక దృష్టి, దురాశ పట్టి
నెట్టెఁ గైకను గోప మందిరము లోకి. 25

కII దిగనాడె విరులు నగలున్,
మగుడంబడి కట్టె నొక్క మాసిన చీరన్
బిగి ముసుఁగు వెట్టుకొనియెన్;
వగలాడులు మాయలందు వలఁతులుగాదే. 26

ద్విII నక్షత్ర హీనమౌ నడి నిసి భాతి
భూషణ హీనయై పొలతి యొప్పారె
వెల్ల మబ్బులు గల వినువీధి యందు
గ్రహణమునకు ముందు రహి వెల్గు నినుని
బోలుచు భూపతి ముదముతో జొచ్చె
కన్నుల కింపగు కైక సౌధమ్ము.
అనఘుడా ముదుసలి యౌవన వతిని
తన ప్రాణమున కన్న ఘనమైన కైక
నతి పాప సంకల్ప నవనీ తలమున
కనుగొనె నిట్టూర్చు కాంతా భుజంగి. 27

గీII రామ పట్టాభిషేక నిర్ణయము కైక
కెఱుక సేయంగ, దశరథుం డేగు దెంచి
యామె ముసిగిడి శోకింప నరసి పలికె
"నొడలు నొవ్వంగ నేలపై నుండ నేల." 28

కII కన్నీరు వెల్లువలుగాఁ
జెన్నగు వదనంబు చెల్వు చెడఁ జీఁకటిలోఁ
బెన్నూర్చెడి ప్రియ భామను
మన్నీఁ డూరార్పఁ దొడఁగె. మచ్చిక హెచ్చన్. 29

కII వగపేలా! హేలావతి,
తగునే దైన్యంబు నీకుఁ దలిరుంబోడీ,
నెగడునె పూవుం దీవియ
పెగలో? నీమేను శోక శిఖిలోఁ గమలెన్. 30

క॥ నీ నగవుల పూఁదేనియ
నానక నేఁ బ్రదుకఁ గలనె? యన్నుల మిన్నా,
యీ నెవ్వగ నీకేటికి?
హానిన్ నీకెవఁ డొనర్చె నంభోజ ముఖీ! 31

క॥ తెలివా! నీ కోరిక నా
కెఱిఁగింప వదేమి? సంశయింపఁగ నేలా?
నెఱవేర్చనె యెది యైనన్?
నెఱవాదిని సూర్యవంశ నృపుడన్గానే? 32

ద్వి॥ నీహార తమమును నీరజాప్తుండు
తొలగించు నటు చింత తొలగింతు నేను. 33

తే॥ కాము శర పీడితుండయి, కామ వేగ
వశుడు, ముదుసలి భూపతి వనిత జాల
మెఱుగ జాలక చెప్పెను 'మెఱుగుబోడి
కోర్కె యెట్టిదైనను తీర్తు కోరు మిపుడు'. 34

వ॥ అని యడిగిన దశరథునితోఁ గైకేయి "రాజేంద్రా! శంబరాసుర సంగరంబున మీకు నేఁజేసిన సాయంబునకు మెచ్చి నాకు మీరిచ్చిన రెండు వరంబులను మీకడ నే నిల్లడ వెట్టితిని గదా; నాకిప్పుడు మీరవ్వానిని సఫల మొనర్పవలయు. 35

క॥ అలనాటి రెండు వరములఁ
దలపుఁడు భరతునకు విశ్వధాత్రి నొసంగన్,
వలెఁ దొలివరమునఁ; రాముని
మలివరమునఁ బంపవలె సుమా వనములకున్. 36

క॥ జనపదము లందు నిలువక
వనములఁ బదునాలుగేండ్లు వసియింప వలెన్
ముని వృత్తిని రఘురాముఁడు;
దినమణికులదీప! కోరితిని నా కోర్కుల్. 37

క॥ కూరిమి సతి కోరిన యీ
దారుణ వరయుగము దశరథ క్షితిపతికిన్
నారసములు చెవి నాటిన
తీరౌదవన్, మూర్ఛ గదిరెఁ జిత్తం బదరెన్. 38

వ॥ అతఁడు కొంత వడికి మూర్ఛనుండి తేఱుకొని. 39

శా॥ "ఏమేమీ,! మదిరాక్షి, నీతనయునే యీధాత్రికిన్ నేతగా
నేమం బారఁగ నే నొనర్చెదను గానీ, గానలం బట్టి శ్రీ
రాముండేటికిఁ బోవఁ గావలయు? భార్యా రూపముం దాల్చి నా
గీముం జొచ్చిన కాలసర్పమవు కైకేయీ! యథార్థంబుగాన్. 40

క॥ మేలములటె యీ మాటలు?
నీలో ఈ కోర్కె లొదవెనే నిజముగ? దు
శ్శీలుర దుర్బోధలచే
ఈలాగునఁ బల్కుచుంటివే! కైకేయీ! 41

క॥ చన్నిచ్చినావు నీవీ
కన్నయ్యకు, భరతునివలె గారామున రా
మన్నను బెంచిన దానవు
మన్నించినదాని విట్లు మాటితివి గదే!" 42

ఆ॥వె॥ అని వచింపఁ - గైక "యవనిపా! నీవిట్లు
పలుకఁ దగునటయ్య? భరతుఁ డెట్టు
లవని పాలనమున కర్హుండు గాఁడు? నీ
పుత్రు లందు భేద బుద్ధి తగునె? 43

క॥ ఇన్ని దినంబులు నన్మన్
మన్నించి వరంబు లిచ్చి మంచిన నీవి
యన్నువ తెమ్మనఁ బలుకుట
విన్న జనుల్ నవ్వి పోరె పృథివీనాథా! 44

వ॥ అంత దశస్యందనుం డిట్లనియె. 45

ఉ॥ "ఏమిటులాడెదోసి! యెపుడేని అనాదరమున్ వెలార్చెనా
రాముఁడు నీయెడన్? నిరపరాధి వనిన్ బదునాలు గేండ్లు పో
రాముల పాలు గావలెనె? రక్కసి! యెక్కడ నేర్చితీ నుడుల్
బూమెలు వెల్వరించు వరముల్ సృజియించిన
యింద్రజాలముల్?" 46

క॥ "వగలాడి కోర్కెఁ దీర్పగఁ
దగ వెఱుఁగని గ్రుడ్డిఱేడు తఱిమె నయారే,
తొగసూడు కొలము సంద్రపుఁ
దొగ విందున్ రామచంద్రు దూరవనులకున్." 47

వ॥ అని జనులు నిందింపరా? వినుము నాపలుక్కులని చెప్పిన పతి
మాటలకుఁబెడ మోమై యున్న కైకతో నమ్మను జేశ్వరుం
డిట్లనియె. 48

క॥ నగుబాట్లగు మన బ్రతుకులు,
సుగుణఖనిన్ రామచంద్రు సుత్రామ సమున్
దెగువన్ వనముల కంపిన,
జగమున సౌఖ్యమున బ్రదుకఁ జాలన్ జెలియా! 49

క॥ బొట్టు చెడు నీకుఁ గైకా!
రట్టువడున్ రాచ కొలము రాముని వనికిన్
నెట్టుదు మేనిన్ మనలన్
దిట్టుదురు జనంబులెల్లఁ దీర్పరు లగుచున్. 50

సాధ్వి॥ శ్రీపతి సము గుణసేవధి వని నివసింపగ జనుమని చెప్పఁగ నే,
నోపను; బ్రియసుతు నుజ్జ్వల చరితుని నుజ్జన మొనరిచి యుండ
నిలన్
బాపము ముదుసలి పల్లటిలునని కృపన్నను గనుగొనుమా
రమణీ
బాపురె కుటిలతఁ బాయని గదువపు వాలకమును నెఱపం దగునా?

వ॥ కైకేయీ శ్రీరామచంద్రుడు. 52

క॥ సత్యముచే లోకమ్ముల
నిత్యము ధానమ్ముచే వనీపకతతులన్
భృత్యత్వమ్మున గురువుల
నత్యంతము వింటిచేత నరులను గెలిచెన్. 53

క॥ పలు తెఱగుల బతిమాలెన్
గలకాలము నింద వడుట గమనింపు మనెన్
గలికి విడలేదు పట్టున్,
దలవ్రాఁత నతిక్రమింప దశరథువశమే? 54

క॥ వనజముఖీ వర వాగురు
లను జిక్కి ధరావిభుఁడు విలాప మొనర్పన్
గననేరని యట్లర్కుఁడు
వనజమ్ముల కినుకగాంచి వార్ధినిఁ జేరెన్. 55

ఆ॥వె॥ హరి సౌంధ్యరాగ మాకాశలక్ష్మికిఁ
దొగపు పట్టమాయె సొగసు తెనఁగ
అస్తమింపఁ బోవు నరుణార్క బింబంబు
చెందిరంపు బొట్టు చంద మెనసె. 56

వ॥ అంత సంధ్యా కాంత రోదసీ రంగస్థలిం బ్రవేశించె. 57

క॥ చెంగావి జిలుగు చీరన్
జెంగులు జారన్ ధరించి చెల్వము చిందన్
బొంగుచు నడవఁగ నందెలు
ఘంగున రవళించె వనఁగ ఖగములు గూసెన్. 58

క॥ పూరిండ్ల నడిమి కొప్పులఁ
దోరంబుగ రేఁగు పచన ధూమము లొప్పెన్
నారీ గణములు సంధ్యా
శ్రీ రమణికి దిద్దు ధూప రేఖల భంగిన్. 59

క॥ దినమణి కన్మొఱఁగిన, భూ
జనపతి మతి నిముడ లేక జగతిం బర్వన్
మునుకొనిన శోక మోయన
ఘనమై దశదిశల నంధకారం బడరెన్. 60

క॥ చీఁకటిలో లోకంబులు
చీకాకునఁ జిక్కు టరసి, స్నేహ విశేషా
లోకంబుల లోకముఁ గనఁ
దేకువతో విధుఁడు వొడమెఁ దెలి నగవులతోన్. 61

క॥ చలువల వలువను దాలిచి,
కలువ కనులు విరియ విధునిఁ గనుఁ గొనెడి నిశా
లలన పొలుపారె వలపులు
చిలుకుచుఁ బ్రియుఁ గను నవోఢ చెలువంబలరన్. 62

ఉ॥ చిక్కని చీఁకటిన్ మగని చేతల తీవ్రత కోప లేక యా
చక్కెర వింటి జోదు కళ చక్క నెఱుంగని లేఁత ముద్దరా
లొక్కతె భర్తకున్ దెలియ కుండఁగ దాగఁగఁ గన్నుఁ బ్రామి తాఁ,
జిక్కమి, వెన్నెలల్ విరిసి చిక్కఁగఁ జేసెను నాథు కౌగిటన్. 63

క॥ రాగిల్లెఁ జంద్రకాంతము,
సాగర ముప్పొంగెఁ, గలువ సమ్మోదించెన్,
భోగుల కానందమును వి
యోగుల కార్తియును వృద్ధిబొందెన్ జ్యోత్స్నన్. 64

కII పొలయలుకలఁ బెడమోముల్
గలియక పట్టియలఁ బట్టి కలఁగెడి జతలన్
గలుఁప జనుదెంచు వేగై
తులకించుచు వేగుఁ జుక్క తోచెన్ బ్రాచిన్ 65

గీII కామ కేళీ విజృంభణ క్లాంత లైన
క్రొత్త జంటల యలఁత పోఁగొట్ట వీచె
మంథర ప్రత్యుషఃకాల మారుతములు
విచ్చు తమ్ముల గంధముల్ వెలయఁ జేసి. 66

గీII కలువ చెలువల మోములు కసటు వడఁగఁ,
గువల యాప్తుని నెమ్మోము గోము దూల,
గూళ్లు వెల్వడి పుల్గుల గుములు గూయఁ,
బ్రాగ్దిశన్ దొంగి చూచెను భాస్కరుండు. 67

కII వడి వడి వెడలెను భానుఁడు
పుడమి విభుఁడు భాను కులుఁడు పొగలుచు రాత్రిన్
గడపిన వాఁడెట్లనుచును
దొడరెడి కుతుకంబు తోడఁ దూరుపు దెసకున్. 68

వII అత్తఱి వైతాళికులు. 69

సీII కాకుత్థ్స వంశ ముక్తామణీ! రఘువరా!
కౌసల్య కూరిమిఁ గన్న తండ్రి;
జానకీ హృదయాంబు జాత మాధ్వీ రసా
స్వాద విశారద చంచరీక;
సాకేత సామ్రాజ్య జన నేత్ర కువలయా
హ్లాద నాపాది సుధాంశు మూర్తి;
క్షీర పాథోధి వీచీచయ శేష ప
ల్యంక సమాన శయ్యా శయాన,

గీ॥ నీదు పట్టాభిషేకంబు నేఁడు చూడ
వచ్చి యున్నారు ప్రజలెల్ల. వనజ బంధుఁ
డదియె పొడసూపెఁ బ్రాగ్దిశ యందు, లెమ్ము
లెమ్ము భాస్కర తేజస్వి, లెమ్ము లెమ్ము. 70

వ॥ ఏవం విధమునఁ బ్రవర్తిల్లిన మేల్కొలుపులచే రామభద్రుండు
మేల్కాంచి కాల్యకృత్యంబులు నిర్వర్తింపఁగా. 71

క॥ రంగారు రంగ వల్లిక
లం గొంతలు దీర్చ, సొంపులం గుల్కు జగా
బంగరు పీఠములన్ బ్రౌ
ఢాంగనలు శుభాంగు రాము నవనిజ నెలమిన్. 72

క॥ ఆసీనులఁ జేసి, దసో
ల్లాసముగా మధుర గళములన్ నవ కవితా
ధ్యాసిత గిరిజా పరిణయ
భాసురముల గేయములను బాడుచు లీలన్. 73

క॥ కెందమ్మి పూవురేకుల
యందము హసియించు సొబఁగు టరచేతుల నా
నందముతోఁ దలలంటిరి
ఇందు నిభాననకు, రఘు కులేశున కింతుల్. 74

క॥ సారెకు సురభిళ తైలము
జారఁగ మేనులను బూసి, చాతుర్యము నిం
డార నలుగిడి కనక భృం
గారములన్ నీరు గొనిరి కంజదళాక్షుల్. 75

కII పొనరిన బంగరు గిండ్లను
జను(గవ చేరువను నిలిపి, జలములు వోయన్
మునుకొనిన వనజ నయనల(
గననాయెన్ ద్రికుచలైన గతి( జూపఱకున్. 76

గీII జలక మాడించి కురులొత్తి పొలప మొప్ప(
బలుకు సాం(బ్రాణి పొగవైచి, చెలువు మెఱయ
జనక పుత్రికి రామ చంద్రునికి లలిత
గతిని గైసేసి రుత్పలగంధు లవుడు. 77

కII తేజరిలె శంప సొంపున
రాజన్మణి సురుచిరాభరణ శోభితయై
రాజానన జనకజ సుర
రాజోపల నీలదేహు రాముని సరసన్. 78

కII ఈ రమణ నేస(గు సీతా
శ్రీరాముల కడ(కు వచ్చి చెప్పె సుమంత్రుం
డో రామా నిను గాంచగ(
గోరెను నీ తండ్రి యిపుడు గొబ్బున రమ్మా. 79

వII అంత శ్రీరామచంద్రుడు కైకేయి సౌధంబున కరిగి యాదేవిని( దండ్రినిం గని మ్రొక్కి నిలిచి, జనకుని దైన్యంబు గుర్తించి, కలరూపు నెఱుంగ( జేయుమని కైకేయినిం బ్రార్థింప నామె యిట్లనియె( దొల్లి. 80

కII దేవాసుర సమరంబున(
జేవన్ మీ తండ్రి కేను జేసిన సేవన్
భావించి యత(డు మోదము
దైవాఱగ నా కొసంగె( దగ వర యుగమున్. 81

క॥ కోరితిని యౌవరాజ్యం
బారూఢిగ భరతునకు, మహాత్ముఁడ వగు నీ
కీరేడు వత్సరంబులు
కారడవుల మునుల రీతిఁ గాలముఁ గడపన్. 32

క॥ ఈ రెండు వరంబుల మీ
కూరిమి పిత నాకొసంగి కొంకునఁ జెప్పన్
నేరక మోమోడి యిటుల్
నీరసముగ నున్నవాడు నినుఁగని రామా! 33

క॥ కైకేయి వరములన్ విని
కీకారణ్యముల నుండ కృతనిశ్చయుడై
చీకటి రాత్రిన్ వెలిగెడి
రాకా శీతాంశు పగిది రాముం డొప్పెన్. 34

ఆ॥వె॥ తండ్రి గారి మాట దాఁటని శ్రీరామ
మూర్తి విన్నవోని మోము దనర
మొలక నవ్వు నూని మోడ్చిన కరముల
తండ్రి పాదములను దాఁకి పలికె. 35

గీ॥ నృప చరిత్రంబు పాప భూయిష్ఠ మట్టి
రాజ ధర్మంబు నుండి నన్ రక్ష సేసి
మునులు వర్తించు పథమునఁ బొమ్మటంచు
బోధ సేసిన తల్లి కైమోడ్పు నీకు. 36

ఆ॥ నీదు వాక్యములను నెరవేర్తు నేనమ్మ
తండ్రి మాటలనుచు తలనుఁ దాల్చి
తండ్రి యాన నెపుడు దాటను; నాధర్మ
మది యటంచుఁ దెలియు మమ్మ నీవు. 37

ఆ॥ అర్థ మందు నాశ యావంతయును లేదు
ఉత్సహింప నిచట నుండ తల్లి
ఋషి సముండ నేను మృష వల్కు నోడుదు
ఆశ్రయింతు ధర్మ మనవరతము. 88

ఆ॥ తండ్రి యాన నేను తప్పక తలదాల్తు
ననువులైన నొడ్డి; అటవు లందు
పదియు నాలుగేండ్లు వసియింతు భరతుండు
రాజ్య మేలు నమ్మ ప్రాభవమున. 89

వ॥ ఇవ్విధంబున శ్రీరామచంద్రుండు వలుకుచుండ. 90

సీ॥ నాదు కంటి వెలుంగ, నా బహిః ప్రాణంబ
నీవు చల్లగ నేల నిలను జూడ
కలలెన్నొ కన్నాను కల్లలే యాయెను,
కఠినాత్మురాలు కేకయ తనూజ
నిర్ణయం బొనరించె నీకుఁ దాపస వృత్తి,
ధాత్రీపతినిఁ జేసె తన కొమరుని,
నా పూర్వ జన్మ పుణ్యము నీవు కన్నయ్య;
నా పాప ఫలమె యీనాటి యాయె;

గీ॥ మాట యిచ్చితి నాతండ్రి మరలలేను
దొసఁగు నాయందుఁ గలిగెను, దూరఁ దగదు
అనెడి భావంబు గనపడు నట్లు తన్ను
దైన్యమునఁ జూచు తండ్రిని మాన్యునిఁ గని. 91

వ॥ తండ్రితో శ్రీరామచంద్రుఁ డిట్లనియె. 92

చ॥ మనుజుల సత్పథాచరణ మగ్నులఁ జేయగలట్టి ధర్మ పా
లన మతి దుర్ఘటంబు; ప్రజలన్ బరి తృప్తులఁ జేయఁ బూనుటల్
పనిగొని యెండమావుల జలంబును గాంచుట యౌను; రాజ మౌ
ళిని వెలుగొందు కాంచన కిరీటము ముండ్ల కిరీట, మారయన్. 93

కII ఈ దేహం బీ రాజ్యము
మీదే, పాలింతు నేను మీ శాసనమున్
గాదనక, యౌవరాజ్య
శ్రీదేవిన్ భరతుఁడే వరించున్ గాతన్. 94

ఉII కోరను రాజ్య వైభవము కోర నభీష్ట సుఖమ్ములన్ దివిన్
కోరను జీవితమ్ము సుమ కోమలమైన వసుంధరా సుతన్
కోరుదు నిత్యమున్ భవదకుంఠిత సత్య వచోను పాలనన్
ధీరత వీడ నౌనె ధరణీధవ! దీవన లిచ్చి పంపుమా. 95

కII ఈరీతిఁ దగిన పల్కులు
శ్రీరాముఁడు పల్కి; కదలి సీతను దల్లిన్
జేరి, పినతల్లి వరసం
ఛారముఁ బట్టాభిషేక భంగముఁ దెలిపెన్. 96

వII పూజా గృహంబున నున్న కౌసల్య కీవృత్తాంతము పిడుగు పాటాయెను. 97

కII ఒడ్డొరసి పొరు నది నడి
బొడ్డున నున్నట్టి వృక్ష మూలము వెల్లిన్
గడ్డలు కరుగన్ ద్రాలుచు
పడ్డటు కౌసల్య వగపు వఱదన్ ద్రాలెన్. 98

వII మూర్ఛ మునింగిన తల్లిని రామభద్రుండు సేదదీర్చెను. ఆమె కన్న కొమరుని యెడబాటున కోర్వలేక యిట్లు విలపించెను. 99

ఉII బిడ్డలు లేరటంచు దురపిల్లితి, సంతతికై తపించి, నేఁ
బడ్డవి పాట్లు గావు - నిను భాస్కర తేజుఁ గుమారుఁ గంటి, నీ
గడ్డకు నీవె రాజువని కంటి గలల్, పదునాల్గు వత్సరాల్
గడ్డలు కాయలున్ దినుచుఁ గానన వాసము సేయ బోదువా! 100

ఉ॥ ఏకొఱ నోము నోచితినొ? యేమొ? నినున్ సుగుణాభిరాము, సు,
శ్లోకు, సుతాగ్రగణ్యు, సురలోకనుతున్, బిత నిర్దయాత్ముడై,
పోకడ పెట్టెనా? విపిన భూముల నీవు వసించు నట్టులా,
కైక యదేల కోరెఁ గొడుకా! జనకుం డిది సమ్మతించెనా? 101

ఉ॥ పాపము లెట్టివో గత భవమ్మున నేనొనరింప కున్న, ది
వ్యాపగ బోలు కైక మది యగ్గలమౌ పగ కగ్గమౌనె, యీ
యాపద నీకు గల్గునె సుతా! గహనమ్ముల కీవు పోవ, నే
నీ పగవారి మధ్య మను టెట్టులొ యీవగ యీదు టెట్టులో. 102

ఉ॥ దైన్యము నిస్సహాయత విడాకు హతాశ నొనర్చి, యోచనా
శూన్యనుఁ జేసె నన్ను, నెటు జూచినఁ దోచు నగాధమే, జగ
న్మాన్యుని నిన్ను దుర్గమ వనమ్ముల పాలొనరించు శక్తి సా
మాన్యుల సొత్తుగాదు, మను మార్గము లేదిక నాకు నాయనా! 103

ఆ॥వె॥ పడతి మిన్న కైక కడుపునఁ బుట్టక
ఏల పట్టి వైతి వీవు నాకు?
వన నివాస రేఖ వనజ భవుఁడు వ్రాసె
నన్ను!, నిన్ను నేను గన్న కతన. 104

వ॥ పలు రీతుల దుఃఖించు తల్లిని రామచంద్రుం డోదార్చుచు
నిట్లనెను. 105

ఉ॥ ఈవిధి శోకభారమున నేడ్వగ యుక్తమె; ధైర్యమూనుమా!
భూవరు నాజ్ఞ నేను వనభూములలో నివసించి వచ్చెదన్
నీ విట మానవేంద్రునకు నేమముతో వరివస్య సల్పుటే,
నీవిధి; తండ్రిమాటను గణింపని పుత్రుఁడు పుత్రుఁడే ధరన్. 106

చ॥ అనుటయు లక్ష్మణుండు విని యాజ్యము వోసిన వీతిహోత్రుఁడో,
యనఁ దన యన్న మీఁది ప్రణయంబు వివేకముఁ గప్పఁ బల్కెఁ;
ఈ,
జనపతి యాన యౌనయె నిజంబుగ? జాయలకున్ వరంబు లీ,
యనువున గూర్చు వారలు ధరాధిపులే? యిది ధర్మ బద్ధమే? 107

ఆ।వె॥ అన్న, యానతిమ్మ, ఆలస్య మింకేల?
చక్కడంతు నీదు శాత్రవులను,
గపట మార్గ చరులఁ గానలఁ బట్టింతు,
భరతుఁ బట్టి కట్టి చెఱను ద్రోతు. 108

వ॥ లక్ష్మణుని యుక్తమైన పలుకుల వినుమని కౌసల్య ప్రతిమాలెను. కాని పితృ వాక్య పరిపాలనా దక్షుండగు శ్రీరామచంద్రమూర్తి చలింపక తమ్మునిఁ జిఱునగవునఁ గని యిట్లనియె. 109

ఉ॥ పావనులౌ, మునీంద్రుల నివాసములైన యరణ్య భూములన్
హావిరిఁ గాపురించి పదునాలుగు వత్సరముల్ దపోబల
శ్రీ విభవాభి రాములకుఁ బ్రీతియు భక్తియు నివ్వటిల్లఁగా
సేవ లొనర్చు భాగ్యమది సేకుఱె, మానుము చింత లక్ష్మణా. 110

వ॥ తమ్ముఁడా! మనుజు డెపుడు ధర్మము నాచరింప వలయును. ధర్మము ననుసరించియే అర్థకామముల సాధింప వలయును. 111

ఆ॥ గురువు, రాజు, ముసలి, కూరిమి తండ్రియు
కామ క్రోధ హర్ష కారణమున
సత్య ధర్మములకు సాక్షిగా నొసగిన
యాన తలను దాల్చు టనవరతము. 112

ఆ॥ ధర్మ పత్ని మాడ్కి ధర్మంబు గూర్చును
అర్థ కామ తృప్తి నహరహంబు
ధర్మ రహితమైన ధనము కామమ్మును
నింద బడును జగతి నిశ్చయముగ. 113

ఆ॥ కాంత పతికి దీర్చు కామమెలమి; యర్థ
మును సుపుత్రుల గనిపొందఁ జేయు;
నటుల ధర్మ ఫలిత మర్థ కామమ్ములు
గనుక ధర్మపథము చనదు విడువ. 114

వ॥ అని సౌమిత్రి యాగ్రహావేశమ్ము నుపశమింపఁ జేసిన శ్రీరామ
చంద్రుని వనవాస గమనోన్ముఖునిఁ గని కౌసల్య దీవించి పలికె.

ఉ॥ ధర్మమె తోడుగా వనపథంబుల వాసము చేయఁ బోవు నిన్
ధర్మమె రక్షసేయు గహనమ్ములఁ, గ్రూర భయంకరాకృతుల్,
దుర్మదులైన రక్కసులఁ ద్రుంచెడి కర్మమునందు; నిత్య స
ద్ధర్మ పరాయణాత్ములకుఁ దప్పవు కష్టము లివ్వ సుంధరన్. 116

వ॥ ఇది యంతయుఁ జింతతోఁ గాంచు సీతాదేవి. 117

క॥ ఒప్పునొ యొప్పదొ వెంటన్
దప్పక నేవత్తు ననిన! ధవుఁడే మనునో?
ఎప్పగిదిఁ జెప్ప వలెనని
ఒప్పెడు పలుకులను నెమకు నుద్విగ్నతతోన్. 118

క॥ కడఁగంట యొడయనిన్ గని
బొడమెడి కన్నీట గళము బొంగురు వోవన్
దడఁబడుచు వేఁడె మ్రీతో
వడవికి నే వత్తు నొసఁగు డనుమతి నాకున్. 119

క॥ నీ నీడ నా నివాసము;
నీ నగవుల కాంతి నాకు నెల వెన్నెలలౌ
నీ నెలవు గహన మయ్యును
శ్రీనిలయము కంటె నాకు శ్రేయము కూర్చున్. 120

మ॥ వనులన్ మీరు చరించఁ బోవ, నిట నే వాసంబు గావింప నో
పను, నే మీ సహధర్మచారిణిని, మీ పజ్జన్ జరింతున్ తపో
ధనులన్ ధన్యులఁ తత్త్వ వేత్తలను మంత్రద్రష్టలన్ గొల్చు ప
ట్టున నేనున్ దమ నీడనై మెలఁగు నట్టుల్ జేయు టర్థంబగున్.

వ॥ ఈ మాటలను విని రావలదని రాముఁ డెన్ని భంగులఁ జెప్పినను
సమ్మతింపని సీతతో. 122

క॥ కంటక తరు నికరము దిన
మంటఁగఁ గ్రిక్కిరియఁ బగలు యామిని కాఁగాఁ
దుంటరి వన సత్వంబులు
వెంటం బడ సుఖము లేదు, విపినాంతములన్. 123

ఉ॥ నిష్కరుణులు నిహంత లవినీతులు మానవ మాంసభక్షకుల్
ముష్కరులైన దైత్యుల సమూహములుం డటవీస్థలంబులన్
దుష్కర మౌను జీవితము ధూర్జటి కైనను; కాన, జానకీ
నిష్కటమందు సౌఖ్యమున నెమ్మది నుండుము పోయి వచ్చెదన్.

వ॥ ఇట్లు హెచ్చరించిన వల్లభునితో వైదేహి. 125

ఉ॥ దక్కసుతెంత విక్రమ ధురంధరులైనను; బాహు వీర్య స
మ్యక్ ...శల ప్రభావ గరిమన్ హరు విల్లును ద్రుంచి నట్టి నీ
చక్క... యాశ్రమంబు గల చానకు నాకు భయంబు లేదు; నా
కిక్క... ...టు లేదు హృదయేశ్వర, నన్గొని పొమ్ము కానకున్. 126

వ॥ అని ... త్తర మీయఁగా శ్రీరామచంద్రుడు సీతతో నిట్లనెను. 127

మ॥ లలనా నీకు చరింప శక్యమగునా? రాత్రిం చరానీక భూ
ములు; శార్దూల మదేభ సింహ వృకముల్, ముప్పొద్దు
లుప్పొంగుచున్
జలద ధ్వానము సల్పు భీకరముగా సంత్రాసమున్ గొల్పుచున్
వలదా కష్టము, నోర్వలేవు విపినావాసంబు; ప్రాణప్రియా! 128

సీ॥ ఊర్వీజ శాఖల దర్వీకరమ్ములు
ప్రాకుచు బుసలిడి భయము గొల్పు;
సింహ శార్దూలముల్ చెలగి గర్జించుచు
ఘూర్ణిల్లు చుండును గుండెలవియ;
పృథివి చలింపగ బృంహిత ధ్వనులతో
మత్తేభ యూథంబు మలగు చుండు;
నక్ర సమూహముల్ క్రకచ దంతమ్ముల
చీల్చి చెండాడి గ్రసించి మ్రింగు;

గీ॥ పగలు చీకట్లు చేయుచు పాదపములు
మింటి నంటుచు దిశల వ్యాపించి యుండు;
రాజ రథ మార్గయుత గాదు; ప్రబల దావ
విస్ఫులింగచ్ఛటా భీల విసర మడవి; 129

సీ॥ పుండరీకమ్ములు నిండిన సరసులు
మత్త నక్ర విలాస మందిరములు
ముక్తికాంతా ధ్యాన ముని జనాశ్రయములు
పలలాశ వైశస బాధితములు;
గుంజన్మదాళినీ కుంజ పుంజంబులు
భీకర వ్యాళ సమాకులములు
తేనె పట్టుల నొప్పు తీవెల వృక్షముల్
భల్లూక ఘుర్ఘుర ధ్వని యుతములు.

గీ॥ కమ్మ పొదరిళ్ళు తెమ్మెరల్ కాలసర్ప
భూరి పూత్కార నాద విస్ఫోటితమ్ము
లడవు లానంద భయ సంభ్రమా కులములు
కాంత నీవేడ కాంతార గమన మేడ. 130

వ॥ అని వచించు శ్రీరామునితో సీత యిట్లనియె. 131

ఉ॥ భయమును గొల్పు పల్కులను పల్కుట పాడియ ప్రాణనాథ! నా
భయము త్వదీయ దర్శనము బాసి వసించుటయే మహాత్మ! నీ
దయ కవచమ్ము గాఁదమకుఁ దామ తొలంగు విపత్ సహస్రముల్;
నియమము నాది నీ యడుగు నీడ చరించుట నెల్ల వేళలన్. 132

ఆ॥ ముజ్జగంబులందు పురుషుండ వీవని
నన్ను నీకొసంగె కన్నతండ్రి
పురుష మూర్తివైన పూబోడి వీవని
నేడు తెలుసు కొంటి నీ పలుకుల. 133

క॥ కోదండ పాణి వగుచున్
నా దండను నీవు నిలువ నాకు భయమ! నీ
కైదండను కష్టంబుల
పూదండల రీతి దాల్తు పురుష వరేణ్యా! 134

క॥ ఒడ బడక మీరు పోయిన
నొడలిని నిప్పులను వైతు నోర్వను నేని
యెడబాటు పురుష పుంగవ
తొడిమను విడి పూవు మనునె? ధూళిని బ్రుంగున్. 135

ద్వి॥ అని పల్కు జానకి నక్కునఁ జేర్చి
కమలాక్షుఁడా చాన కన్నీరు తుడిచి
ఓదార్చి పలికెను ఒప్పుగా నిటుల
నీ మన స్సెరిగియు నేను పల్కితిని

యశమును విడనోప యతివ నిస్వేడ
వాస యోగ్యము గావు వనములు లలన
తెలియఁ జెప్పితి నీకు తేటతెల్లముగ
అయినను నాతోడ నష్టకష్టముల
నోర్వగఁ బూనితి వువిద్వ నీ పేరు
ఆచంద్రతారార్క మవనిని నిలుచు
అనుసరించుము నన్ను వనసీమ కతివ.
దాన మొనర్పుమా ధన ధాన్యములను
పురము వీడు మనకు సిరులేల ననగ
దాన మొసంగెను ధన ధాన్యములను
వస్తు వాహనముల వనిత సంప్రీతి. 136

వ॥ అంత సౌమిత్రి శ్రీరామచంద్రునిఁ జూచి. 137

క॥ శాసింప దగిన మీరే
వేసట వనులన్ వసింప; వేడ్క నయోధ్యన్
నే సుఖము లొంద నోపను
మీ సేవలఁ జేసి కొనగ మీతో వత్తున్. 138

వ॥ అని పలుక సౌమిత్రి తన వెంట వచ్చుటకు శ్రీరామచంద్రు డంగీకరించెను. సుమిత్ర కౌసల్యతో నిట్లనెను. 139

చం॥ జగతికిఁ గాంతి నిచ్చు నవ సారసమిత్రుని దాచ నౌనె! యీ
జగతికి హ్లాదమున్ గొలుపు చంద్రుని శోభను నిల్పనౌనె; యీ
జగతికి నూర్పు వాయువు-ప్రసారము కట్టడి సేయ నౌనె; యీ
యగణిత రామయానమున కడ్డము నిల్వగ నౌన సోదరీ! 140

క॥ ఆర్తులను బ్రోచి; యడవుల
దూర్తుల మద మణచి ప్రబల దోర్బల శక్తిన్
కర్త యయి సత్య వృత్తికి
కీర్తించన్ బడు నితఁడు దిగీశులు మెచ్చన్. 141

వ॥ వనవాస గమనోన్ముఖుండైన సౌమిత్రిని గని యామె యిట్లనియె.

చ॥ తలచుము జానకీ సతని దల్లిగ నావలె; రామచంద్రునిన్
దలచుము తండ్రిగా దశరథ ప్రభు మాడ్కి; నరణ్య సీమలన్
దలచు మయోధ్య రీతిగను; ధర్మము వీడక సత్యమూర్తివై
మెలగుము, పోయి రమ్ము సుత! మేలగు నీకు విచార మేటికిన్.

వ॥ శ్రీరామచంద్రుఁడు 144

గీ॥ భోగ భాగ్యంబులను వీడి, పాలఁతిఁ గూడి
తపము లొనరించు జడదారి ధర్మమూని
కంటకావృత వనములన్ గాపురంబు
సేయఁ బోయెడి నాకేల సిరులటంచు. 145

పృథ్వి॥ అనర్ఘ నవ రత్న భూషలు గృహాంబరాందోళముల్
ధనమ్ము మొదవుల్ పొలమ్ములు రథములశ్వేభముల్
దినేశ కులవర్ధనుం డొసఁగె దీనులౌ పాత్రులౌ
వనీపకులకున్ స్వసంపద నవారితో దారతన్. 146

క॥ అడిగిన వారల పాత్రత
పొడవు నెఱిఁగి యుచిత రీతి భూరి వసుతతుల్
వడి నొసఁగెడి శ్రీరాముని
కడ కొక బాడబుఁడు శుష్క గాత్రుఁడు వచ్చెన్. 147

ఆ॥వె॥ వచ్చి "రామచంద్ర, బహుపుత్రుఁడను నిర్ధ
నుండ, నుంఛవృత్తి నుండు వాఁడ.
పర్వఁ జేయఁ దగు గృపాదృష్టి నామీఁద"
ననుచు వేఁడు కొనియె నెనరు పుట్ట. 148

ఆ॥వె॥ పలికె రాముఁ డపుడు పరిహాసముగ "నీకు
వేయి గోవులైన నీయఁ గాని,
కఱ్ఱ నీవు విసరఁగా నెంత దూరానఁ
బడునొ కసెద, వేయు వలయు, లెమ్ము". 149

క॥ ఈ తెఱఁగున రాముఁ డనెన్
బ్రాతఁను మొలచుట్టుఁ జుట్టి బ్రాహ్మణుఁ డుదుటన్
జేతో మోదము సంధిల,
మూతిని బిగఁ బట్టి దండమున్ గొని విసరెన్. 150

క॥ సరయూనది కావలి దరి
కరిగెన్ దండంబు, గో సహస్రమ్ములకున్
దరువాతఁ బడియె, నదిగని,
పరమానందమున రామభద్రుఁడు విప్రున్. 151

ఆ॥వె॥ గ్రుచ్చి కౌఁగిలించు కొని యిచ్చె నతని కా
వులను గొయ్య పడిన నెలవు వఱకు
'వలదు కినుక నాదు పరిహాసమున' కని
యా మహానుభావు ననునయించె. 152

వ॥ అంత నా జన్నిగట్టు శ్రీరామ చంద్రమూర్తిని గూర్చి. 153

మత్తకోకిల॥ నిన్ను నేమని సన్నుతింతును నిత్య సత్యవచోనిధీ,
కన్న తండ్రి యశస్సు నిల్ప, జగద్ధితం బొనరింపఁగాఁ.
బిన్నతల్లికిఁ బ్రీతిగా నడవిన్ వసింపఁగఁ బోదువే.
ఎన్నఁగా భగవంతుఁడే జనియించె నీభువి నీవుగాన్ 154

వ॥ అని వినుతించి గో వ్రాతమ్మునుగొని నిజావాసంబున కరిగె.
రాముండు మరలి. 155

చ॥ ధరఁ బరితృప్తుఁడై తెరలు తండ్రి పదమ్ములు ముట్టి మ్రొక్కి, సం
బరమున గాంచు కైకకును వందనమున్ బొనరించి, భక్తితో
గురుల కెరంగి, తల్లుల కకుంఠిత ధైర్యము గల్గ జేసి, స
త్వరముగ రాజధాని విడువన్ సమకట్టె రఘూద్వహుం డొగిన్.

సీ॥ వాసన తైలాల వన్నె లీనెడి కురుల్
జడలుగా శిరమున సంతరించి,
చందన చర్చలన్ జందు మీఱెడి మేన
భస్మంపుఁ బట్టెలఁ బాదుకొలిపి,
జలతారు వలువల సొరు జిల్కెడి కటిన్
మొఱకు వల్కలములఁ బొదివి కట్టి,
కాంచన భూషలఁ గైసేయు కంఠాన
రుద్రాక్షమాలలు భద్రపఱచి,

ఆ॥వె॥ పాదరక్షలు విడి, పావుకోళ్లు దొడిఁగి,
ప్రేమ గదుర సీత వెంట రాఁగ
నవని తీరు సూడ నార్యతో వచ్చిన
యాశు పగిది నొప్పె నిన కులుండు. 157

సీ॥ రఘుకుల తిలకుండు రాజధానిని వీడి
యతివతో ననుజుతో నడవి కరుగఁ
బుర పురఁ బొక్కుచుఁ బురజను లేడ్చిరి
కన్నీళ్లు కాల్వలు గట్టి పార,
రఘు రామ చంద్ర విరహిత మీ నగరంబు
నెలవుగా దగదని నిలువ లేక
అతిశయ ప్రేమచే నా మహనీయుని
ఆబాల గోపాల మనుసరింప,

గీ॥ కళ దొఱంగె నయోధ్యానగరము, విపిన
ములు జనపదంబులై యందములను జెందె,
వీడు కాడాయె రాముండు వీడి పోవఁ
గాడు వీడాయె రాముండు కాలు వెట్ట. 158

క॥ పురుషులు శోక భరమ్మునఁ
బురుషోత్తము వెంట నంటి పోయిన తఱి ను
ప్పరమున కెగసిన ధూళులు
తరళాక్షుల కంటినీటి ధారలు నణఁగెన్, 159

క॥ వెనుకొని వచ్చెడి పౌరులఁ
గని రాముఁడు సెప్పె "మీరుక్రమ్మఱుఁ" డని, వా
రు నిలువని కతన నతఁడు న
డినిసిని వారి కనుఁగప్పి డిగనాడి చనెన్. 160

వ॥ భార్యానుజ సమేతుండగు కౌసల్యా నందనుండు కతిపయ దినంబులకు శృంగి బేరంబుఁ జేరె, నట గుహుండను చెంచు ఱేఁడు వారలను గంగ దాటించుటకై తన పడవను గొని వచ్చి, నీలమేఘశ్యాముని చరణంబులఁ గడుగం దలంచి పడవ నెక్కఁ బోవు ప్రభువు డగ్గఱి. 161

క॥ "ఉండుండుము సామీ నిలు
బండే నీకాళ్ళు దాకి పడుచైందటగా!
ఎండిన పడ వేమగునో
కుండెడి నీటిని పదాల గొబ్బునఁ బోతున్. 162

వ॥ అని పలికి. 163

క॥ శ్రీదంబుల, శ్రీచిత్తా
హ్లాదంబుల, పాప పుంజ హరణంబుల, బ్ర
హ్మాదినుతంబుల, రఘువరు
పాదంబుల గుహుఁడు గడిగె పరమప్రీతిన్. 164

వ॥ ఇటుల ధన్యుండైన గుహుండు సీతాలక్ష్మణులను గంగ దాటింప వారు గహన ప్రదేశముల చనునప్పుడు అసూర్యం పశ్యయైన సీతాదేవి. 165

సీ॥ మిత్రుని రశ్మిల మిలమిల లాడుచు
జాల్వారు సెలయేళ్ళ చాలు గనుచు;
పలురంగు లీనెడి పక్షి తండమ్ముల
వివిధమౌ కూతల వింత వినుచు;
మబ్బుల యురుముల నుబ్బి నర్తించు నె
మిళ్ళ పింఛమ్ముల మిసిమి గనుచు;
ఉదయాస్త సమయాల నుర్విని వినువీథి
మారు దృశ్యమ్ముల సౌరు గనుచు;

గీ॥ అమలినంబైన ప్రకృతి దృశ్యంబు లద్భు
తావహంబుల గాంచుచు నవని జాత
బాలి కనుబోలి మోదించె పరవశమున
నిండు జాబిల్లి వలె మోము నిండు కొనగ. 166

సీ॥ పరమాత్మ జీవాత్మ భ్రమను గల్పించెడి
మమకార రూపమౌ మాయ మాడ్కి;
చంద్ర బుధుల మధ్య చదల కిందంబైన
రుక్మరోచులఁ చిమ్ము రోహిణి వలె
కామ వసంతులఁ గడిమి నుత్ప్రేక్షించు
లావణ్యముల ప్రోవు రతి విభాతి
నడయాడు కొండల నడుమను గలగల
జాల్వారు సెలయేటి సౌరు వోలె
సంజకెంజాయలో సామేను గార్కొన్న
మబ్బులోని వెలుంగు మాల వోలె

గీ॥ మగువ సీతమ్మ నడచెను మగని వెంటఁ
తన పదమ్ముల నుంచక ధవుని పాద
ముద్రలఁ మరది సౌమిత్రి పూని విల్లు
వెంటరాఁ వారి జాడల నంట కుండ. 167

వ॥ కాలి నడకను పయనించు సీతాదేవి. 168

సీ॥ కటికి ఛానేలలఁ గాలూని నడువంగ,
బొబ్బలు పదములఁ బొటమరించె,
ఉలుకుచు గులక నట్టుల సంచరింపంగ,
గోళ్లలో నెత్తురు గూడు గట్టె,
ఇసుక పట్టుల మండుటెండలో మసలంగఁ,
గడువడి నరికాళ్లు కంది పోయె,
ఎగుడు దిగుడు చోట్ల నిట్టట్టు దిరుగంగ,
మృదులారుణాంఘ్రులు మెలిక వడియె,

గీ॥ తల్లి ధారుణి తనమీఁద దయను వీడి
కష్ట కాలాన సంగాతకత్తె గామి
బాధ నొందుచు నుండియు భర్త వెంట
నతని ప్రణయంబె యూఁతగా నతివ మెలఁగె. 169

క॥ వెడ వెడ నడుగులు తడఁ బడ
బడలిన పదయుగము తోడ పడతుక నడచెన్
బొడమిన తాపము దీఱన్
బొడనీడల యందు భూమి పుత్రిక నిలిచెన్. 170

స్రగ్విణి॥ "భోగ భాగ్యంబులన్ బాజ్యఁడౌ తండ్రికై
త్యాగముం జేసి, పద్మాలుగేండ్లుండఁగా
వేగుఁ గాంతార మందిచ్చమై, నీతఁడీ
సాగరాబద్ధ విశ్వంభరాధీశుఁడౌ" 171

క॥ అని మును లాశీర్వర్ష
మ్మును గురియఁగఁ జేసి నారు, భూపుత్రికతో
ననుజునితో వనమునఁ జను
జనవంద్యుండైన రామచంద్రుని మీఁదన్. 172

ఆ॥వె॥ మార్గ మధ్యమందు మాన్యులు
మౌనివతంసు లాదరింప దాశరథులు
చిత్రకూట గిరిని జేరి సీతమ్మతో
నొక్క పర్ణశాలనుండి రచట. 173

ఆ॥వె॥ ఇట నయోధ్యయందు వృద్ధుండు దశరథ
క్ష్మావిభుండు రామచంద్రుఁ డడవి
కేగెనని విషాద సాగరమ్మున మున్గి
యుటమటించి చేరె నమరపురికి. 174

వ॥ వార్తాహరు లీసంగతి భరతున కందింప, నాతఁడు శత్రుఘ్నుని
వెంటఁ బెట్టుకొని. 175

ఉ॥ కేకయి రాజధాని విడి, ఖేదము తోడ యిరా నయోధ్య క
స్తోక జవంబునన్ జని, విశుద్ధ చరిత్రులు రామలక్ష్మణుల్
శ్రీ కమనీయమూర్తి యగు సీతయుఁ గానల కేగి యుంటకున్
గైకయుఁ దద్వరద్వయము కారణ మౌనని తా గ్రహించుటన్.

క॥ పెల్లుబికెడు దుఃఖంబునఁ
దల్లడిలుచుఁ, గుపితుఁ డగుచుఁ దలఁగుచుఁ దల్లీ,
వల్లభుని గొంతు నులిమెడి
ప్రల్లదపుం గోర్కె లీవు వాంఛించితివా? 177

క॥ నా రాముఁ డంచుఁ బెంచియుఁ
గోరఁ దగని కోర్కె లేల కోరితి వమ్మా,
ప్రారబ్ధ కర్మమున నీ
కూరిమి నిండిన మనమ్ము కుత్సిత మాయెన్. 178

క॥ తల్లీ, నీవెఱుఁగవె, నా
యుల్లము? శ్రీరాముఁడే యయోధ్యకు వన్నున్
వల్లభుఁ జేసెదనన, నే
నొల్ల, నతం డొకఁడె యర్హుఁ డుర్వి భరింపన్. 179

క॥ ఈ పాపము గావించిన
నీపేరీ జగతి యందు నిల్చు ననిశమున్;
నా పరువము సెడె, నిలువఁగ
నోపన్ నీ యెదుట, వన్న యొద్ద కరిగెదన్. 180

ఉ॥ నా మనమందు శాంతి, రఘు
నందనుఁ గన్నులఁ గాంచి నప్పుడే;
నా మనమందు శాంతి, రఘు
నందను పాదము లంటి నప్పుడే;
నా మనమందు శాంతి, రఘు
నాయకు తక్కున, జేర్చి నప్పుడే;
నా మనమందు శాంతి; రఘు
నందనుఁ డిమ్ముగఁ బ్రోచినప్పుడే;

వ॥ అని భరతుండు శత్రుఘ్నుం గూడి సముచిత పరివారంబుతోఁ దల్లులతో జిత్రకూటంబున కేగెను. 181

గీ॥ నార చీరలు గట్టి కృష్ణాజినమ్ము
జటలు ధరియించి దీప్తి కృశాను లీల
శాశ్వతానంత బ్రహ్మ తేజమున నొప్పు
రామ చంద్రుని గాంచె భరతుఁడు భక్తి. 182

వ॥ లక్ష్మణుని సుకుమారియగు సీతను భరతుడు గాంచి బాష్పవారి ధారా కలుషిత కృతాననుండై. 183

కII శ్రీరామ చంద్ర మూర్తీ,
పేరాస మదీయ జనని బెడిదపుఁ గోర్కెన్
గోరెను, మన్నింపుము నా
కీ రాజ్యము వలదు, నీవ యేలఁగ రమ్మా! 184

కII చెల్లని వరము లడిగె మా
తల్లి కటా, కొడుకు మీఁది దట్టపుఁ గూర్మిన్
మల్లడి పెట్టెను జనకునిఁ,
దల్లడిలం జేసె నన్ను, తనయున్ నన్నున్. 185

ఉII రేయి వగల్ కలంచి యొసరేఁగెడి నావగ చిచ్చు నార్పు మీ
సాయ మొనర్పుమీ, గుణ విశాల, యిలాతల మీవె యేలుమీ,
దోయిలి వట్టి పల్కెదను దోసము నాయెడ లేదు, నీవు నా
శ్రేయముఁ గోరి రమ్ము, సవరింపుము కల్గిన జాఱు పాటులన్.

కII మనఁ జాల నేను, నీవీ
వనముల వసియించు చుండఁ, బ్రజలిడు సడులన్
వినలే నయోధ్యలో, నా
మనవిని విని యన్న, నీవు మరలుము పురికిన్. 187

ద్విపదII అని యిటు ప్రార్థించి, యన్నయ్య పాద
వనజయుగమ్ముపై వ్రాలి వెక్కసపు
టడలున వెడలిన యట్టి యశ్రువుల
నడుగులు గడిగిన యనుజుని భరతు
దైవస్వరూపుండు ధర్మవిగ్రహుఁడు
లేవంగఁ జేసి యాశ్లేష మొనర్చి
శ్రీరాముఁ డాతని చెక్కిళ్ళ మీఁదఁ
గారెడి కన్నీరు కరమునఁ దుడిచె,
మృదు వచనంబుల హృదయంగమముగ

సదయుఁడై యాలీలఁ జదురొప్పఁ బలికె.
"తగదయ్య తగదయ్య, తమ్ముఁడా దిగులు,
వగ నొందుట వివేక పద్ధతి యగునె?.
సొగసు జిల్కెడి మోము సొగయఁ జేయకుము
పగవారి గుండియల్ బ్రద్దలౌ భంగి
మగటిమి వెలయించి మహి నేలు మీవు
రహి వుట్టఁగాఁ బ్రజా రంజన దీక్ష
వహియించి పాలింప వలె ధర భరత! 188

ఉ॥ కట్టితి వేల కావిని? వికాసముఁ బాసిన దేమి మోము? రా
పట్టి కనర్హ మిట్టి వనవాసుల వేసము, యౌవ రాజ్యపుం
బట్టముఁ గట్టఁ బెట్టుకొని ప్రాభవ మొప్పఁగఁ దండ్రి గారికిన్
నిట్టలమైన సాయమును నీవొనరింతువు గాదె తమ్ముఁడా! 189

క॥ అని యడుగ, భరతుడన్నకు
వినిపించెను దండ్రి మరణ వృత్తాంతము, నా
యన యౌర్ధ్వదైహిక క్రియ
లను దానొనరించుటయు విలాపము గదురన్. 190

గీ॥ విన్ను విఱిగి పయింబడ్డ విధమున ధర
క్రుంకినట్టులు, చంద్ర సూర్యులకుఁ బతన
మొదవి నటులయ్యె రామున, కుమ్మలికపు
ఘాటి కవనిజ సౌమిత్రి తల్లడిలిరి. 191

గీ॥ నీరద శ్యాము రాముని నేత్ర యుగము
నుండి జలజల బాష్పమ్ము లురలె, భూరి
శోక సాగర మెడఁదలో సుళ్లు దిరిగి
పొంగి యువ్వెత్తుగా లేచి పొరలి పొఱ. 192

వ॥ కొంత వడికి దాశరథి దుఃఖ మపనయింపఁ జేసికొని భరతునితో నిట్లనియె. 193

గీ॥ "తమ్ముఁడా నమ్ము, విధి బలీయమ్ము, విధికి
దాసుఁడై నిర్ణయ మొనర్చెఁ దండ్రి మనకు
విధుల, నీవేల వలయు నుర్వీతలంబు,
నేను బదు నాలుగేండ్లుండు గాననమున". 194

వ॥ అంత భరతు డిట్లనియె. 195

మ॥ మన వంశంబున రాజ్యభారము వహింపన్ జ్యేష్ఠు డర్హుండు; కా
వున మర్యాద నతిక్రమింపక ప్రభో! భూభారమున్ దాల్పుమా!
జననీ మోహితుఁడైన తండ్రి మఱచెన్ శాస్త్రార్థ ధర్మంబు; పు
త్రుని ధర్మంబు; పితృాణ మోక్షణమె - దీర్తున్ - వీతరాజ్యుండనై,

వ॥ భరతుఁడెన్ని విధంబుల ప్రార్థించినను రామభద్రుండు రాజ్య పాలన కంగీకరింప కుండుటచే భరతు డిటుల ప్రార్థించెను. 197

క॥ నీ పాద కంజ యుగ్మము
నీ పాదుక లందు నిల్పు నీరజ నయనా!
కాపాడును నీ రాజ్యము
నీ పాదుక లేలి ధరను నిరుపమ లీలన్. 198

వ॥ అంత శ్రీరామచంద్రుడు భరతుడు దెచ్చిన పాదుకలలో పాదము లుంచి భరతు నక్కున జేర్చుకొనెను. భరతుండన్నతో నిట్లనెను.

ఉ॥ నీ దయ లేక స్వామి! ధరణీ భరమూనగ సాధ్యమౌనె? నీ
పాదములన్ బ్రపూతములు; భాసుర హేమ విభూషితంబులున్
శ్రీదములైన పాదుకలచే నడపంబడు రాజ్యతంత్రముల్
వేదవిదుండ వీవు నిను వేడెద నన్గృప చూచి బ్రోవుమా. 200

క॥ పాదుకలు రాముఁ డొసఁగెన్;
శ్రీదములని యౌదలన్ ధరించెను భరతుఁ
వేదనతో రాముఁడు రా
లేదని భరతుండు కొందలించుచుఁ జనియెన్. 201

క॥ నంది గ్రామంబును జన
వందితుఁడు భరతుఁడు సేరి పాదుకలకు నా
నందమునఁ గట్టెఁ బట్టం
బందఱ డెందముల మోద మావహిలంగన్, 202

ఉ॥ పూజ లొనర్చెఁ బావలకు, భూజన రంజనమున్ బొనర్చి వి
భ్రాజదపూర్వ పద్ధతిని రాముని లెంకగ రాజ్యమేలె, నా
రాజయశాలి యా భరతు సాటి సహోదరుఁ డెవ్వఁడీ ధరన్?
భాజన మయ్యె మానవుల ప్రస్తుతి కీయనఘుం డయోధ్యలోన్.

గీ॥ శక్తి యుక్తుండు దశరథ చక్రవర్తి
యచ్యుతుని రాము నృపుఁ జేయు నాస పడఁగ
మించి సింహాసనము నాక్రమించు కొనియెఁ
బాదుకల్, వింతలౌ విధి వర్తనములు. 204

గీ॥ చిత్ర కూటంబు నందువసించు రామ
చంద్రుఁ డొకనాఁడు తన్గని సంభ్రమించి
గుసగుసలు వోవుతపసులఁ గొసరి యడిగె
"నేమి మీయాజ్ఞ" సెలవిండు స్వాములార," 205

గీ॥ అంత నుడివిరి తాపసు "లసురగణము
వచ్చి యిచ్చట సాధుల బాధ పెట్టు
చుండు, కాంతా సమేతులై యున్న మీర
లొండు నెలవున కేగుట యుక్త" మనుచు. 206

క॥ మునులు వచించిన పగిదిన్
దనుజాంతకుఁ డరిగె వేగ ధరణిజతోఁ ద
మ్ముని(గూడి చిత్రకూట
మ్మును వీడి తగిన నివాసమున్ వెదకు చొగిన్. 207

ముత్యాలసరము॥ కొంత దూరము వోయి చేరెఁ బ్ర
శాంతమగు మున్యాశ్రమంబును
అలరుఁ దీవెల హరువు లీనెడి
యబ్బురపు వాటన్.

ఉజ్జ్వలాంగుని రామచంద్రున
వోత్పలాక్షిని జనక పుత్రిక
నత్రిముని గని యాదరమ్మున
స్వాగతం బొసగెన్. 208

స్వాగతము॥ స్వాగతమ్ము రఘువంశ శశాంకా!
స్వాగతమ్ము సురవందిత పాదా!
స్వాగతమ్మసుర వంశదవాగ్నీ!
స్వాగతమ్ము మునివర్గ శరణ్యా! 209

తోటకము॥ ధనువూని కరమ్మున దర్పముతో
దనుజావళి నాపి హతం బొనరిం
ప నరాకృతి నీధరపై జరియిం
చు నృసింహుండ వీవనుచున్ దలఁతున్. 210

రథోద్ధతము॥ శ్రీపతీ, సుజన జీవనా, హరీ!
నీపదాబ్జ మహనీయ ధూళిచే
పాపకర్ముల నివాస దేశముల్
రూపు మాఱి తనరుం బవిత్రమై. 211

వనమయూరము॥ నిత్యముఁ బ్రజాళిఁ గరుణించెదవు, తత్త్వ
ప్రత్యయముఁ గూర్చెదవు భక్తులకు, నీసాం
గత్యము గదా ముని నికాయములు కోరున్,
సత్యరుచిసారసరసస్ఫుట వచస్వీ! 212

స్రగ్విణి॥ సోమ సూర్య ప్రభాస్తోక దృక్కంజముల్
శ్యామ దేహద్యుతుల్ హ్లాదముం గూర్చ, నా
ప్రేమ నిండన్ సమర్పింతు నీకంజలుల్
రామచంద్రా, వినీలచ్ఛవి భ్రాజితా! 213

క॥ ఈ రీతిన్ నుతియించెన్
శ్రీరఘువరు నత్రిమౌని చేతంబలరన్
గారామునఁ గౌఁగిటిలోఁ
జేరిచి యనసూయ నిమిరె సీత శిరస్సున్. 214

వ॥ ముని దంపతులు సీతారామలక్ష్మణులకుఁ దగిన రీతి నాతి
థ్యంబు నెఱపిరి. కొంతవడి వారు విశ్రమించిన పిదప ననసూయా
దేవి జనకజను జేరం జీరి. 215

క॥ నీ కల్యాణపు గాథను
నాకెఱిఁగింపుము కుమారి, నవ మన్మథునిన్
శ్రీకరుని రామచంద్రుని
నీ కనులన్ మొదటఁ గనిన నిర్వృతి నెలమిన్. 216

ఆ॥వె॥ తపసి పత్ని కోర్కె ధరణిజ మన్నించి
చెప్పఁ బూను కొనియెఁ జిన్ననాఁటి
పెండ్లిగాథ, పొదలెఁ బెనుసిగ్గు తెరలు భా
వమునఁ దొంటి యనుభవములు మెదల. 217

కII మునిముని నవ్వులు నవ్వుచు
దెసలవలోకించు సీత తెఱఁగును వెస నా
ర్రసి "తల్లీ, నాకడ నీ
కు సిగ్గుదగునా?" యటంచుఁ గొంకును బాపెన్. 218

వII అనసూయా దేవితో నంతట జానకి యిట్లు చెప్పం దొడంగె. 219

సీII సంతతి లేమిచే జనక క్షితీశుండు
యాగం బొనర్పంగ, యజ్ఞ వాటి
కను దున్ను సమయానఁ గనె నన్నుఁ బుణ్యుండు
నాగేటి చాలున, నర్మిలి ననుఁ
బెంచెను సీతయన్ బేర్వెట్టి, యొక నాఁడు
చెలులతో నాడుచు శివుని కార్ము
కముఁ జరిపితి నొక్క కరమున, నది కని
నంత నాపిత నిశ్చయం బొనర్చె.

గీII శంకరుని విల్లు మోపెట్టఁ జాలి నట్టి
దంటయే నన్నుఁ జేపట్టఁ దగు నటంచు
నాస్వయం వరమునకు నానా ధరాధి
నాథు లరుదెంచినారు సన్నాహ మొప్ప. 220

కII బలముగల భవుని వింటినిఁ
బలువురు యత్నించి రెత్త, భంగ పడిరి, వే
తొలగిరి లజ్జను రాముడ
వలీల గొని యెక్కు వెట్ట భగ్నం బాయెన్. 221

వII అంత నొక్క శుభ ముహూర్తంబున మా వివాహ మంగళము
నిష్పన్నంబయ్యె. 222

మ॥ తొలుతన్ స్వామి ముఖేందు మండల రుచుల్ ద్యోతించి నాలోచనో
త్పలముల్ సొచ్చిన యంతనే పులకరింతల్ గల్గె నేతన్మృదూ
క్తుల తీయందన మంతరంగమును మాధుర్యోర్ములన్ దేల్చె, శ్రీ
లలనా సన్నిధి వెన్నుఁడున్న చెలువుల్ ఖాసిల్లె నాయూహలన్.

క॥ తొలి జన్మములో నీతని
చెలినై వర్తిల్లి నాదు చిత్తం బలరన్
చెలికారము సల్పనిచోఁ
గలుగునె నా యెడఁద నిట్టి కౌతూహలముల్. 224

క॥ నునుసిగ్గు తెరలఁ జీలుచు
కొని వెడలిన యనుభవములకున్ రూపము క
ల్పనఁ జేసిన జానకితో
ననసూయాదేవి పలికె నతి వత్సలతన్. 225

క॥ పతియే గతి సతి కారయఁ
బతి పుణ్యఫలంబు సతియ పరిశీలింపన్
సతియుం బతి పూదావుల
గతి కాలము గడపవలయుఁ గద, కల్యాణీ! 226

క॥ కూరిమి చెలులను హితులను
ఆరని సుఖసంపదల నహంకారమ్మున్
జార విడచి; ధర్మమునకుఁ
గారడవుల భర్త వెంట గదలితి వమ్మా. 227

క॥ అరయన్ సర్వావస్థలఁ
బర దైవత మెన్న పతియె పడతికి నట్లే
పురుషునకు సౌఖ్య విధియున్
దరుగని తపమునకు ఫలము దారయె తల్లీ. 228

వ|| అని అనసూయ వచింప సీత యిట్లనెను, 229

చ|| పతి గుణదోషముల్ గనక భక్తిని భర్తను పూజ సేయుచే
సతి విధియంచు మత్పిత ప్రశస్తముగా వచియించె పెండ్లి నా
డతులిత రీతి నా యనుగు టత్త వచించెను వచ్చు నప్పుడున్
గుతుక మెలర్ప మీరలనుఁ గ్రొత్తగఁ జెప్పితి రమ్మ యిప్పుడున్.

క|| నూతన కాంతుల్ గలవియుఁ
బూతము లైనవి దుకూలముల్ పుణికెఁ దమిన్
సీత కననూత - కైకొని
రాతిథ్యముఁ రేయిఁ గడపి రట వారెలమిన్. 231

వ|| మఱునాఁ డుదయం బగుడు వృద్ధముని దంపతుల యాశీస్సు
లందుకొని, సెలవుఁ గొనిబయల్దేఱి దండకారణ్యమున మహర్షుల
సేవించుచు వారు కాలముఁ గడపిరి. 232

క|| వనులన్ దిరుగుచు రాముఁడు
గనెఁ బెక్కుఋ మునుల దండకావన మందున్
వినయమున మునుల సేవల
ననవరతము సలిపె నాతఁ డనుపమ భక్తిన్. 233

క|| ముని కన్యకలున్ జెంచెత
లినకుల భూషణుని రాముఁ బృథివీ పుత్రిన్
జనవంద్యుని సౌమిత్రిఁ
గని సంభావించి రతుల కౌతుక మెనయున్. 234

వ|| వార లిట్లనుకొనిరి, 235

క|| కందర్పనిభుఁడు రాముం,
డందమునన్ రతిని మించు నవనిజ, సిలుగుతో
వొందఁగనేలా? వారీ
కందువలన్ గ్రూరసత్వ కాంతారములఁ? 236

కII మారా కారుల రాజకు
మారుల సుకుమారులన్, రమాసమ సీతన్
ఘోర వనంబుల కంపిన
దారుణ వర్తనుల నేల ధాత సృజించెన్? 237

వII ఇట్లనేక విధంబుల విధి చెయిదంబుల నాడి పోసిరి. సీతా రామ
లక్ష్మణులు. 238

కII విప్పారిన కన్నులతో
నొప్పిదముగఁ దమ్ముఁ జూచు నువిదల నుడులన్
మెప్పులను వినుచు సమ్మద
ముప్పతిలన్ వనుల మెలఁగి రుల్లాసమునన్. 239

కII రామా! జగదభిరామా!
కోమల సీతాంతరంగ కువలయ సోమా!
క్షేమంకర శుభనామా!
భూమానందైకసీమ! పురుషలలామా! 240

ఓం తత్సత్.

కII సరవి నయోధ్యాకాండము
విరచించెను దుగ్గిశెట్టి వేంకటరమణా
య్య, రసజ్ఞులు తలలూపఁగ,
హరి భక్తులు సంతసింప, నార్యులు మెచ్చన్.



శ్రీ మానినీ మనోహర!
కామారి ప్రణుత నామ! కందశ్యామా!
భూమిజన స్తుతి పాత్రా!
సోమాంబుజ మిత్ర నేత్ర! శోభిత గాత్రా! 1

## విరాధవధ

వ॥ ధనదుని రాజధానియైన యలకాపురం బెట్టిదనిన. 2

ఉ॥ ప్రబ్బిన తేకువన్ విరియ బారు సుధాంశుని కాంతిరేఖలన్
మబ్బుల ముద్దులాడు మణి మంజుల హర్మ్య వితాన వేదులన్
గబ్బి చనుల్ చలింపఁ గడకన్ నటియించెడి మించుబోండ్లు త
బ్బిబ్బొనరించి పూరుష వివేకములన్ హరియింతు రప్పురిన్. 3

క॥ తుంబురుఁడను గంధర్వుఁడు
సాంబునిఁ బూజింపఁ దగిన స్వర్ణాంబుజముల్
డంబు మెయి మఱచి శయ్యను
పంచిన తమి రంభఁ గూడి పైకొని రతులన్. 4

ఆ॥ అంబుజముల నభవు నర్పింపఁ దెమ్మన్న
యక్షరాజు నాన నవలఁ ద్రోచె;
సురత కేళులందు సొక్కెడి వారికి
వెలది సెజ్జ యగును విశ్వ మెల్ల. 5

క॥ శంకరు పదములఁ గొంచన
పంకజముల పూజఁ దివురు వైశ్రవణుండా
కింకరు వృత్తం బారసి
కింకను రావించి వానిఁ గెరలి యిటులనెన్. 6

క॥ రతి మరఁగి నీవు నాయా
నతి మఱచిన చెయ్దమునకు నవయుచు వనులన్
గతిమాలి ధరను దిరుగుము
మతి హీనుడ వగుచుఁ గ్రూర మనుజాశనువై. 7

క॥ గడగడ వణకుచు తుంబురుఁ
డదలి తూలి యక్షరాజు నడుగుల మీఁదన్
బడి డగ్గుత్తికతో వెఱ
సుడివడు చిత్తమున నతఁడు స్రుక్కుచుఁ బలికెన్. 8

ఉ॥ ఒప్పులకుప్ప సంగతి నియోజిత కార్యము మానసంబునన్
గప్పు వడంగఁ జేసినది; కారుణి కోత్తమ! భృత్యుఁడైన నా
తప్పును సైపుమయ్య! కృపఁ దాలిమి సూపగదయ్య; యింతకీ
యొప్పని తప్పుగాక మఱి యొండొకదున్నదె నాదు సేవలోన్. 9

తే॥ క్షమకు నర్హుండ శాపంబుఁ గ్రమ్మరింపు,
వసుధ నుండంగఁ జాలను వదలి నిన్ను
నీదు సేవను; దయఁ జూడు నెమ్మితోడ
నని పదంబులు విడకున్న నధిపుఁ డనియె. 10

ఉ॥ తప్పదు నీకు దండనము ధైర్యము బూనుము ప్రాప్తమైన యీ
ముప్పు తఱిన్; ధరింపవలెఁ బుణ్యజనాకృతి; ప్రాణి కోట్లకున్
దెప్పరముల్ ఘటింపవలె; నీవు విరాధుఁడవన్న పేరుతోఁ;
దప్పక త్రుంచు నిన్ దశరథ క్షితిపాల తనూజుఁ డేపునన్. 11

వ॥ అదియె నీ శాపావసానం బని కుబేరుండు సెప్ప తుంబురునకు విరాధ రూపంబు సంప్రాప్తించె. 12

ఉ॥ ధారుణి నుండి యాకసము దాక మహోన్నతమైన మేను పెం
పారిన యట్టు లాయెను దురాగ్రహ ముప్పతిలెన్ మనంబునం
దూరక; ముజ్జగమ్ముల నొకుమ్మడి మ్రింగెడు నంత క్షుత్తు నిం
డారెను కుక్షిలో, నసుర యాకృతి నొందగ నాతఁడత్తఱిన్. 13

సీ॥ పలుచని నెమ్మేను బంధురం బాయెను
నిబిడాంధకార వినీల మగుచు,
సురుచిర కేశముల్ జుంజుఱు లాయెను
తామ్ర శలాకా వితాన మగుచు
కోమల దంతముల్ కోఱలుగా మాఱ
ప్రాకట క్రకచ కరాళ మగుచు
మధుర కంఠధ్వని మలఁగి భీకర మాయె
నట్టహాసా రవోద్ఘట్ట మగుచు

గీ॥ మదిని సాత్త్విక భావంబు సెదరి పోయె
నుగ్ర కోపంబు పెల్లుగా నుప్పతిల్లె
బుద్ధి లోపించె, నింద్రియముల్ చలించె
యమునకు రాక్షసత్వ మెయ్యాన ఘటిల్ల. 14

క॥ దివి నుండి యుల్క దిగినటు
భువిఁ జేరఁగ వచ్చె, మానవుల మాంసములన్
జవిఁ జూచెను, వన ముని జన
నివహమ్ముల గుండె లదరి నిలకడ లెడలన్. 15

ఆ॥ ఇట్టి రక్కసీని పట్టగు నటవికి
రామ లక్ష్మణులు ధరాతనూజ
రాగ, వారిని గని, రాక్షసుం డణచుచు
వారి ముందు దూకి పరుస మెసఁగ. 16

ఆ॥ రాజ సుతుల మధ్య రాజిల్లు రమణినిఁ
బట్టి రాక్షసుండు బలిమి మెఱయ
లాఘవమున నెత్తి లాలస వృత్తితోఁ
బేర్చి యార్చిఁ జంకఁ బెట్టుకొనియె. 17

కII ఈ చిన్నది నాకుం దగు
వాచారఁ బనేమి? దీని వరియించితి మీ
కీ చెలిదక్కదురా! వే
వే చనుఁడని రక్కసుండు వికవిక నగియెన్. 18

కII మధ్యే మార్గంబునఁ దను
మధ్యను బొందితిని నేను మరలుఁడువే! మీ
వధ్య స్థలమగు నిద్ది; య
సాధ్యము మీ బ్రదుకు లింక జగతీస్థలిలోన్. 19

కII ఈ రీతిని వదరుచు నా
ఘోరాకారుండు సీతఁ గొని పరుగెత్తన్
ధీరుఁడు రాముఁడు త్రుటిలో
వారించెను వాని గతిని పవనాస్త్రమునన్. 20

ఆII సీత భీతిఁ బాప శీఘ్రంబ యసురపైఁ
గణకు టంపగములు గాఁడ నేయ
నతని పెద్ద దేహ మవనిపైఁ బడినను
మరణ మొంద లేదు మనుజ వైరి. 21

ఆII వాని యొడలి నుండి ప్రాణముల్ వీడక
కుదురు కొనక బిట్టు కొట్టు కొనఁగ
గుంటఁ ద్రవ్వి యందుఁ గొండంత దేహంబు
వైచి రాజసుతులు వప్పి నిడిరి. 22

గీII కాలె వాని శరీరంబు కమరు కంపు
దిశల నెల్లెడఁ బర్వఁగ; దివ్యరూప
మొందు దోచె మంటలఁ; విరాధుం డడంగ
యక్షుఁడై నిల్చె నతఁడు శాపాంత మొంది. 23

క॥ కడు నచ్చెరువున తన్నుఁ గ
నెడి వారిని గని యతండు నిజ వృత్తంబున్
నుడివెను రామునకుం బ్రణ
తుఁడై వినయమునఁ, దిరోహితుండయి చనియెన్. 24

వ॥ పదంపడి సీతారామలక్ష్మణులు శరభంగుని యాశ్రమంబు నకుంజని, యాతని దేహత్యాగంబుఁ గాంచి, ఆయాశ్రమము వీడి పోబోవు వారి నచట తపమొనరించు మునులు దర్శించి యిటుల విన్నవించిరి. 25

చం॥ వనముల కాయలన్ దినుచు; వాగుల నీరము ద్రావుచున్; తపం
బొనరుచు మమ్ము; క్రూరులు మదోద్ధత రాక్షసు లేపు మీరి తా
రనిశము బాధ వెట్టుచు భయంబును గూర్చుచు చంపుచున్న వా
రనయము మాకు రక్షకుఁడవై మనుజాదుల శిక్ష సేయవే! 26

ద్వి॥ మా తపః ఫలమున మనుజాధిపుండు
నాల్గవ భాగమున కధికారి యగు
కావున రాఘవా కావంగవలయు
మమ్ముల నని చెప్ప మనుజేంద్రు డనియె
జనకుని యానచే వనముల కేను
అరుదెంచి నాడను; యాదృచ్ఛికముగ
తపసుల రక్షించి ధన్యత గాంతు
రాక్షసానీకమున్ శిక్షించి నేను
అభయంబు గూర్తునే నార్ష సంస్కృతికి
అని చెప్పి సీతతో ననుజుని తోడ
అరిగె సుతీక్ష్ణ మున్యాశ్రమమునకు
అట రేయి గడిపి యా యాశ్రమ మందు
ఉదయాన మేల్కొని యుదయించు భాను
కనుగొని పల్కెను ముని తోడ నిటుల. 27

ఆ॥ అల్ప బుద్ధి వాడు అధికార పీఠాన
విఱ్ఱ వీగు నటుల వింటి పైన
సూర్యు డతిశయించి చుఱుకు మనక మున్నె
పోయి వత్తుమయ్య ముని వరేణ్య. 28

ద్వి॥ అని పల్క మునిచంద్రు డాశీర్వదించి
పోయి రమ్మని పల్కె భూపతి కెలిమి. 29

వ॥ సుతీక్ష్ణ మహాముని యనుమతి బొంది బయలుదేరిన శ్రీమంతుడు,
రూపసంపన్నుడు, స్వతేజోవిరాజితుడు, అయిన శ్రీరామచంద్రుని
జూచి సీతాదేవి యిట్లనెను. 30

గీ॥ ధర్మమును మీకుఁ జెప్పెడి దాన గాను
అయిన నాపల్కు లావంత యాలకించి
మీకు తోచిన రీతిని మేలుగాను
మసలు డని కోరు దానను మాన్య చరిత. 31

వ॥ ఈ ముని ధర్మము సూక్ష్మము కామ జన్య వ్యసన హీనుడు దీనిని
పొందగలడు. ఈ వ్యసనములు మూడు. అసత్యమాడుట, పర
స్త్రీనిఁ గామించుట; వైరము లేకున్నను నితరుల హింసించుట.

గీ॥ అది తప్పని మాట మిమ్మంట లేదు
అన్య కాంతలపై మీకు నాస లేదు
కారణము లేని వైరమ్ము గోరి మీరు
రాక్షసులఁ జంప జేసెడి ప్రతిన లేల. 33

ఉ॥ నీవు దయాపయోనిధివి; నిష్ఠను తాపస ధర్మమూనగా
నీవన సీమఁ జొచ్చితివి; నీకు నకారణ వైరమేల; దై
త్యావళి తోడ; క్షత్రియుల ధర్మము; తాపస ధర్మ మెవ్విధిన్
నీవు సమన్వయించెదవు; నిష్ఠుర వైరము వీడు రాఘవా! 34

ద్వి॥ అనిన సీతాదేవి నభిమాన వతిని
సన్నుతి యొనరించి స్వామి యిట్లనియె. 35

క॥ శిష్టజన రక్షణంబును;
దుష్టుల శిక్షించు నీతి తొయ్యలి నాయు
త్కృష్ట పథమీ పథమ్మును
స్పష్టముగా సంచరింతు సత్యము సాధ్వీ. 36

క॥ ఈ ధర్మా చరణంబున
నే దారను, తమ్మునైన నేలను గూడన్
మోదమున వీడ నేర్తును;
సాధువులన్ రక్షసేతు సత్యవ్రతుడన్. 37

వ॥ అని సీతాదేవికి తన ధర్మదీక్షనుఁ జెప్పి శ్రీరామచంద్రుడు పయ
నించి కతిపయ దినంబులకు సీతాలక్ష్మణులతో గోదావరీ తీరంబు
జేరెను. 38

ఉ॥ అంచిత గౌతమీ తటము నందలి పంచవటీ స్థలాన ని
ర్మించిరి పర్ణశాల పొదరిండ్లకు మధ్య మనోహరంబుగా,
మించిన తృప్తి నుండిరట మేనుల యందము మేల్మి నందఁగాఁ
గాంచన గాత్రి సీత తనుకాంతి కడుంగడు తేజరిల్లగన్. 39

వ॥ శ్రీరామచంద్రమూర్తి. 40

క॥ గేదంగి పూల పొదలన్
గోదావరి సలిలములను, కొండ చఱియలన్
బాదపముల క్రీనీడల
నాదటఁ గ్రీడలను సలిపె నవనిజ తోడన్. 41

సీ॥ చెట్టు చివరి కొమ్మఁ జెలువారు పూవును
బొందఁగోరి విభుని భుజము నూను,

గోదావరీనది నీదు లాడుచు మున్గి
ధవుని బాహువుల బంధమునఁ జిక్కి,
బాణముల్ వేయు నుపాయంబు నేర్చుచు
నురియాడి ప్రాణేశు నురముఁ జేరు
సైకతస్థలముల జాఱుచు నల్లనఁ
గాలు నిల్వఁగఁ గాంతు కరము వట్టు.

తే॥ శాద్వలంబుల ప్రాణేశు సరసఁ జేరి
నర్మ మృదు భాషణముల నానంద మొందు
జనక నరనాథ తనయ యీ చంద మెనయఁ
బతినిఁ బాయక ఛాయగాఁ బరిఢవిల్లె. 42

చ॥ సులలిత సూన సంతతుల శోభలఁ జూపుచుఁ దత్పరిమళం
బుల మదిఁ జొక్కఁ జేయుచును భూరుహ శాఖల ప్రాలి వింతవ
న్నెల పులుఁగుల్ పెలార్చు రమణీయ రవామృత మానఁ
జేయుచున్
జెలియకు మోదముం బొనరిచెన్ రఘురాముఁడు పేర్మి నామనిన్.

చ॥ రమణుని పేరురమ్మున సరాగముగాఁ గరయుగ్మ మూని; గ్రీ
ష్మమున మహీజ గౌతమిని జక్కఁగ నీదెడి ఛక్కి నేరిచెన్
దమకముతో జలంబుల నితంబిని నేర్పున మున్గితేల నా
యమ సొగ సంగవించె జలదాంగన నింగినిఁ దేలు పోలికన్. 44

## శూర్పణఖా వృత్తాంతము

మ॥ అపరాహ్ణంబున నొక్కనాడు సతితో నందందు మిట్టాడుచున్
విపినంబందు ప్రవాళ పుష్పఫల సందీప్తోరు నానానికుం
జపరీత స్థలులన్ ద్విజావళుల సందర్శించుచున్ రాముఁడా
చపలాంగీ సవిధంబునం దనరె భాస్వన్నీల మేఘంబునాన్. 45

వ॥ అట్టియెడ. 46

ఉ॥ చూచెను చుప్పనాతి నృపసూనుని యందము పుల్కు పుల్కనన్
వాచవులూర వాని నునువాతెర తేనియలానఁ గోరుచున్
రోచి రుదంచితంబగు చనువంగ నాతని పేరురమ్మునం
దేచిన పేర్మి నొత్తి రమియింపఁ దలంచెను సంభ్రమంబునన్. 47

ఉ॥ కామిని కంతు బారిఁ బడి కాముని మించిన రాము గోర వాఁ
డేమనునో యటంచు మది నెంతయు సంశయ మందు, జానకీ
భామినిఁ మించు మైసొబగు వారక చూచుచుఁ దన్నుఁ
బోల్చుచున్
రామునిఁ బొందలేనని నిరాశ వహించును నిస్పృహయతన్. 48

వ॥ పరితపించుచు తన మనంబున నిట్లని తలంచె. 49

క॥ మదవతుల నోము ఫలమగు
మదనుని నెఱిమించు రూప మహితుం డితఁడీ
పదునాలుగు లోకంబులఁ
బదపడి వెదకినను నేను బడయుంగలనే? 50

క॥ నాతి మునుముందు నెక్కొనఁ
జేతోభవుఁ డంపగములఁ జేకొని విసరన్
భూతలము నందుఁ బురుషుం
డే తీరున నిల్వనేర్చు నెట్టిండైనన్. 51

క॥ ఈ తరళాక్షిని మించిన
రీతిని రూపంబునొంది రేచెధ నితనిన్
ప్రీతిగ నను బ్రార్థింపన్
జూతు ననుచుఁ జుప్పనాతి సొబగు వహించెన్. 52

ఉ॥ చెక్కుల సొరు, చన్నుఁగవ చెల్వము, కన్బొమ తీరు, జాళువా
చొక్కపు మేని సోయగము; సొంపు మిటారపు మోము దమ్మిపై
మక్కువ నెక్కు తుమ్మెదల మాదిరి ముంగురులున్; దలిర్పఁగా
జక్కఁదనాల కుప్పయగు జవ్వనియై నిలచెన్ క్షణంబులోన్. 53

ఆ॥ తెచ్చికోలు సొబగు దేహంబు నందొప్ప
అచ్చమైన ప్రౌఢ నవఘళించి,
మెచ్చికోలు నంద; మెల్లని నడలతో
సచ్చరిత్రు కడకు సాగెఁ గుటిల. 54

క॥ అఱగొఱ పఠచునొ రఘువరుఁ
డఱయక మత్తనువు మురువునని యెదఁ గొంకున్
గురుకటి కుచ భారంబున
నఱిముఱివడి జంత వచ్చె నలసపు నడలన్. 55

క॥ నట్టాడ నడుము, మనమునఁ
గొట్టాడఁగ వలపుఁ దలఁపు, కొసరు నడకలన్
మట్టియలు మ్రోయ నల్లన
మిట్టి యుబుక గుబ్బచనులు మెలతుక వచ్చెన్. 56

సీ॥ పలుచని వలిపంబు పరువంపు వంపుల
చక్కదనంబులఁ జాటి చెప్పఁ,
బైతాటి చనుఁగవ్వ పాలిండ్ల మెఱుఁగుల
వన్నెల కొకవింత చిన్నెఁ గూర్పఁ,
గుచ్చిళ్ళు చక్కఁగా గుస్తరించిన గోచి
జఘన చక్రోన్నతి సొరుఁ జూప,
చెవులందుఁ దాల్చిన చెందొవ పూవులు
నిద్దంపు చెక్కుల నిటుఁ గూర్ప.

గీ॥ మేని లావణ్య కాంతులు మేలు కొలుపఁ
జూచు వారల కాంక్షల, సురుచిరాంగి
ఓరగా నిల్చె లేమావి కొసరిల్లి
రాము కనుచూడ్కి పథమున రాగ మెసఁగ 57

సీ॥ లేమాని గున్నపై లేఁత కెంగేల్సాపి
బాహుమూల రుచుల బయలు చేసి,
గుండ్రని గుబ్బల కొమరు గన్పడు నట్లు
పార్శ్వ భాగములఁ గన్పడఁగఁ జూపి,
ముద్దు నెమ్మొగమున మొలక నవ్వు వెలార్చ
సోగ కన్నుల నెద సొలపుఁ జూపి,
యటునిటు మెడఁ ద్రిప్పి యద్దంపుఁ జెక్కులఁ
గమ్మల కాంతులు గ్రాలఁ జేసి.

గీ॥ చీర సరిగంచు పదములఁ జిందులాడ
ఎడమ పాదంబు నించుక యెత్తి నిలిపి
లలిత భంగి లతాంగి విలాస లీలఁ
జూచె రాముని క్రీగంట సుందరాంగు. 58

చ॥ కలువల కాంతులన్ దెగడు కన్గవ వీనుల దోనలంట; చె
క్కులు నెఱిమించు టద్దముల క్రొందళుకున్ పసలీన; వె
న్నెల రుచులీను హాసములు నిల్పగ తెల్లని దంత కాంతులన్
నెలతుక చుట్టె రాఘవుని నిశ్చల దృక్కుల మేను పొంగగన్. 59

క॥ ఈ రీతినిఁ దన కోర్కెల
దీరుచుమని వగలు సూపు తెఱవ మనంబున్
సారాచారుఁడు రాముం
డారయ లేకట్టులనియె నవనిజ తోడన్. 60

శా॥ కందర్పాంతకు నిగ్రహంబుఁ జెఱుపన్ గంజాక్షుఁడీ మోహినీ
సౌందర్యంబు వహించెనా? బళిబళీ! సౌదామినీ తుల్య, యీ
చంద్రాస్యన్ గనుఁగొన్న నాదు మది; యీ చందంబునన్
బొంగె; నే
యందాలన్ వడఁబోసి చేసెనొ యజుం డయ్యారె! యీ కామినిన్.

చ॥ అవధులు లేని యీ యతివ యందము లోక మనోహరం బహో!
దివిజ నితంబినీ రుచిర దివ్య తనూ విభవ ప్రభావమున్
భువిని వసింపఁ జేయ విధి పొల్పున నీమేను సృష్టి చేసె; నీ
యువతికి భర్త యే సుకృతి యొకద ధన్యుఁ డతండు భూస్థలిన్

ఉ॥ అంతము లేని యీ విపిన మంతయు దివ్య విలాస సంపదన్
వింత జగమ్ముఁ జేసెను; వివిక్త తలంబిది వచ్చె నేల యీ
కంతుని దంతి యిచ్చటికిఁ గ్రచ్చఱ? నాథుని యండ నుండ కీ
కాంత భయంకరం బయిన కానన సీమఁ జరింప నేటికో? 63

క॥ మాన విహీనముగా ఈ
కాననమునఁ బురుషు చెలిమిఁ గాంక్షించుచు నె
మ్మేను జిగి వెల్వరించెడి
చానన్ సెఱజాఱ నరసి జానకి కినుకన్. 64

క॥ అడుగుఁడు పడఁతిన్ గడువడి,
మిడిమేలపు వడువు దనర మెలఁగెడి నిది; కా
రడవుల నిట్టి మడంతుల
గొడవలు మన కేమి కీడు గూర్చునొ! యేమో! 65

క॥ జానకి పలుకులు విని, రిపు
కానన దావానలుండు గత మోహుండై
దానవి నడిగెను, లలనా!
కాననమున నొంటిఁ దిరుగఁ గారణ మేమి? 66

ఉ॥ ఎచ్చటి నుండి యిచ్చటికి యేణవిలోచన యేగుదెంచి నా
వచ్చర లేమవా? యవని యందము జూచెడి కౌతుకంబు తో
వచ్చిన దానవా? దనుజవర్గ నివాసము లీ యరణ్యముల్
జెచ్చెర నేగు; మొంటరిగఁ జెల్వని బాసి వసింప రాదిటన్. 67

వ॥ అని ప్రశ్నింపఁగా. 68

క॥ ఎవ్వతెనైన మతేమీ,
జవ్వనమును ముడుపుఁ గట్టి సరసుఁడ! నీకై
యివ్వనమున వసియించెద
నెవ్వగఁ దీరంగ బ్రియము నింపుము నాపై. 69

క॥ ఒంటరి నెటులైతిని నా
జంటను నీవుండ నిచట; సఖ! నీవు వినా
కుంటువడు నాదు కోరిక
దంటరితన మవలఁ ద్రోఁచి దయఁ జూడ గదే? 70

గీ॥ సొక్కు చున్నాను మారుని చుఱుకుఁ గోల
లు హృదయంబునఁ జొచ్చి తూండ్లు వడఁ జేయ,
నీదు మధు రాధరామృత మాదరమున
నొసఁగి గాయాల మాన్పు మనూన చరిత! 71

క॥ తన తలఁపుల నీ రీతిని
దనుజాంగన తెలియఁ బలుకఁ దమి యలరారన్
జనవున; రాముఁడు నివ్వెరఁ
గని పలికెను బైసిలేని కాముకి తోడన్. 72

గీ॥ మగువ నీవిట్లు గోరంగఁ దగునె చెపుమ?
ఏకపత్నీ వ్రతుండనే నితర సతులఁ
జూడ నోడుదు; నిన్గూడిమాడు వయసు
కోడె గోవాళ్ళ వెదకుము గోర్కె లలర. 73

కII ఒక సతియే నాకనుచున్
ప్రకటించెడి పురుషవరుని రామునిఁ గని యా,
ముకురానన పలు తెఱఁగుల
వికత్థనము జేసె నతని; వెఱవ కిటులనెన్. 74

ఉII చూడవదేమి నా సొబగు సోగ కనుంగవ నల్ల విచ్చి, మా
టాడ వదేమి ప్రేమ దొలుకాడు మృదూక్తుల, నిండు కూరిమిన్
బ్రోడ తనంబు వెల్వఱచి బొల్పుగఁ గౌఁగిలిఁ జేర్పవేమి? నిన్
వేడెద, రమ్ము, నా వలపు వీసర సేయకు కోరి వచ్చితిన్. 75

ఉII ఏలర సామి! యేటికిటు లెల్లిద మాడఁగ? నీకు నాయమా?
బాళినిఁ గొంటి నీ ప్రియుని, పంబిన సంబర మొప్ప వేగ న
న్నేలు కొనంగ రాదొ? మది కెక్కిన మక్కువ నిన్నుఁ గొల్తురా!
తాళగఁ జాలరా, మదన తాపము దీఱఁగఁ గౌఁగిలింపరా. 76

వII అని యా మాయదారి పల్కిన పల్కులు కర్ణ శూలంబులయి
నొప్పింప శ్రీరామమూర్తి దానితో నిట్లనియె. 77

కII పలుగాకి పలుకు లవురా,
తులువతనం బెనయఁ బలికి ద్రోహము మాకున్
సలుప నిట కరుగు దెంచిన
పలువవు - మా ముంగల నిలువ వలదిక పొమ్మా! 78

వII అంతట నా నాతి శ్రీరామునితో నిట్లనియె. 79

కII మోహించితి నిను; నీకై
నా హొయలు తుఱంగలించు; నను గూడి జగ
న్మోహన రూపా! నా స్మర
దాహముఁ దీరుచుము; ప్రాణదాతవు గమ్మా! 80

ఉ॥ మాటకు మాటకున్ బదులు మాటలు వల్కకు వన్నెకాఁడ! నీ
కూటమి గోరి వచ్చితిని గోర్కెను దీర్పుము నీటుకాఁడ! నా
గాటపు వాంఛఁ ద్రోసి చెలగాటము లాడకు, నేర్పుకాఁడ! నా
బోటి వధూటి పొందు పొలుపున్ జవి చూడని జన్మ మేలరా? 81

క॥ విశ్రవసు కూర్మి పుత్రిని
విశ్రుతుఁడగు పంక్తిముఖుని పిన చెలియల, నీ
యాశ్రయమును నేఁగోరఁగ
నశ్రమమున నియ్యఁ దగదె? యంగజ రూపా! 82

వ॥ దానికి శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె. 83

గీ॥ బ్రాహ్మణివి నీవు, మఱియును రాక్షసివియు
మానిసిని నేను పెరయింతి మగఁడ నేను,
పొత్తు కుదరదు; దయచేసి పొమ్ము వేగ
అనుచు రాముండు పరిహాసమునకుఁ గడఁగె, 84

చ॥ అయినను నీదు కోరికల నాఱడి సేయక తీర్పవచ్చుఁ బో
యి యడుగు మీవు లక్ష్మణుని; హృద్యములైన భవద్విలాసముల్
నయములు హావభావములు నవ్య విధిం జెలువారఁ జూపినన్,
ప్రియమున నిన్నుఁ బొందుఁ దన ప్రేయసి యాతని చెంత
లేమిచేన్. 85

క॥ అన్నిటను నాకు సముఁడత
డెన్నఁగ బంగారు వన్నె లీనెడి మెయితో
మిన్నయగుఁ; గట్టినగు నా
కన్నన్ నీకర్థుఁ డాతఁ డన్నుల మిన్నా! 86

క॥ సల్లాపించెడి సతితో
నుల్లాసంబొప్పఁ బ్రీతి నుండు పురుషు రా
గిల్లం జేయు ప్రయత్నము
జెల్ల దటం చెఱిఁగి యామె చెచ్చెర నరిగెన్. 87

కII మదవతి సౌమిత్రి కడకు
పదరుచుఁ జనుదెంచె మత్తవారణము వలెన్
హృదయ మెఱింగించె, సుగుణా
స్పదుఁడగు రామానుజుండు భాషించె నిటుల్. 88

కII ఎమ్మెయి ననుఁ గోరుదు వీ
వమ్మా! నే సేవకుండ; నగ్రజు సతివై
సమ్మదమున నీవుండిన
నెమ్మిన్ నేఁ గొలుతు నిన్ను నియతి దలిర్పన్. 89

ఆII అసు తోడు చేడె హస్తంబు రీతిని
చుప్పనాతి దిరుగఁ జూచి సీత
యులతి నవ్వు నవ్వ నామెపై నీసున
దనుజకాంత పలికెఁ గినుక గదుర. 90

కII ఈ మెలత కుసుమ కోమల
కామ కళాభిజ్ఞురాలు గానోపదు నే
నీ మది కింపొదవింతు జు
మీ, మన్మథ పూజ్య రాజ్య మేలింతు నినున్. 91

సీII సుడిగాలి వలె నిన్నుఁ జుట్టి సోలించెద
జలపాతముం బోలె పలుకరింతు,
ఉప్పెన వోలె నిన్నుత్తేజ పఱచెద,
రస సముద్రం బట్లు రక్తిఁ గూర్తు,
కరినిఁ గరిణి భంగిఁ గారడవుల యందు
నీతోడు నీడగా నెమ్మి నుందు.
జలదారవమ్ములఁ దులకించు మణితముల్
నిండ నీరతి కేళి నిగ్గు దేల్తు.

గీ॥ నీదు మది కెక్కు రీతి నేనెగడు దాన
రమ్ము పంచాస్య మధ్య నన్ రహిని గూడ,
నాదు సర్వాంగకమ్ములు నీదు స్పర్శఁ
గోరుచున్నవి రారమ్ము కోర్కెఁ దీర్ప. 92

గీ॥ బొమ్మ వలె నున్న యీకొమ్మ పొందు తగదు
రసికతన్ మున్గి తేలించు రాగవతిని
ప్రౌఢ నను గూడి, వీడు మీబాల చెలిమి
ఓలలాడింతు సౌఖ్యంపు డోలలందు. 93

మ॥ అని యా రాక్షస కాంత యారభటితో నత్యంత కామార్తయై
మునుమున్ బుట్టెడి యూర్పు గాడ్పులు కడున్ మోహాగ్నినిం
బెంచఁగాఁ
దనువల్లాడఁగఁ జన్నుగొండ లుబుకన్, దర్పించి, శ్రీరామునిన్
ఘనమౌ కౌగిటఁ జేర్ప దూకె కరయుగ్మం బుద్ధతిన్ జాపుచున్.

క॥ రారా రమ్యాకారా;
రారా సుకుమార! వీర! రంజింపుమురా!
దూరము సేయకురా! నిన్
గోరిన క్రాల్గంటి మీద కోపము విడురా! 95

ద్వి॥ అని పైబడన్ బోవు నసుర కామినిని
దనుజారి వింటితో ధరణిపైఁ ద్రోచె. 96

ఉ॥ రూపము మార్చి తాఁజెలువ రూపము దాలిచి కామ భావనో
ద్దీపితుఁ జేయఁగాఁ దలచె ధీరు మనోహరు రాము గోమలున్
బాపుల రూపు మాఱిన స్వభావము మాఱునె! కాకి కోకిలా
లాపము సేయ నెంచిన కళా మధురామృత కంఠ మబ్బునే? 97

క॥ అవమానాగ్నినిఁ దెరలుచు
రవరవ పడి చుప్పనాతి రాముఁడు తన్ని
ట్లవలన్ ద్రోయన్ గతమా
యవనిజ యని యెంచి యా మె నంత మొనర్పన్. 98

క॥ మిడుగురులు చెలఁగ కనులన్
గడువడి ధర విడచి లేచి క్రౌర్యం బెనయన్
పుడమి కుమారిక మీఁదన్
బడ నుంకించెను పలాశి పండ్లు గొఱకుచున్. 99

క॥ దురుసు వహించిన రక్కసి
సరసత్వము పట్టుజూరె; సౌమిత్రి రుషన్
ఛురికన్ ముక్కున్ జెవులను
పరుసంబునఁ గోయ నామె పరిభవ మొందెన్. 100

సీ॥ బాలేందు రేఖకు వంకఁ దీర్చెడు నొసల్
మిట్ట పల్లము లాయెఁ గొట్టి నట్లు
కలువంక కన్బొమల్ కమనీయతను బాసి
కుటిలమ్ములై తోచెఁ గుబురు లట్లు
అఱచేతులం బట్ట ననువైన చందోయి
గండు మీఱెను గొప్ప కొండ లట్లు
పసిమి కాంతుల నీను మిసిమిమై హొంజాయ
మేకొనె నల్లనై మేఘ మట్లు.

గీ॥ లలిత గతి నున్న పదములు లావు నొందె
రుచిర వాక్కులు శ్రవణ దారుణము లయ్యె
అద్భుతాకార సౌందర్య మడఁగి; లోక
భయదమై నట్టి యాకృతి బయటఁ బడఁగ. 101

సీ॥ పద ఘట్టనంబులఁ బగిలె బ్రహ్మాండంబు
ఫూత్కారముల రేఁగెఁ బొగల గములు,
రోదనంబున మ్రోగె రోదసీ కుహరంబు
ఆక్రోశరవమున నడలె దిశలు
కేశా హతిన్ బాఱె కేసరి నివహంబు
తీక్ష్ణ నేత్రాగ్నులం దెరలెఁ బులులు
కరముల తాకునఁ గరి యూథములు తాఱె,
ఉద్వేల రయమున నూగె తరులు.

గీ॥ ఓడికలు గట్ట నెత్తురు లౌడు గఱచి
నాసికా కర్ణ విచ్ఛేదన ప్రభూత
పరిభవానలమున క్రుగ్గి పరువు లిడుచు
శూర్పణక సోదరుని ఖరుఁ జూడ నరుగ. 102

క॥ పరుగున నరుదెంచిన సో
దరిని వికృత ముఖిని రక్త ధారాశ్రులు పె
ల్లురలఁగ నేడ్చెడి దానిని
ఖరుండు తానాశ్వసించి కలతెఱఁ గడిగెన్. 103

వ॥ చుప్పనాతి యిట్లనియె.

మత్తకోకిల॥
అన్న యేమని విన్నవింతు నయారె రాముని దౌష్ట్యమున్
వన్నెకాడవు రార యంచు నవారితంబగు ప్రేముడిన్
నన్ను గూడి సుఖింపుమన్న ననాదరంబున నీక్రియన్
జెన్నుఁ గొల్పెడి ముక్కు వీనులఁ జెక్కి సారు నడంచెరా. 105

క॥ అచ్చపు నాతను విభవము
మచ్చరమునఁ గాంచ లేక మనుజుని సతి, నన్
గ్రచ్చుకొని ముక్కుఁ జెవులను
ద్రచ్చించెను చూడు నేను తల్లడ పడఁగన్.

ఆ॥ చెక్కు నాదు ముక్కుఁ జెవులను సౌమిత్రి
నాతి సీత నవ్వె నన్నుఁ జూచి
మట్టు బెట్ట వలయు మానవాధములను
చెనటి చేత ఫలము జెందు నట్లు. 107

ఉ॥ దానవి శోక బాష్పములు; తన్ముఖ మండల నాశికా శ్రుతి
స్థాన వినిర్గత క్షతజ ధారలు; శోణ నదీ స్వరూపమున్
బూని, కుచాద్రులన్ గడచి పొక్కుట నెక్కొని నిండి వెల్వడన్
గానఁగ నయ్యె రక్కసి వికస్వర కింశుక వృక్షమో యనన్. 108

ఉ॥ చింపిరి జుట్టు, నెత్తురుల చిత్తడి, వెల్వెలఁ బాఱు మోము, క్రో
ధంపు టుదగ్రతన్ రద విదారిత మోష్ఠము గల్గి, యిప్పుడే
చంపుదు రామ లక్ష్మణుల జాల్ములఁ గ్రూరుల నంచు
నార్చుచున్
అంపానరించ శూర్పణఖ; రక్కసి సోదరు లప్పు డుగ్రులై. 109

క॥ రక్కసుల యుక్కు సేనల్
గ్రక్కున సమకూర్చి రామలక్ష్మణులన్ దా
మొక్కుమ్మడిఁ బరిమార్పన్
మొక్కలముల్ గడు వలుకుచుఁ బోయిరి పెలుచన్. 110

శా॥ రక్షోవాహిని మీఁద వర్తుల గతిన్ రాబందు లల్లాడుచున్
పక్షక్షేప మొనర్ప; రాత్రిచరులోర్వన్ లేక యాపక్షులన్
గుక్షుల్ వ్రీల శరమ్ములన్ నెఱపినన్ గ్రొన్నెత్తురుల్ జాఱి యా
రక్ష స్సేనను ముంచి తేల్చెఁ దెలుపన్ రాబోవు దౌర్భాగ్యమున్.

ఆ॥ కారు మేని మీఁద ఘర్మ బిందువు లూర,
గనులఁ గోపవహ్ని గడలు కొనఁగ
మెఱపు లీను కాలమేఘంబు చాడ్పున
ఖరుఁడు వెఱపుఁ దోపఁ గానుపించె. 112

శా॥ కాలవ్యాళము వంటి తొండము నుదగ్రస్ఫూర్తి పైకెత్తి యు
ద్వేలోద్రేక నిశాత కుంతముల ఖాతిన్ దంతముల్ వర్తిలన్;
శైలాకార శరీర సౌష్ఠవముతో, సంరబ్ధమై సంగర
వ్యాలోలంబయి యున్న వారణముపై వచ్చెన్ ఖరుండుద్ధతిన్. 113

ఆ॥ వచ్చి చూచి రాము వనజాయ తేక్షణుఁ
జిచ్చు కంటి వేల్పుఁ జిన్న బుచ్చు
మగఁటిమి గల మేటి మగఁడని గుర్తించి
బెదరు మదిని ఖరుఁడు బిగియఁ బట్టి. 114

క॥ మక్కువ నా చెల్లెలు నీ
యక్కు నెదన్ జేర్చ గోర నబల నయారే!
ముక్కుం జెవులును జెక్కితి
వక్కటికము లేని వాఁడవై హంవీరా! 115

ఉ॥ కోరఁగరాదె శూర్పణఖ కూరిమితో నినుఁ? గోరినంతనే
వేరిమి మీఱఁ గామితము నొయ్యనఁ దీర్పక యివ్విధంబునన్
బౌరుష హీనమైన పని భామినిపైఁ దలపెట్ట శౌర్యమా?
యారసి యిప్పుడైనను బ్రియంబడి శూర్పణఖన్ గ్రహింపుమా!

క॥ దానవుని పలుకుల న్విని
మానవపతి రాముఁడనియె మగఁటిమి దోపన్
మా నయపథ వర్తనమున్
మీ నీతియుఁ బొసఁగ దిచట మిన్నక పొమ్మా! 117

క॥ అని పలుకు రామచంద్రుని
దనుజాంతకు దుర్నిరీక్ష్య దర్పోద్ధతునిన్
గని పలికె ఖరుఁడుదగ్రత
"మనఁ జాలవు పగను బెంచి మానవ హతకా!" 118

ఉ॥ అంత ఖరుండు దాశరథి నాహవముం బొనరింపఁ బిల్చి "నీ
యంతము జూతు నే" ననుచు నంగుళి సంజ్ఞను జేసి, సేనలం
బంతము తోడ రాఘవుని బట్టి వధింపగఁ బంప సైన్య మ
త్యంత రయంబునన్ సునిశితంబగు కోలలఁ గుప్పె రాముపై. 119

చం॥ కరమున విల్ దటిత్తు వలె గ్రాలఁ; చలించు వినీల శైల సుం
దరతను దేహమొప్పఁ; కదనంబున నిల్చె రఘూద్వహుండు, భీ
కర దనుజాగ్ని కీలల నికాయము నార్పఁ; శర ప్రకాండముల్
సరసర నింగి నుండి పడి జార్చు పయోధర పంక్తి రీవితో. 120

మ॥ త్రిదివ ద్వేషణ దూషణ త్రిశిర ఉద్వృత్తాశ్వ వక్షోరుహాః
బదవిక్షేప విపక్ష ఘోర ఖర శుంభద్వారణ శ్రోణి; సు
న్మద దైతేయ చమూవరాననుఁ; సన్మానించె రాముం డుద
గ్ర దిధక్షాశుగ దీర్ఘ బాహువులఁ జిక్కం జేసి సోత్కంఠుఁడై. 121

క॥ వెలుగులు చిమ్మెడి సూర్యుని
నలచి నలచి బలిఁగొనంగ నల్లని మబ్బుల్
తలపడు రీతిని; రక్కసు
లలల పగిదిఁ జుట్టు ముట్టి రా రాఘవునిన్. 122

క॥ కంటక తరు శాఖలచే
మింటిఁ జుంబించి మించి మిట్టాడు వనం
బంటుకొని యణఁగి నట్టుల
కంటకులు కమలిరి రామ కాండజ వహ్నిన్. 123

ఉ॥ వాలము తాకునం దరులు వ్రాలఁగఁ; బాద విఘట్ట నంబులన్
దూలికలై శిలల్ పడఁగఁ ద్రుళ్ళుచుఁ బర్విడి వచ్చి నేస్గుపై;
శూలి వలెన్ బ్రచండమగు శూలముఁ దాలిచి రాము సుద్ధతిన్
గూలుచు వాడుగా ఖరుఁడు గొబ్బున నిబ్బరమూని మారొ్కనెన్.

మ॥ రటదత్యుజ్జ్వల కింకిణీ కలితమున్; రక్తా మిషా సక్తమున్;
నిటలాక్షోత్కట శూల శాతము మహా నిర్ఘాత వేగంబు; వి
స్ఫుట దుర్వృజన కంటక ప్రకటమున్ శూలంబు క్రవ్యాదుఁడు
ద్భట దోశ్శక్తిని రామచంద్రుని యెదన్ భంజింపఁగా వైచినన్.

వ॥ దాశరథి కోపో ద్దీపిత మానసుండయి. 126

క॥ శూలంబును, ముష్కరు ఖరు,
కాలాగ్నినిఁ గ్రక్కు నంపగమిచే నొంచెన్
దూలించె వారణంబును
తూలిక వలె నాశుగముల పెట్టున పోరన్, 127

చ॥ పరుని కరంబునన్ ఖరుని పాటును గాంచి భయంకరంబుగా
నుఱుముచు దూషణుండు నిశితోగ్ర శరంబులు వైవ రాముపైఁ
జరచర బాణ పుంజములఁ జాపము నందుఁ గూర్చి వైచి దా
శరథి దురంబునం దునిమె క్ష్మాస్థలి రక్కసు మేనుఁ గూలఁగాన్

క॥ ముమ్మొన వాలుం బోలెడి
యమ్మున రాముండు త్రిశిరు హత మొనరిచి పై
గ్రమ్మిన యిరుల నణఁచి లో
కమ్ముల వెలిగించు తరణి కరణిం దోఁచెన్. 129

క॥ అక్షతుఁడై యరుదెంచిన
రక్షో నాశకుని రాము రాగం బెసగన్
వక్షో జాలింగనముల
నా క్షమ సుత యాదరించె నతి మోదమునన్. 130

క॥ మచ్చరకించి యొనర్చిన
హెచ్చుగు యత్నంబులన్ని హీనంబగుడున్
జచ్చిన సోదరులం గని
ఱిచ్చవడెను జుప్పనాతి రేఁగు వగపునన్. 131

ఆ॥ తెప్పిరిల్లి చూచి తెగినట్టి తన తెగన్
వెఱచి చూచి యరిని విహ్వలాంగి
చుప్పనాతి పాఱఁ జూడ లంకేశుని
తనదు భంగపాటు మనవి సేయ. 132

క॥ ఉల్కవలె వ్రాలి సోదరి
నిల్కడ సుంతైన లేక నెవ్వగఁ గన్నీ
రొల్క విలపింప; నూఱట
వల్క తగిన రీతి; నిట్లు పంక్తిముఖుఁడనెన్. 133

క॥ చెప్పుము చెల్లెల! యెవ్వం
డిప్పగిదిని నిన్నుఁ జెక్కె! నీశుండైనన్
దప్పక దున్మెదు నే, ననఁ
జెప్పెను శూర్పణఖ రాము చేతల నెల్లన్. 134

వ॥ అన్నా రాముని గుఱించి యేమి వచింతును. 135

క॥ అందమ్మున కందర్పుఁడు
చందురు హసియించు మోము; సారస దళముల్
నిందించు కన్నుగవ; మి
న్నంటెడి పొడవు; బాహు లౌరా నిడుపుల్. 136

క॥ దొన నుండి ములికిఁ దీయునొ
గొనయము సంధించి యలుగుఁ గూర్చునొ లేదో!
కనులకుఁ గనుపించకయే
దనుజుల గుండెలను ములికి దాకి వెలువడున్. 137

ఉ॥ రాముని పేరు తద్ఘన పరాక్రమ గాథను విన్నయంతనే
యా మనుజాశి మానసమునం దతనిం గని నట్టు లెవ్వడో
కోమల భావ మొక్కటి ప్రకోపము నంద ముఖంబు వాడె, నా
భామిని చుప్పనాతి గని భ్రాతను వల్కెను గూర్చు నట్లుగన్. 138

కII రామునకుం గడుఁ బ్రియమౌ
కామిని యందాల బరిణె గలదా వనిలో
నేమగువ సాటి యామెకు
నామాటల నిజము దెలియు నవలాను గనన్. 139

ఆII మగువ పేరు విన్న మాత్రాన నమరారి
మానసంబు నందు మరుగు వడెను,
రామచంద్రు నెపుడొ రాజిల్లు తేజానఁ
గంటి ననెడి తలఁపు కళవళంబు. 140

కII ఆసక్తినిఁ దనుఁగను కాం
తాసక్తుని రావణుని, పలాశిని గని సీ
తా సౌందర్యంబుఁ బొగడె
నాస యతని మానసమున నంకుర మొందన్. 141

కII కన్నులు కలువలు రేకులు
చన్నులు, పూచెండ్లు; మెఱపు సన్నని నడుమం
దెన్నుకొని లోతు పొక్కిలి
కన్నుల కింపొనరఁ జేయుఁ గామిని సొబగుల్. 142

కII పిడికిట నెన్నడు మడఁగును
కడు వలుద మిటారి చనులు కౌఁగిట నడగున్,
అడగదు జఘనం బెచటను
పడఁతుక చక్కందనంబుఁ బరికింపనగున్. 143

ఉII పుల్ల సరోజనేత్ర పెదవుల్ విడ నవ్వఁగ పండు వెన్నెలల్
దెల్లఁగ విచ్చెడిన్; బలుక దివ్య మనోహర వీణ తంతువుల్
సల్లలితంబుగఁ మొఱయు; జానుగఁ జూచిన వాలు చూపులన్
నల్లని కల్వ జొంపములు నాఁటెపుఁ బోణిమి నించు నెల్లెడన్. 144

రుచిరము :-

అనూనమూర్తి రుచిరమైన ముద్దుమో
ము నమ్రముఁ జేసె విధుని మోము నందు మ
చ్చ నిల్పి; విస్తృత కటి చక్రమేఁచ భీ
తి నీరుఁ ద్రావె నిసుక తిన్నె లొయ్యనన్. 145

గీ॥ కల్ల మాటలు గావివి కాంచఁ దగిన
కామినీ రత్న మన్న లోకాల నెల్లఁ
జుట్టి గాలించిననుఁ నీవు చూడఁ బోవు
సీత గోటినిఁ బోలెడి చెలువ నొకత. 146

క॥ పలు మాటలేల నన్నా!
కలభాషిణి రూప మహిమఁ గాంచినఁ దెలియున్
బలుకుం జేడియ యేనియుఁ
బలుకుల వర్ణింప లేదు భామిని సొబగుల్. 147

క॥ రక్కసి, రావణు మదిలో
నెక్కు నటుల సీత సొబగు నేర్పడ జెప్పెన్;
రక్కసుల ఱేఁడు సీతను
గ్రక్కునఁ జెఱవట్టఁ దలచి కనలి యిటులనెన్. 148

సీ॥ మిట్టించి లాగునె మృగరాజు జూలును;
బెబ్బులి కోఱలఁ బెఱుక నగునె?
కాలూని త్రొక్కునె కాలాహి పడగను;
పిడికిట పిడుగును బడయ నగునె?
తివురుచు రేపునె తేనీటీగల పట్టు;
కొమ్ముతేన్గునుఁ బట్టి గుంజ నగునె?
కీలినిఁ గట్టునె చేలాంచలంబున,
కల్లోలితాబ్ధినిఁ గట్టనగునె?

తే|| చెల్లెలా! నీదు మొగమును జెక్కి యిటుల
ప్రాణముల తోడ నిలలోనఁ బ్రతుక నగునె?
మనుజ మాత్రుండు నన్నవమాన పఱచె
మాఱు సల్పుదు నేవాని మగువఁ బట్టి 149

క|| అని సోదరి నూరారిచి
మనుజునిఁ జెలిమీఁద తమిని మనుజారి వెసన్
జని; మాయల మారిని గల
సెను మారీచునిఁ దపంబుఁ జేసెడి వానిన్. 150

ఆ|| పంక్తి కంధరుండు వానికిఁ జెప్పెను
చుప్పనాతి పడిన చుఱుకు కోఁత;
రాముని యలుగులను రక్కసుల్ పదునాల్గు
వేలణఁగిన విధము విశదముగను. 151

త|| దనుజ కామిని నాదు సోదరి తారసిల్లఁగఁ బ్రీతితోఁ
గని ముదంబున గారవింపక కల్మషాత్ముఁడు కత్తిచేఁ
గొని మదంబునఁ గోయునే కడుఁ గ్రూరుఁడై చెవి ముక్కులున్
జెనఁటి చేతకు వాని భార్యను జెచ్చెరన్ జెఱవట్టెదన్. 152

వ|| నీ సాయంబు నాకిత్తఱిఁ గావలెనని రావణుండన. 153

క|| కామంబునఁ గనుఁ గానక
రాముని సతిఁ బట్టఁ గోరు రావణునకు వే
యా మారీచుఁడు వల్కెను
నేమము నీతియు వెలార్చు నిష్ఠుర పణితిన్. 154

గీ|| చెల్లెలి పరాభవించిన చెయ్దమునకు
యుద్ధ మొనరించి వానికి బుద్ధిసెప్పు
కాని చెలియలి వర్తన గర్హితంబు
తగదు పరకాంతఁ బట్టుట వగకుఁ గుదురు. 155

ఆ॥ మంచిఁ జెప్ప నీకు మంత్రులు లేరొకో
వయసు చెల్లె నీకు; వనజముఖులు
నిన్ను వలచువారు నీపురి నున్నారు
పరుని యాలి కొఱకుఁ బరుగు లేల? 159

ఆ॥ చిఱుత ప్రాయమందె చెలఁగుచు శ్రీరాముఁ
డంపగముల వైచి యర్ణవమునఁ
దూలవైచె నన్ను దుర్జయుఁ డాతండు
వలదు వాని తోడ వైర మెపుడు. 157

ఆ॥ చెట్టు చెట్టు సందు చీర కృష్ణాజినాం
బర ధరుండు బాణ పాణి రాము;
పాశ హస్తు కాలు వలె; భయంకరుని నే
గాంచు చుందు భయము గ్రమ్మ చుండు. 158

క॥ రాముని వలని భయంబున
'రా' మొదలుగ గల్గు పేళ్ళు, రత్నము రథమున్
నామనమునఁ వెఱపు ను
ద్దామ గతిఁ నిల్పు చుండుఁ దలగక నెపుడుఁ. 159

వ॥ రావణా! అతండెవరను కొంటివి! 160

క॥ లోకా ధీశుడు! సత్య ప
రాక్రమ వంతుండు; సాధు రక్షకుఁ డమలుం
డాకృతి నొందిన ధర్మము
ప్రాకృత రూపంబు గొన్న పరమాత్మ సుమా! 161

గేయము॥

తగదని పల్కిన తగువగు పల్కులు
వెగటై దోపఁగ వేలుపు దాయకు
తెగవైతును నిను మారీచా! యని

తిగిచె గృపాణంబుఁ
అత్తరి మారీచుండనె దేకువ
నెత్తిన కత్తిని నిలుపు రావణా!
మిత్తిని బోలిన నీ వాలుంగని
తత్తఱ మందితిరా! 162

ఉ॥ మంచినిఁ గోరి చెప్పితిని మానక నీవిటు మూర్ఖచిత్త! నన్
ద్రుంచెద నంచు ఖడ్గమును దూసెద వేల? వివేకహీన! నిన్
గాంచ భయంబు లేదు; పలుగాకి తనంబును మాని నేను శే
షించిన జీవితంబును ఋషి ప్రకృతిన్ గడపంగఁ గోరితిన్. 163

క॥ వికి వికి నగి రావణుఁడనె,
బక జపమో! పిల్లి జపమొ? పాటించుచు నీ
వకటా! చరింతువె యుచ్చటఁ
బ్రకటింతువె సాధువృత్తి పరిశుద్ధముగాన్. 164

క॥ మునివృత్తి నీకు దగునా?
దనుజా! నీకేల పుట్టెఁ దగని ప్రవృత్తుల్?
మునులను జెండిన నిన్నే
ముని యొప్పును; బుద్ధి చెడెనొ ముదిమిని నీకున్? 165

గీ॥ మానవుల హింస పెట్టుటే దానవులకు
నర్హమైనట్టి ధ్యేయంబు; హరిణమవయి
పొమ్ము మనుజుల వంచింప; పుడమి సుతను
బట్టుదును వారు నీవెంటఁ బరువులిడఁగ. 166

వ॥ నావిని మారీచుండా దశకంధరున కిట్లనియె. 167

కః నీచేఁ జచ్చుట కంటె స
మీచీనము రాము చేత మృతినొందుట; నే
నే చనియెద నొనరించెద
నీ చెప్పిన యట్లు; చాలు నీతో వాదుల్. 168

ఆః రామ బాణ వహ్ని ప్రబలమై నినుఁ గాల్చు,
ముందు ముందు రణము నందు నీవు
మేలుఁ గోరి నట్టి మిత్రుని మాటలఁ
దలఁతువయ్య! వలదు తులువ తనము. 169

వః అని తన తుది పల్కులు పల్కి. 170

శాః మారీచుండు కురంగ రూపమున రమ్య స్వర్ణ రేఖాచ్ఛ శో
భా రోచు ల్వెదచల్లుచున్ వన మృగ వ్రాతంబునన్ మిన్నయై
యారంభించెను సంచరించుటకు మాయామేయ మార్గంబులన్;
శ్రీరామాశ్రమ భూమి చెంత విహరించెన్ వంచనా వైఖరిన్. 171

కః బంగరువునఁ బొదిగిన పలు
రంగుల రతనముల భంగి రాజిల్లెను సా
రంగము తనువున మచ్చలు
రంగారె విచిత్ర రుచుల రవి కిరణములన్. 172

గీః సీత చెంగటఁ బులు మేయుఁ జిత్త మలరఁ
బూరి మేయుచు సిరు చక్కిఁ బాఱఁ జూచుఁ
బట్టి గమకించు జానకి పాదరవము
వినుచుఁ జెంగు చెంగున వినువీధి కెగురు. 173

కః అటుచూచు నిటు చూచును
తటుకునఁ దలవంచి తృణము తమితోఁ గొఱకున్
చటులతటి చెవులల్లార్చుచు
నటునిటు నడయాడు జింక యద్భుత లీలన్. 174

క|| తటవట సేయున్ సీతను
దటస్థమై యుండి; తొలఁగ దాటును బట్టన్
దటుకున లే గౌఁదీవియ
నటియింపఁగ ధరణితనయ నయమునఁ బోవన్. 175

క|| ఇట్టినిఁ బట్టన్ జానకి
యట్టున హస్తంబు వైవ నతిలఘు గతితోఁ
జిట్టున యఱంగి నేలకు
జట్టునఁ జెయి జాఱ మృగము చయ్యన దుముకున్. 176

క|| కనక మృగం బీరీతినిఁ
గనకాంగికి హస్త గతము గాక చరింపన్
గని రఘురాముఁడు చేరం
జని ప్రియభామినిని, స్వేదజల కలితాంగిన్. 177

ఆ|| అలసి నట్టి సీత యలకలు సవరించి
జారు ఘర్మజలము సక్క నొత్తి
సేదఁ దీరఁ జేర్చి చెలువను కౌఁగిట
రాముఁ డనియె నిటుల రాగ మెసగ. 178

ఆ|| పట్టి తెత్తు దీని పడఁతిరో; చూడు మీ
ఎంత అందమైన యిట్టి యైన
నింత మంచి యింతి యింతగాఁ గోరిన
ఏల దొరక కుండు నిజగాన?

గీ|| అని వచించి శ్రీరాముఁడా హరిణము బడి
కార్ముకంబును శరములఁ గరములఁ గొనిఁ
పరుగులెత్తెను, జింకయుఁ దిరిగి తిరిగి
కనుచు రాముఁ బ్రధావించెఁ గడు వెరపున. 180

ఉ॥ గాలినిఁ దేలు గంతులిడి, కాంచను మోరను ద్రిప్పి రామునిన్
దాలిమిఁ దూలి పెన్దను వితాకు నటంచని చిక్కు కైవడిన్
సోలుచు నిల్చి, యూర్పులను స్రుక్కుచు రోజుచుఁ
బ్రక్కలాడఁగా,
దీలుపడంగఁ జేయుచును ద్రిప్పెను వానిని వేయి భంగులన్.

చ॥ పరుగిడు జింక వేగముగ వాలికలై నురుపుల్ స్రవింపఁగాఁ
గొఱకిన గడ్డి పోచలను గొంకునఁ జార్చును నోటి క్రేవలన్,
వెరలుచు బాణ మెద్దు పరతెంచునొ యంచుఁ గడుం
గలంగుచుం
దిరుగు మొగంబు పెట్టి వెను దృక్కుల ముందుకు సాగు భీతిమై

ఆ॥ త్రిప్పి త్రిప్పె రాము రొప్పుచు వనములోఁ
గొండలందు నదులఁ గోనలందు
ప్రాణభయము చేతఁ బరుగిడుచున్ లేడి
చిక్కు నటులె చిక్కు చిక్కకుండె. 183

క॥ విసిగిన రాముఁడు కసితోఁ
బసిఁడి మృగము మీఁద నొక్క బాణము విడువన్
దెసలద్రువఁగ ధ్వనిఁ జేయుచుఁ
బసిఁడి మెకము దూపుఁ దొరఁగి పలలాశి పడెన్. 184

చ॥ ధరణినిఁ బడ్డ దైత్యుఁడు విదారిత వక్షుఁడు తీవ్ర వేదనా
భర వివశాంగుఁ డయ్యును స్వభావముచేఁ గుటిలుండు గాన, దా
శరథి గళస్వనం బిది నిజంబని శ్రోతలు నమ్మునట్లు, వే
గిరపడి "లక్ష్మణా" యనుచుఁ గేకయిడెన్, విడనాడె ప్రాణముల్

గీ॥ ఆర్త నినదంబు "లక్ష్మణా" యనిన, దాని
యఱపు తన భర్తదే యని యాత్మఁ దలఁచి
వెఱచి జానకి మఱఁదినిఁ బిలిచి చెప్పె
"అగ్రజుఁడు చిక్కె నిలుగుల నరుగు మయ్య". 186

వ॥ ఈ మాటలు విని సౌమిత్రి జనక తనయతో నిట్లనియె, 187

క॥ రాముఁ డజేయుఁడు వదినా!
సేమంబున నుండు నమ్మ! చెనటి యెవండో
ఆ మృగ రూపమునం బడె
రాముని శరఘాటి కెవఁడు బ్రదుకం జాలున్? 188

క॥ పోరి వృచ్చె నిన్న మొన్ననె
శరజాలము వైచి రాత్రిచర వాహినులన్
దురమున రాముం, డాఘనుఁ
బరు లెవ్వరు దాక లేరు భయము వదులుమా! 189

క॥ కావున శంకింపకుమా!
పోవను నినువీడి; యిచట మోసంబగు సు
మ్మీ; వనములు మాయావుల
కావాసము లగుట మరువ నగునా తల్లీ? 190

క॥ సౌమిత్రి సౌమ్య వచనము
లా మగువకుఁ దప్పు లాయె; నాగ్రహమున నే
మేమో యనె సౌమిత్రిన్;
భామలకు వివేచనంబు పలుచ తలంపన్. 191

క॥ జనకజ పలుకులు లక్ష్మణు
మన మెఱియఁగఁ జేయ నతఁడు మ్రాన్పడియును దో
డనఁ దేరి పలికె సేవకు
నను నిట్టుల దూఱ నీకు న్యాయంబగునా? 192

క॥ అని పలికి నారసములుఁ
ధనువున్ గొని లక్ష్మణుండు ధరణిజతో వ
త్తునని వచియించి యగ్రజు
ని నరయఁగాఁ జనె నటవి కనిందితుఁడు వెసన్. 193

క॥ కని లక్ష్మణు నిర్గమనము
దనుజేశుఁడు పర్ణశాల దాపునకుం బో
యి నళినదళేక్షణను, దీ
నను, బాష్ప మలిన ముఖిని జనకజను గాంచెన్. 194

తే॥ ఆమె మహనీయ సౌందర్య మబ్రపడుచుఁ
గాంచె దశకంఠుఁ డుత్కంఠ గార్కొనంగఁ
గాని యతనికి నామెలోఁ గానుపించె
వెఱపుఁ గొలిపెడి తేజంపు వెలుగొకండు. 195

గీ॥ ఆమె పూతమౌ వర్చస్సు నాకళించు
నంత నాతని హృదయంబు నావరించె
పూర్వ జన్మ విభ్రాంతి; విమూఢుఁ డగుచుఁ
గువలయేక్షణ సొబగు వాగురలఁ జిక్కె. 196

వ॥ ఆతండు తన మనంబున నిట్లనుకొనియె. 197

క॥ పావక కీల విధంబునఁ
బావనమై యొప్పు నిట్టి పడఁతిని వేడ్కన్
భావజు కేళినిఁ గూడెడి
భావుకులకు నదియె నిజము బ్రహ్మపదంబౌ. 198

మ॥ అరవిందానన హృద్యమయ్యె ననవద్యంబైన రూపంబుతోఁ
దిరమై యున్న మెఱుంగుఁ దీవయన నుద్దీపించు చున్నట్టి యీ
తరుణీరత్నపు సన్నిధానమున మత్ స్వాంతంబు తప్పెన్ దిటఁ
జరితార్థంబగు నాదు జన్మ మిపుడీ శ్యామన్ గొనం గల్గినన్. 199

ఉ॥ రాక్షస రూపమున్ వదలి రావణుఁ డంత త్రిదండి రూపమున్
దక్షతఁ దాల్చి జానకినిఁ దచ్చనచేఁ గొననెంచి, ముంగిటన్
భిక్ష యటంచు బిట్టఱచె వేఁదుఱుతోడన; ప్రేమ భాజన
ప్రేక్షణ భృంగరాజి వనజేక్షణ వక్త్ర సరోజ మానఁగన్. 200

క॥ "పతి యేగతి నుండెనొ"? యం
చతి చింతం గుములు సతికి; యతి యాచనముల్
శ్రుతి పుటము నందుఁ బడలే
దతివల కెన్నంగ నాథు లసువులు గాదే? 201

క॥ చూపులఁ జూచియుఁ జూడక
వాపోవుచుఁ గంటినీరు పయ్యెదఁ బడి సం
తాపించు శోకమూర్తి ని
ఆపని తమిఁజూచి రావణాసురుఁ డనియెన్. 202

ఆ॥ అతివ! నేను దావకాతిథ్యముం గోరి
వచ్చి నిల్చినాడ వాంఛ నూని
నన్నుఁ జూచి నీవు మన్నింపఁగా రాదె
యనఁగ వాని పలుకు లాలకించి. 203

క॥ ఉలికి పడి చూచి ముంగలఁ
దలవాకిట నిలిచి యున్న తపసిని; బెల్చన్
గలగుండు వడి మనోవిభు
కలతెఱఁ గెఱుగంగఁ గోరి, కలికి యిటులనెన్. 204

మ॥ మునిలోకోత్తమ! మీరలీ వనమునన్ ముద్దైన బంగారు లే
డిని; దానిన్ గ్రహియించు యత్నమున వింటిం దాల్చి వెన్నాడు చు
న్న నరోత్తంసుని; వాని సోదరునిఁ గన్నారా? యెటుల్ వోయిరో
వినఁగా నా హృదయంబు తత్తఱిలు వేవేగన్ దయం జెప్పుడీ! 206

వ॥ అందులకా కుహనాముని జనకనందన కిట్లనియె.

ఉ॥ కాంచ సుమీ మనోహర మృగంబును; దానినిఁ బట్టి వెన్కఁ వే
గాంచిత లీలఁ బోయెడి నరాధిపు సూనుని; వానితమ్మునిన్
గాంచుచు నుంటి నీనిబిడ కానన సీమ నుపోఢ యౌవనన్
గాంచన కేతకీ కుసుమ గాత్రిని మోడుపు లేని చూపులన్. 207

క॥ ఎవ్వతె వీవనిలోఁ దో
డెవ్వరు లేకుండ నొంటి, నేటికిఁ జింతల్
నివ్వటిల మోము దామర
మవ్వముఁ గోల్పోయెఁ, జెప్పుమా ననఁబోణీ? 208

వ॥ నావిని జనకజ వాని కిట్లనియె. 209

క॥ ఓ మునివర! నే దశరథ
భూమీధవు స్నుషను, జనక భూవతి పుత్రిన్
నేమమున నేను నాపతి;
నా మఱఁదియు నుంటి మిచట నయ మొప్పారన్. 210

క॥ జింకను బట్టం జనె నీ
వంకకు నాథవుఁడు రామ భద్రుఁడు; సుగుణా
లంకృతుఁడు లక్ష్మణుఁడు సనె;
జంకుచు నొంటరిగ నుంటి సంయమిచంద్రా! 211

క॥ ప్రణమిల్లి విన్నవించెద
క్షణమున రాఁగలరు వారు; జటిలోక గ్రా
మణి! శ్రమ దీర్చు కొనుండని
యణుకువతో నామె పలికె నతిథికిఁ బ్రీతిన్. 212

వ॥ ఆ కపటాత్ముం డప్పుణ్యవతి నిట్లనియె. 213

క॥ వనముల నుండం దగుదువె?
మనఁదగుదువు నీవు రాజ మందిరములలో
నన విల్తుని గొలుచుచు నీ
వనయము క్రీడింపఁ దగుదు వంబుజ వదనా! 214

ఉ॥ బంగరు మేని కాంతి కెన వచ్చెడి పచ్చని పట్టు చీరలోఁ
బొంగెడి సీత జవ్వనపుఁ బొంకము గాంచుచుఁ గామి రావణుం
డంగజు నార్తితో నవయు చాత్మ మనోరథ మించు కించు కా
మంగళ గాత్రికిం దెలుప మానిని రోష కషాయి తాక్షియై. 215

వ॥ వానింగని యిట్లనియె. 216

ఉ॥ కట్టితి వీవు కావి; జడఁ గట్టెను నీతల మీఁది వెంట్రుకల్
బట్టితి వీవు దండమును; పట్టెలుగా వెలిబూది పూఁతలన్
బెట్టితి వీవు దేహమునఁ; బేర్పులుగా రుదురాక పేరులన్
జుట్టితి వీవు జోగివలెఁ; జుల్కన పల్కులు పల్క యోగ్యమే?

క॥ వేసము పవిత్ర మైనది
దోసము నీ పలుకు లందుఁ దోచుచు నుండెన్
మోసము చేయన్ జగతిని
వేసము ధరియించితివె వివేక విహీనా! 218

క॥ జానకి విదిల్చె నీ క్రియ
వానిని; మోమువలఁ ద్రిప్పి పలుకక యుండెన్
దానవుఁ డత్యుగ్రుండై
మానినితోఁ బలికెను నవమాన హతుండై. 219

వ॥ జానకీ! వినుము. 220

మ॥ ధరణీ రాజ్యము నిచ్చెఁ దమ్మునకుఁ, గాంతారంబు నన్ నారలన్
సరవిం దాలిచి కష్టముల్ గుడుచుచున్నాఁ డట్టి మూఢుండు సుం
దరి! నీ వల్లభుఁడా? శిరీష కుసుమ న్యక్కార కృన్మార్దవా
దరిణీ యాంగివి వే త్యజింపు మతనిన్ దౌర్భాగ్య దామోదరున్.

క॥ బేలా! నీలావణ్యము
మాలిన్యము చెంద వనుల మనఁదగునె? కడున్
లాలించెద నిను లలనా!
పాలింపుము నన్ను నీదు బానిస రీతిన్. 222

గీ॥ అనిన రావణు పల్కుల నతివ వినుచు
మోము కెంపొంద మనమున ముప్పిరిఁ గొన
వెఱపు లజ్జయుఁ గ్రోధంబు; పెల్లుబికిన
కోపమున నిట్టులనె వానిఁ గొంచె పఱచి. 223

క॥ సతులందు నీదు చతురత
వెతఁ దెచ్చును పాము్మ పేగ; వెలితి పలుకులన్
మతిహీనుని వలె నీవో
మతిమంతుఁడ పలుక నగునె? మాన్యత వలదే? 224

ఆ॥ అమర దర్పదమను నసురాధి నేతను
అల్పుని వలె నరసి యామె పలుక;
ప్రల్లదంపు రీతి రావణుఁ డనె మన
ఉల్లసం బడెఁతో పెల్లు గాగ. 225

ఆ॥ రక్కసీంద్ర పతిని రావణుఁడను నేను
అందగత్తె పొందు నభిలషింతు,
నిన్నుఁ గన్న దాది నిలువదు నామది
నన్నుఁ బొంద వేల సన్నుతాంగి? 226

క॥ విను నా పత్నులలో నీ
వనుపమ రత్నంబ వగుచు వలదుచు నుండన్
దనివి మెయిన్ సేవింతును
కనులమ నినుఁ గప్పికొందు గారము పేతున్. 227

క॥ అని పలు విధముల వేఁడెడి
దనుజాధిపుఁ జూచి పలికె ధరణీసుత రా
ముని సాటిలేని ధాను
ష్కునిఁ గూరిచి యతఁ డసుదుల్ఁ గూల్చిన తెఱఁగున్. 228

ఆ॥ రాము బాహు బలము రావణ! యెఱుఁగవే?
వేఁడి కంటి వాని విల్లు విఱచి
పొగడు నందె నతఁడు పురుషోత్తముఁడు సుమా!
రమ్యమూర్తి నిహత రాక్షసుండు. 229

వ॥ అని పలుకు జానకి వచనంబులు ములుకులై నొప్పింప
రావణుండు తన నిజ స్వరూపంబును దాల్చు నవసరంబున. 230

సీ॥ సౌమ్యత మేనిపై బట్టునఁ బాసెను
కుండలి యొడలిపైఁ గుబుసము వలెఁ
బుండరీకచ్ఛవిఁ బొలుపారు కందోయి
యొప్పుఁ గొల్పుచు చింత నిప్పులయ్యె,
శరదంబుదచ్ఛాయ కరణి వెల్గిన మెయి
కాలాంబుదంబును గెలి సలిపె,
సంస్కార హీనమౌ జటల పాటల కాంతి
యలికులంబుల కప్పు నతకరించె.

గీ॥ బొందు రుద్రాక్షలు సువర్ణ భూషలాయె
బూది బ్రుంగిన మేన మైపూఁత లలరె
రాసభానీత కాంచన రథము దోచె
అసుర ముని రూపమును వీడు నవసరమున. 231

ఆ॥ ఘన ఘనాఘనంపు గర్జితం బెటు లట్లు
హుంకరించెఁ గడు సహుంకరించి
మెఱపు మెఱసి నటుల మిఱుమిట్లు వెలయించి
రావణుండు నిలిచె రమణి యెదుట. 232

చ॥ ఒక పెనుగాలి సుళ్ళగుచు నుద్ధతి నుర్విని వీడి నిల్చినన్
ఒక పెనుమంట యొక్కవడి యున్నతమై దివినంటి గూలినన్
ఒక పెనుమోత దిక్కులను నూపుచుఁ బర్వి యణంగి పోయినన్
ప్రకటితమౌ భయంకర నిరస్త నిరావము బర్వె నంతటన్. 233

గీ॥ చేతనా చేతనంబులు చేష్ట లుడిగె;
ప్రకృతి యంత నిస్తేజమై వ్రాలి తూలె;
పారు గౌతమి నీరమ్ము పారు టణగె;
ఒక్క క్షణముర్వి యంతయు నుక్కణంగె. 234

సీ॥ కప్పను మ్రింగెడి సర్పంబు నోర్విప్పె
పూవుపై తుమ్మెద మూర్ఛ మునిగె;
నీటిలో మీనముల్ నేత్రముల్ విప్పెను;
సెలయేళ్ళ సవ్వడి నిలచి పోయె;
గాండ్రించు బెబ్బులి గళరవ మణగెను;
సింహ గర్జనములు సేగి నొందె;
చదలపై విహగము మెదలక నిలచెను;
కరి బృంహితమ్ములు కలక బారె;

తే॥ చెట్ల కొమ్మల నూగెడి చిలిపి కపులు
హస్తముల పట్టు వీడగ నవని గూలె;
వీడి సన్న్యాసి వేషము వింశతి భుజు
డతి భయంకర మూర్తియై యవతరిల్ల. 235

ఆ॥ రక్కసీని ప్రళయ రావంబు నాలించి
భీకరాకృతిఁ గని బెగ్గడిల్లి
రామ లక్ష్మణులను రమ్మని పిల్చుచు
విహ్వలించె సీత వెల్లబారి. 236

ఉ॥ ఊరుపు గాడ్పులన్ వడకు చుండగఁ జన్గవ; బెండు వారుచున్
జాఱు తరంపు మోవి నెఱి చక్కఁదనంబును గోలు పోవఁగా;
సోరును జిందు నేత్రములు జాజుఁ దొరంగుచు గాజు వారఁగా!
బోరన వ్రాలె భీతిమెయి మూర్ఛ మునింగిన సీత ధాత్రిపై. 237

క॥ అతి దుఃఖాబ్ధి మునింగిన
యతివను హస్తముల నెత్తి యరదము మీఁదన్
ధృతితో నిడుకొని యాతఁడు
ద్రుతగతితో నేగె శౌర్య దోహల వృత్తిన్. 238

ఉ॥ చల్లని గాలి వేగమున సాగు రథంబును సోకు చుండఁగా
మెల్లన మేలు కాంచి సతి మేచక మేఘముఁ బోలు రావణున్
జల్లన గుండియల్ కనుచు, సంభ్రమ చిత్తముతోఁ గలంగుచున్
దల్లడ మందుచుం బిలిచె దానవ భీకరు రాము రక్షకై. 239

ఆ॥ పర్ణశాల చెంతఁ బ్రవహించు గౌతమిఁ
బ్రీతిఁ బెంచినట్టి విరుల లతలఁ
బేరు పేరు బెట్టి పిలిచి చెప్పెను సీత
పతికిఁ దెలుపఁ దనదు బన్నములను, 240

సీ॥ గౌతమీసూత! నా కాంతున కెఱిగింపు
దురితాత్ము రావణు దుష్టచేష్ట,
ప్రస్రవణగిరి! నాపతి కెఱఁగింపుమా
కల్లరి రావణు కపట వృత్తి
లతకూనలార! నాగతి వివరింపుఁడీ
రాజేంద్ర సుతునకు రాఘవునకు
* ఇక్ష్వాకుకుల సఖా! యెందుఁ బోయితి వయ్యా!
వృక్షంబు విడిచి యో విహఁగ రాజ!

* జటాయువు దశరథుని సఖుఁడు. అతడెప్పుడు పర్ణశాల ముంగిట వృక్షముపై వసించు చుండెను.

గీ॥ సూర్య హిమకరు లార! నన్ జూడ రయ్య!
రావణుని బారి నుండి నన్ గావ రయ్య!
యెందుఁ బోతివి నాథ; నన్నిందు విడిచి
ఒంటి దానను స్వామి; నన్నేమ రావె? 241

శా॥ ఈ రీతిన్ విలపించుచున్ జనక భూభృత్పుత్రి దుఃఖాగ్ని కీ
లా రేఖా పరిపీడి తాత్మయయి పెల్లల్లాడ; నా రావమున్
సారాచారుఁడు పక్షిరాజు విని సచ్చారిత్ర సీతమ్మకున్
ఘోరంబైన విపత్తు గల్గెనని గగ్గోలంది పర్వెన్ వడిన్. 242

గీ॥ కనె జటాయువు దశముఖు కనక రథము
నందు నెలుగెత్తి యేడ్చెడి యవని సుతను;
బలిమి నాతండు జానకిన్ బట్టె ననుచు
తలఁచి; యడ్డగించె రథము; పలికె నిటుల. 243

క॥ నిలునిలు రావణ! జడియక
తులువతనం బొప్ప నీవు తొయ్యలి నిటులన్
బలవంతముగాఁ బట్టిన
ఫలితంబును బొందె దీవు పరువెత్తకుమా! 244

క॥ అని పలుకు జటాయువుపైఁ
దన తీవ్రతరాసి వెఱకి తారొ్కని పెలుచన్
దనుజపతి క్రూరకర్ముఁడు
కనలుచు యుద్ధంబు సేసెఁ గ్రౌర్య మెలర్పన్. 245

వ॥ పక్షీంద్రుఁడు విజృంభించిన వాఁడయి. 246

సీ॥ పక్కుపక్కునఁ దన్నెఁ బద ఘోరహతి చేత
దశ శిరో ముకుట రత్నములు రాల,
టక్కుటక్కున వాడి ముక్కుతోఁ బొడిచెను
దుంటరి దేహంబు తూట్లు పడఁగ,

తీవ్ర పక్షోద్ధతిన్ దిగ్భ్రాంతి నొందించె
రాక్షసు ధైర్యంబు రాలు పడఁగ,
క్రకచాభ నఖములఁ గర్కశ దేహంబు
రక్కెను రక్తధారలు స్రవింప.

గీ॥ వచ్చినటె వచ్చి దొరకక వ్రచ్చి నిలుచు,
నూర్ధ్వమున కేగు క్షణమున; నురు బలమునఁ
బ్రబల వేగమునం దూకి వాని పయిని
దికమకలు సేసె, నొప్పించిఁ ద్రిప్పి త్రిప్పి. 247

సీ॥ నెత్తుటం దోఁగుచు నేలపై దెరలిన
శిరములు పూచెట్ల చెన్ను నలర,
మొగమున మొనసెడి మొఱకైన ముకు పోట్లు
దంతక్షతంబులన్ దనరి యొప్ప,
మేనిపై నంతట మెఱసెడి పాయలు
గోటి నొక్కుల రీతి గొనబుఁ గొలుప,
పగిలిన రత్నాలు పలురంగు లీనుచుఁ
గంకణ శకలాల గతిఁ దలిర్ప,

గీ॥ విహగ విభునిచేఁ గదనాన విహ్వలుఁడయి
దిక్కుఁ దోఁచని రక్కసి యుక్కుఁ దక్కి
పరఁగ రాక్షస రతిపాలఁ బడిన యట్టి
కన్నె పొలపంబుఁ జిందించె వన్నెఁ దొరఁగి. 248

వ॥ పడంపడి రావణాసురుండు జానకిని దించి. 249

చ॥ అలఁతి యటంచు నెంచి యొక యండజ మిట్టులఁ దన్ను మార్కొనన్,
విలయ కృశాను తేజమునఁ బెల్లున రేగి కృపాణముం గరాం
చలమునఁ బట్టి పక్షములఁ జాచి వడిన్ బఱతెంచు పక్షి ఱె
క్కల నొగి జెండె రావణుఁడు ఖండితమై ద్విజ ముర్విఁ గూలఁగన్

గీ॥ కూలిన జటాయువుం గాంచి కువలయాక్షి
దిక్కుఁ దోపక బెదరున నుక్కు దక్కి
పరువు లెత్తెను గానలోఁ బథము గనక
కావుమా రామచంద్ర! నన్గరుణ ననుచు. 251

క॥ పరువిడు రాముని పడఁతినిఁ
గరమున వడిఁ బట్టి యెగిరి కార్ముకిలు వలెన్
జరియించె నంబరమునం
దు రావణుఁడు లంకఁ జేర ద్రుతగమనమునన్. 252

క॥ నల్లని రావణు చెంగటఁ
దల్లడ పడు సీత మిసిమి తనువు చలింపన్
నల్లని రేగడ పొలమున
నల్లనఁ బ్రవహించు కుల్య యట్టులఁ దోచెన్. 253

క॥ కదలు గిరి రగిలినట్టుల్
మదకరి ఫాలమున మెఱయు మణి పట్టమునా
సుదతి పసిమి చెంగు దివిన్
వెదచల్లెన్ మిసిమి యసురు నెమ్మేనఁ బడన్. 254

ఉ॥ "కాదిది నీలమేఘమునఁ గ్రాలు మెఱుంగు; స్థిరత్వమున్నదే?
కాదిది చంద్రరేఖ; వడిగా నెటు లేగును దక్షిణాశకున్?"
రోదసిఁ జూచి భూచరులు రూఢిగఁ జెప్పఁగ లేక యీవిధిన్
వాదము లాడఁ జొచ్చిరి నభంబున రావణుఁ డేగ సీతతోన్. 255

క॥ రావణ మేఘము జానకి
వావిరిఁ గన్నీళ్ళు వానవలెఁ గురియుంగాఁ
ద్రావఁగ దివిపై కెగిరెను
వేవేగమ చాతకములు విభ్రాంతములై. 256

ద్విపద॥
రావణుం డీరీతి రమణినిఁ గొంచు
దివి పయిఁ బోవంగ; దివిజులు నరులు
ద్విజ జాతి గాంచిరి విస్మయం బెలయ
మార్గ మధ్యంబున మగువ సీతమ్మ. 257

ఆ॥ కొండ మీఁద నున్న కోతి గుంపునుఁ జూచి
యొడలిపైఁ గడాని తొడవు లొలిచి
చీర కొంగుఁ జించి చెచ్చెర ముడి వైచి
తనదు జాడఁ దెలియఁ దరుణి విడిచె. 258

క॥ పైనుండి పడిన మూటను
వానరపతి యర్కసుతుఁడు భద్రము చేసెన్
దానవుఁ డెవఁడో పట్టెను
మానిని నని తలఁచి దుఃఖ మగ్నుం డాయెన్. 259

క॥ సీతను జెఱఁగొని రావణుఁ
డాతత గతి లంకఁ జేరి యంబర వీధిన్
ప్రీతిన్ జూపెను లంకను
భూతల నాకమ్ము దనుజ పుణ్య ఫలమ్మున్. 260

చ॥ కనుమిది రత్నమందిర వికాస వినిర్జిత నాక పట్టణం
బనిమిష యక్ష కిన్నరు లనారత మిచ్చట నాదు సేవకై
పనిఁ గొని యుంద్రు; సౌఖ్యముల పట్టు, పురంబిది నిత్య సౌఖ్యసం
జనిత విలాస భోగముల శాల యనన్ జెలువారు భామినీ! 261

సీ॥ ఈ మహానగరిలో నెల్ల వేళల యందు
నల్ల నల్లన వీఁచుఁ జల్లగాలి,

ఈ మహానగరిలో నినరశ్మి యెవ్వేళ
తమ్ములు విచ్చు మాత్రంబ కాయు,
ఈ మహానగరిలో నే రాత్రియైనను
పున్నమ రేయియై పొలుపు నించు,
ఈ మహానగరిలో నే కాలమందైన
వాసంతలక్ష్మి యొప్పారు చుండు,

గీ॥ దిక్పతులు, సూర్య చంద్రులు దివిజ తతులు
నన్ను సేవించి నా కనుసన్న లందు
మెలఁగు చుందురు నిన్నును మెచ్చు నటులఁ
గొలుచు వారలు నన్నేలు కొనుము కలికి. 262

ఉ॥ ఉన్నత నాక హర్మ్యముల నోహటిలింగ నొనర్చు కాంతి స
పన్నములైన సౌధములఁ బ్రాకు లతోపరి పుష్ప వాసనల్
మిన్నుల యన్ను మిన్నల కమేయ సుఖంబును గూర్ప వార లిం
దున్నెన రొప్ప నుందురు; వినూతన సౌఖ్య రసాభిలాషులై. 263

వ॥ అని వర్ణించి. 264

క॥ ఎన లేని రత్న రాసులు,
కన నింపగు కేళి వనులు కడువడి నేటకే
వనయముఁ బోరాఁ గల్గుచుఁ
దనరారెడి పుష్పకంబుఁ దరుణికిఁ జూపెన్. 265

గీ॥ రావణుని వైభవంబును రమణి గాంచి
వీస మంతేని దుఃఖంబు వీడ కుండ
మ్లానముఖియైన నామెను మనుజ వైరి
శపుచుఁ బలికెను దహతహ గడలు కొనఁగ. 266

క॥ తోఁగెదమే సెలయేళుల,
ఊఁగెదమే పూల లతల యూయెల లందున్
సాగింతము జీవితముల
భోగాబ్ధిన్ మున్గితేలి పుల్లాబ్జాక్షీ. 267

క॥ మానిసి రాముఁడు వచ్చునె?
కానన గిరికందరములఁ గడచి యిచటకున్;
బూనిక సంద్రము దాఁటునె?
వానిని వేమఱచి నాదు వల్లభ వగుమా! 268

ఉ॥ ఆకస మంటు కోట పరిఖావృతమై తనరారు చుండఁగా
గాఁకలు తీరినట్టి దృఢ కార్ముఖ హస్తులు రక్కసేంద్రు పెన్
వేఁకను గాఁచు చుండఁ; బురి వేలుపు లేనియుఁ జూడ లేర,యే
తేకువ నొక్క మానవుఁడు త్రెళ్ళక దీనినిఁ జొచ్చుఁ జెప్పుమా?

క॥ ఈ రీతిని మతిమాలిన
కారులు కూయంగ నతఁడు; కనలుచుఁ బలికెన్
జారువిలోచన, రాముని
ధీరత్వము శౌర్య పటిమ తెలియుం బడగాన్. 270

క॥ నీ రాజ్యము నీ భోగము
శ్రీరాముని కాలి గోటి సిరి కెనయౌనే?
పేరాస విడిచి మనఁగా
నా రాముని పజ్జఁ జేర్చు నను; క్షమియింతున్. 271

చ॥ పరమ పతివ్రతన్, జనక పావన వంశ సముద్భవన్, ధరా
తరుణి సుతన్, రఘూద్వహుని దారను నన్నొక యల్పురాలిగా
గరువతనంబునం జెనకి కామము గన్నులఁ గప్పఁ దెచ్చితే;
తఱుగవె నిన్ను రాఘవు నుదగ్ర శరంబులు నుజ్జు నుజ్జుగాన్. 272

గీ॥ ఈ చరాచర ప్రకృతి నీ యాప్సితముల
నిచ్చ నెఱవేర్చు నని చెప్ప హృద్యమగునె
భీతిచేఁ గొల్చు నిన్నది, ప్రేమ రహిత
యనెడి సత్యం బెఱుంగుమా యసురనేత. 273

ఉ॥ నీతినిఁ దప్పి పోవఁ దగునే కులకాంతలు ధర్మ బాహ్యలై?
ప్రీతిని రాజ్యభోగముల వీడితి నాథుని సేవ సేఁతకై;
నాతి చరింప నోపునె మనః ప్రియనాథుని వీడి? నన్ను నే
రీతిని గాని రాఘవు నరిందముఁ గూర్పుము లెమ్ము దుర్మతీ.274

క॥ బలిమిని నను డగ్గరినన్
జలన రహితమైన మేను స్వాధీనమగున్
వెలలంగాఁ బ్రాణమ్ములు;
కులకాంతలఁ గనఁగఁ దగునె కులటల రీతిన్. 275

క॥ జడియక దృఢముగఁ బలికెడి
పడఁతిని రావణుఁడు గాంచి పకపక నగియెన్
జడివాన బడెడి వడువున;
గసడురి రక్కసుల కాపుగడ సీతకిడెన్. 276

క॥ పది రెండు మాసములలో
మదిరాక్షీ! నన్ను నీవు మన్నింపనిచోఁ
దుదముట్టింతును నిన్నని
రదనంబులు గీటు కొనుచు రావణుఁ డరిగెన్. 277

క॥ ఘోరాకారులు రక్షః
క్రూరాంగన లొకటఁ జుట్టి కొట్టెద మనుచున్
బారలు చూపుచు రాగా
నీరసమున సీత చూచె నెవ్వగ గదురన్. 278

చ॥ పటుతర వాక్పరంపరలు బాణములై మది గాడి పారఁగాఁ
గటకట నొంది రావణుఁడు గ్రన్నన తన్నటవీడ; సీతలో
దిటువుఁ దొరంగి నిస్పృహను దెన్నులు లేని మహాబ్ధి దాటి త
న్నెటులు రఘూద్వహుండు గను; నెప్పుడు వచ్చు నటంచు
మూర్ఛిలెన్. 279

వ॥ అట దండకాటవిలో శ్రీరాముండు సౌమిత్రి యెదురుపడ వాని
కిట్లనియె. 280

క॥ జనక సుత నొంటిగా విడి
నను నెమకుచు నీవు రాఁగ నరభక్షకు లా
వనిత నెటుల్ హింసింతురొ
అనుజా! నా హృదయ, మకట యడలం దొడఁగెన్. 281

క॥ ఆ పగిది మృగము వెంబడి
చాపము ధరియించి నేను జయ్యనఁ బోగాఁ
బ్రాపింపక అలయింపఁగఁ
గోపంబున వ్రేసినాఁడఁ గోలన్ దానిన్. 282

క॥ అసువులు మృగ రూపంబును
బసచెడి విడుచుచుఁ బలాశి బాణ నిహతిచే
వెస మిమ్ము మోసగింపను
కసిగా నా గళము బోలు గళమున నఱచెన్. 283

క॥ వడిగా వచ్చుచు నుంటిని
జడిసితి రని యెంచి మీరు; చాన నొకర్తన్
విడిచి యరుదెంచితివ త
మ్ముఁడా! యనఁగ లక్ష్మణుండు మ్రొక్కి వచించెన్. 284

సీ॥ మీ బాణ నిహతిచే మృగము చచ్చుచు నార్తి
హా లక్ష్మణా! సీత! యంచు నార్వ

యా క్రందనము విని యవనిజ తలపోసె
సిలుగుల మీరలు చిక్కితి రని,
తల్లడిల్లుచు నామె ధైర్యంబు విడనాడి
విలపించుచును గడు వెఱఁగు పడుచు
మీ పరాక్రమమును మేలుగా నెఱిఁగియు
బేల గావున మది భీతి నంది.

గీ॥ పొమ్ము వేగమ లక్ష్మణా! పోగులుచు వని
రాముఁ డర్థించె సాయంబు; రయమునఁ జను
మనఁగ "నాపదలకె" మీర లాపదయని
చేటు చెనకదు మీకని చెప్పినాడ. 285

మత్తకోకిల॥
ముప్పు మీకిసుమంత లేదని
ముజ్జగంబుల యందు నేఁ
జెప్పఁగా నను సంశయించెను
సీత తాల్మిని వీడుచున్,
దప్పు నా యెడఁజూపఁ జాలక
దారుణంబగు కిన్కతో
దెప్పరంబులు వల్క సోదర!
దీలు నొందితి; వచ్చితిన్. 286

వ॥ శ్రీరామచంద్రుడు సౌమిత్రితో నిట్లనెను. 287

ఆ॥ అబల, నార్త, భీత, నడవిలో నొక్కతన్
విడచి వచ్చుటే వివేక మయ్యె
ఆమె నిన్ను దూర! నావేశముననను నా
యాన దాటి తీ వనాదరమున. 288

క॥ మానిని పలుకులు ములుకుల
మానిన గాయముల వెచ్చ నూర్చ్చ ననుజునిన్
దీనానను నోదార్చుచు
వే నడచెను రాఘవుండు వెలఁదినిఁ గాంచన్. 289

ఆ॥ జలరుహంబు లేని సరసి చందంబున
రేవెలుంగు లేని రేయి రీతి
మొలక చివురు లేని మ్రోడు మ్రాకుం బోలి
పర్ణశాల యుండెఁ బడఁతి లేమి. 290

క॥ సీతా! సీతా! యనుచును
కాతరుఁడై రఘువరుండు కళవళ పడుచున్
నాతిని నలుగడ వెదకుచు
భీతినిఁ బరువిడుచు దిశల బేర్కొని పిలిచెన్. 291

గీ॥ క్షితిధరా! తెలియునా? నీకు సీత జాడ?
తరణి గోత్రుడా! తెలియునా? తరుణి జాడ?
కువలయాధిపా! తెలియునా? కోమలి గతి?
అని యడుగ ప్రతిధ్వని యతని నడిగె. 292

ఆ॥ పారు నీటి నడిగె, పర్వతంబు నడిగె,
చెట్టునడిగె, కలగి పుట్ట నడిగె,
జింక నడిగె, చేరి పంకజంబు నడిగె
అడిగె నడిగె రాము డడవి నంత. 293

ఆ॥ తిరిగి తిరిగి చూచె దొరువులన్ జెఱువుల
బొరియలందు కొండ చఱియలందు
గుబురు పొదలలోనఁ గొమరు కుంజములందు
గుబులు చెంది యతఁడు కొమ్మకొఱకు. 294

ఆ॥ పిలిచె పిలిచె నాతఁ డెలుఁగు రాపడు నట్టు
తిరిగె తిరిగె కాళ్లు దీయు నటుల
చూచి చూచి యతఁడు సూడక చూచెను,
భ్రమసె, భ్రమసె నతఁడు భార్య కొఱకు. 295

సీ॥ సెలయేటి గలగల కలికి నవ్వులటంచుఁ
జెంతకుఁ జని దరస్మిత మొనర్చు,
జలజాతమును గాంచి చెలి ముద్దు మోమని
మోవిఁ జెంతకుఁ జేర్చి ముద్దులాడు
మృగి బిత్తరపు జూపు మృగనేత్రదని యెంచి
చూపులం గలుపంగఁ జూచు చుండు
కరిణి నడలు గాంచి కాంతయే యనుకొని
ఆస యుప్పొంగ వెన్నంటి పోవు.

గీ॥ ధరణి జాతను గనలేక; ధాత్రి మీఁది
వన్నె చిన్నెలు భూపుత్రివన్న యూహ
భ్రమసి మతిమాలి దీనుఁడై రాముఁ డకట
మలగి తిరుగుచు నుండెను మందుని వలె. 296

సీ॥ పద్మాకరము నుండి పద్మగంధము పర్వఁ
జెలి మేని తావి యంచలరి నిలుచు,
సెలయేట బేడిస మిలమిల మెఱుపులు
కలికి చూపులటంచుఁ గలఁగి చూచుఁ,
బూరెమ్మ గాలిలోఁ బొలుపుగాఁ జలియింపఁ
బడతి పయ్యెద యని పట్టఁ బోవు,
వన్నెలపురి విప్పి వన మయూరం బాడ
వెసఁజూచు వరవర్ణిని సిగ యనుచు.

గీ॥ ప్రకృతి యంతయు సీతయై పరిఢవిల్లఁ
బొడమె నిచ్చట యని కూర్మిఁ బొదువఁ బోవు
వెలఁది లేమిని పరికించి విహ్వలించు
వంక వంకలఁ గనుఁగొని భ్రాంతిఁ జెందు. 297

ఆ॥ ధూళి నిండె మేను కాళులు గందెను
పిడుచ గట్టె నాల్క పెదవు లెండె
అతివను గన లేక యసురుసు రయినారు
రాజ సుతులు సహజ తేజ ముడిగి. 298

వ॥ జానకీపతి మఱియు సతిని దలంచి యిట్లు విలపించె. 299

గీ॥ "భాసుర సుహాస విలసిత వదన సీత
పర్ణశాల కలంకృతి; వనజగంధి;
నా బహిఃప్రాణ మటవిని నంజుదిండ్ల
పాలఁబడె నేమొ? యేనెట్లు బ్రదుకువాఁడ! 300

గీ॥ తొల్లి చేసిన పాపమో తొయ్యలి యిటు
లంతమై పోయె దైవోపహతుఁడ నేను
తండ్రి గతియించె; ధారుణీ తనయ పోయె
దుఃఖ వారిధిఁ దరియించు త్రోవ యేది? 301

గీ॥ ఏల వేదనోద్ధతిని నా హృది పగులదు?
ఈ తనువు వీడి ప్రాణంబు లేల పోవు?
పాపముల నెన్ని చేసితిఁ బ్రాగ్భవమున
ననుభవించుచు నుంటి నియ్యటవి లోన. 302

క॥ రాజ్యం బబ్బమిఁ జింతిలఁ
బూజ్యుఁడు జనకుఁడు గతింపఁ బొగల మది నిటుతో
త్యాజ్యం బాయెను ప్రాణము
భోజ్యము దుఃఖంబె నాకు భూమీ స్థలిలోన్". 303

క॥ జానకికై యీ రీతినిఁ
గానసమున రఘువరుండు గలఁగుచు దిరుగన్
దీనుని కైవడి, లక్ష్మణుఁ
డానసమున ధైర్యరేఖ యచ్చు పడంగన్. 304

వ॥ ఇట్లన్నతో ననియె. 305

శా॥ ధీర స్వాంతుఁడ వీవు పామరుని రీతిన్ సీతకై యీగతిన్
ఘోరారణ్యము లందు దుఃఖిత మతిన్ గోల్గోలునం చేడ్చుచున్
బ్రారబ్దం బననౌనె? యుక్తమగు కర్తవ్యంబుఁ బోనాడి, యో
సారాచార; వియోగముల్ సతములే సంయోగముల్ గల్గవే?

మ॥ కలఁతున్ వార్ధుల; నాకసంబు పగులంగా వ్రేతు; దిగ్గాల ము
త్తల పాటొందఁగ నార్చి పేర్తును; మహాఘాత్రీతలంబెల్ల నేఁ
బెలుచన్ జుట్టి పలాశి మూకల ననిన్ వేటాడెదన్; బెక్కు ప
ల్కులదేలా? కొని తెత్తు మా వదిన నెట్లో యామె యెందుండినన్

గీ॥ ఒప్పు మాటల సౌమిత్రి యూరడించె,
రామచంద్రుని, జానకీ రమణి జాడఁ
దెలియఁ గోరుచు విపినమ్ము గలయఁ దిరిగి
కాలి గుర్తుల నొక్కచోఁ గనిరి వారు. 308

వ॥ అనుఁగు తమ్ముఁ డన్న కిట్లనియె. 309

సీ॥ ఇటఁ జూడు మగ్రజా! యింతి పదంబుల
ముద్రలు విస్పష్టముగఁ దలిర్చె,
ఈ పాదముద్రలతోఁ బాటుగాఁ బెద్ద
కాలి గుర్తులు కొన్ని గానఁ బడియె,
బలియుఁ డొక్కఁ డెవండొ పడతిఁని వెన్నాడి
యున్నట్లు తోచుఁచు నున్నదయ్య,

చినిగిన పయ్యెద చీలికల్ వ్రేలాడు
చున్నవి చెట్లపై; నన్న కనుము.

గీ॥ పరుగిడు నపుడు భామిని పయ్యెద తరు
శాఖలను జిక్కి చినిగిన సరణిఁ దోఁచు
గాజు ముక్కలివే యిటఁ గానుపించె,
జారి పడెనేమొ వడినేగి సారసాక్షి. 310

క॥ పెను ఱెక్కల యాకలిటన్
గనకపు రథశకలములును, కండలు, శిరముల్
గననాయె నౌర యెవ్వఁడు
పెనంగెనో పక్షి నెదిరి విక్రమ మొప్పన్. 311

క॥ జానకి పదముల జాడలు,
దానవుతోఁ బక్షిరాజు తార్కొని రణమున్
బూనికఁ జేసిన గుఱుతులు,
మానిని ధరియించినట్టి మాలలుఁ దోచెన్. 312

క॥ ఇట నెవఁ డొక్కఁడు వడఁకుచుఁ
గుటిలత నున్నాఁడు వీనిఁ గూల్చెద నని వే
పటు మార్గణమును వింటన్
దిటవున సౌమిత్రి దొడుగ ద్విజ మిటు లనియెన్. 313

క॥ విడువకు విడువకు బాణము
కడముట్టెను ప్రాణ మనఘ! కనుఁగొన మిము నే
విడనాఁడ కుంటి నసువులఁ
దొడరితి రాక్షసుని గెలువఁ దొయ్యలి కొఱకై. 314

కు॥ నీపడఁతిని రావణుఁడను
పాపాత్ముఁడు బలిమిఁ బట్టి పరువంగా నే
నోపిన శక్తి నెదుర్కొని
ఆఁపగలే కిటుల నైతి యసురుని చేతన్. 315

కు॥ అని పక్షి వరుఁడు మడిసిన
ననలము రగిలించి దాని యలఘు శరీరం
బును దహనము సలిపి పితృ ప
ఖుని ఋణమును దీర్చుకొనిరి కుందుచు వారల్. 316

వ॥ అప్పక్షిపుంగవు చితిని గని రఘువరుం డిట్లనియె. 317

కు॥ యాగములు సేయు వారలు
భోగంబులు వీడి తపము మొనసెడి వారల్
బాగుగఁ బొందెడి సద్గతి
నోగృధ్రమ నీకు నేను నొసఁగితిఁ బ్రీతిన్. 318

కు॥ ఖగవరు పలుకులను దలఁచి
రగిలెడి కోపాగ్ని ననియె రాఘవుఁ డంతన్
జగతి నెటకరిగి దాగినఁ
బగతుని రావణునిఁ బట్టి పరిమార్తుననిన్. 319

కు॥ ప్రసరింపఁగ భువనంబుల
రక్కసి మూకలను బట్టి రాచెద కాలన్
దిక్కులహరంబుల బ్రీల్చెద
గ్రక్కదల నొనర్తు నేను గగన పథంబున్. 320

కు॥ అని యుద్వేగంబునఁ బా
వని యగు సతినిఁ గడుఁ దలఁచిఁ పలికెడి యన్నన్
గని కన్నీరు స్రవింపఁగ
వినయంబున లక్ష్మణుండు బెగడుచుఁ జెప్పెన్. 321

క॥ కాలమును దాఁట శక్యమె?
కాలమున కధీనమనరె కర్మలు భువిలో,
జాలము సేయక తెమ్మా
తాలిమినిన్ ధృతిని బూని ధరణిజ నెమకన్. 322

ఆ॥ నీవు జ్ఞాననిధివి, నేనొ యజ్ఞుండను
చెప్పనేర, నీదు సేవకుఁడను
చింతయందుఁ జిక్కి చీకాకు పడు మీకు
జ్ఞాని మార్గమేను జ్ఞప్తి పఱతు. 323

గీ॥ యుక్తముగ లక్ష్మణుఁడు బల్కి నూఱడిల్లె
రామచంద్రుఁడు; సీత నరణ్యమందు
వెదకుచున్ బోవు చుండఁగ హృదయ మదరఁ
గొట్టు శబ్దంబు నాల్గు దిక్కులను నిండె. 324

మ॥ విపులోరస్స్థల మందు గన్నొకటి యాభీలంబుగాఁ గ్రాలఁ; దో
రపు వైశాల్యముతోఁ బిచండము మహోగ్రంబై విడంబింప; వ
క్త్ర పురోభాగము రక్తఫేనయుత దంష్ట్రా ఘోరమై కన్పడన్
గృపణుం డెక్కఁడు లాగె బాహువులతో శ్రీరామునిన్ లక్ష్మణున్.

మం॥ విస్మయంబునఁ గాంచు వీరులన్ బట్టి
అదటునఁ; బల్కె నా యసురాధముండు. 326

క॥ బలిసిన మూపులు మీయవి
వలసిన మాంసంబు గలదు వాచవి దీఱన్
బొలుపున భక్షింతును; మి
మ్ముల విధియే పంపె నాకు మోదము గూర్పన్. 327

వ॥ అని యా వికృత స్వరూపుండు కబంధుడు లాలసుఁడై పలుకు
చుండ. 328

శా॥ చండాంశూగ్ర మరీచులన్ జెనకు రోషజ్వాల లక్షిద్వయిన్
మెండై గ్రాలగ రామలక్ష్మణులు సందీప్త ప్రతాపక్రియో
ద్దండ స్ఫూర్తిఁ దదీయ బాహువుల నుత్సారించి ఖండింప వే
దండద్వంద్వము బంధమున్ విడినటుల్ దైవారి రారాసుతుల్.

క॥ కొండాడిరి ముని జనముల్
భండన పండితుల రామలక్ష్మణులను దు
ష్టుండైన యాకబంధున్
ఖండించిన వీరు సములు నరహరి కనుచున్. 330

మం॥ ధాత్రిపై వ్రాలిన దనుజుని మేను
బూడిదన్ జేసిరి భూపాల సుతులు. 331

ఉ॥ మంటల మధ్య లేచె నొక మంగళరూపుఁడు దివ్యకాంతి మి
న్నంటఁగ బూర్ణిమాయుత సుధాంశుని తేజము డిందఁ జేయుచున్
గొంటు తనానఁ దాను మును గ్రొవ్వి యొనర్చిన పాపపుంజముల్
గుంటు వడంగ రాముని యకుంఠిత తీవ్రతరాసి ధారలన్. 332

క॥ వెలలేని రత్నభూషణ
ములు మెఱయుచునుండ దేహమున, దివ్యములౌ
వలువలతో వెలయు నతఁడు
పలికెను దన కథ; నుతించె వారిన్ ప్రీతిన్. 333

సీ॥ జనపాల సుతులార! వినుఁడు నా చరితంబు,
దను వంశజుండ, గంధర్వ వరుఁడ,
తరుణార్క కాంతులన్ దనరారు చుంటిని
కామ రూప మహిమఁ గలిగియుంటి,
బ్రహ్మ వరంబుచే బలగర్వ యుతుఁడనై
విహరించు చుంటిని విపుల జగతి

ప్రముక్కుడి రూపంబు మోదంబునం దాల్చి
ప్రసుక్కించు చుంటిని సురల, మునుల,

గీ॥ స్థూలశిరుఁడను తాపసి చూచి నన్నుఁ
క్రుద్ధుఁడై శాపమిచ్చెను, క్రూరమైన
రూప మిచ్చనుఁ గొంటి, వీ రూపముననె
బ్రతుకు రాక్షస వృత్తిని వసుధ యందు. 334

గీ॥ శాపమును గ్రమ్మరింపు మీ శాంత హృదయ
పరిహసనమున నెనిట్టి పాపి రూపు
బొంది నాఁడను దయఁ జూపు పూత చరిత
యనుచుఁ బ్రార్థింపఁగా నాతఁ డనియె నిట్లు. 335

క॥ "ఒకనాఁడు నీదు కరములఁ
బ్రకటిత బలులైన యట్టి రాజకుమారుల్
సుకృతులు బంధితులై నిను
శకలము లొనరింత్రు నీకు శాపము దీరున్. 336

వ॥ నేను రాక్షస రూపంబు నొంది క్రూర కార్యంబు లొనరించుచు
నొక్క దినంబున. 337

ఉ॥ నేను మదాతిరేకమున నిక్క మహేంద్రునిఁ బోరఁ జేరఁగా
నా నముచిద్విషుండు కులిశాహతి నొంపఁగ నాదు మేనిలో
జానువులున్ శిరం బడఁగె, సాస్రుడనై కడు వేడఁగా నతం
డాననమున్ పిచండమున; నక్షిని వక్షములోనఁ జేరిచెన్. 338

గీ॥ పండె నేటికి నా పుణ్యఫలము దేవ!
తొంటి రూపంబు నొందితిఁ; దొలఁగి పోయె
తలిసి శాపంబు, మీరలీ దారిఁ బట్టి
చనుఁడు శుభములు చేకూఱు సత్వరముగ. 339

కII ఇన తనయుఁడు సుగ్రీవుఁడు
వనౌకసుఁడు ఋష్యమూక పర్వత శిఖరం
బున ననుచర సహితుండై
కనఁబడు నాతని చెలిమినిఁ గావింపఁ దగున్. 340

ఆII న్యాయ వర్తనుండు, నమ్రుండు, సజ్జనుం
డలఘు విక్రమాఢ్యుఁ డవని నంతఁ
దొల్లిఁ దిరిగి చూచెఁ దొయ్యాలి జాడను
నీకుఁ జెప్పఁ గలఁడు నిశ్చయముగ. 341

వII అని విన్నవించి, గంధర్వుం డదృశ్యుండయ్యె, రామలక్ష్మణులు
వనంబులఁ జనువారు మార్గమధ్యంబున శబరి యాశ్రమంబున
కుం జనిరి. 342

కII తన కారాధ్యుని రాముని
వనరుహ లోచనునిఁ గాంచ వర నిష్ఠన్ దా
ననయంబుఁ దపము సేయుచుఁ
గనుఁగొనె రాఘవుని శబరి కాంక్ష దలిర్పన్. 343

కII ఉచితముగ శబరి పూలన్
బ్రచురముగాఁ బూజఁ జేసి రామునకుం దా
రుచి చూచి మంచి ఫలముల
శుచిగా మెసవంగఁ బెట్టి శుభముల నొంచెన్. 344

ఆII ఇంతి పూర్వ పుణ్య మింతింత యనరాదు
ముక్కు మూసి జపము పూని చేయు
మునులు గాంచ నట్టి మురవైరి కాన్పించె
మోక్షపథము పొందె పుణ్యచరిత. 345

వ॥ శబరి యోగాగ్నిచే భౌతిక దేహంబు విడనాడి సురధామంబుఁ జేరె; అంత నా రాకుమారులు పయనించి పంపా సరోవరంబును జేరుకొనిరి. 346

సీ॥ అలల హస్తంబుల నర్ఘ్య పాద్యము లిచ్చి
 కోకిలా రవములఁ గుశల మడిగి,
పుష్పాది శీకరంపు హిమవారి యొసంగి
 వలిగాలి వీవన నలరఁ జేసి
ఇంపైన జలములఁ దృషను దృప్తి యొనర్చి
 ఫలముల క్షుద్బాధఁ బాయఁ జేసి
వృక్షంపుఁ గ్రీనీడ విశ్రాంతిఁ గలిగించి
 కుసుమ శయ్యలఁ బండు కొనఁగఁ జేసి

గీ॥ సద్గృహస్థుని వలె నెప్డు సంతసమున
నతిథులను గారవించు చత్యాదరమునఁ
బాంధులకుఁ బ్రీతిఁ గూర్చు పంపా సరస్సుఁ
గనుఁగొనిరి రాజపుత్రులు కౌతుకమున. 347

వ॥ శ్రీరామ చంద్రుడు పంపా సరస్సును వీక్షించి ముదితాంత రంగుండై తమ్మున కిట్లనియె. 348

ఉ॥ తెల్లని స్నిగ్ధమౌ యిసుక తిన్నెలు శ్రోణివలెన్ రహింపఁగా
మెల్లఁ మెలంగు వీచికలు మించు పయంట వలెన్ జెలంగ వి
ద్యుల్లతి కోప మాబ్జ రుచి తోరపు నవ్వుల తేట రీతిగా
నుల్లసిలన్; లతాంగి వలె నొప్పెను బంప ప్రహృష్ట పాంథయై.

సీ॥ కాదిది పాదోధి కడు స్వాదు సలిలంబు
 త్రాగుట కర్హమై తనరు చుండ,
కాదు శాద్వలమిది, కదలుచుఁ గలఁగునె
 ట్లలలపై నల్లల నాడు చుండ,

కాదిది స్నిగ్ధమౌ కఠిన స్ఫటిక తలం,
బంబుజ మార్దవం బలరి యుండ
కాదిది రతనాల కంబళి, వికసిత
కల్హార గంధంబు గ్రాలు చుండ,

గీ॥ విమల వారి పూరంబుతో వెల్లి విరిసి
నాచు తీవెలతోఁ గడు నల్లఁ బడియు
పద్మ హల్లక సద్మమై వఱలె; సకల
బథిక జన తాపహారి పంపా సరస్సు. 350

సీ॥ పరితాప మారంగఁ బంపా జలంబుల
నన్నదమ్ములు స్నాన మాచరించి,
సావిత్రి జపియించి, సవితకుఁ గేల్మోడ్చి
కడుపార ఫలములఁ గుడిచి, తనిసి,
పూఁజొంపముల నీడఁ బూవు సెజ్జల మీద
శ్రమదీఱఁ గను మోడ్చి శయన మొంది
మందమారుతముల యందంపు టొడియందు
గాఢ నిద్రా తరంగములఁ దేలి.

గీ॥ గండు కోయిల సంగీతకములు; తేంట్ల
మృదుల ఝుంకార నాదముల్ మేలు కొలుప
వేగ మేల్కాంచి పంపను వీడి చనిరి
చెలిమి చేయంగ సుగ్రీవు చెంత కరిగి. 351

ఉ॥ విదిత యశుండు రాఘవుఁడు విష్ణుని యంశము నొంది పుట్టియున్
మదమున రావణాసురుఁడు నాతిని గైకొన నద్దురాత్మునిన్
జిదుమఁగఁ గోతి సఖ్యమును జేయఁగఁ బోయెను వింత లిట్టివే
కద-విధి దాటఁగాఁ దరమె కంజదళాక్షున కేని మేదినిన్. 352

క॥ రజనీచర కంటక వృ
క్షజాల వర్ధిష్ణు బాహు శౌర్య జ్వలనా!
నిజభుజ బలాశ్రితార్య
ప్రజాభమత నీతి ధర్మపాలన కలనా! 353

ఓం తత్సత్.

చ॥ పటుతర రామ భక్తి పరివర్ధిత సత్త్వుఁడు; దుగ్గిశెట్టి వేం
కట రమణాభిధుండు; గుణ గణ్యుఁడు; సింహపురీ నివాసి; యు
త్కట కవితా కుతూహల వికస్వర మానసుఁడై రచించె; ము
చ్చట లొలుకన్ రఘూద్వహుని; చారుచరిత్ర మరణ్యకాండమున్



శ్రీకర ధరణీ తనయా
లోక సముల్లసిత హృదయ, లోకత్రయ ర
క్షా కౌతుకనయ, పటు శర
సాకల్య త్రుటిత ధనుజ సముదయ రామా! 1

వ॥ దేవా, అవధరింపుము. 2

క॥ మిన్నంటు ఋష్యమూకం
బన్నా! కను మదియె దాని కటు నిటు చుట్టున్
జెన్నైన తాళవృక్షము
లున్నవి మేఖలను బోలి యొప్పు దలిర్పన్. 3

ఆ॥ తాటి చాలు గాలి తరగల నూగాడ
ముదురు పచ్చవన్నె పొదలు పొదలఁ
గొమరుఁ జిల్కు పించియము నూని నర్తించు
నట్టి నెమ్మివోలె నచల మొప్పు. 4

క॥ శ్రీరామ చంద్ర మూర్తికి
నీ రీతి సుమిత్రకొమరుఁ డేర్పడఁ జూపెన్
దూరమున నున్న గిరి, నిం
డారిన కుతుకమున నడచి రచటికి వారల్. 5

క॥ కరి కలభంబుల గమనపు
టొరిమన్ నడతెంచు పూరుషోత్తములన్ భా
స్కర తేజ స్సురుచిరులన్
ఖరకర పుత్రుండు గాంచెఁ గళవళ పడుచున్. 6

ఉ॥ గ్రీవము సాచి నిక్కి పరికించి, విరోధులుగా భ్రమించి సు
గ్రీవుడు బెగ్గడిల్లి తన ప్రెగ్గడ యైన మరుత్తనూజునిన్
ధీవరుఁ జేరఁ జీరి "యరుదెంచెడి వారలఁ గాంచి నాడఁవే
పావని వాలి నన్దునుమఁ బంపిన యోధవరుల్ నిజంబుగాన్. 7

ఆ॥ వేగ పోద మింక నీ గిరి వీడ్కొని
తీరె ఋణము మనకుఁ దీని కిపుడు
పిలుపు మీవు మిత్ర వితతిని హనుమంత
వీరి పొలుపుఁ జూడ వెఱపు గల్గె. 8

క॥ సుత్రాముని తనయుండీ
క్షత్రియ పుత్రులను బంపె సందియ మేలా
మిత్రవరు లార కదలుఁడు
ధాత్రిని వేరొక్క చోటఁ దలఁ దాచు కొనన్. 9

క॥ అని యీ చందమ్మునఁ దన
గనుఁ గొనలన్ బాష్ప జలము గ్రమ్మఁగ దీనా
ననుడై యున్న వనచరవ
రు నర్కజుఁ గని హనుమ యనె రుచిరపు ఫణితిన్. 10

క॥ వెఱపు డుగుము భాస్కర సుత
గిరి విడి చని నంత మాత్ర గిలి తొలగు నొకో
వెరపున ధృతిఁ గొనకున్నన్
బెఱ దేశంబునను భీతి వెన్నంటునుగా! 11

క॥ పరుల పనుల నెఱవేర్చెడి
వెరవరులుగఁ దెలియఁ బడరు; విలసిత శౌర్య
స్ఫురణంబున ముజ్జగములఁ
బరిపాలనమునకుఁ దగిన వారీ పురుషుల్. 12

ఆ॥ ఏను పోయి వత్తు నిప్పుడ వీరల
జాడ నెఱిగి వీరి సఖ్యమునకు
జతనమున్ బొనర్తు క్షత్రియులని వేద
వేద్యు లనియుఁ దోచు వీరిఁ జూడ. 13

కII మతిమంతుఁ డగు ప్రభంజన
సుతుఁడు సమీపమున దొరయు శూరుల ధాత్రీ
పతి సూనుల దర్శించి, వి
నతిఁ గావించి మృదుల వచనమ్ముల ననియెన్. 14

కII మిమ్ముల దరిసింపంగా
నిమ్ముల వదలంగ రాని నృప సుతు లనుచున్
నమ్మకము గలిగె; నీ గహ
నమ్ములఁ దిరుగంగఁ గారణమ్మును జెపుఁడీ. 15

మII మహనీయం బగు రూప వైభవముతో మధ్యందినార్క ప్రభా
స్పృహణీయంబగు శౌర్య రేఖలు విరాజిల్లన్ ధనుష్పాణులై
మహి నేలన్ గల శక్తి గల్గియును సామాన్యుల్ బలెన్ మీరలీ
గహనాంతమ్మునఁ బాదచారులయి రాగా కారణం బేమొకో. 16

కII అనిలుని యంశంబున నం
జనకు జనించితి, భజింతుఁ సప్తాశ్వ సుతున్
హనుమ యనువాఁడ, నెచటికిఁ
జను చుంటిరొ చెప్పు డయ్యా! సాయ మొనర్తున్. 17

ఆII వాక్య కుశలు డైన పావని వాక్కుల
వాక్య విజ్ఞు లైన పార్థివ సుతు
లాలకించి; యంత యనుజు లక్ష్మణునితో
పలికె రాఘవుండు సలలితము. 18

ఆII ఇంపు గొలుపు పలుకు లితనివి వింటివా
వేద విదు డటంచు విశద మగును
పలుకు లందు తేట; వడి లేదు; మిక్కిలి
వ్యవధి లేదు; పలుకు పలుకు మధ్యం. 19

క॥ కనులను లలాట మందున్
గను బొమలను మొగము నందు గాత్రం బందున్
కనుగొన మించుక దోసం
బును; పలుక నితండు తీయముగ సౌమిత్రీ. 20

వ॥ నా విని వాయునందనునకు సౌమిత్రి యిట్లనియె. 21

క॥ విదిత రఘు కులజులము మే
ము దశరథుం డనెడు రాజు పుత్రులము వనిన్
బదు నాల్గు వత్సరంబులు
పదిలముగ వసింప నెంచి వచ్చితి మనఘా! 22

ఆ॥ ఏను లక్ష్మణుండ నీకృతి శ్రీరామ
చంద్ర మూర్తి సుగుణ సాంద్ర కీర్తి
ఇంతిఁ గూడి యటవి కీతండు ననుడెంచె
వారి వెంట నేను వచ్చినాడ, 23

ఆ॥ మగువ కోర్కె దీర్ప మాయలేడి కొఱకు
నగ్రజుండు సనిన నతని వెదుక
నాకు టిల్లు వీడి యన్నకై నే నేగ
వనిత నపహరించె దనుజుఁ డొకడు. 24

సీ॥ సతి జాడఁ గానక మతి మాలి తిరుగుచుఁ
బట్టు వడితిమి కబంధు చేత,
వాని దీర్ఘ బలిష్ఠ బాహులఁ జెండాడి
తేకువ నెఱపి పొందితిమి స్వేచ్ఛ,
ఆ కబంధుండు శాపావసానము నొంది
భవ్యమౌ పూర్వ రూపంబు గాంచి
చెప్పెను "మీకు శ్రీ సీతా మహాదేవి
వృత్తాంత మెఱుగంగ ఋష్యమూక

ఆ॥ గిరికిఁ జనుడు మీకుఁ ధరణి కుమారుండు
సాయపడు నటంచు, నాయనఁ గన
నరుగు చున్న వారమా సూర్య తనుజుని
నెలవ దేదొ మాకు తెలుపు మనఘ. 25

క॥ అని సౌమిత్రి వచింపఁ బ
వన పుత్రుఁడు ప్రీతిఁ బొంది వైళమ వారిన్
గొని చనె నిన సుతు చెంతకు
నెనరున సఖ్యం బొనర్ప నిర్వుర కెలమిన్. 26

వ॥ దశరథాత్మజుల వృత్తాంతంబును సుగ్రీవుండు పావని వలన విని
తా నిట్లనియె. 28

క॥ ఒక నాడు వింటి మనసును
వికలము గావించు నేడ్పు వినువీథిని దా
ని కలతెఱఁ గరయ మొగముం
బ్రకటంబుగఁ బైకి నెత్తఁ బడె భూషణముల్. 29

క॥ కనుఁడీ కాంచన భూషల
నని యర్కసుతుండు దెచ్చి యవనిజ నగలన్
మనుజపతికిఁ జూపింపఁగ
కనుల జలము జాలు వారఁ గాంచె నతండున్. 30

ద్వి॥ పరికించు మనుజ నీ వదిన భూషలను
కన లేక యున్నాను కన్నీరు కలచ
అని చెప్ప శ్రీరాము డనుజుని తోడ
పలికెను సౌమిత్రి కలగుండు వడచు. 31

క॥ గుఱుతింపన్ లేనన్నా!
అరుదౌ నవరత్న లసిత హారావళులన్;
గుఱుతింతు నూపురంబుల,
నిరతము మా తల్లి పాద నీరజ సేవన్. 32

కII జలజాక్షుని కన్గొనలన్
జలజల కన్నీరు జాఱి సోను నయముగా,
జలజాప్తుని తను జాతుఁడు
పలికెను, దురపిల్లఁ దగునె? పార్థివ, యిటులన్. 33

కII దాయల మూలమున మనకు
జాయల యెడఁబాటు గలిగె శౌర్యస్ఫూర్తిన్
దాయలఁ బరిమార్చి యనిన్
జాయల చెఱఁ బాప వలయు సరగున స్వామీ! 34

కII అన విని రాముఁడు పలికెను
దినమణి సుత, నన్నుఁ బోలెఁ దీఱని దుఃఖా
బ్ధిని మునిఁగియు నోదార్చితి
వి నీదు చరితంబుఁ జెప్పు వినఁగా వలతున్. 35

వII సుగ్రీవుం డగ్రజునితోఁ దనకుఁ గలిగిన వైర కారణంబు వారి
కెఱింగించె. 36

## వాలి సుగ్రీవుల వృత్తాంతము

ఉII వాలి మదగ్రజుండు, మఘవత్ప్రియ పుత్రుఁడు, తీవ్రకోపి, దం
భోళి కఠోర దేహుఁడు ప్రభూత పరాక్రమ దుర్నిరీక్ష తే
జోలసితుండు పంచశర చోదిత దుర్మదవృత్తి నందుఁడై
యాలరియై యొనర్చెను మహాఘములన్ వినుమా వచించెదన్.

తేII ఘనుఁడు మాతండ్రి మరణింప మనుజ వర్య,
అగ్రజుఁడు వాలి కిష్కింధ కధిపుఁడయ్యె,
కొలుచు చుంటి నే తత్ప్రభుఁ గూర్మి మెఱయ
నాతఁడును బ్రీతి నన్ను సమాదరించె. 38

ఆ॥ అంత నొక్కనాఁటి యర్ధరాత్రంబందు
రాక్షసుం డొకండు రభస వృత్తి
నగరి మ్రోల నిలిచి తగవాడ వాలినిఁ
బేరు వెట్టి పిలచి పేలఁ దొడఁగె. 39

క॥ వాఁడతి బలుండు దుందుభి
యీడెవ్వరు లేని సత్త్వ మెసఁగ వరమునన్,
వేఁడుకఁ దిరుగుచు భువిఁ
బోరాడఁగ వెదకం దొడంగె నరిది బిరుదులన్. 40

ఉ॥ దుందుభి యుగ్రశక్తి మెయి దుర్మద వృత్తిని ముజ్జగంబులన్
జిందులు ద్రొక్కుచున్ బ్రజలఁ జిక్కులు వెట్టుచు; వార్ధి తీరమున్
బొంది సముద్రునిన్ బిలిచెఁ బోరికి, ఏంటివె యిట్టివాని నీ
వెందయినన్? మదానఁ ఖొగరెక్కిన వారు చరింతురీ క్రియన్. 41

చ॥ చెలియలి కట్టపై నిలిచి చిందము నొత్తి భయంకరార్భటిన్
జెలఁగుచు బాహులం దొడలఁ జేతుల స్ఫాలనమున్ బొనర్పఁగా
గలఁగెను ముజ్జగంబులు గకావికలై పడెఁ బక్షి జాలముల్
మలఁగి కలంగి సాగరుఁడు మ్రాన్పడి నుప్పుల గ్రక్కెఁ గ్రక్కునన్. 42

ఉ॥ చిట్టఁడు రక్కసుండు కడు దీమస మొప్పఁగ నిల్చి, యూర్పులన్
గట్టిగఁ దీసి పోవిడువ కంధి తరంగయు లూగె వెన్కకున్
బిట్టుగ నార్చి పోరునకుఁ బిల్వఁగ నీరధిలోని జంతువుల్
గుట్టుఁ జెడంగఁ బైటఁ బడి గుండెలు వ్రీలి గతించె నంతటన్.

క॥ చెలరేఁగి పిలుచు రక్కసుఁ
జలపాదిన్ గాంచి జలధి సంభ్రమమున "నే
బలియుండ గానుఁ బోరన్
వలిమల తగు" నన నతండు వార్ధిని వదలెన్. 44

క॥ నవ్వుచు నా దనుజేంద్రుఁడు
రివ్వున వలిమలను జేరి రేఁగుచు; మంచున్
గ్రొవ్వునఁ గొమ్ములఁ జిమ్ముచుఁ
జివ్వకు హిమగిరినిఁ జేరెఁ జేవ దలిర్పన్. 45

క॥ కొమ్ముల గోరాడుచు, తౌ
ద్రమ్మునఁ బోరునకుఁ బిల్చు రక్కసుఁ గని యా
ముమ్మొనవాల్ దొర మామకు
బమ్మెర కనులందుఁ బర్వె భయ విభ్రాంతిన్. 46

క॥ 'నీ లావున కే నోపను;
శూలికి దీటయిన వాలి శూరాగ్రణితో
నాల మొనరింపఁ బొమ్మని
బాలిశునకు విన్నవించె వలిమల భీతిన్. 47

క॥ కరి తుండములకు నెనయగు
కర యుగ్మము నప్పళించి క్రవ్యాదుఁడు వే
ధర కంపింపగ వచ్చెను
పరువడిఁ గిష్కింధ కరిగె వాలినిఁ జెనకన్. 48

క॥ ఓరీ వానర రారా!
పోరాడఁగ నన్నెదిర్చి; పోటరి తనమున్
మాఱాడక చూపు మనుచుఁ
గాఱులు పలుకం దొడంగె గర్వం బొలయన్. 49

ఆ॥ సాగరుఁడు చలించె, స్తంభించె వలిమల
బిట్టు చెదరి నేను బిలువ ననికి;
వాలి! నిన్నుఁ గూర్చి పలువురు సెప్పిరి
తగిన జోదు వనుచుఁ దరలి రమ్ము. 50

కII వర గర్వితుడగు రక్కసి
తరుచరుఁడగు వాలి మెడను దనరెడిఁ *రత్నా
భరణపు మహిమ నెఱుంగక
దురమును బొనరింప బిలిచె, దురితము పండన్. 51

కII మగువల సాంగత్యంబున
నగచరపతి మధువుఁ ద్రావి నర్మిలి నుండన్
బగవాని బొబ్బరింతలు
నగభిత్సుతు చెవినిఁ జొచ్చె నడి రేయందున్. 52

కII మద ఘూర్ణిత నేత్రుండై
మదవతుల సమాజము విడి, మనుజాశను దు
ర్మదము నడగించి త్రుంపఁగఁ
గదనమునకు వాలి వచ్చెఁ గాలుని మాడ్కిన్. 53

ఆII వాలి యసురునిఁ దన వాలంబునం జుట్టి
ముష్టిహతుల బిటు మోది క్రుమ్మి
త్రిప్పి త్రిప్పి కొట్టెఁ ద్రెళ్ళంగ ధాత్రిపైఁ
గాలిగోటఁ జిమ్మె ఘన శవంబు. 54

కII ఆకాశమునం దెగుచుచు
రాకాసి వపుస్సు గురిసె రక్తపు వానన్;
భీకర దేహం బది పడె
ప్రేకనయై ఋష్యమూక పృథ్వీధ్రము పైన్. 55

---

* వాలికి మహేంద్రుఁడొక రత్నాభరణ మొసఁగెను. అతడు దాని నెప్పుడూ ధరించును. ఆ రత్నాభరణపు మహిమ వలన వాని నెదిరి పోరాడు వైరి శక్తిలో సగము వాలినిఁ జేఱును. కనుక వాలి నెదిరి పోరిలోఁ జయించుట యసాధ్యము.

కII బోరనఁ బడినట్టి యసృ
గ్ధారల జడి దడిపెను జడదారుల నట వా
రోరిమిఁ దూలి శపించిరి
చేరిన నిట వాలి చచ్చుఁ జెచ్చెర ననుచున్. 56

కII శాపపు టాదరువున నే
నీ పర్వత శృంగ మందు నిరవుగ నెటులో
కాపురము సేయు చున్నా
నేపగిది జయింప నగునొ యింద్రజు ననిలోన్. 57

కII దుందుభి మరణంబును విని
దుందుడుకున వాని సుతుఁడు దోర్బల మొప్పన్
మంధరగిరి వలె వచ్చె న
మందగతిం బోరొనర్ప మఘ వాత్మజుతోన్. 58

కII వచ్చిన మాయావినిఁ గని
చిచ్చర పిడుగటుల రేఁగి చీల్చెద ననుచున్
బెచ్చు పెరుగు కోపంబున
వచ్చెను రాకసునిఁ జంప వాలి రయమునన్. 59

ఉII వాలి యుదగ్ర హుంకృత రవంబును, నిప్పులఁ గ్రక్కు కన్నులన్
వాలిన కన్క, యాతని యపార బలోజ్జ్వల శౌర్య సంపదు
ద్వేలతఁ గాంచి రకసుఁడు భీతిఁ గలంగుచుఁ గాసిఁ జెందుచుం
దూలి చలించి పర్విడుచుఁ దూరె నొకానొక గహ్వరంబునన్. 60

ఆII వాని వెనుక వాలి; వాలి వెనుక నేను
వెంట నంటి వరుస బిలముఁ జేర,
వాలి దనుజు నంటి వడిఁ బోవుచున్ గుహా
ముఖము నందు నిలిపి పోయె నన్ను. 61

క॥ ఏకాబ్దా నంతరమున
భీకర రవ మెడలె రక్త ఫేణిక పాఱన్
శోకించితి నేనప్పుడు
రాకాసి కరాన వాలి గ్రుమ్మంబె నటంచున్. 62

క॥ దనుజుఁడు రాకుండెడి లా
గునఁ బెను శిల వైచినాడ గుహకడ్డముగా
నెనరున నపరక్రియలన్
వనరుచుఁ జేసితిని, గీశ పతి నైతి నొగిన్. 63

ఆ॥ కొలువు కూట మందుఁ గూర్చుండి నేనుండ
నొక్క నాడు వాలి యుగ్రమూర్తి
మబ్బు లేని పిడుగు మాడ్కినిఁ జనుదెంచ
విస్మయమునఁ గాంచి వెఱగు పడితి. 64

వ॥ రక్తారుణ నేత్రుండయి చుర చుర నన్నుంజూచి యిట్లనియె. 65

ఉ॥ ఓ యవినీతివర్తన! దురూహల నూని గుహాముఖంబునన్
ద్రోయఁగ రాని పెన్శిలను దుష్టుడవై బిగగొట్టి నావె; నా
దాయవు గాక నీ వకట తమ్ముఁడ వౌదువె? వ్రేయి వ్రక్కలన్
జేయుదు నీ శిరంబు; ధరణీస్థలి జ్ఞాతులు వధ్యు లారయన్. 66

తే॥ క్రోధ తామ్రాక్షుఁడయి చూచి క్రోల్పులి వలెఁ
బైకి లంఘించి నా మెడఁ బట్టి తిగిచి
ధర పయిన్ ద్రోసె నటు సేయఁ దగదటంచు
సభికు లెందఱు చెప్పిన సరకుఁ గొనక. 67

వ॥ నయనంబుల నుండి కవోష్ణ బాష్పంబులు జాలు వార నానత
ముఖుండనయి నేను మా యన్నతో నిట్లంటిని. 68

ఉ॥ చిన్న తనంబు నుండి నను జెంతకుఁ జేరిచి పెంచి నట్టి నా
యన్నవు నీవు నన్నెఱుగవా? దనుజుండు నినుఁ వధించి నా
డన్న భ్రమఁ వహించి యతడా గుహ వెల్వడకుండ పెద్ద బం
డన్నిల బెట్టి వచ్చితిని నఁ క్షమింపుము తప్పు నేసినఁ. 69

క॥ పలు తెఱుగుల నిటు వేఁడితి
గల తెఱఁగును జెప్పి, వాలి కఠినుండై
నిలు వెడల నడచియును నా
యలివేణినిఁ దాను గొనియె నవినీతుండై. 70

క॥ పలు మాఱు నను వధింపఁగ
బలయుత వానరుల వాలి పంపఁగ నే నా
తులువలఁ బొలి పుచ్చితి, నిటఁ
గలవరమున నున్నవాఁడ గావుము రామా! 71

ఉ॥ ఎచ్చట నున్న నే వెదకి యిందు నిభాస్యను జానకీ సతిన్
జెచ్చెరఁ దెచ్చి సాయమును జేయుదు నమ్ముము, చింత మాని నా
యిచ్చను మున్నుఁ దీర్పుము, మహేంద్రుని పుత్రు ననిన్
వధింపుమీ
గ్రచ్చర రాజ్య సంపదలఁ గ్రమ్మరఁ బొందెదు నట్లు సేయుమీ!

వ॥ నా విని శ్రీరాముండు. 73

క॥ వగపుడుగుము సుగ్రీవా!
పగతుని బవరమునఁ గూల్చి పాటవమున నే
దగ వౌనఁ గూర్చెద; నిన్నీ
నగచర రాజ్యంబునకు నొనర్తును బతిగాన్. 74

వ॥ అని నమ్మఁ బలికి. 75

ఆ॥ బొటన వ్రేల మీటెఁ బోలదిండు దుందుభి
కొండ వంటి తనువు; గోల గూల్చె
సప్త తాళములను; చాటె శ్రీరాముండు
తన బలమ్ము వాలి దర్ప మణప. 76

క॥ తరణిజ వాలినిఁ బిలువుము
దురమునకున్; నేను నిలిచి దోహల వృత్తిన్
బరిపంథి బలము బెగడగ
నరుదగు విజయంబు నీకు ననిలో గూర్తున్. 77

వ॥ సుగ్రీవుండు కిష్కింధాపుర ద్వారంబున నిల్చి వాలి నుద్దేశించి
యిట్లనియె. 78

క॥ ఎక్కటి కయ్య మొనర్పన్
గ్రక్కునఁ బురి వెడలి రమ్ము కౌలుని నగరం
బక్కజముగఁ జూపింతును
జక్కఁగ నా యెదుట నిలువు సమర మొనర్పన్. 79

క॥ దినమణి సుతు పలుకులు విని
కనలుచు మఘవాత్మజుండు కయ్య మొనర్పన్
దన నగరు వీడి రయమునఁ
జనుదెంచి హసించుచు వనె శౌర్యస్ఫూర్తిన్. 80

ఉ॥ వోటు మగండవే? యిది పోరొనరింపఁగ వచ్చినాడవే?
చాటున నిన్ని నాళ్ళు కొనసాగెనె నీదు పరిశ్రమం బిసీ
పోటున కీవు తాళుదువె? పోటరి యెవ్వఁడు తోఁడు వచ్చెరా!
దీటుగ నిల్వరా, త్రుటినిఁ ద్రెంచెదఁ దావక జీవతంతువుల్. 81

కII ఎన్నాళ్ళకు నాకోరిక
నన్నువ చందానఁ దీర్ప నరుదెంచితివా
నిన్నిఁక విడువను నిను నీ
* యన్నను గనఁ బంపువాఁడ నతి వేగముగాన్. 82

వII వాలి నిందాగర్భితంబులగు వాక్యంబుల సుగ్రీవుని డెందంబును
తూటాడినంత వారిరువురును. 83

కII పెల్లుబికెడు క్రోధము సం
ధిల్లన్ గండరము లుబుకఁ దెగువన్ మగలై
గల్లోలం పడి పోరిరి
వెల్లువలై శోణితములు పృధివిం బాఱన్. 84

కII పట్టిరి ఱొంటొరు గట్టిగ
బిట్టుగఁ బ్రహరించు కొనిరి పిడికిళ్ళ వడిన్;
జుట్టిరి పెను వాలంబుల
దట్టంబుగ దేహములను దళన మొనర్పన్. 85

కII బాహా బాహి కచాకచి
దేహంబులు నుజ్జుఁగాఁగఁ దీవరమునఁ ఘో
రాహవ మొనర్చి రిర్వురు
అహా! యని చూచువార లచ్చెరు వందన్. 86

తేII వజ్రి పుత్రుని దృఢముష్టి పాతములకు
సవితృ పుత్రు విశాల వక్షంబు వ్రీలె
సుతుని దైన్యంబు గన లేక సూర్యు డడలి
యపర దిక్కాంత చాటున కరిగి డాఁగె. 87

---

* నీయన్న — యముడును సూర్యపుత్రుడే.

కII పోటునకు నిల్వఁజాలక
పోటు వడికి సూర్య సుతుఁడు బొగులుచుఁ బారెన్
నోటను నుర్వులు గ్రక్కుచు
బోటరి రఘురాము పాదములఁ బొదవి కొనెన్. 88

వII శ్రీరాముని పాదముల మీఁద వ్రాలి దైన్యంబున గళంబు రాపడ
సుగ్రీవుం డిట్లనియె. 89

ఉII నమ్మిన నన్ను నీవిటు లనాదర దృష్టులఁ జూచి, వాలి క
గ్గమ్మొనరించి యిచ్చటనె కాలు కదల్పక యుంటఁ జూడు నా
యెమ్ములు నున్నమాయె, ప్లవగేశ్వరు నిష్ఠుర ముష్టి ఘాతలన్;
వమ్మయి పోయె నా బ్రదుకు వాలినిఁ జంపమిఁ జేసి రాఘవా!

వII శ్రీరామమూర్తి సుగ్రీవు నోదార్చి యిట్లనియె. 91

కII ఒకటియె రూపము మీయది
ప్రకటముగా వాలిమీఁద బాణము వేయన్
సుకరంబు గాక వాలిని
నికారణ మొనర్ప లేక నిలిపితి నమ్మెన్. 92

కII అఱుత నొక పూలమాలను
గుఱుతుగ నుంచెదను నీవు గొంకక వాలిన్
మఱలం బిలువుము పోరికి
నుఱుమాడుదు నముచిసూదను సుతుం గోలన్. 93

ఉII భాను సుతుండు రాఘవుని పల్కుల కూరట నంది వాలిచే
నైన కఠోర ముష్టి హతు లన్నియు విస్మృతి నొంద లక్ష్మణుం
డేవిక పూలదండ మెడ నేర్పడ వైచి, భుజంబు దట్టఁగా
నానిక నంది మానసము నందు దురం బొనరింపఁగాఁ జనెన్. 94

వ॥ మరుసటి దినంబున.

క॥ దుర మొనరింపఁగ రమ్మని
పరుసంబునఁ బిలుచునట్టి భాను కుమారున్
బోరి పుచ్చ వాలి వచ్చెను
పరువిడి చెవి నిడక తార పలుకుల నలతిన్. 96

గీ॥ అన్నదమ్ములు రోసాన నని యొనర్చ
నవసరంబున నొక భూరుహంబు మాటు
నిలిచి శ్రీరామ చంద్రుండు నేరుపు మెయి
బాణ మొక్కటి విడిచెను వాలి యెదను. 97

ఉ॥ వక్షము నందు రాఘవుని వాడి శరంబు జొరంగ తీవ్రతన్
పక్ష యుగంబు చెండఁబడి వ్రాలిన శైలము భంగి భూమిపై
వృక్ష చరాధి నాయకుఁడు విహ్వలుఁడై పడి తెప్పరిల్లి, తా
రూక్షణ దృక్కులన్ రఘువరుం గనె నాశ్రితలోక వత్సలున్. 98

క॥ కినుక కనులన్ గడల్కొన
ఘన వేదన మునిఁగి రామ కార్ముక నిర్ము
క్త నిశిత శరంబు కతమునఁ
దనకీ స్థితి వచ్చె నెఱిఁగి తరుచరుఁ డనియెన్. 99

గీ॥ ఏమి వైరము నా తోడ రామ, నీవు
చెట్టు చాటున నిలుచుండి గుట్టు చెడక
విల్లు నెక్కిడి బాణంబు వేడుక మెయి
నా యెదను నాటి నాఁడ వనాదరమున. 100

ఉ॥ పుట్టితి వీవు హేళి పరిపూత కులంబునఁ; దండ్రియానతిన్
గట్టితి వీవు వల్కలము గర్మ ఫలంబును దాట లేమి, చే
పట్టితి వీవు క్షత్రియుల పాడిని నిల్పఁగ వింటి; నట్టి నీ
వెట్టులఁ జంపఁ బూనితివి వృక్ష చరున్ నను మోసగాఁడవై. 101

ఉ॥ కోరిన నాదు సాయమును, కోమలి జాడను లిప్త లోపలన్
నేరిచి నీదు ముందసుర నేతను నిల్పనె! జేలవై కటా!
భీరునిఁ జేరి చంపితివి వీరునిఁ జాటున నిల్చియుండి, యే
వైరము లేక, యిట్టి యెడ పాప ఫలంబును బొందకుందువే? 102

క॥ అని పలుతెఱగుల దూఱుచు
వనచర విభుఁ డార్తినంది వ్రాలెన్ ధరపై;
దినమణి కులభూషణుఁ డా
ఘనునిం గని పలికెఁ గరుణ గడలు కొనంగన్. 103

క॥ తమ్మునిఁ బుత్ర సమానుని
ఇమ్మునఁ బోఁద్రోలి వాని యిల్లాలిని గా
మమ్మునఁ గలియం దగునా?
ఎమ్మెయి యిది న్యాయమౌనొ యింద్రజ, చెపుమా! 104

క॥ తనతోఁ బుట్టిన దానిని
తన తమ్ముని సతిని మరియు తనదు కుమారిన్
మనసిజ కేళుల దేల్చిన
మనుజునకున్ శిక్ష స్మృతిని మరణము వాలీ. 105

క॥ తప్పొన్న యపుడు సోదరుఁ
దప్పక దండింపఁ దగును; దార హరణమే
యొప్పనుట నీతియే, నీ
విప్పగిదిఁ జరింపఁ దగునె యింద్ర తనూజా. 106

క॥ పరకాంతను జెఱపట్టిన
నరభోజను శిక్షసేయు నలవియె నీకున్
బర దార చోరునకు? నా
కరయన్ నీ సాయ మెట్టు లర్థింప నగున్. 107

ఆ॥ పడసి యుండ వచ్చు వాలి, నీ సాయాన
శ్రమము లేక నాదు ప్రాణసఖిని
కాని - యాచకుండఁ గాను నిన్నర్థింప;
నీతి హీను చెలిమి నేను గోర. 108

ఉ॥ ఏను నరుండ స్నేహితున కేర్పడ సాయము సేయ నెంచి త
న్మానిని బట్టి వాని కవమానము నేసిన నిన్నుఁ ద్రుంచితిన్
మానిత జిష్ణు దత్త మణిమండన భూషిత వక్షుఁ, బోరిలోఁ
బూని జయింప రాని వరముంగల నిన్ను వనాట శేఖరా! 109

క॥ నా సాయమునన్ రాజ్యం
బీ సూర్యుని సుతుడు పొందె, నిఁక నాకర్జం
బే సరణినేనిఁ బొందుదు
బాసటగా నితఁడు; కార్య ఫల మిట్టిదియే! 110

గీ॥ ఇట్లు బలికిన రాము నహీన తేజ
మును గనుంగొని హరిసూతి మోడ్పుఁ గేల
సన్నుతించెను రఘుకుల సార్వభౌము
నెలమి ధరఁగాచు వేలుపం చెఱిఁగి యోఁజిగి. 111

ఉ॥ రాజకులైకదీప! రఘురామ ధరాధిప! దుర్నిరీక్ష్యతే
జా! జితవైరి హేమ ముకుటాంచల రత్నవిభాసితాంఘ్రి ప
ద్మా! జలజాప్త వంశతిలకా! నను మూర్ఖు క్షమింప వేడెదన్
భ్రాజిత దివ్యమూర్తి, నిను వైష్ణవ తేజునిఁ దూలనాడితిన్. 112

క॥ అని పలువిధముల హరిజుఁడు
కనుఁ గొనలన్ నీరు జాఱఁ గర మను రక్తిన్
వినుతించి తన కుమారునిఁ
దనుజాదికి నప్పగించి తనువు దొఱంగెన్. 113

వ॥ రామభద్రుండు సుగ్రీవుని ప్లవంగ రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ గావించె. అంగదునకు యువరాజ్యాభిషేకంబుఁ జేయించె. నట్టి యెడ వర్షాకాలంబు ప్రాప్తించె. 114

ఉ॥ కాలము తూలికం గొని వికాస వినీల పటంబు నందుఁ దాన్
మేలయి నట్టి చిత్రముల నేర్పునఁ దీరిచి దిద్దెనో యనన్
పాలనురుంగు వెల్గు పరిపాండు వలాహక ఖండ జాలముల్
నీల నభంబునన్ వెలసె నేత్ర మహోత్సవమున్ బొనర్చుచున్.

క॥ సల్లలిత సాగరముపై
నల్లన బొలుపారి నట్టి యలలో యనఁగా
నుల్లసిలెఁ గంటి కింపగు
వెల్లని జీమూత వితతి విను వీధులలో. 116

క॥ తెల్లని మబ్బుల తునకలు
అల్లనఁ బరుగిడుచు నిర్మలాకాశమునన్
నల్లఁగ మాఱెను ఘనమై
పెల్లు తమిస్రమ్ము గ్రమ్మ విశ్వం బెల్లన్. 117

ఆ॥ కాలసూత్రధారి గగన రంగస్థలి
రంగు రంగు తెరలు లాగి నటుల
వెల్ల మబ్బు వెంట నల్లమబ్బులు పర్వె
వ్రాలె నింద్రధనువు వాని మీఁద. 118

క॥ చిటిపొటి తొలి చినుకులు వడి
పటపట మని వెంట వంటు వానల వడిచేఁ
దటపట లాడుచు నడచిరి
పుటపుట నెన్నడుము లాడఁ బూవుం బోఁడుల్. 119

కII పెళపెళ యుఱుములు మ్రోయఁగఁ
దళతళ మెఱుములు మెఱయఁగ ధరణీ జనముల్
కళపళ పడుచు భయంపడి
ప్రళయంబని దాఁగి కొనఁగ వానలు గురిసెన్. 120

ఉII ఘోర విరూప రాక్షసులు గ్రొవ్వి మదంబున భీకరార్భటిన్
జేరి దివిన్ సురేంద్రునకుఁ జిక్కి, భరించుచు వాని విల్లు త
ద్భారము మోయ లేక శ్రమ వారి కణంబులు జార్చి నట్లుగా
వారిద గర్భముల్ వెడలి వచ్చిన వానలు తోచె నంతటన్. 121

ఉII భూరి కబంధ ధారల నపూర్వపు వారధి గట్టె మబ్బు; శృ
ఖార మెలర్పగా మెఱపు కన్నియ మించుల దివ్వెలుంచె; నౌ
రౌర దివిన్ భువిన్ గలిపె నన్నటు; మానవలోక జీవనా
ధారము లైన వర్ష జలధారలు తోరము లయ్యె నెల్లెడన్. 122

కII కుండల పోతగ వానలు
మెండై కురియంగ నదులు మేరలు మీఱన్
నిండుకొని పాఱ నబ్ధి
చండములకుఁ జిల్లు లైన చందం బెనయున్. 123

కII జడిలో నిసర్గ సుందరి
పుడమి తడిసి పూవు కనులఁ బొటబొట కన్నీ
రెడలంగఁ గానుపించెను
గడు నేడ్చెడి రీతిఁ బట్టి కష్టపు దశకున్. 124

కII కడు వడి జడి గురియన్ రా
ముఁ డలరు విలుకాని బాణముల కగ్గంబై
కుడువక, కన్నులు మూయక
పుడమి కుమారిని దలంచి పొగిలెను మిగులన్. 125

క॥ ఎలఁ బ్రాయం బాదిగఁ ద
న్నలరించిన కూర్మి చెలియ యసురుని యింటన్
గలఁగుచు నెటులున్నదొ? యని
పలవించెను రఘువరుండు బాలుని మాడ్కిన్. 126

చ॥ కలకల నవ్వుచున్ విరియు కంజ దళమ్ములఁ గ్రమ్ము గండు తేం
ట్లను, గిరీంద్ర శృంగముల నొక్కెడు నట్టులఁ గప్పు వారిదం
బులను రఘూద్వహుండు గని బ్రుక్కెడి రాక్షసు లంచు నీసుచేఁ
గలఁగుచు వాడి తూపులను కార్ముక మందు నిగుడ్చు భ్రాంతిమై

ఆ॥ ముసురు కారు నందు ముసిరిన చింతతో
భూమి సుతను దలఁచి పొగిలి పొగిలి
రామచంద్రమూర్తి రవి గాను పింపఁగాఁ
గన్ను లెఱ్ఱఁ జేసెఁ గపినిఁ దలఁచి. 128

క॥ వానలు ముగిసిన యంతన్
వానరులను సీత నరయఁ బంపెద నను ప
ల్కానాడు వల్కెఁ గపి పతి
ఈనాడిఁక వాని నెమక నేగన్ వలయున్. 129

మ॥ అనుజా లక్ష్మణ! ధూర్తుఁడా వనచరుం డాహ్లాద వారాన్నిధిన్
మునకల్ వేయుచు విస్మరించె నకటా! భూపుత్రి యన్వేషణా
జని వేగంబ తదీయ వానమునకున్ జక్కం బ్రబోధించి వా
నివిఁ దెమ్మ్చుటకుం గృతఘ్నుని స్మరాంధీభూత చేతస్కునిన్.

వ॥ అతనితో నాపలుకులుగా చెప్పుము. 131

క॥ వాలి చనినట్టి మార్గము
బాలిశుడా! మూయలేదు; పలికిన పలుకుల్
నా లావు విస్మరించినఁ
దొలగలను నిన్ను వాలి త్రోవకు మూర్ఖా. 132

కః అన్న వచనంబుల్ విని
క్రన్నన సౌమిత్రి యరిగెఁ గడుఁ గ్రోధమునం
గన్నుల నిప్పులు రాలఁగ
నన్నగచరపాల మందిరాభిముఖుండై. 133

చః పురమును జొచ్చి లక్ష్మణుడు పోవుచు నుండఁగ రాజవీధి; జి
చ్చర పిడుగట్టు; లా యనఘు నంగదుఁ డారసి చెప్పఁగాఁ గపీ
శ్వరునకు; నంతలోఁ జెవులు బ్రద్ద లౌనర్చెడి జ్యారవంబు ని
ష్ఠురముగ విన్పడన్ దరణిజుండనెఁ; దారను గాంచి భీతితోన్.

కః మచ్చరమున లక్ష్మణుఁడదె
వచ్చుచు నున్నాడు వాని భయమున మేనన్
ముచ్చెమటలు గ్రమ్మె సఖీ!
సచ్చరితుని శాంత పఱుపఁ జనుము లతాంగీ. 135

గీః మధు విలోలిత లోచన మధురవాణి
మదన కేళీ కళాలోల మందగమన
మణి లసత్ కాంచి తత నితంబమున వ్రేల
రత్న రంజిత తార హారములు మెఱయఁ
జీర సరిగంచు పదములన్ జిందులాడఁ
గాలి మంజీరములు ఘల్లు ఘల్లు మనగఁ
గైపుచే సిగ్గు వీడిన కపిలతాంగి
తార యరుదెంచె లక్ష్మణున్ దారసిల్ల. 136

కః అండజయానను దారను
దండను గనె లక్ష్మణుం డుదాత్తుఁడు "మీకున్
దండంబు దేవరా" యని
కొండాడెను దార యతని కోపము దీర్పన్. 137

కII దాసులము మేము మాపై
నీసేటికిఁ? గీశులం గపీశుఁడు గూర్చెన్
భూసుతను వెదకు కొఱకై;
బాసన్ నెరవేర్పఁ గలఁడు భానుజుఁడెలమిన్. 138

కII మెత్తని మాటల లక్ష్మణు
నుత్తల పాటడఁగఁ జేసె సువిద; తరణిజుం
డత్తఱి గీమును వెల్వడి
తత్తఱమున రాజసుతు పదంబుల నంటెన్. 139

కII వానినిఁ గని లక్ష్మణుఁడనె
వానర పతి! నా పదముల వ్రాలితి వేలా
దీనుని కైవడి? లే - నీ
మాన ప్రాణ ప్రదాత మన్నింప వలెన్. 140

కII అన్న నినుఁ దోడి తెమ్మనెఁ
గ్రన్నన నినుఁ గూడి నట్టి కపి బలములఁ జే
సన్నను బిల్చి కపీంద్రుడు
సన్నుత గుణుఁడైన రాము సన్నిధి కరిగెన్. 141

కII మిన్నంట ధూళి రేఁపుచుఁ
గన్గొనఁగ రాని పాడవుఁగల కపి బలముల్
వెన్నంటి రాగ రవిజుం
డన్నరపతిఁ జేర వరిగి యంజలి వట్టెన్. 142

కII శ్రీరాముడు తన చెంతకుఁ
బారావా రోపమాన వానర సేనా
వారము రా శాంతుండై
యా రవిజునిఁ బిలిచి పలికె నతి మోదమునన్. 143

ఉ॥ పాంపితి వోవ్వ వేగమునఁ బోయెడి కీశుల సత్వరంబ పం
పింపుము సూర్యపుత్ర! యతి విస్తృతమైన ధరిత్రి నెల్ల గా
లింపను సీతకై యన, వలీముఖ సైన్య విభాగ కార్యమున్
గుంపుల నాయకత్వమును గొబ్బున సూర్యసుతుండు దేల్చినన్.

వ॥ వినతుండు ప్రాగ్దిశకు, అంగదుండు దక్షిణ దిక్కునకు, సుషే
ణుండు పడమటి దెసకు శతబలి యుత్తరంబునకుఁ జని తమ
బృందముల సాయముతో సీతాన్వేషణముఁ గావింప వలసి నట్లు
నిశ్చయింపఁ బడియె. 145

క॥ మాసము లోపల సీతా
వాసంబు నెఱింగి రండు వైళము యనుచున్
శాసించెను గపి సేనను
భాసుర తేజస్వి ప్లవగ పార్థివుఁ డెలమిన్. 146

క॥ దక్షిణ దిక్కున కేగెడి
యక్షీణ బలాఢ్యుఁడైన యనిలజుచేఁ బ
ద్మాక్షుఁ డభిజ్ఞానముగా
నాక్షితిసుత కుంగరంబు నంపెను బ్రీతిన్. 147

క॥ నెల గడవక మున్నే శత
బలి వినత సుషేణు లనెడి వానరులు విలా
తుల వెదుకఁ జనిన వారు మ
రలి వచ్చిరి సీత నెట నరయఁ జాలమిచేన్. 148

గీ॥ ధరణి పుత్రిని వెదకుచు దక్షిణ దిశ
నంగదాదులు చేరిరి యంబునిధిని:
దారి తెలియక నిస్పృహం దలఁగు వారి
యార్తి విని వచ్చె సంపాతి యనెడి పక్షి. 149

ఆ॥ ప్లవగులార! మీరు ప్రాయోపవేశంబుఁ
జేయుఁ గారణంబుఁ జెప్పుడయ్య!
సాయ పడుదు నేను, సంపాతి నాముఁడ
నరసి వచ్చినాడ నఖిల జగతి. 150

క॥ అని పలికిన పక్షీంద్రున
కనిలజుఁ డెఱిఁగించె జనక జాపహరణ గా
థను విశదంబుగ, విని
ద్విజము నెవ్వగఁ బొగిలె జటాయువు మరణమునకున్. 151

గీ॥ అంత సంపాతి యెఱిఁగించె హనుమదాది
వానరులకు, సీతాదేవి వనధి నడుమ
రావణుని పాలితంబగు లంక యందు
నవని శయ్యగ పడి యున్నదని వగపున. 152

క॥ పారావార గభీరా!
క్రూరాసుర జీవ హరణ కోవిద శస్త్రా!
మారజిత శుభాకారా!
శ్రీరాజిత విపుల వక్ష శ్రీ రఘువీరా! 153

ఓం తత్సత్

క॥ వర కిష్కింధా కాండము
విరచించెను, దుగ్గిశెట్టి వేంకట రమణ
య్య, రసజ్ఞులు తల లూపఁగ
హరి భక్తులు సంతసింప నార్యులు మెచ్చన్.

క॥ రామా, సద్గుణధామా,
శ్యామాంబుద రుచిర దేహ సౌష్ఠవ కామా,
కామారి వినుతనామా,
ప్రామినుకుల దివ్యసీమ, రాజలలామా! 1

మ॥ వదనంబుల్ గడు వాల్చి, దీర్ఘ మగు నిశ్వాసంబులన్ దీయుచున్
గదలంబాఱి వడంకు డెందములతోఁ గర్తవ్యతా మూఢులై
రొదచే రోదసి నాక్రమించెడి సముద్రుం గాంచి మేమిప్డు డీ
యుదధిన్ దాఁటుట కేది మార్గమని యత్యుద్విగ్నులై వానరుల్.
వ॥ చేయందగు కార్యం బేమని జాంబవంతుం గని. 3

క॥ తమలో వృద్ధుని ధీయుతు
నమల చరిత్రుఁ గపివరుల యతులిత శక్తుల్
గ్రమమున నెఱిఁగిన వానిని
దమితో సర్థింప నతఁడు దగ నిట్లనియెన్. 4

క॥ కడలిం గడవఁగ మనలోఁ
గడు శక్తి సమన్వితుండు కరువలి సుతుఁడే
వడిఁ దిరిగి రాఁగ నతఁడే
కడిది మగం, డన్యు లెట్లు గడతురు వనధిన్. 5

క॥ లెమ్మా, పవన తనూజా,
యిమ్మాడ్కిం జింత గుంద నింపిత మగునా?
పొమ్మా దానవ నగరికి
నిమ్మా రాఘవుని కాన్క పృథివీ సుతకున్. 6

క॥ గురుబల యుతుఁడవు నీవల
కరువలి కెనయగుదు వేల కలఁత పడంగన్?
సరగున సంభ్రమ్ముఁ గడచి
మరుత్తనయ పొమ్ము, లెమ్ము మహిసుత నరయన్. 7

వ॥ అని జాంబవంతుండు మారుతి నుద్బోధింప. 8

క॥ తన శక్తి తా నెఱుంగక
వనరెడి వాయుజుఁడు స్వీయబల మెఱుఁగుటచే
వననిధిని దాఁట దేహము
ఘనముగ నాతండు పెంచె గంభీర గతిన్. 9

శా॥ అంభోధ్యుత్తరణార్థమై పెనుప దేహంబున్ మహేంద్రాద్రిఁ బా,
దంబుల్ నిల్పి ప్రభంజ నాత్మజుఁడు మూర్ధం బూర్ధ్వ దిగ్యాన సం
రంభ ప్రక్రియ పైకి పోవ నుదయార్క ద్యోతులన్ జిమ్ముచున్,
సంభావించిరి నూత్న సూర్యుఁడని యాశ్చర్యంబుతో ఖేచరుల్.

క॥ కుంచించి జానువులఁ దా
నంచితగతి నూగి రేగి యాకాశమునన్
సంచిత బల సంపత్సము
దంచితుఁడై సాగె వనచరాగ్రణి త్రుటిలోన్. 11

క॥ వడి నెగురు వాయుసుతు నుర
వడి కెదురెక్కంగ లేక వార్నిధిలోనన్
గడుకొని పరుగిడు తరగలు
పిడికిలి వలె నిలిచెఁ జెదరి ఫేనము లురులన్. 12

క॥ పావని వేగాకృష్టత
నావననిధి ఫేన మెగుర నంబర వీధిన్
బోవుచు నుండిన మిత్రుని
కై విసిరిన కడలి చేయి యనఁగా నొప్పెన్. 13

క॥ గిరి నున్న చెట్టు చేమలు
కరువలి సుతు గమన వేగ కర్షణ యుతలై
యొరఁగిన, సంభ్రమం బందున్
వరలెను దీరమున మిత్రు వదలెడు భంగిన్. 14

వ॥ పావని పై కెగిరి నపుడు. 15

క॥ ఎగసిన పూవులు కడలిన్
బిగువు సడలి పడుచు నుండ పెల్లున వఱలెన్
దగ దివిజులు పూవానలు
నగచరుపై గురిసి నటు లనంత ప్రీతిన్. 16

ఉ॥ వాయుసుతోర్ధ్వ దిగ్గమన వారిత సాగర వీచికా వళుల్
తోయము మీఁదనే నిలిచె త్రుళ్లక పైకెగ ప్రాకి నుర్వ్యతో,
నాయెడఁ గాన వచ్చెను సహస్ర ఫణమ్ముల సర్ప రాజముల్
వేయియొ, లక్షయో పయికి లేచి నటించుచు నున్నవో యనన్.

క॥ వాయు తరంగంబులపై
వాయు తనూజుండు బర్వ వార్నిధి భక్తిన్
దోయిలి దాల్చి నటులఁ ద
త్తోయము రూపొందె గాలి త్రొక్కిడి కతనన్. 18

ఉ॥ ఆకసపుం బథమ్మున మహాత్ముఁడు మారుతి గాఢ దీక్షతో
నాకనివాసు లచ్చెరువులన్ దలలూచుచు మెచ్చుచుండ న
స్తోక బలంబునన్ జనఁగఁ దోయధి పావని సేవసల్ప మై
నాకుని హేమశృంగు నగనాధుని పుత్త్రుని లెమ్ము లెమ్మనెన్. 19

క॥ లెమ్మా, నగరాజసుతా
పొమ్మా పావనికి నెదురు మోదమెలర్పన్
గొమ్ముల నిలువం జేయుము
సమ్మతి నాతిథ్య మిమ్ము సామీరి కొగిన్. 20

వ॥ అంత మైనాకుండు. 21

కం॥ వననిధి పిలుపును విని తా
దినకరు తేజంబు నెనసి దివమున కెగసెన్
గనకపు శృంగంబులతో
నినకుల శశి దూత సేవ నెలమి నొనర్పన్. 22

ఆ॥ కడలి యలల నుండి కనకంపు శిఖరాలు
వెలికిఁ దోపఁ దనకు విందొనర్ప
నెదురు వచ్చు పర్వతేంద్రునిఁ గనుఁగొని
యనిల సుతుఁడు సంశయంబు నొంది. 23

ఉ॥ రాక్షస మాయగాఁ దలఁచి ప్రబ్బిన తేకువతో గిరీంద్రునిన్
వక్షము వెట్టి క్రుమ్మెఁ బ్రసభక్రియ శృంగము భంగమౌ నటుల్
దక్షుఁడు మారుతాత్మజుఁడు - తద్బల సంపద యెట్టిదో నగా
ధ్యక్ష తనూభవుం డెఱిగి హర్షము నొందెను మానసంబునన్. 24

వ॥ అప్పుడు మైనాకుం డిట్లనియె. 25

కం॥ మైనాకుం డను వాఁడను
నే నగపతి సుతుఁడఁ, దొల్లి నిర్జరపతి వ
జ్రానలము నుండి నన్నుం
భోనిధి నీ తండ్రి దాచి ప్రోచెన్ గరుణన్. 26

వ॥ అప్పటి నుండియు సురక్షితుండనై నేను సాగరంబునందు నివ
సించుచున్న వాఁడ, సమీరునకు సుతుండవగు నీకు సేవఁ జేయ
నవకాశము కల్పింపుము. 27

కం॥ శతయోజనమ్ము లేనియు
నతులితగతి దాటు దిట్టవయ్యు మహాత్మా!
మతిమంతుఁడగు సముద్రుని
కతిథివిగా నిల్చి సలుపు మానందంబున్. 28

వ॥ ఈ పలుకుల నాలించి. 29

క॥ మైనాకుని యాదరమును
వానరవీరుండు మెచ్చి పల్కె నిటుల, 'నేఁ
బూనితిఁ బ్రతినన్ రఘువరు
మానినిఁ గాంచకయె నిలువ మార్గమునందున్.' 30

వ॥ మహనీయంబగు మీ యాతిథ్యము నాకు ముట్టి నట్లే. నన్ను మన్నింపుఁడని పల్కి మైనాకుని కనక శృంగంబులు స్పృశించి పావని పురోగమించె. 31

క॥ సురస యను పన్నగాంగన
సుర చోదిత యగుచుఁ బవనసుతు నడ్డుకొనన్
బరుసమునఁ బెనఁగ కాతఁడు
సురసను వెరవున జయించె సుర లబ్రపడన్. 32

క॥ అంబరమున బావని చన
నంబునిధిన్ నీడ బర్వె : నాతని చాయన్
డంబుమెయిఁ బట్టె సింహిక,
సంబరమున దానిఁ జంపె సామీరి వెసన్. 33

గీ॥ కడచె నీరీతి వార్ధిని గగనచారి
పవనజుఁడు దూకెను సువేల పర్వతమున
వాయుజు నిపాత వేగాన బ్రవయ్యలయ్యె
గండశిలలు, మహీజముల్, తుండులయ్యె.
ప్రకృతి సంభవ మోహమున్ బాసి, ఆత్మ
వంతుఁడు స్వరూపధారియై వదలి నటుల
వనధి దాట దాల్చిన కొండ వంటి మేను
హ్రస్వ మొనరించె పవనుజు డద్భుతముగ. 34

వ॥ ఆంజనేయుండు సువేలాద్రినిఁ గొంతవడి విశ్రమించి త్రికూట
గిరి స్థితంబగు లంకానగరంబు వంక సునిశితంబగు దృష్టితో. 35

ఉ॥ చూచె సమీర నందనుఁడు సూర్య కరోజ్జ్వల రశ్మి జాళువా
రోచుల పూఁతలన్ బలు మెఱుంగుల నీనెడి సౌధజాలమున్
మోచిత దివ్య సౌరభ సమూహ సమన్విత గంధవాహుఁ చే
నూచగ బద్ధ తీవియల నూగి, భ్రమించు మదాళి జాలమున్. 36

క॥ ఎత్తైన కోట కొమ్మలు
పత్తనమును జుట్టు కొనుచుఁ బరుల మనమ్ముల్
బిత్తర పోవం జేసి వి
యత్తలమున్ రాచు కొనుట నాతఁడు కాంచెన్. 37

క॥ పురి నొరసికొనుచు నల్లన
సరిత్తు ప్రవహించుఁ బులిన సంపద్రుచితోఁ
గరి మదగమనల జఘనపు
సిరిఁ దలపించుచు నమేయ శృంగారమునన్. 38

క॥ కోట సమ మగును గిరికిన్,
మీటున్ లెక్కింపుఁ జివర మిన్నేటి దరిన్
దీటగును పరిఖ వనధికి
పోటీపడు లంక దేవపురితో నెపుడున్. 39

క॥ పరిఖను దాట నశక్యము
పరికింపఁగ నెంతగట్టి ప్రాకార లకైనన్
తరగల రవములు నిరతం
బరి పంఘుంబులకు గుండె లవియం జేయున్. 40

క॥ నానావర్ణంబులు గల
సూనావళి తోడ వెలయుచున్ వనసీమల్
సూనాస్త్రుని కేళీస్థలు
లై నర్మ సఖీసఖుల విహారముఁ గూర్చెన్. 41

క॥ విచ్చిన పూవుల ప్రోవుల
పచ్చని శాద్వలము లందుఁ బాఱెడు కుల్యల్
పొచ్చెం బెఱుఁగని వసుమతి
కుచ్చెళ్లో యన రహించుఁ గొమరారంగన్. 42

క॥ జలజాకరములు తమ్ముల
చెలువముతోఁ గలువ పూల సింగారముతోఁ
బొలుచున్ లంకావాసులు
కలకాలము తలపఁబోరు కాలపు మార్పున్. 43

క॥ లచ్చికి నిలయం బందపు
టచ్చరలకు నాలయంబునై దివిజులనేన్
మచ్చరమున వెస గీటున
బుచ్చెడి రక్కసుల కిక్క బుద్ధిం దెలియన్. 44

వ॥ అట్టి లంకాపురంబును రాత్రి సమయంబున. 45

ఆ॥ చిఱుత రూపమొంది పురమెల్ల వెదఁకగాఁ
బవన సుతుఁడు కదలెఁ బరువు లిడుచు,
కోట ద్వారమందు బోటి యొక్కర్తుక
హనుమ నడ్డగించె నార్భటించి. 46

ఆ॥ అఱచి చఱచి మారుతాత్మజు నిట్లనె
"నిలువు నిలువు కోఁతి, నెలవుఁ దప్పి
యిటుల నేల వచ్చితీవు, ప్రాణంబులఁ
గొందుఁ గదల వేని కుటిల చిత్త! 47

వ॥ అప్పుడు. 48

మ॥ చఱపున్ దాను గ్రహించి, డీల్పడక, రోషంబూని జృంభించి పే
రురము౦ బెంచి, నిమీలితాక్షుఁడయి నిర్వ్యాఘోల్లసద్విక్రమ
స్థిరలీలన్ దృఢమైన యంగుళుల ముష్టిన్ గట్టిగాఁ గూర్చి ని,
ష్ఠురమౌ పోటొకటిచ్చె దానవికి జిష్ణుం డాంజనేయుండొగిన్. 49

ఆ॥ హనుమ ముష్టి ఘాతమునకు వే దానవి
దొరలె భూమి మీఁదఁ దిరిగెఁ దనువు
పొరలి యఱచి వగచె, ముక్కున నోటను
పూరములుగ రక్త ధార లెడల. 50

క॥ మద మణఁగ, బెదరు పైకొన
అదవద గ్రమ్ముకొనఁ బట్టె ననిలజు పదముల్
వదలక లంకిణి దీనత
సదయ హృదయ, చంప వలదు శరణంబనుచున్, 51

వ॥ వెండియు లంకిణి యిట్లనియె. 52

ఆ॥ తొల్లి బ్రహ్మ సెప్పె దోర్బలంబున నను
గెలుచు వానరుండు గెలుచు నెపుడు
చేటు కాలమపుడె చేకుఱు లంకకు
నసుర నాశనమున కదియె మొదలు. 53

ఆ॥ నీవు చేయఁ బూను నిర్ణీత కార్యంబు
సఫల మగును జుమ్ము సత్వరముగ
జనకజాతను గని సాహసంబున నీవు
మరలి పొమ్ము కనుము మంగళంబు. 54

వ॥ అని పలికి లంకిణి యదృశ్య కాఁగాఁ జంద్రోదయం బయ్యె. 55

సీ॥ అరుణ కాంతిచ్ఛట లంబుధిలోఁ బర్వెఁ
బుష్యరాగంబులు పొలిచె మింట,
నింగి పాథోధి వినీల మధ్యమునకు
బంగారు మొలనూలు పొదు కొనియె,
ఘనమైన ధ్వాంతంబు కదలియం దడఁగెను
నీలిమ నీరధిన్ నిండు కొనియె,
చిఱు చీఁకటులు సేరె చెట్లక్రీ నీడల
చిగురాకు చేడియ చెమ్మగిల్లె,

గీ॥ కలువ కన్నుల నవ్వెను గొలఁకు కలికి,
పేర్మిఁ గొంతులఁ గూడంగ వీలుగామి
వంతఁ గుమిలిరి విరహిణీ వనజముఖులు
చంద్రికం గూడి యుడురాజు చదలఁ బొడమె. 56

క. అలల కరమ్ముల నంబుధి
పిలువఁగ; గలకల నగవుల విచ్చఁగ నీలో
త్పలములు; సుఖ సంతోషం
బులఁ జెలఁగఁగ జగములు, నభమున విధుఁ డలరెన్. 57

చ॥ నిసి యను వన్నెలాడి కడు నేర్పునఁ దూర్పు హసంతిపై వెసన్
శశి యను వెండి కుండఁగల సార పయస్సును గాచుచుండగా
బుసబుస పొంగి భూమిపయిఁ బొల్చునఁ జిందిన పాల పొంగుగా
మిసమిస వెన్నెలల్ చెలఁగి మేదిని పై వడిఁ బర్వె సాంద్రమై.

చ॥ నెల తొలి దిక్కునన్ బొడమ, నిండిన పేర్మి ధరా వధూటి మేల్
చలువ దుకూలపున్ బయఁట చక్కఁగ దాలిచి శైల శృంగసం
కలిత కుచాగ్ర పాటవ నికామ వికాసము వెల్వరించి స
ల్లలితపుఁ గల్వ లోచనములన్ దగ స్వాగత మిచ్చె నవ్వుచున్.

ఆ॥ పుచ్చ పూవు లీలఁ బొడమిన వెన్నెల
నలరులందు క్రొత్త యంద మొదవెఁ;
జలువ సొగసు ముసుగు చక్కఁగ సవరించి
కడిది శోభ నొప్పె పడతి పుడమి. 60

వ॥ ఆ లంకాపట్టణంబున. 61

గీ॥ స్వర్గమున దివ్యసుఖములు చవిని రోసి
వసుధఁగల సౌఖ్య మనుభవింపంగఁ దలఁచి
యచ్చరలు వేడ్క నిచ్చమై వచ్చి నిలిచి
నట్లు చూపట్టి రచ్చటి యతివ లెల్ల. 62

ఉ॥ కట్టిన పుట్టముల్ తొలఁగఁగాఁ బురుషాయిత కేళి సల్పి, లో
గుట్టుగ నున్న యంగముల కోమలికమ్ములు హార కాంతులన్
బట్టి బయల్లుగా నెగడ, భామలు మోములు వాల్చి వ్రీడఁ జూ
పట్టిరి పూలపై నొరగు బంగరు పక్షుల ప్రాభవంబుతోన్. 63

ఉ॥ అచ్చర పిండు సోయగపు టద్భుత లీలను మించు హేలతో
ముచ్చట గొల్పు కామినులు మోహన గీతిక లాలపించుచున్
విచ్చిన వెన్నెలన్ ప్రియుల నెయ్యము చూఱగొనంగఁ జూచుచున్
అచ్చెరు వందుచున్ వెదకె నంజని పుత్త్రుడు జానకీ సతిన్. 64

వ॥ ఇట్లు ప్రభంజనాత్మజుండు లంకా పురంబున వెదకి వెదకి సీతా
దేవిం గావక రావణాంతఃపురంబు ప్రవేశించి యచ్చటఁ బాన
భూమిని నిద్రాపక్తలైన పూర్వం భోగులం గాంచెను. 65

క॥ పలు తెఱఁగుల తను కాంతులు
గల చెలువల కలువ కనులు కాంచన భూషల్
మిలమిలలు పాము కుబుసపు
వలువలు దలఁపించెఁ బుష్పవన శుభశోభన్. 66

క॥ ఉల్లసితపు టుల్లంబుల
నల్లన మధురానుభూతు లాదట మెదలన్
పుల్లాబ్జాక్షుల మోములు
పల్లవితములయ్యె స్వప్న పరవశమయ్యున్. 67

క॥ అంభోజాక్షి యొకతె స్వ
ప్నంబున రావణునిఁ గూడి పరవశయై మో
దంబున సవతి ముఖాబ్జము
చుంబించెను నిద్రమునిగి చూత్కారములన్. 68

చ॥ జిలుగు కడాని భూషలను జెన్నెసలార ధరించి శోభలన్
జిలికెడి దేహముల్ రతుల చేత శ్రమంపడి స్విన్నమైన యా
వల సుఖనిద్ర నొంది తమ పయ్యెద లూర్పుల సంచలింపగాఁ
జెలువల చాలు దోచె సరసీజ పరాగ తరంగిణుల్ వలెన్. 69

క॥ అందఱు శీతాంశు ముఖుల్
అందఱు తనుమధ్య లైన యరవిందాక్షుల్
కందర్పుని పూములుకులె
యందఱు నందాల ప్రోవు లబ్బురపుఁ జెలుల్. 70

ఆ॥ అచట నున్న యట్టి యన్నుల మిన్నలు
రాక్షసేంద్రు పట్ల రాగమూని
కోరి వచ్చినారు కోరికల్ చిగిరింప,
బలిమి నెవతె నతఁడు పట్టలేదు. 71

ఉ॥ నీల పయోధరావళుల నిగ్గుల నీనెడి దేహ కాంతితోఁ
గాలుని బోసి కంటి రుచిఁ గ్రాలు త్రిపుండ్రము గల్గు మోముతో
శైలము వోలెఁ బండుకొని చక్కఁగ నిద్దుర బోవు రావణున్
బోలఁగఁ జూచి దా బవన పుత్రుఁడు భీతిని బొందె నెంతయున్.

గీ॥ కంధరాచ్ఛాదితోర్ధ్వ భాగంబు, రశ్మిఁ
గ్రాలుచున్నట్టి క్రింది భాగంబు, గల్గి
నట్టి కనకాద్రి చందాన నతఁడు తోచె
పట్టు పీతాంబరముఁ దాల్చి పవ్వళించి. 73

వ॥ రావణుని పర్యంకంబున. 74

క॥ కుందనపు బొమ్మ యనఁదగు
సుందరి యత్యుజ్జ్వలంపు సొగసున శోభల్
చిందించునదై కనఁబడె
నందమ్మున సాటి యెవ్వరామెకు ధరణిన్. 75

చ॥ అనుపమ దివ్యరూప మహిమాతిశయం బెసలార లోక మో
హన తనువల్లి రావణుని యంగము లంటఁగ గాఢ సుప్తిలో
మునిఁగిన దాని మంజుమణి భూషిత గాత్రిని రాక్షసేంద్రు భా
ర్యను గని యంజనా సుతుఁడు రాముని పత్ని యటంచు
భ్రాంతుడై. 76

గీ॥ కంటి నేనుఁ గడకుఁ గంజాయతాక్షిని
రాము కూర్మి సతిని రాగమయిని
గడలి దాఁటినట్టి కర్జంబు చేపడె
స్వామి కార్య మింక జక్కఁ బడును. 77

వ॥ అనుచు సహజ చాపలంబున. 78

అంబురుహము॥
కాంచితి రాముని కాంత నటంచు వి
కాస మెప్పఁగ మోమునన్
మించిన వేఁడుక తోకను రేపి యు
మేయ లాఘవ మొప్ప లం
ఘించుచుఁ గేరుచు గంతులు వేయుచుఁ
గ్రేళ్లు దాటుచు నవ్వి న

ర్థించుచు స్తంభము లెక్కుచు జారుచుఁ
దేలగిల్లుచు వ్రాలుచున్. 79

వ॥ మందోదరి సౌందర్యంబునకు ముగ్ధుండై జానకి యని భ్రమించి యోచించి జానకి కాదని పావని. 80

క॥ రామానురక్త ప్రాణ
స్వామిని విడనాడి పరుని పర్యంకమునన్
గామక్రీడలఁ దేలునె?
కామిని యిది, సీత గాదు. గణుతింపంగన్. 81

వ॥ అని నిశ్చయించి. 82

చ॥ సొగసు మిటారి చేడియలు చొక్కపు టాసవమాని మత్తునన్
జిగి నెలరాల నేల పయిఁ జీరలు-జాఱ సుషుప్తి నొందఁగాఁ
జిగురు మెఱుంగుమేని సును చెల్వము గాంచి సమీర సూతి తా
బొగిలెను బాప కూపమున మున్గితి నంచు దురంత చింత తోన్.

క॥ 'మగువను వెదకం దగునే
మగవారల మధ్య? నేను మై మఱవక యీ
మగనాండ్ర నడుమ వెదకితి
మగువ కొఱకు ధర్మమె' యని మారుతి దలఁచెన్. 84

క॥ కనఁ జాలక సీతను బా
వని వనరుచుఁ గడచె పంక్తి వదనుని గృహమున్
జని వెదకి వెదకి వేసరి
పనివడి నాతం డశోకవనముం జేరెన్. 85

క॥ ఉన్నత భూమీరుహమున్
గ్రన్ననఁ దానెక్కి దెసలఁ గలయం జూచెన్
గన్నుల పండు వొనర్చెడి
ప్రసన్నని యుద్యానవనము ప్రమద మెలర్పన్. 86

ఉ॥ ఉన్నత వృక్షశాఖికల నూగు తలంపుపసంహరించి తా
మిన్నుల దాఁకు కొమ్మ పయి మేవడి నిల్చి ధరాతలంబుపైఁ
గ్రొన్నన లొప్పు తీవియల కుంజములన్ గని పోల్చె తారలన్
విన్ను రహించు లీల పృథివీస్థలి శోభిలుఁ బూలగుత్తులన్. 87

వ॥ మఱియు నిటుల భావించె. 88

క॥ చిఱుమామిడి కిరువంకల
విరి తీవెలు ప్రాకి కదల వేకువగాలిన్
సరవి నెసలారె నామని
విరి యుయ్యెల మాధవునకు వేసిన రీతిన్. 89

గీ॥ ప్రియుని తొడ వీడి పరువిడు ప్రేయసి వలె
జారు సెలయేరు పర్వత సానువులను
జలములన్ వ్రాలు కొనల వృక్షంబు లొప్పె
క్రుద్ధురాలిని వారించు కొమ్మల వలె. 90

ఆ॥ ప్రాఁకు శాఖ నుండి మారుతి దుమికె, ని
కుంజములను బూవు గుములు రాలఁ
బూవులందు మునిఁగి పొల్పారె నాతండు
కొమరు మిగుల విరుల కొండ వోలె. 91

ఆ॥ పవన సుతుఁడు చెలఁగి వనమున విహరింప,
నలిగి నట్టి జొంపములను గలిగి
చెదిరి నట్టి విరులచే శీర్ణ శిఖలచే
లతలు రతి కలుషిత రామలైరి. 92

వ॥ పావని యశోక వనమున జానకిని వెదకి వెదకి వేసారి. 93

ఉ॥ మ్రొక్కెను రామచంద్రునికి మ్రొక్కెను సీతకు మ్రొక్కె గాలికిన్
మ్రొక్కె సుమిత్రపుత్త్రునికి మ్రొక్కెను రుద్రునకున్ సురాళికిన్
మ్రొక్కెను సూర్యచంద్రులకు మ్రొక్కెను వానరనేత కాత్మలో
వెక్కని చిక్కుదీర్పుఁ డవనీసుతఁ జూపుఁ డటంచు వేఁడుచున్

క॥ రాముని మంగళ రూపము
నీమముతో మదిని నిలిపి నిశ్చల వృత్తిన్
భూమిసుత జాడఁ దెలుపుము
స్వామీ, యని వేఁడుకొనియె సామీరి వెసన్. 95

క॥ కలువలు వెలవెలబాఱన్
కలువల చెలి వెల్లఁ బాఱగాఁ, బులుఁగు గముల్
పిలపిలఁ గుజములఁ జెలఁగఁగఁ
దొలిదిక్కునఁ గాంతిరేఖ తోచె నలఁతిగాన్. 96

క॥ నలుదెసలన్ బరికించెను
దొలి వెలుఁగునఁ బవనసుతుఁడు తొయ్యలి కొఱకై;
చలమునఁ గనెఁ దరువు మొదలు
నెలవుగ నున్నట్టి యొక్క నెలఁతఁ గృశాంగిన్. 97

క॥ దెసల వెలిఁగించు రవిచే
పసిచెడి కళఁ దొరఁగి నట్టి చంద్రుని మాడ్కిన్
మసిగప్పిన మణికైవడి
వసివాడిన సీతను గనె వానరుఁ డంతన్. 98

ఉ॥ శోకము రూపుగొన్న గుణశోభిత రాముని బాసి యుండుటన్
జోకఁ దొఱంగి వన్నెచెడి సోయగమున్ బెడఁ బాసి దీనయై
యేఁకట నాథునిం దలఁచి యేడ్చుచుఁ గన్నుల కెంపుతో మహా
ప్రాకృతులైన రక్కసుల యందిక నుండిన కోమలిన్ గనెన్. 99

ద్వి॥ పొగమంచు గ్రమ్మిన పొందమ్మిఁ బోలె,
అంగార పీడితయౌ రోహిణి వలె
సంజ కెంధూళిలో సవిత చందాన,
పూవులు లేనట్టి పూదీవ మాద్రి;

శుక్ల పాడ్యమి నాటి శుభ్రాంశు రీతి
భస్మ నిక్షిప్తమౌ వజ్రమ్ము మాడ్కి;
ధూమ దూషిత కీలికామాల రుచిని,
పుణ్య సంక్షయమునఁ బుడమినిఁ బడిన
కాంతి విహీన నక్షత్రంబు చవిని,
తన సమూహము బాసి వనరాజు చేత
సంరుద్ధ బద్ధ గజ వధూటి భాతి,
వాడక యుక్తయౌ వల్లకి వలెను,
అసుర బాధితయైన యజ్ఞమ్ము మాడ్కి
విస్మృతి గాంచిన విద్య విధమున;
ప్రతిహతమైనట్టి శ్రద్ధను బోలి;
స్వర మణగారిన శబ్దమ్ము మాడ్కి
అపవాద బాధిత యశము చందాన
తపమే ధనమ్మైన యుపవాసకృశను
నిరతపతిధ్యాన నిర్మల మతిని
దుఃఖ సంతప్తను దుర్బల తనును
శ్లేష్మమై పీతమౌ క్లిష్ట వస్త్రమున
భర్తృ వాత్సల్య మాభరణమై యొప్ప
గళదశ్రుసిక్తను కాంతను గాంచి
అనిలజుండు దలచె నటుమట నొంది. 100

కII 'ఈ చీర చెఱఁగుననే
ఈ చేడియ నగలు ముడిచి యిలపై జారన్
వైచెను మేము కనంగా;
తోచుమ—ఈ రామ—రాము—తొయ్యలి' లీలన్. 101

క॥ రామోక్తంబులు సీతా
భామామణి నగలగాంచి పాదప శాఖన్
సామీరి నిరూపించెను
నామెయె సీతనుచు మేని నగల గురుతులన్. 102

ద్వి॥ ఈమెను వీడియా యినకులాధిపుఁడు
అసువుల నిలుపుట యచ్చెరు వౌర,
ఈరామ మానస మా రామునందు
ఆ రాము మానస మీ రామ యందు
వాసించు గనుకనే బ్రతికి యున్నారు
ఈ సాధ్వి కొఱకు నా యిక్ష్వాకు నృపుడు. 103

గీ॥ అబల యెటు బోయెనో యని యటమటించు
ఆశ్రితను బ్రోవ లేదని యావటిల్లు
దార నెడబాసి నానని తల్లడిల్లు
ప్రియ వియోగాగ్నిచే దురపిల్లు చుండు. 104

ఆ॥ జలజ నయన సాధ్వి జానకియని యెంచి
తెలియఁగోరి యామె కలతెఱంగు
పవనసూతి యెక్కెఁ బాటవమ్మున శింశు
పా తరువును దాగెఁ బర్ణములను. 105

ఆ॥ చేవ గోలుపోయి సీతమ్మ శింశుపా
తరువు మొదట వనటఁ దెరలు చుండ,
వేఁగుజాము నందు ప్రేగగు మోహాన
రావణుండు వచ్చె రమణి కొఱకు. 106

ఉ॥ తియ్యని స్వప్నవీచికలఁ దేలుచు సీతను గూడినట్లు తా
శయ్యను వీడివచ్చె నొగి జానకితోఁ దనగూర్మి సర్వమున్
జయ్యనఁ జెప్పి రావణుఁడు సాధ్వి మనంబును ద్రిప్ప కామితం
బుయ్యెల లూగఁగా హృదయ ముప్పొంగులూర విరాళి పెంపునన్.

వ॥ పావని రావణుంజూచి. 108

ఉ॥ వాని దృఢోన్నతాంగముల పాటవ జాత భయంకరత్వమున్
వాని తపో విభూతి విభవంబున నొప్పు సుదీర్ఘతేజమున్
వాని విశాల ఫాలమును వాని మహోజ్జ్వల దేహ నీలిమం
బూనిని రీవిఁ గాంచి వెఱపొంది యడంగెను వృక్షశాఖలన్. 109

ఆ॥ చూచె నిదుర బోవుచో, నిప్డు నడయాడు
రాక్షసేంద్రుఁ జూచె, రాజసంబు
మూర్తి గొన్నయట్లు పొడకట్టె జగమేల
వలఁతి యనుచుఁ దలఁచెఁ బవనసుతుఁడు. 110

ఉ॥ దట్టపు ముంగురుల్ నుదురు దాఁకుచుఁ గన్బొమ యంచు
లల్లనన్
ముట్టి చలింప నందముగ మోడ్పుకనుల్ వికసింప నెట్టనన్
మట్టియ శబ్దముల్ నిదుర మంపును ద్రోల ననర్ఘ భూషణా
లట్టిటు సందడింప ధవు నంటుచు వచ్చిరి రాక్షసాంగనల్. 111

ఆ॥ తన్నుఁ గాంచి వణఁకి తనువల్లి కుంచించి
యవనతాంగి యైన యువని జాత
యందమైన మేని నంటంగఁ దలఁచిన
పంక్తి కంధరుండు పల్కె నిట్లు. 112

చ॥ పదినెల లిట్లు వ్యర్థమయి పాఱెను, మాయురె, కాలవాహినిన్
ముదితరో, నీదు మానసము మూర్ఖపుఁ బట్టును వీడదేల? నీ,
వదయత గాసిఁ జెందుచును యౌవన మాఱడి సేయనేల? నీ
యెద నభిరామలీలఁ గదియించి వెసన్ నను గౌఁగిలింపుమీ?113

గీ॥ పట్టమహిషీ పదంబు నొసఁగఁతి నీకుఁ
గట్టువాఁడను, నన్నుఁ జేపట్టితేని,
వట్టి మాటలు గావు నిన్ వదలఁబోను
బట్టు వాఁడను వినకున్న బలిమి నిన్ను. 114

ఉ॥ నీ యపురూపమైన కమనీయ శరీరము నూని నీవు న
న్నే యలివేణి నిండు తమి నొయ్యఁ గవుంగిటఁ జేర్ప నూర్జితా
మేయ సుఖంబు నొందెదను; మించి నినున్ రమియించు కంటె ని
శ్రేయసముండునే? కలదె సిద్ధి తపస్సున కన్య మెద్దియేన్? 115

ఉ॥ చేయుదు నిన్ను బట్టమహిషిన్, ననబోండ్లకు మేలుబంతివై
పాయని ప్రేమతోడ నను బయ్యెద కొంగునఁ గట్టు కొమ్ము, నా
ప్రేయసివై విహార మొనరింపఁగ రమ్ము వనస్థలమ్ములన్
గాయజుకేళిఁ దేల్చి యొసకమ్మున నన్నలరింపు మంగనా! 116

ఉ॥ ఎప్పుడు నా మనస్సు కననింపగు నీయెడ లగ్నమౌటచే,
నొప్పనిదయ్యె నన్యలగు ఉగ్మలులం గవగూడు మాటః యో
కప్పురగంధి; యశ్రువుల గార్చెడి కన్నులతో నిటుండఁగా
నొప్పిదమౌనటె సుఖము లొందఁగ నర్హత నీకు లేదటే? 117

ఉ॥ వేయి విధాల సోయగపు వేడ్క వెలార్చెడి కామినీమణుల్
నా యనుబంధమున్ విడక నా కనుసన్నల నుండియున్ జెలీ
నీ యతిలోక సుందరత నింపెను మోహము నా మనంబునన్
గాయజు వాడి తూపులకు గాసిలెఁ గాయము, కౌగిలింపవే! 118

చ॥ ఉరువగు చన్నుదోయి మది నువ్విళులూరఁగ జేయు వాంఛలన్
గురువగు శ్రోణి నాయెద బుగులొ్కనఁ జేయుఁ బ్రగాఢ కాంక్షలన్
మురువగు నీదు కెంపెదవి ముద్దుల నాడఁగఁ బిల్వ నేనెటుల్
వరకరభోరు, నిస్పృడ వలంతిని? కాదని పోవ నేర్తునే? 119

ఆ॥ పూవు వంటి మేనుఁ బొగిలింప న్యాయమా?
శోక వహ్నియందు సుందరాంగి;
నిన్నుఁ గన్నదాది నిలువదు నామది,
కరుణఁ జూపి నన్నుఁ గావు మతివ! 120

క॥ జవ్వనమను కొలఁకున నో
జవ్వని, నీ సొగకనులు శఫరుల మాడ్కిన్
మవ్వపుగతిఁ గదలుచు నన్
గవ్వించు నికేమి నేతుఁ గరుణించగదే! 121

క॥ కరికుంభంబుల కరణిన్
దురుసై నీ వలుద చనులు తొయ్యలి, తోచున్
బరికింప మదనుఁ డెత్తిన
వర జయకుంభముల ప్రాభవముఁ బురుడించున్. 122

క॥ విరియం బాఱిన తమ్మిన్
దిరుగాడెడి తేఁటిగముల తీరున, లలనా,
వఱలున్ నీ నగుమోమున
కరువలిచే రేఁచఁబడిన కచపాశంబుల్. 123

క॥ నాభి గుహా స్థిత నిధి సం
శోభిత కుచ కనక శృంగ సురుచిర భూతి
ప్రాభవ రక్షా దక్ష మ
హా భుజగియె నీదు వేణి యబ్జనిభాస్యా! 124

క॥ అచ్చపు మేని కొలంకున
విచ్చెను నీ మోముదమ్మి విన్నాణముగన్
హెచ్చయిన మధువుఁ గ్రోలన్
వచ్చెను ముంగురులు తేంట్లు వలెఁ బూఁబోణీ! 125

గీ॥ నాదు సహచరివై నీవు నడచితేని
సార్థకంబగు నీమేని చక్కఁదనము,
అడవిఁ గాచిన వెన్నెల యగును జామ్ము
మగనిఁ దలఁచి పరాఙ్ముఖి వగుదు వేని, 126

ఆ॥ గువ్వవోలె నీవు కూర్చుండి యున్నను,
బైఁట నెంతలాగి మాటుఁ గొనిన,
దాఁచఁదరమె నీకుఁ దన్వంగి, నీలోన
వెల్లి విరియుచున్న వింత సొబఁగు! 127

క॥ ఎంచన్ దరమే నీలో
సంచితమ్మై యున్న సృష్టి చాతుర్యంబున్?
మించున్ మించు తనుద్యుతి
నంచగమన, దాఁచఁగలవె యవనత ముఖివై? 128

కవిరాజ విరాజితము॥
రజనికరానన! యేలనె నన్నిటు
రాయిడి వెట్టుచు నుంటివి, పం
కజదళలోచన! న్యాయమె నన్నిటు
కాల్పఁగఁ దీక్ష్ణపు దృక్కులచే?
గజగమనా! ననుఁ గాయజుకేళిని
గౌతుక మొప్పఁగఁ దేల్పుము, నీ
భజన మొనర్చెడి వాఁడను, రాణిగ
భాసిలి పాలన సేయఁగదే. 129

ఉ॥ చేడియ, యేటికే యిటులఁ జీఁదఱ గొందువు? పూవుఁబోఁడు తూఁ
టాడెడు నాదు మేను నకటా - దయలేక; దయార్ద్ర దృష్టులన్
జూడక యున్న నా తనువు స్రుక్కి నశించును; గూర్మిఁజూపుమీ,
వేఁడెద, దైత్యనాథుఁడను వేల్పుల సేవ గ్రహించు శూరుఁడన్.

క॥ నీ పెదవుల ముకుళనమున
నీ పువ్వు దీవియలు చివురు లిప్పవు ననలన్
కోపము వీడి హసింపుము
ఈ పుష్పోద్యానంబు నవ్వ నిందు నిభాస్యా. 131

గే॥ కనకా భరణా లంకృతవై
మెఱపు తీగవలె మేఘమాలలో
విహాయసంబున పుష్పకంబున
విహరించుము నన్ననుగ్రహించుము.

కుసుమిత తరు కుంజమ్ములలో
అళికుల గానము లాలకించుచూ
చొక్కపు టాసవ మానుచు నాతో
హాళిని హేళుల గూర్పగరావే.

అలలు ముద్దిడు సైకతమ్ముల
అలక లల్లల నాడ మోమున
బాహు వల్లరి నన్ను పెనగొన
నాదరించుము నన్నులలనా. 132

చ॥ అసదృశమైన యౌవనము నారడి వుచ్చుట న్యాయ మౌనటే?
కుసుమ సముద్గమ ప్రకర కుంజము భృంగ విహీన మౌనటే?
కుసుమ శరోపమాను నను గూడి సుఖించి చరించకున్నచో
మిసమిస లీను వెన్నెలలు మేదుర కానన సీమ కాయుటే. 133

క॥ వదలుము మంకు తనమ్మును
మృదువౌ నీ పెదవి విచ్చి మెత్తని పలుకుల్
ముదితా నుడువుము తీయగ
సదయత నను గూడి పొందు స్వర్గ సుఖమ్ముల్. 134

క॥ ఈమాద్రి కన్ను గానక
భామిని భూపుత్రి పవని భాష్యయుటంచున్
నేమమున నుండ జాలక
ఏమరి ప్రార్థించె దానవేంద్రుడు సీతన్. 135

క॥ ములుకుల వలె నామూర్కు_ని
పలుకులు కర్ణములఁ దూఱఁ బరపురుషునితో
బలుకగ నొల్లక; తృణమును
నిలిపి యెదుటఁ బలికె సీత నిష్ఠురభణితిన్. 136

ఉ॥ పుట్టితిఁ బుణ్యమూర్తి యగు భూసతి గర్భమునం దయోనిజన్,
మెట్టితి మేల్మి వర్తనకు మెప్పు వహించిన వంగడంబునన్
బట్టితిఁ బూరుషోత్తముని పాణిని లోకము లెల్ల మెచ్చ, న
న్నట్టి పవిత్రురాలి తనువంటఁగఁ గోరెదు దుర్మదాంధుఁడా! 137

క॥ నారీరత్నమ నంటివి
కూరిమితోఁ బరుని గూడి కులికిన యెడలన్
నారీ రత్నమ నౌదునె?
నారికిఁ బరపురుషు పొందు నాణెమ్మగునే? 138

ఆ॥ జరయు రుజయుఁ గూడి జర్జరితంబును
జేయున నట్టి మేనుఁ జెనటి వగుచుఁ
గోరఁ దగునె నీతికోవిదుడవు నీవు
బ్రహ్మవంశ మందుఁ బ్రభవమంది. 139

క॥ నా సఖు నెడఁబాయక నే
నే సుఖముల వదలి నానొ, యీ వొసఁగెదవే
యా సుఖముల? నే నుందునె
నీ సరసన్ దుచ్ఛబుద్ధి, నీతి విహీనా! 140

క॥ కడుఁ గూర్చు నాథు నుండియు
నొడికపు సౌమిత్రి నుండియున్ బెడిదంబౌ
పెడఁబాటు కలిగె నక్కట,
కడగండ్లే ర్పడిమె నీదు కపటము చేతన్. 141

క॥ కడిఁది కుతంత్రంబులచే
నొడఁ గూడదు నీదు కోర్కి; యుర్వీసుత నీ
కొడఁబడు ననియెడి యోచన
విడువుము, పెరచేడె మీఁది పేర్మి వినంబో. 142

క॥ కడు కూరిమి నన్నేలెడి
యొడయునిఁ గికురించి తెచ్చి యిల్లని నాతో
వెడఁగుం బల్కులు బల్కెద
వడిగొట్టువు పొందఁగలవురా యఘ ఫలమున్. 143

ఉ॥ చెప్పితి వెన్నొసార్లు జగజెట్టివి నీవని, సర్వలోకముల్
గుప్పిట నుంచి యీ భువనగోళము త్రిప్పితినంచు, వేడ్కమై
గొప్పలు చెప్పగా నగునె? కూళవు వంచన సల్పి బల్మిమై
యొప్పని నన్నుఁ దెచ్చుటది యున్నతి చిహ్నముగాఁ దలంతువే?

ఆ॥ పలికె నిట్లు సీత - పంక్తిముఖుం డామె
ప్రబల పరుష వాక్ప్రరంపరలకు
గరము కినిసి కూడఁ గాముకుఁ డౌటచే
నోర్చి యిట్టులనియె నువిదఁ జూచి 145

క॥ మురుపులు జిలికెడి దానవు
పరుసములగు భాషణములు పలుక దగునా?
సరసము లాడందగు, నా
సరసను గూర్చుండి నీవు జలరుహ నయనా! 146

క॥ నీ రూపమునకు బానిస
నై రక్తుఁడనైతి విస్ఫుటాబ్జముఖీ, నీ
పారుష్యపుఁ బలుకులు నా
కూరిమి సడలింప లేవు కొనకొని యెపుడున్. 147

కII వలరాజు తూపులకు నే
నిలువఁగ లే నతివ, మాననీయుని నన్నున్
ములుకులను బోలు కఠినపుఁ
బలుకుల నొప్పింపవలదు పర్వేందుముఖీ! 148

కII ఈ విధమునఁ బలికిన యా
రావణు వాక్యములు దుర్భరములై తోచెన్
భూవరు సతి కామాటలు
దావాగ్ని జ్వాల లౌటఁ దా నిట్లనియెన్. 149

కII దహనంబైనను దేహం
బిహసౌఖ్యము లొల్లనిచట, నినకుల తిలకుం
డహరహము నాదు హృదయపు
కుహరంబున వెలుఁగుచుంట గుర్తింపవొకో? 150

కII మత్తుఁడవై కోరితి వు
న్మత్తత మగనాలి నన్ను, నానాథుఁడు నిన్
జిత్తునియులు జేయును నీ
పత్తనము సముద్ర మందుఁ బడి భగ్నమగున్. 151

కII నీ భార్యల నీవెట్టులు
ప్రాభవమున రక్షసేయ వాంఛించెదవో
యీ భువి నితరులు పరసం
క్షోభిత పత్నులను బ్రోచు కొందురు కడకన్. 152

ఉII ఒప్పని నన్ను సాధ్విని దురుద్ధతిఁ బొందఁ దలంచితేని, నిన్
దప్పక బూది సేయఁగల దానను, మూర్ఖత మాని తేకువన్
జప్పునఁ జేర్చు నాథవుని సన్నిధికిన్, నినుగాచు నాతఁడున్
ముప్పులు నిన్ను ముంచుటకు మున్నె వివేకముతోఁ జరింపుమీ!

ఉ॥ ఇప్పర మెన్ని దుర్దశల కిమ్మగునో, నిను నమ్ముకొన్న వా
రెప్పగిదిన్ నశింతురొ గ్రహింపఁగ లేవు గదా యిసీ, గుఱిన్
దప్పదు రాము బాణమది, తప్పక నిన్ దెగవేయుఁ జుమ్మ, నీ
గొప్ప శరీర మిర్వియయిఁ గూలక పోవదురా దురాత్మకా! 154

క॥ పలికె జలజాక్షి యీక్రియ
జలజల బాష్పములు రాల, జానకి మోమున్
దిలకించుచుఁ గ్రుద్ధుండై
పలాశి కాలాహి భంగిఁ పైబడ నిలచెన్. 155

క॥ కన్నులు నిప్పులు రాలఁగఁ
జెన్నొఁతన్ బట్టు గొఱికి భీకరుఁడై యా
మన్నీఁడు తన్ను దూఱిన
యన్నుల మిన్నను వధింప నడిదము దూసెన్. 156

క॥ అచ్చోటి మగువలం దొక
మచ్చిక గల మచ్చెకంటి 'మానుము రోషం
బిచ్చెల్వ నిచ్చగింతువె
వచ్చిన నేనుండ, నను చు నాథుం బొదివెన్. 157

క॥ ఒల్లని యీ సతియెడ నీ
యుల్లము నిలుపంగఁ దగునె యుడుగని కోర్కెల్
మల్లడిగొన, రమ్మా కో
కొల్లలుగా గలరు నిన్ను గూడు శుభాంగుల్. 158

ఆ॥ అనుచుఁ దన్నుఁ బొదివి యడ్డగించిన యట్టి
కూర్మి చెల్వ మనము కుందకుండ,
చుట్టుకొన్న యట్టి సుందరాంగుల కెట్టి
వెగటు దోపకుండ వేల్పు దాయ. 159

చ॥ తన కతఁ గన్నవారి మది తల్లడమంది కలంగకుండు రీ
తిని గమకింపఁ బోనడచి, తీవ్రత వెల్వడకుండు నట్లుగా
ననువున గూర్చి నట్టి దనుజాంగన కౌఁగిలి మెల్లఁగా సడ
ల్చి నగవు మోము నూని; యిటు సీతనుఁ జూచి వచించె నిట్టులన్

క॥ విన రెవ్వరు నీ గోడును
గన రెవ్వరు నీదు పాట్లు, కావున నిందే
మనవలె నా యగ్గమునన్
వనమున రాముండు చచ్చినాఁడో యేమో! 161

క॥ పరునింట నిన్నిదినములు
చరించినట్టి సతినిఁ గడు చక్కని దానిన్
బరువుగల మగడెవండును
బరిగ్రహించునె; త్యజించు బంభరవేణీ! 162

గీ॥ రెండు మాసాల వ్యవధిలో నిండు కూర్మి
నాదరింపక పోయిన, నబ్జ వదన,
పంపు వాఁడను గాలుని పట్టణమున
కంచుఁ జెప్పెను రావణుం డవని సుతకు. 163

ఉ॥ సీతను జుట్టి కాఁపుదల సేయు భయంకర రాక్షసాంగనా
వ్రాతముఁ జూచి రావణుఁడు బల్కె "మృదూక్తులనైన క్రూరమౌ
చేఁతలనైన మార్చవలె సీత మనంబు" నటంచు సమ్మదా
పేత మనస్కుఁడై చనె నభీష్టము కూడని కారణంబునన్. 164

వ॥ అంత రాక్షసాంగనలు సీతతో. 165

క॥ రావణుని వైభవంబును
జేవయు నబ్బలియుఁ జేరఁ జెందెడి సుఖముల్
కావరమునఁ గాదనినన్
జీవితమునఁ గలుగు వెతలు చెప్పిరి వారల్. 166

క॥ కన్నుల నీరము చిప్పిల
విన్నఁదనము దోప నచటి వికృతాస్యలకున్
దిన్నని మాటలఁ దగదని
యన్నెలతుక సెప్ప, వార లాగ్రహవశలై. 167

క॥ చంపెద మనియున్, మఱి నీ
సొంపగు దేహంబు నల్ల జుర్ఱెద మనియున్
అంపపుఁ గోరల మాంసము
నింపుగ భుజియింతు మనియు నేర్పడఁ బలుకన్. 168

గీ॥ రాక్షసస్త్రీల బెడిదంపు రావమునకు
గాఢమైనట్టి నిదురలోఁ గలలు గనెడి
త్రిజట యను రాక్షసాంగన తివిరి లేచి
దనుజ కాంతల వారించెఁ దగదటంచు. 169

వ॥ అంతఁ ద్రిజట యిట్లనియె. 170

క॥ చాలింపుఁడు మీపలుకులు
పాలింపు మటంచు సీత పాదాబ్జములన్
వ్రాలుడు, మనలన్ గావఁగ
నీ లలనయె మనకు దిక్కు పృథివీస్థలిలోన్. 171

క॥ కలఁగంటి వేఁగు జామున
విలసిల్లెడు నీపురంబు విఱిగి కడలిలో
గలిసి నశించెను, రాక్షస
కులము హతంబయ్యె రాము కోలల చేతన్. 172

క॥ రావణుఁడు మునిఁగెఁ జమురునఁ
గావిరి వస్త్రములు గట్టెఁ గాలుని దిశకున్
వావిరి పరిజనములతోఁ
బోవఁగఁ గనుఁగొంటిఁ బోతు మూపున వడిగాన్. 173

క॥ శ్వేతాంబరుఁడై కాంతి
స్ఫీత గజం బెక్కి ప్రేయసీ యుక్తుండై
భ్రాతయగు లక్ష్మణునితో
భూతలపతి రామచంద్రమూర్తి వెలింగెన్. 174

క॥ కనకాంగద కేయూరము
లిన రశ్మిన్ బ్రతిఫలింప నేనుఁగు నెక్కెన్
ఘనుఁడగు విభీషణుం డొ
య్యన దనుజుల్ తన్నుఁ గొలిచి యభినుతి సలుపన్. 175

క॥ నాకల నిజమగు నేనిన్
బ్రాకటమగు బవరమందు రాముని చేతన్
సోకుల మన్నీఁడడఁగును
రాకా శశివదన సీత రామునిఁ బొందున్. 176

క॥ కావునఁ దర్శింపకుఁ డీ
దేవి నిఁక విభీషణుండు తేజముతో నీ
దీవికిఁ బ్రభుఁడగు మనలన్
గావఁగ నీసాధ్వి దక్కఁ గనుఁగొన మొరులన్. 177

క॥ శుభలక్షణ శోభిత యీ
యిభగామిని ప్రగ్గఁబోవ దిక్కట్టులలో
విభుఁ డీమెను రక్షించును
ప్రభువగు రావణుని జంపి భండన భూమిన్. 178

క॥ వెఱపుడుగుము సాధ్వీ నీ
చెఱఁ బాపఁగ రాముఁ డిటకుఁ జెచ్చెర వచ్చున్,
దురమున ప్రమందును రావణుఁ
డరమర నీకేల! నమ్మ హర్షముఁ గనుమీ! 179

ఆ॥ అనుచుఁ ద్రిజటవల్ల నవనీతసూజాత
సాంత్వనంబు నంది సంతసమున
మంచు వీడినట్టి మంజరి వలెఁ దోచెఁ;
బలికె సమయ మెఱిఁగి పవనసుతుఁడు. 180

సీ॥ సరయూనదీతీర సాకేత రాజ్యమ్ముఁ
బాలించె దశరథ పార్థివుండు,
పుత్త్రుల నల్వురఁ బురుషోత్తములఁ గనెఁ
బుత్త్ర కామేష్టిని బూని చేసి,
రాజకుమారులన్ రాముండు జ్యేష్ఠుండు
పటుతర విక్రమ బాహుబలుఁడు,
శస్త్రాస్త్రవిద్యల సాటిలేని మగండు
సుగుణాలవాలుండు సుందరుండు
రక్షించు ధర్మమున్ రక్షించు లోకము
నాత్మధర్మంబును నాత్మజనుల
చిఱుత ప్రాయము నందుఁ జెనటి రక్కసులను
యజ్ఞ రక్షణకునై హతమొనర్చె,
కాలకంఠుని పెను కార్ముకంబును ద్రుంచి
సీతమ్మ మురువైన చేయి పట్టె,
రాజ్యాభిషేకంబు రామునకుం జేయ
సమకట్టె దశరథ చక్రవర్తి,
తగదని కైకేయి తన పుత్త్రు భరతుని
రాజొనర్పు మటంచు రచ్చఁ జేసి

గీ॥ పంపె రాముని బదునాల్గు వత్సరములు
కాననంబున నివసింపఁ గఠిన వృత్తిఁ;
బ్రాణనాయకు నెడఁబాసి బ్రదుక లేక
వెంటనంటెను జానకి విపినములకు. 181

గీ॥ తపసి వేసమ్మును ధరించి తరుణిఁ గూడి
రాఘవుఁడు లక్ష్మణుఁడు వెంటరా, వనమున
మునుల మన్నలన్ బొంది ముదము మీఱఁ
జిత్రకూటంబు సేరి వసించు చుండ. 182

గీ॥ వచ్చె నొకనాఁడు భరతుండు భక్తితోడఁ
దల్లి సల్పిన పాపానఁ దలను వ్రాల్చి
చిత్రకూటంబునకుఁ గడు చింత మునిఁగి
యన్న పాదంబులం బట్టి యటమటించె. 183

గీ॥ 'అగ్రజా, రాజ్యమే నొల్ల' నని భరతుఁడు
పాదముల వ్రాలి ప్రార్థింపఁ బాదుకలను
రాఘవుం డిచ్చి నియమించెఁ బ్రతినిధిగను
భరతుఁ బాలింప ధరఁ దన పదవియందు. 184

వ॥ ఆవల సీతారాములు లక్ష్మణునితో. 185

గీ॥ చిత్రకూటంబు వీడి విచిత్రములను
గహన పథములఁ గాంచుచుఁ గాలినడకఁ
గతిపయ దినంబులకుఁ జేరి కట్టిరొక్క
పర్ణశాలను గౌతమీ పంచవటిని. 186

వ॥ ఆ పంచవటి చేరువ పర్ణశాలలోఁ గొంతకాలము నివసించిరి.
ఒక్కనాఁడు. 187

సీ॥ రాముని గవయ శూర్పణఖ రా సౌమిత్రి
చెక్కెను రక్కెస ముక్కు చెవులు,
చెలియలకై పోరుసేసిన ఖర దూష
ణాదుల రాముండు హతమొనర్చె,
మాయామృగంబైన మారీచు వంచన
చే రామలక్ష్మణుల్ దూరమరుగ

మని రూపమున వచ్చి మోసాన జానకీ
దేవిని గొంపోయె రావణుండు,

గీ॥ వ్యోమ పథమున నేగుచు నువిద సీత
యెలుఁగు రాపద నేర్వంగఁ బులుఁగు ఱేఁడు
రావణుని తోడ సమరంబు రహినొనర్చి
ధరణిఁ (బ్రాలెను ఱెక్కలు విఱిగి సురిగి.

సీ॥ రామలక్ష్మణులు ధరాసుతన్ గానక
యడలుచు వెదకి నారటవు లెల్ల,
ఋశ్యమూకమున సుగ్రీవునిం జేరిరి,
సఖ్యమ్ము వాలితో సలిపినారు,
వాలిని గూలిచి ప్లవగ రాజ్యమునకు
నేతగా సుగ్రీవునిం బొనర్చ
నాతండు సీతామహాదేవి జాడను
దెలియంగ నాలుగు దిక్కులకును
బంపిన వారిలో వాయు తనూజుండ
దక్షిణదిశ కేను దరలినాఁడ,
పక్షివరుండు సంపాతి సూచించిన
తెఱఁగుననే బయల్దేఱి వనధి
లంఘించి వచ్చితి లంకకుఁ జేరితి
రావణు నంతఃపురమ్ము నందు.

గీ॥ వెదకి కనలేక వేసారి విసిగి తుదకుఁ
గంటి నిచ్చోట శ్రీరాము కాంత నేను
ఏ సులక్షణములు రామనృపతి నొడివెఁ
లక్షితములయ్యె నా శుభ లక్షణములు.

క॥ శ్రవణామృతముగ రాముని
పవిత్రకథనిట్లు మధుర భణితిని మదికిన్
జవులూరించెడు స్వరమున
జవరాలికిఁ జెప్పె హనుమ సౌహృద మొప్పన్. 190

క॥ అరవిచ్చిన కనుదమ్ముల
వెఱపొందుచుఁ జూచె సీత వృక్షము పయికిన్
అరుణార్కుని బింబమ్మున్
బురణించెడు వాయుసుతుని మోముం గనియెన్. 191

ఉ॥ రాక్షస మాయ యౌనని ధరాసుత శోకము నొందు, భీతిమై
వృక్షము పైకిఁ జూచుఁ, గలయేయని యెంచు, మదిన్ గలంగు నా
భిక్షుకుఁడైన రావణుఁడె వృక్షచరుండయి వచ్చెనంచుఁ దా
నక్షుల నీరుగ్రమ్మ వెతనందును నించును వేడి యూర్పులన్.192

క॥ తరుచరుఁడు వృక్షముం దిగి
వరవర్ణిని బెదరు వాప వక్కాణించెన్
"వెఱపుడుగుము తల్లీ నే
కరువలి తనయుండ, రాము గాదిలి బంటున్. 193

క॥ ఎవ్వతె వొంటరి పాటున
నివ్వనమున గాసి నొంది, యీగతి ధూళిన్
మవ్వపుఁ దనులత మాయఁగ
నివ్వగ నుండగ హేతు వేమే తల్లీ! 194

క॥ కోమలి, వననిధి దాఁటితి
రాముని పని బూనితిన్, ధరాసుత కొఱకై
వేమఱు గ్రుమ్మరి కాంచితి
ధూమాంతర శిఖను బోలు తొయ్యలిని నినున్. 195

క॥ సురతరుణివొ, యక్షకులా
భరణమవొ, గరుడ జాతి వరపక్షినివో
యురగాంగనవో, నీ రూ
పరయఁగ దివ్యమని తోచు నద్భుత భంగిన్. 196

క॥ శ్యామవు, శాత్రవ గృహమున
బాముల కోర్చుచును స్వీయ పాతివ్రత్యం
బే మగువ యోముకొను? శ్రీ
రాముని దేవేరి వీవు - రాకేందు ముఖీ! 197

క॥ వనచరుఁ డీవిధిఁ బలుకుచు
జనకజ భయముడుప నామె సన్నిధి కరుగన్
దనుజాధిపుఁ డీరూపున
అనువున వంచింప వచ్చెనని యామె యనెన్. 198

క॥ శ్రీమంతుడైన దశరథ
భూమీశ స్నుషను జనక భూపతి పుత్రిన్
నామమునన్ సీతను నే
ధీమంతుడు రామచంద్రు దేవిని హనుమా. 199

క॥ చూడఁగ వ్రేలెడు లేవీ
వోడక సాగరము దాఁటనోపితివే? యే
వేడబయో యగునా? నీ
పోడిమిఁగన నాదు మదిని బొడమెను శంకల్. 200

వ॥ అంత సీతాదేవికి ప్రత్యయంబుఁ గలిగింపఁ దలంచి. 201

క॥ పెంచెను దేహము పావని
మించిన సుడిగాలిధాటి; మిన్నుం దాకెన్
జంచత్కాంచన ముకుట ము
దంచిత దీధితుల నెఱపి యద్రిం బోలన్. 202

క॥ జనకసుత పవన తనయుని
ఘనరూపము విస్మయంబు గడలు కొనంగన్
గనుఁగొనుచుండఁగఁ బావని
వినయంబునఁ దొంటిరూప వీక ధరించెన్. 203

వ॥ సీతాదేవికి స్వీయోదంత మిట్లు విన్నవించె. 204

క॥ అంజన తపము ఫలింపఁ బ్ర
భంజను నంశమునఁ బుట్టి బలియుఁడనైతిన్
గంజాప్తసుతుని సచివుఁడ
నంజిక యనుమాట యెఱుఁగనట్టి భటుండన్. 205

క॥ అని తన జన్మవిషయము ప
వనాత్మజుం డెఱుక పఱుపఁ బాయని శంకన్
జనకజ వర్ణింపుమనెన్
వినఁగోరుచు విభుని రూపు వీను లలరగన్. 206

వ॥ హనుమంతుం డిట్లనియె. 207

క॥ పలుకుల వర్ణన సేయఁగ
దలమే నీ విభుని సొబగు? తరుచరుఁడను నా
పలుకులు మన్నింపుము, నీ
యులుకును దీర్పన్ వచింతు నొగి వినుమమ్మా? 208

మ॥ సమమై యున్నతమై దృఢంబునయి శాస్త్వాంతంబునై సుప్రస
న్నమునై సారగభీరతాస్పదము విన్నాణంబునై భవ్యమై
కమనీయంబయి మందహాసరుచిరేఖా శోభితాస్యంబునై
కొమరారున్ రఘురామమూర్తి తగు పల్కుల్ లేవు వర్ణింపఁగన్.

గీ॥ చూడవలెనమ్మ శ్రీరాము సుందరతను,
వర్ణనన్ జేయ వశమౌనె వాణికైన?
బురుషులనె మోహవార్ధిలో ముంచఁ గలుగు
దివ్య కమనీయగాత్రుండు భవ్యమూర్తి. 210

సీ॥ అపురూపమైన నీలాంబరచ్ఛాయకు
మెఱుఁగులు దిద్దును మేనికాంతి,
పున్నమచందురు పాలపంబునకు వన్నె-
నొసఁగఁ జాలును హాసమొప్పు మోము,
కుముదసంతతులకుఁ గమనీయతం గూర్పఁ
గలుగును ద్యుతులీను కన్నుదోయి,
మదకరి గతులకు మర్యాద నేరుపు
ననవద్య గంభీరమైన నడక,

గీ॥ సాధు వాగ్ఝరి మకరంద మాధురిమకుఁ
గ్రొత్త తియ్యందనంబును గొసరి యిచ్చు,
నమ్మ, శాఖామృగంబున కలివి యగునె
నాకు శ్రీరామమూర్తి వర్ణనము సేయ? 211

క॥ అన్నకు నీడగు తమ్ముం
డన్ని గుణంబులను : గాని యపరంజికి మేల్
వన్నెను గూర్చు శరీరపు
వన్నియ గలవాఁడు భ్రాతృభక్తుఁడు దేవి! 212

క॥ ఏమని చెప్పుదుఁ దల్లీ
రాముని వ్యథ, నీవు లేమి రాత్రిం దివములో
వేమఱు నిను స్మరియించుచు
భూమిజ లేనట్టి బ్రదుకు పొల్లని వగుచున్. 213

సీ॥ నగుమోముగల స్వామి నవయుచు నున్నాఁడు
చింతాతురమ్మునఁ జెలియ లేమి,
ఏకతంబున నీదు స్మృతులు హేతువులుగా
వేఁడి నిట్టూర్పులు విడుచుచుండు,

అబ్జాకరంబుల యట్లు లోచనములు
నిరతంబుఁ గన్నీట నిండియుండు,
నొల్లండు స్నానంబు నోగిరంబును నిద్ర
వోవండు తనుకాంతి గ్రుంగె ధూళి,

గీ॥ నీదు రూపంబు నాత్మలో నిల్పి యెపుడు
ధ్యాన మొనరించుచున్న వాఁడమ్మ, నిజము,
గడపు గడియలు యుగముల కరణి, రాఘ
వుండు పురుషోత్తముండు నమ్ముము, శుభాంగి! 214

క॥ కలుముల చెలి చెలికానికిఁ
దులతూగెఁడి యందగాడు తోరపు వగచేఁ
గలువకనుల్ జలనిధులై
తలఁగన్ కోభిల్లు నీమొగము నెలఁ గనమిన్. 215

తరళ॥
కలికి కన్నుల నీరు చిప్పిలఁ గ్రాంత, నీకొఱ కేడ్చుచున్
బలవరించును ఖవల్లు రేలును బాధనొందును దీనతన్
సలుపుచుండును జపము నెప్పుడు జానకీ శుభమంత్రమున్
గొలుచు నీదగు మూర్తి నా యనఘుండు నిశ్చల బుద్ధితోన్. 216

క॥ చింతాభరమునఁ గ్రుంగి ని
రంతరమున్ దన్నుఁ దలఁచు రఘుఋని గాథన్
సాంతమువిని హర్షమ్మున్
వంతయుఁ బెనఁగొనఁగ జనకనందన గ్రమసెన్ 217

గీ॥ అనవాలుగ రాఘవుం డంపినాఁడు
ప్రేయసికి నీకుఁ దన యంగుళీయకమ్ము
నంచు హనుమంతుఁ డొసఁగిన; నవని తనయ
యధికమైనట్టి యాహ్లాద మనుభవించె. 218

కII క్రన్నన బాష్పములురలన్
జెన్నగు నుంగరముఁ గాంచి చేతం బలరన్
గన్నుల కద్దుకొని సఖుని
గన్నట్టి ముదంబునొందెఁ గాంతామణి తాన్. 219

ఉII నాథుని వ్రేలి యుంగరపు నామముఁ జూచుచు వ్రేలఁ జొన్పుచున్
నాథుని కూర్మి హస్తమున నర్మిలి గంధమలంది పేర్మిమై
నాథుని బొందినట్టి యలనాఁటి వివాహ మనోజ్ఞ దృశ్యముల్
బాధను గొల్ప-రాఘవుని పత్ని నిగిడ్చెను వేడి యూర్పులన్.220

వII ఉంగరము నుద్దేశించి యిట్లాక్రోశించె. 221

ఉII రాముని ముద్దుటుంగరమ! రత్నవిరాజిత హేమముద్రికా;
యేమని చెప్పె ప్రాణవిభు డేవిధి నుండెను చెప్పు మమ్మ; నా
స్వామి కరాంగుళిన్ వదలి; వాయుజుతో జలధిన్ దరించి గా
రామునఁ జూడ వచ్చితివ; ప్రాక్తన కర్మ విపాక దూషితన్. 222

కII ఇన్ని దినంబులు ననుఁగన
కున్నావటె, యెట్టులుంటి వూర్మిక, యౌరా!
మన్నాథు కూర్మినంతయు
గొన్నావటె, నన్నుఁ జూడకుండుట తగునే? 223

కII నాకన్న మిన్న వీవే
యా కౌసల్యాతనూజు నంగుళి వదలన్
లేకుంటివి, నే నిచ్చట
రాకాసుల మధ్యఁ జిక్కి రాయిడి వడితిన్. 224

చII పతి యెడఁబాటు నోర్చు కొనవచ్చునె సాధ్వికి! నాథుచింతచే
వెతను గలంగు సీత పరివేదనముం బరివృద్ధి సేయు సం
గతులఁ గెలంకుచున్నదది కాంతుని యుంగరమంచు నెంచి మా
రుతి వచియించె నిట్లు నెనరున్ వెలయించి సమాశ్వసించుచున్.

గీ॥ కష్టముల కాలమంతయుఁ గడచిపోయెఁ
గపులతో రామభద్రుండు కదలి వచ్చు
దుష్టరాక్షస గణములన్ ద్రుంచి వైచు
నీదు చెఱఁబాపి నినుగూడు నిజము నిజము. 226

క॥ వచ్చును రాముండిచటికి
చిచ్చఱ పిడుగట్లు చించి చెండాడు నినున్
ముచ్చిలి తెచ్చిన రావణు
నచ్చెరువున జగములరసి హర్షము నొందన్. 227

ఆ॥ అంతయేల నమ్మ యానతి నాకిమ్ము
చదును జేతు లంక క్షణము లోన,
దనుజవిభుని రావణుని ద్రుంచి నిన్ను నీ
ఱేనిఁ జేర్పఁగలను జానకమ్మ. 228

క॥ ఎక్కుము తిన్నం బోలిన
చక్కని నా వీపుమీద సాధ్వీ, త్రుటిలోఁ
జుక్కల వీథిం జని నే
గ్రక్కున నినుఁగూర్తు నీదు ప్రాణేశునకున్. 229

వ॥ పావని వాక్యంబుల కలరి సీతాదేవి యిట్లనియె. 230

ఉ॥ అంతటి వాఁడవే యగుదు వారసి చూడఁగ నాంజనేయ నా
యంతట నీదువెంటఁ జను టౌచితి గాదు; రఘూద్వహుండు ధీ,
మంతుఁడు వార్ధిదాఁటి రిపుమర్దనమున్ బొనరించి నాదు దుః
ఖాంతమొనర్చి నన్నుగొను టర్హమగున్ దలపోయ మారుతీ! 231

ఉ॥ ఓముమటంచు నావిభుని కొప్పిదమౌనటు చెప్పి తెమ్ము, నే
రాముని దక్క నన్యులఁ బరాకునైన స్పృశింప నోప, మా
యాముని వేషధారి కపటాత్ముఁడు రావణుఁడంటె నన్ను నే
నేమియుఁ జేయ లేక బలహీనత గ్రాన్పడి యుంటి భీతనై. 232

వ॥ మారుతీ! మన్నాథునకు నాపలుకుల నిట్లెఱింగింపుము. 233

గీ॥ క్రొవ్విన సను గాకి చీరంగఁ గోపమూని
వైవఁగా లేదె బ్రహ్మాస్త్ర మీవు నాథ,
అట్టి కూరిమి యేమాయె నాతతాయి
రావణుఁడు నన్నుఁ జెఱవట్ట రావదేమి? 234

గీ॥ చెమ్మటఁ జెరగిపోయిన చెంపబొట్టు
తుడిచి నిండారు కూర్మితోఁ దొల్లినీవు
మణిశిలా తిలకంబును బుణికి పెట్టి
నట్టి నామీఁది పేర్మి యేమయ్యె నయ్య! 235

క॥ గడువొసఁగె రక్కసుఁడు నే
నొడఁబడుటకు వత్సరంబు నోర్చితి నెటులో
కడపితిఁ బదినెల లిఁకనేఁ
గడపఁగ లేనంచుఁ దెల్పు కాంతుని దెమ్మా! 236

వ॥ అంతట మారుతి. 237

ఆ॥ నీదు వగపుఁ జూచి నే వచించితి క్షమిం
ప వలయును మదీయ వచనసరణి
ధర్మ సమ్మతములు తల్లి నీ పల్కులు
పంపు మమ్మ యానవాలు నిచ్చి. 238

వ॥ అని ప్రార్థింప. 239

క॥ నీలాంబర మధ్యంబునఁ
గ్రాలెడి యుడువీథి నడిమి గ్రహకూటము నా
నీలాలకముల పాపటఁ
గ్రాలు శిరోరత్న మొసఁగెఁ గపి ముఖ్యునకున్. 240

వ॥ దానిని గ్రహించి దేవతి కొంగునఁ బదిల పఱచి. 241

క॥ కడలిని దాఁటిన వెరవును
బుడమి సుతన్ గాంచినట్టి పొలుపున్ దెలుపన్
గడఁక మెయి వాయుదేవుని
కొడుకేచి యశోకవనముఁ గూలం ద్రోసెన్. 242

ఆ॥ చివర కొమ్మనుండి చెంగున దూకంగఁ
గొమ్మ విఱిగెఁ గ్రింది కుంజ మణఁగె
వాల మలఁతిఁ జుట్టి వడిలాగ వేరుల
తోడఁగూడి తరులు దొరలి పడియె. 243

క॥ హనుమంతుని యాగడమున్
వనపాలకు లడ్డఁ బోయి పరిభవపడి వే
చని రావణుతోఁ బవన సు
తుని చేష్టిత మెఱుక పఱుపఁ దొరపు టలుకన్. 244

క॥ కన్నుల నిప్పులు రాలఁగఁ
గ్రన్నన రావణుఁడు శౌర్యగర్వితులను బం
పె న్నైఱసరులన్ హనుమను
ఛిన్నాభిన్న మ్మొనర్చి చెండాడుటకై. 245

క॥ వచ్చిన రాక్షస సేనన్
గ్రచ్చ పొదను బోలు దాని గనుగొని వీకన్
హెచ్చరికఁ జేసె పావని
యుచ్చస్వనమూని యాగ్రహోద్రేకముతోన్. 246

చ॥ "పరమ పరాక్రమోజ్జ్వలుఁడు భాను కులాంబుధి సోము దూతనై
యరయఁగ రామపత్ని నిట నంబుధి దాఁటితి నామెఁగాంచి యా
తెఱవకు రాము సేమమును దెల్పితి నేగుచు వానరు లెట్టి వారొ మీ
కెఱుఁగఁగ జేయ నీ వనము నిట్లొనరించితి, రండు పోరికిన్. 247

క॥ రామునకు జయముఁ గూర్చెద,
రాముని సతిఁ దెచ్చినట్టి రాక్షస విభునిన్
గామాంధునిఁ, దత్పురమున్
భూమిని లేకుండ నాశముం బొనరింతున్." 248

క॥ ఇక్కరణి సింహనాదము
లుక్కునఁ గావించి రేఁగి యుద్భటుఁడై తా
నొక్కఁడె వ్రేల్మిడి సోఁకుల
నక్కజముగ జముని వీఁటి కంపం గలిగెన్. 249

క॥ చావక మిగిలిన వారలు
రావణునకు బవనసుతు పరాక్రమ రుచియున్
జేవయుఁ దెలిపిరి; సమర
ప్రావీణ్యము గల్గు దొరల రావణుఁ డంపెన్. 250

క॥ రెచ్చి సమీర కుమారుఁడు
పొచ్చెము రానీక దానవుల నవలీలన్
వచ్చెను: దైత్యుల నుఱిమెన్
బచ్చన బొమ్మలను జదుము బాలుని భంగిన్. 251

వ॥ ఈ విషయ మెఱింగి రావణుఁడు. 252

ఉ॥ మించిన కోపవేగమున మేను వణంకఁగ రావణుండు శౌ
ర్యాంచితుఁడైన నందనుని 'అక్ష' కుమారుని ఆంజనేయు శి
క్షించు నిమిత్తమంపెను; ప్రసిద్ధుఁడు వాఁడని సేయఁబోయె ని
ర్వంచిత బాహు విక్రమ విరాజితలీల నశోక వాటికన్. 253

క॥ బవరంబు సేయ వచ్చిన
యువకుని నత్యుగ్రతేజు నూర్జిత సత్త్వున్
బవనజుఁడు సూచి "యౌరా
పవిఁ దాఁకన్ బ్రసవ మొకటి వచ్చె" ననుకొనెన్ 254

కII హోరా హోరిగఁ బోరిరి
వారలుః పవనజుఁడు చెట్లు బండలు ఱువ్వెన్,
దారుణ శరముల నక్షుఁడు
మారుతిపైఁ గురియఁ జేసి క్రమ్మఁదఁగఁ జేసెన్. 255

కII మాయా యుద్ధ మొనర్పన్
ఛాయాక్రియ నక్షుఁ డెగిరె చదలున; కంతన్
వాయుజుఁ డుప్పరమునకున్
బోయి గ్రహించెన్ తదీయముల్ పాదంబుల్. 256

కII అక్షీణ బాహుబలుఁ డ
య్యక్షుని పాదములు పట్టి యవనిన్ గొట్టన్
అక్షణమున మరణించెను
రక్షోవిభు నందనుండు రక్కసు లార్వన్. 257

వII అంతట రావణుండు అక్షకుమారుని మరణంబు విని తన
కుమారు నింద్రజిత్తునిఁ గని. 258

ఉII తుంటరి వానరుం డొకఁడు దుర్జయుఁడైన భవత్సహోదరున్
దంట నెదిర్చెనా? యతని ధాటికి నిల్చెన? చంపెనట్టె! ము
క్కంటిని సైత మోర్వగల గండరగండఁడు కోఁతి చేఁబడెన్
వింటిమి ఘోరవార్త, సరవిన్ గపిఁ బట్టుట కీవె పోవలెన్. 259

కII ఇంద్రు జయించిన వాఁడ వు
పేంద్రుని కీడైనవాఁడ వీవు వెసన్ ని
స్తంద్రుఁడ వైచని వైరిని
సంద్రమునన్ ద్రోసి రమ్ము చంపి కుమారా! 260

ఉII సోదరు చావు వార్త మదిఁ జొచ్చి దవానలమట్టు లేర్చుటన్
వేఁదుఱుగొన్న వాని కరణిన్ రణరంగముఁ జేరఁబోయి యా
వేదన మూదలింప నలిపెన్ గపిపైఁ బటు సింహనాదముల్
రోదసి నిండఁ జేసెను, విరోధిని జూచెను రూక్ష దృష్టులన్. 261

కః కోఁతి పయిఁ బఱపె నాతఁడు
హేతి వ్రాతమును బోని యిషువుల విలస
చ్చాతుర్య లాఘవముతో
వాతాత్మజు మేను తూట్లు వడి జల్లెడగాన్. 262

సీః విస్ఫులింగంబుల వెదజల్లు నమ్ములన్
ఫూత్కారముల వాయుపుత్త్రుఁ డార్పె,
వాయువేగమ్మున వచ్చు బాణమ్ముల
వాతాత్మజుఁడు కేలఁ బట్టి విఱిచె,
సురశిలీముఖములు కరువలి తనయుని
ఉక్కు దేహముఁ దాఁకి ముక్కవోయె,
వజ్రసన్నిభములౌ బాణముల్ వడివచ్చి
యాంజనేయుని మేన నణఁగి పోయె,

ఆః మొనసి యింద్రజిత్తు పుంఖాను పుంఖమ్ము
గా నిగుడ్చు నిశిత కాండ చయము
హనుమపట్ల వ్యర్థమగుచుండె, నీభంగిఁ
జండ భండనంబు జరుగుచుండె. 263

ఉః పావని యింద్రజిత్తుపయి వైచెడి గండశిలల్ కుజంబులున్
వావిరి నింద్రజిత్తు తన బాణ పరంపరలన్ వెలార్చుచున్
జేవ యెలర్పఁ ద్రుంచుచు ననిన్ బురణించెను గాని, పావనిన్
రావణి గెల్చు మార్గము కనంబడదయ్యె గణించి చూచినన్. 264

కః కరువలి సూనుని విక్రమ
మరికట్టగ వెఱవు గనమి యటమటి పడుచున్
సురవైరి సుతుఁడు వైచెను
బరిపంథి విదారణంబు బ్రహ్మాస్త్రంబున్. 265

మ॥ వర బ్రహ్మాస్త్రము చేత మూర్ఛిలిన శాశ్వత్తేజునిన్ బావనిన్
ధరపైఁ గాంచి నిశాచరుల్ జయ జయ ధ్వానంబులన్ సల్ప ని
ర్భరమోదంబున; దేవతాగణము దుర్వారంపు దుఃఖంబునన్
సరవిన్ గన్నుల నీరునింప, మెఱసెన్ దా నింద్రజిత్తుగ్రుఁడై 265

క॥ సామాన్య వానరుండని
భూమిని బడినట్టి పవనపుత్రునిఁ బ్రాళ్ళన్
వేమఱుఁ గట్టిరి కొట్టిరి
పామరులగు రక్కసీండ్రు వలనెఱుఁగమిచేన్. 267

గీ॥ రక్కసులు మారుతాత్మజున్ బ్రాళ్ళ చేతఁ
బట్టి పడవేయఁ గొంతసేపటికి వదలి
పోయె బ్రహ్మాస్త్ర బంధమ్ము : బుద్ధిహీను
లహహ, యెఱుఁగరు బ్రహ్మాస్త్ర మహిమ వారు. 268

క॥ అసువులు బాయక పావని
వసుమతి మూర్ఛిల్లె, బ్రహ్మవరమున బ్రదికెన్
వెస మూర్ఛనుండి తేఱను
గసిమై రక్కసులు త్రాళ్ళఁ గట్టిన కతనన్. 269

క॥ పావని బలహీనుని వలె
నోవిని గని బంధనమ్ము నోర్చుచు మెలఁగెన్:
భావింప మేని సుఖములు
పోవిడువం దగవె పనులు పొసగించుటకై. 270

క॥ చుట్టుకొని పవన పుత్రుని
గట్టిన రజ్జువులఁ బట్టి కలకల నగుచున్
నెట్టుకొని పోయి రావణు
కట్టెదుట న్నిలిపినారు కడిఁది పలాశుల్. 271

ఆ॥ తాను దెచ్చి నట్టి తన్వీలలామతో
ముచ్చటించి తోటఁ బొలియఁ జేసి,
యసుర బలము నొంచి యక్షుని బరిమార్చి
నెగడుచున్న కోఁతి నిక్కఁ జూచి. 272

క॥ భగ్గుమన మేను కోపపు
వెగ్గలమునఁ గనుల రక్త బిందువు లురలన్
నిగ్గడి దశకంఠుఁడు తా
దిగ్గన ధరఁదన్ని పలికె దీమస మెసఁగన్. 273

ఉ॥ ఎవ్వడ వోరి, కోఁతి, యిటకేమి కతంబున వచ్చినావురా,
మవ్వపు తోటఁ జొచ్చి విసుమానముగా విహరించుటేలరా!
అవ్వనజాయతాక్షికి రహస్యము లేమి వచించి నావురా!
చివ్వకు కారణం బెఱుగఁ జెప్పుము క్రొవ్వడగింతు మూర్ఖుఁడా!

చ॥ తెలియదొ నీకు, వృక్షచర, దేవతలైనను మత్పురంబు నేఁ
బిలువక నాదు సేవకయి వేఁడుకకైనను జూడఁ బోరురా;
తులువ, యెఱుంగఁబోక, కుమతుల్ గడుఁ జెప్పఁగఁ గ్రుళ్లితో మహో
జ్వలదురు వహ్నికీలల విశంకట వృత్తిని మక్షికంబునాన్. 275

వ॥ అని యడుగ నాంజనేయుఁ డిట్లనియె. 276

సీ॥ నీ భ్రాత వనచర నేత సుగ్రీవుండు
నీ క్షేమ మడిగెను రాక్షసేశ;
ఆ మహాత్ముని పల్కు లాచరణీయముల్
ధర్మార్థ మిహపర తారకమ్ములు;
దశరథ ధరణీశ తనయుండు శ్రీరాముఁ
డనుజుతో పత్నితో వనికి వచ్చె;

పతినంటి వచ్చిన పరమ పతివ్రత
సీతమ్మ వనములోఁ జెదరి పోయె;
ఆమెను వెదకుచు నాయన్న దమ్ములు
చెలిమి సుగ్రీవుతోఁ జేసి నారు
వాలిని రాముండు వధియించి - కపిపతి
సుగ్రీవు నొరించె; సుదతి జాడ
దెలియ సుగ్రీవుండు దిక్కుల నెమకను
వానర సేనలఁ బంపినాడు.

గీ॥ వారిలో నేనొకండను వాయు సుతుఁడ
అవని జాతను వెదకుచు నబ్ధి దాటి
వచ్చి సీతనుఁ గంటి నీ వనము నందు
వింటి నీ దుష్టచేష్ట; నప్రియము గొల్పె. 277

క॥ నినుఁ గనుటకు వనిఁ జెఱచితి,
ననిసేయన్ వచ్చినట్టి యా యుధికుల నా
తను రక్షణకై చంపితిఁ,
గనినాడవు కపుల ధైర్య గరిమన్ మహిమన్. 278

క. కలరెందఱొ నను మించిన
బలియులు సుగ్రీవు బంట్లు వానర యోధుల్
పలికెద విహితోక్తులు విన
వలయున్ గపిరాజు చెప్పి పంపిన మాటల్. 279

మ॥ గణనీయంబగు బ్రహ్మవంశమున భాగ్యం బార జన్మించి, స
ద్గుణముల్ చొప్పడఁ జేయు శాస్త్రములు నీతుల్ నేర్చియున్
నీవు రా
వణ, రామప్రియ, జానకీ రమణినిన్ బట్టంగ ధర్మం బొకో?
క్షణికోద్రేకపు దుష్టచేష్టలను జక్కందిద్ది మేల్కాంచుమా? 280

కII కరుణాఢ్యుఁడు రాముఁడు ని
స్సర మరలేకయె క్షమించు నార్యను సీతన్
త్వరపడి యర్పింపుము దా
శరథికి, నర్థింపు మతని శరణము భక్తిన్. 281

కII చోరత్వము నీచం బది
జారత్వ మధికముగ నభిశంసన మొందున్
చోరత్వము జారత్వము
వీరుఁ డవగు నిన్నుఁ బట్టె విధి నేమందున్. 282

కII పరభార్య నంటనగునా?
ధరణీపతి వీవు ప్రజల ధర్మ పథమునన్
వఱలం జేయుట వెఱవని
మఱచితివా? పట్టఁ దగునె మగనాలి నిటుల్? 283

కII పోఁగాలము దాపురమై
యీ గాలము నందుఁ జిక్కి యిక్కట్టులలో
నూఁగాడుచున్న నీకున్
బాగోగులు సెప్ప మిత్రవరు లిట లేరా? 284

కII గొంతున కురియగు సీతా
కాంతామణిఁ గోరనేల? కంతుని కొఱకై
మంతనములు సలుపుదువా?
కంతునిఁ గనఁగోరి నీవు కాంతువు కాలున్. 285

కII కులమును గుణమును గలిగిన
వెలఁదులు రతిఁ బోలు చెలులు వేనకు వేల్ నిన్
గలియఁగ గనుపన్నులలో
మెలగఁగ, రామానురక్త మెలఁత వలయునే? 286

గీ॥ సాగరోత్తుంగ వీచికా చయము వోలె
మందు వేసంగి గాడ్పుల తండము వలె
ఘోర లయకాల వర్షాంబుధార లట్లు
ప్లవగ బలములు దండెత్తు లంక మీఁద. 287

ఉ॥ సార పరాక్రమాఢ్యులు యశస్వులు ధీరులు భూరిసత్త్వ గం
భీరు లుదగ్రకాయులు పవిత్రచరిత్రులు యుద్ధ పండితుల్
భూరుహ భూధరాయుధులు ముష్టి విదారిత శత్రుమస్తకుల్
వీరులు వానరుల్ ప్రకటవేగులు మట్టరె నిన్ను ముట్టడిన్. 288

క॥ ఒక్కండ నేనె చాలుదుఁ
జక్కాడఁగ నిన్ను నీదు సైనిక చయమున్
నిక్కమ్ముగ నీ ప్రాణము
దక్కించెను రామమూర్తి తన శపథముచేన్. 289

క॥ మానవుఁడు రామచంద్రుఁడు
వానరుఁ డర్కజుఁడు బ్రహ్మవరములు నిన్నో
దానవ కాపాడవు నీ
మాన ప్రాణముల : మానుమా మౌఢ్యంబున్. 290

చ॥ విను మసురాధిపా! యనుభవించితి వీవు తపః ఫలంబు; ధా
త్రిని గల సర్వసౌఖ్యములఁ దేలి మనోహర లీల; నింక నీ
కనుభవ మౌను దుష్కృత దవానల కీలలు నీ మహత్త్వమున్
గనలఁగఁ జేయ భస్మముగ; కన్నుల విప్పి చరింప మేలగున్. 291

వ॥ ప్రభంజన సూనుని యీ వాక్యంబులకు రావణుం డత్యంత
రోషావేశ పరవశుండై యిట్లనియె. 292

క॥ వెంపరలాడన్ వచ్చిన
తెంపరి యీకోఁతి దీని తిమురున్ ద్రుటిలో
దింపుడు కశఘాతమ్ములఁ
ద్రుంపుడు ఖడ్గముల వీఁడు రూపఱు భంగిన్. 293

వ॥ అంత గుణభూషణుండగు విభీషణుం డిట్లుపదేశించె. 294

క॥ తగదీపని దనుజేంద్రా
జగతిన్ దూతలను జంపు చర్య యధర్మం
బగుఁగాన వేఱు శిక్షన్
దగినటు విధియించి వీని దండింపఁదగున్. 395

వ॥ అని ప్రబోధింపఁబడి రావణుండు. 296

క॥ చొచ్చెను మన నగరంబును
విచ్చల విడిఁ దిరిగె, వీని పెను వాలమ్మున్
జెచ్చెరఁ గాలిచి పంపుఁడు
పొచ్చెపు వాలిఁడె తనమ్ము బూనెడు కరణిన్. 297

క॥ రావణు నానతి గుడ్డల
ప్రోవులు తైలమున ముంచి పొంకమెలర్పన్
బావని తోకకుఁ జుట్టిరి
పావులు రక్కసులు దహను పాల్చేసి రొగిన్. 298

వ॥ అప్పుడు హనుమంతుఁడు. 299

క॥ కట్టిన బంధంబుల నొక
పెట్టునఁ బ్రిదులంగఁ జేసి పెను కేకలతో
నెట్టన దనుజ భటాళిన్
గొట్టెను రావణుని లంకకున్ నిప్పు నిడెన్. 300

క॥ కాపున్న దనుజ కాంతలు
భూపుత్త్రిని జేరఁబోయి పొలఁతీ కపికిన్
బ్రాపించెఁ గీడు, దగ్గుం
డైపోయెన్ వానరునకు హావడి కల్గెన్. 301

వ॥ ఈ వార్త విన్న సీతాదేవి. 302

కII తనకై యిక్కట్లం బడి
దనుజుల ద్రోహంబు కతన దగ్ధుండగు నం
జన తనయుఁ గావుమని తా
ననలుని బ్రార్థించె నార్త యై యాకులతన్. 303

కII వగఁ బొగిలి జనక నందన
తగ వహ్నిని మానసమున ధ్యానమొనర్పన్
సెగ సోకలేదు హనుమకు
తొగ చెలి వలెఁ బావకుండు తోచెన్ గపికిన్, 30౪

కII అనలుని చల్లందనమును
హనుమంతుఁడు జనకజాత యాశీర్వాదం
బునఁ గలిగిన ఫలమని యా
మెను సంస్తుతి సల్పి యెగసె మినువీథి కొగిన్. 305

సీII కోట కొమ్మకుఁ జేర గుప్పించి లంఘింప
నొప్పెఁ దారాజువ్వ యోజ నెనసి,
వాలంబు పొడిగించి వలయాకృతిం ద్రిప్పఁ
దనరారెఁ జక్రాయుధంబు మాడ్కి
నున్నత స్థానంబు నుండిదూకగఁ దోక
చూపట్టెనది తోకచుక్క కరణి,
జ్వాలికా మాలికా పరివేష్టితుండయి
యాకృతిం గాంచిన యగ్ని భంగి

గీII దోచె మారుతి : మందిర స్తోమములను
హర్మ్య సందోహములఁ గాల్చె, నతని చేత
బూది చేయంగఁ బడనట్టి దేదిగాని
మృగ్యమయ్యె, విభీషణు నిల్లు దక్క. 306

సీ॥ దినమణికై మరుత్తనయుఁ డెత్తిన ధూప
మన ధూమలత దివంబునకుఁ బ్రాకె,
బ్రళయాంబుదంబులు పర్వీన చందాన,
దట్టంపుఁ బొగలు దిక్తటులఁ గ్రమ్మె,
నమవసనిసి నాటి యంధకారమ్ములు
నెఱసి రోదసియెల్ల నిండుకొనియె,
మిలమిలలాడెడి మిణుగురు లట్టులు
విస్ఫులింగంబు లావిర్భవించె,

ఆ॥ నగ్ని పర్వతంపు టార్భటుల్ చెలరేగఁ,
బ్రజ్వరిల్లె మంట పలువిధములఁ
బూని పవన సుతుఁడు పొంగి విజృంభించి
కలయఁ దిరిగి లంకఁ గాల్చినపుడు. 307

గీ॥ సుళ్ళు దిరుగుచు ధూమంబు సూడ నొప్పె
వ్యోమకేశుని బెడిదంపు బొమముడి వలె
మెలఁగు మిడుఁగురుల్ పొగమధ్య మెఱయ నొప్పెఁ
ద్రిపురసంహారి ఫాలాగ్ని దీప్తివోలె. 308

క॥ ఈ విధమున రావణు లం
కావిభవంబును దహనుని కాహుతిఁ జేసెన్
బావని; రక్కసి మూకల
జీవమ్ములు తల్లడిల్లి చిడిముడి పడగన్. 309

క॥ వాలము జలనిధి నార్పన్
జాలము నొనరింప కవనిజన్ జూచి మహా
భీలంబగు వారిధి ను
ద్వేలగతిన్ వాయువీచి విధమున దాటెన్. 310

క॥ తన రాక కెదురు సూచుచు
వననిధి గట్టునను నిలిచి వనచర వీరుల్
గనుచుండ వాయుపుత్త్రుఁడు
వినువీధిన్ వచ్చి దిగియె వేడ్క సెలంగన్. 311

క॥ కనుఁగొంటిని జానకి నని
హనుమంతుఁడు పలికె మిత్రులందఱు హర్షం
బున వీనుల విందుగ విని
గొనకొని వీరాంజనేయుఁ గొనియాడంగన్. 312

క॥ అంగద జాంబవదాదులు
పొంగెడు నానందజలధి మునుకలు వేయన్
జెంగున దుముకుచుఁ ద్రుళ్ళుచు
సంగీతాలాపనములు సలిపిరి ప్లవగుల్. 313

ఆ॥ లంకయందుఁ దాను లంకిణి నోర్చిన
తెఱఁగు మఱియు సీతకొఱకుఁ బురము
కలయ వెదకి యామెఁ గనుఁగొన్న వెరవును
దెలిపె లంకఁ గాల్చు తెఱఁగుఁ గూడ. 314

వ॥ జానకీదేవిని గుఱించి యిట్లు వచించెను. 315

గీ॥ అవని గల సద్గుణమ్ము లా యవనిజాత
మెప్పు గోరుచు నామెతో నొప్పి యుండు
అందము తపం బొనర్చి యా యన్నుమిన్న
కన్ను సన్నల నెప్పుడు గ్రాలి యుండు. 316

ఆ॥ బాగు బాగు బేసు బళిబళీ యని వాయు
పుత్త్రు నుడుల మెచ్చి పొగడు చుండఁ
గపులు పవనసుతుఁడు విపులమ్ముగా నివే
దించె నుడుల తీరు తియ్య మెసఁగ. 317

తే॥ అంగదాదులు వెంటరా నాంజనేయుఁ
డరుగు చుండఁగ రాముని కవనిజాత
చరిత మెఱిఁగింప; వారలు చక్కనైన
మధువనంబును గాంచిరి మార్గమందు. 318

ఆ॥ దేవతలకుఁ గూడఁ దేఱి చూడఁగరాని
లలిత మధు వనమును లాలసులయి
వానర ప్రవరులు వన విహార మొనర్ప
నంగదాజ్ఞ వేఁడ నాతఁ డొసఁగె. 319

క॥ పసలేని భోజనంబును
మెసవుచుఁ బయనం బొనర్చి మేనులు వాడన్
పసిచెడిన వృక్షచరులకుఁ
బసందు మధువనము దొరకె ఫలభరితంబై. 320

క॥ త్రోపుడు లాడుచు నొంతొరు
వీఁపులపై నెక్కి దుమికి వేఁడుక సెలఁగన్
బ్రాపించిన మధువానుచుఁ
గాపేయ క్రీడలందుఁ గడపిరి కీశుల్. 321

క॥ అదలించుచు బెదరించుచు
వదరుచు వడి వచ్చినట్టి వనపాలకులన్
విదలించి చావఁగొట్టిరి
మదమున మధుమత్తులైన మారుత్యాదుల్ 322

క॥ దెబ్బలుదిని వనపాలురు
గొబ్బున సుగ్రీవుఁ జేరి కోఁతులు వనమున్
దబ్బిబ్బుఁజేసె రన విని
గుబ్బిన సంభ్రమము మాని సుగ్రీవుండున్. 323

క॥ రామునకున్ సౌమిత్రికి
నామధువనమందు జరిగినట్టిది తెలిపెన్
సామీరి జనకతనయా
క్షేమము గనియుండు ననుచుఁ జెప్పె నెలమిమై. 324

క॥ ఆమీఁదట సుగ్రీవుఁడు
సామమునన్ బిలువనంపె సరగునఁ గపులన్
బ్రాముకొని మధువు నానుచు
నేమఱి యున్నట్టి వారిఁ గృతలక్షణులన్. 325

క॥ సుగ్రీవుని యాజ్ఞను విని
నిగ్రహమును బూని కపులు నేర్పునఁ గార్య
వ్యగ్రులయి బయలు దేరిరి
అగ్రేసరుఁడై రహించె నంగదుఁడె లమిన్ 326

ఆ॥ వచ్చి కపులు రామభద్రు పాదములకు
మ్రొక్కి వారు నిలువ మోడ్పుఁ గేలఁ
బవనసుతుఁడు సెప్పెఁ బరమ వినీతితో
జనకసుతను గన్నచంద మిట్లు. 327

క॥ క్షితిఁగనని క్షితి తనూజను
బతి చరణధ్యాన యోగ పారీణను స
న్నుత చారిత్రను గంటిని
వ్రత నియమిత పూతవృత్త భవ్య గుణాఢ్యన్. 328

క॥ లంకాపురమున వెదకితిఁ
బంకజముఖి సీత కొఱకుఁ బరికించితి నే
లంకేశు నంతిపురమున
శంకను విడనాడి వెదకఁ జాలితి నెఱతోన్. 329

క॥ మనుజాశను మందిరమునఁ
గనజాలక కలియఁ దిరిగి కడ కాదేవిన్
ఘన శోక వనధి మునిఁగిన
వనితను గాంచితి నశోకవన వాటికలోన్. 330

సీ॥ వసివాడ నెమ్మేను వగలందుఁ బొగలుచు
మసి పాఁతవలె చీర మాసి ముసర,
సంస్కారహీనమై జడ చిక్కువడి వ్రాలఁ
గన్నీటి చారలు గడలు కొనఁగ
బెదరుచు నెవ్వేళ బెడిదంపు పలుకుల
రక్కసి జంతలు వెక్కిరింప,
నిస్పృహ మనమున నిండి యుండఁగ నెప్డు
మరణమున్ గోరుచు మాననీయ,

గీ॥ కన్నులందునఁ బ్రాణముల్ గలిగి యుండి
సాధ్వి కసిమసి నొందుచు నసి దొరంగి
స్మరణ సేయుచు మీపేరు సంతతంబు
శోకమూర్తియై యుండు నశోకవనిని. 331

క॥ మీరిచ్చిన రత్నాంగుళి
నా రామ కొసంగినాఁడ నామె స్మరించెన్
గారడవుల మీతోడన్
గారామునఁ గడిపి నట్టి కాలమ్ము ప్రభూ! 332

క॥ అలనాడు వాయసపు దు
ర్విలసితమున్ జూచి రోష వివశుఁడవై కా
వలపుం గాకిని గూల్పఁగ
బలియుఁడ వేయంగ లేదె బ్రహ్మాస్త్రంబున్. 333

కll ఆటువంటి వారలయ్యున్
బటుతర శస్త్రాస్త్ర చయము పంక్తివదనుపై
దిటవూని వైచి చంపక
యిటులీ వున్నట్టి హేతువేమీ స్వామి! 334

కll అని కుందుచుఁ జెప్పెను గా
ననమున మీరొక్క నాఁడు నర్మిలి పేర్మిన్
మణిశిల తిలకము చెక్కుట
ననువున దిద్దిన విధంబు నశ్రునయనయై. 335

గీll మాసములు రెండు గడువిచ్చె మనుజవైరి
జనక తనయకు, నేను సాంత్వనము పలికి
గడువు లోపల మిమ్ముఁ దేగల నటంచు
నామెతోఁ జెప్పి వచ్చితి రామచంద్ర! 336

గీll అనవాలుగఁ బంపె మీ కవనిజాత
ప్రాణపదమైన యీ శిరోరత్న మనుచు
దాని శ్రీరాముని కొసంగి మాననీయుఁ
డైన పవనాత్మజుఁడు నిల్చె నంజలించి. 337

గీll ఆత్మసఖి శిరోభూషణంబట్టి ముఖమున
జేర్చి యక్కున యవని జాశ్లేషమొందె
శోక వార్నిధి దరిఁ జేర్చు నౌక వోలె
నంజనాపుత్త్రి సందేశ మతనిఁ దేర్చె. 338

కll నీలాంబుద రుచిమత్తను
లీలా శ్రీరామమూర్తి, లేఖర్షభ ర
క్షాలాభకీర్తి, భూమిసు
తాలలనా హృదయవర్తి, ధర్మస్ఫూర్తి! 339

ఓం తత్సత్.

మ॥ హృదయాహ్లాదక రామపాదయుగి ని
త్యైకాగ్రతన్ ధ్యానమున్,
మదిలో సల్పెడి దుగ్గిశెట్టి నరసిం
హశ్రేష్ఠికిన్, లక్ష్మికిన్
ముదమున్ గూర్చు తనూజుడన్, 'రమణుడన్'
బొంగారు భక్తిన్ రసా
స్పదమౌ సుందరకాండమున్, రచన సే
సద్భక్తితో గూర్చితిన్.



శ్రీ మహితోజ్జ్వల వక్షా!
సామజపతి మోక్షదాత! సన్ముని వినుతా!
కామితఫలదాయక! శ్రీ
భూమిసుతా హృదయవర్తి! మునినుత కీర్తీ! 1

వ॥ శ్రీరామచంద్రుండు చెంతనున్న సీతావృత్తాంత ధురీణుండగు మారుతిం గాంచి యిట్లనియె, 2

క॥ అన్న, పవనాత్మజా! నిను
మన్నించి యొసంగఁ దగిన మాణిక్యంబుల్
చెన్నైనవి గలవే యిల
విన్నాణిన్ నిన్ను గౌరవింతున్ సతమున్. 3

క॥ అని పలికి రామచంద్రుఁడు
తన బాహుద్వయము సాచి ధాత్రిజ వార్తన్
గొనివచ్చినట్టి ధీవరు
ననిలజునిం గౌఁగిలించె నాదర మొప్పన్. 4

క॥ నీరధి నెటు దరియింతున్
నీరజముఖి సీత నెపుడు నెమ్మినిఁ గాంతున్
ఘోరాకారుల రాక్షస
వీరుల నెటు ద్రుంతు ననుచు విహ్వలుఁ డాయెన్. 5

క॥ దినమణి పుత్రుఁడు గనుఁగొని
దినమణి వంశజుని పలుకు దీనత్వము తా
వినయమునఁ బలికె నిట్టులఁ
జనవును గౌరవము దొలుకు చక్కని ఫణితిన్. 6

క॥ "వారధినిఁ గట్టి వార్నిధి
ధారాళముగాఁ దరించి దానవ పురమున్
జేరి దురాత్ముని రిపుఁ రణ
ధౌరంధర్యమునఁ దునిమెదవు రఘురామా! 7

ఉ॥ కనుగొను మీ కపీంద్రులను గాలునిపైఁ దొడఁదట్టి వీకమై
పెనకువసేయు శక్తిఁగల విశ్రుత వీరుల దోర్బలాఢ్యులన్
మినుసిగ వేల్పు నేనియు నమేయ బలంబున నోర్చు దిట్టలన్
దనుజుల మట్టు వెట్టఁగల దర్ప సమగ్రుల సత్త్వశాలులన్. 8

వ॥ ఈ పలుకులకు

గీ॥ అలరె రాముండు; కపిరాజు నాదరమునఁ
జూచె, నాతని సచివు విశుద్ధ చరితుఁ
బిలిచెఁ బవనజు లంకలోఁ గల తెఱంగుఁ
జెప్పుమని కోరెఁ బగవారి గొప్పతనము. 10

వ॥ పావని శ్రీరాముని కిట్లనియె. 11

ఆ॥ సహజమగు నగడ్త జలధి యానగరికిఁ
గోటయౌ త్రికూట గోత్రవరము
క్రొవ్వు నివ్వటిల్లఁ గ్రోల్పులులం బోలెఁ
జివ్వ కెక్కు రక్కసీంద్రు గలరు. 12

ఆ॥ కాచి యుందు రెల్ల గవనుల నప్పురి
వేలకొలఁది దనుజ వీరవరులు
ప్రోడలైన జాగరూకులు గావున
వారిఁ గన్ను ద్రామ వలను గాదు. 13

ఆ॥ అయిననేమి? కడలి యవ్వలి దరికేగి
రాక్షసులను గాలరాచి చదిమి
లంక బెఱికి జలధి పంకంబునం ద్రోయఁ
గలుగు గపులు గలరు తలఁక వేల? 14

చ॥ మనమొక మంచి లగ్నమున మానవనాయక! దైత్య భర్తతో
నని యొనరింపఁ బోవలయు నాహవ దోహల కీశవాహినిన్
గొని" అని మారుతాత్మజుఁ డకుంఠితసత్త్వుఁడు విన్నవింప; న
ద్దనుజవిరోధి రాముఁడు యథావిధి నెత్తెను జైత్రయాత్రకున్. 15

గేయము॥

తరుచర వాహిని దళము లొనర్చెను
దళమున కొక్కొక దళపతి నునిచెను
శుభలగ్నంబున సుగ్రీవునితో
దినమణి రుచితోఁ దేజరిల్లు రఘు
రాముం డరిగెను రాణువ గొల్వఁగ
ఆహవమున దనుజాధిపుఁ గూల్పఁగ. 16

ఉ॥ *మ్రేఁగ నభంబు నన్ కపుల మేయ బలంబుల పాదఘట్టనన్
రేఁగిన పాంశువుల్; పగలె రిక్కలు దోఁచె దిశాంచలమ్ములన్
దాఁగె దివిన్ దినేశుని యుదగ్రమయూఖ కదంబుల్; భువిన్
మూఁగ నుపక్రమించె నలు మూలల చీఁకటు లల్లనల్లనన్. 17

ఆ॥ పుడమి యీని నట్లు పొలువారు కపిసేన
కదను ద్రొక్కి వనులఁ జదును జేసె;
నదుల దాఁటువేళ నడగట్టి వలె నిల్వ
జలము పొంగి పుడమి జడధి యయ్యె. 18

క॥ అంగదుఁడు మోసె లక్ష్మణు
నిం, గరువలి సుతుఁడు రామునిన్ మోసె; జగ
న్మంగళకరుల నిటుల మో
యంగల్గిన వారి పుణ్య మసదృశము గదా! 19

---

* మ్రేఁగు = ఆవరించుకొను.

ఉ॥ అంబుధి వీచికాచయ రవాధికమై, చెలరేగు నిస్వనం
బంబర మెల్ల నింపి, సముదగ్ర జవంపు తరంగమాల చం
దంబున గండు మీఱి, కపి తండము లూర్జిత లీలమై సము
ద్రంబు తటంబునన్ విడిసె బ్రన్నని నున్నని సైకతంబులన్. 20

ఉ॥ దూరమునన్ వినీలమగు తోయములం దటునిట్టు లాడుచుం
జేరువయౌ, కొలంది కడు నిమ్నత నందుచు నట్టె లేచి వి
స్తార పయః పరిభ్రమణ దర్ప మెలర్పగ ఫేనపుంజమున్
దీరముఁ గ్రమ్మ జిమ్మెడియు దీర్ఘతరంగ నిషంగ నీరధిన్. 21

క॥ కనుఁగొని శ్రీరఘురాముం
డనుజునితో ననియె నిటుల "నటునిటు కంటే
వనధిని వానర బలమున్
వినీల రుచిని కపిశ రుచి వెలయుఁను రొదలన్. 22

ఉ॥ మేలి పయోనిధానపు టమేయపు నీలిమ దిగ్వితాన మా
మూలము బర్వి యాకసము పోలిక; తేలెడి ఫేనపుంజముల్
గ్రాలెడు మేఘమాలికల కైవడి; నుర్వుల నీను ముత్తెపుం
జాలులు రిక్క మొత్తముల చాయల; నింపెను గంటి కింపులన్.

క॥ తరఁగల నురుగులు పొరిఁ బొరి
ధరఁ బర్వుచు జారు టొప్పె దశరూపధరుం
డొరిమిన్ జిలుగుం బుట్టము
ధరిత్రి కటి నుండి దిగిచి తళుకొత్తు క్రియన్, 24

ఉ॥ చెన్నగ నబ్ధి యూర్ములను చేతులఁ దీసిన మంచిగంధమున్
గ్రొన్నెలఱేడు హస్తములఁ గొంచెము గొంచెము దీసి దిక్కులన్
గన్నెల మోము లందుఁ దమకంబున బూసిన రీతి నొప్పెడిన్
వెన్నెలఁ గాయుచున్ విధుఁడు విశ్వము నంతయు విస్తరిల్లగన్.

ఉ॥ "తేపకు వీచికల్ దొరలి, తీరము డగ్గఱి వెన్క *కిగ్గగాఁ
గోపనమ్రైన ప్రేయసి కకుద్మతి నంటుచుఁ, నామెఁ బ్రేమ ను
ద్దీపితఁ జేయఁ జేరువకుఁ దీసెడి ప్రేయసులీలఁ దోచు నా
చూపునకీ నదీవిభుఁడు-చోద్యములౌఁ గద కాముక క్రియల్!"26

క॥ చరియించుచు సైకతముల
నరవరుఁడు రఘూత్తముండు నౌక వలెన్ సా
గరమునఁ దేలెడి విధుఁగని
ధరణిజ మదిలోన మెదలఁ దలఁకె విరహియై. 27

క॥ అరవిచ్చిన కనుఁ గల్వలు
పరిమళము వెలార్చు నూర్పు పరువుల నన్నుం
గరమును రక్తినిఁ గౌఁగిటి
చెఱలో బంధించు కూర్మి చెలియన్ దలఁతున్. 28

క॥ బంగారు మోము దమ్మిని
సింగారము చెలఁగ నెత్తి సిగపూల్ చిందన్
ముంగాళ్ళ నిల్చి నన్నుం
బొంగెడి తమి ముద్దులాడు పొలఁతినిఁ దలఁతున్. 29

క॥ అచ్చపు వెన్నెల రేలన్
బచ్చికల లతాగృహముల వర్తించు నెడన్
వెచ్చని యుపగూహనముల
ముచ్చటలన్ దేల్చు పూవుఁబోఁణినిఁ దలఁతున్. 30

మంజరి॥
ఈరీతి విరహ వాహినిలో మునింగి
పడఁతి నుద్దేశించి వాపోవఁ దొడఁగె

---

* ఇగ్గు = ఒఱఁగు

"ఓ చెలీ, యొయ్యారి యొప్పులకుప్ప,
తిన్నని నీరూపు కన్నులఁ గట్టు,
ఎచ్చట నుంటివో? యిక్కట్లఁ జిక్కి
వసివాళ్ళు వాడె నా బ్రతుకుఁ బ్రారెమ్మ;
వన జీవితమ్ము నీ బాసటన్ నాకు
సౌఖ్యప్రదమ్మయి సంతసం బిచ్చె;
పసలేని యడవుల బ్రతుకును నీవు
రసమయం బొనరించి రక్తి గూర్చితివి;
తీయని పల్కులఁ దేనె లూరించి
బాహు పంజరమునన్ బంధించి మించి
సకలేంద్రియమ్ముల సమ్మోద పఱచి
అడవి కాపురము నీవలరించినావు"
ఈ చందమున రాముఁ డింతినిఁ గూర్చి
చెలియలి కట్టపైఁ జింతించు చుండ
లంకలో సభ దీర్చి రావణాసురుఁడు
మంత్రులతోఁ గూడి మంత్రం బొనర్చె. 31

ఉ॥ కోతి యొకండు సంద్రమును గొంకకదాటి, మదించి స్వేచ్ఛమై
నాతినిఁ జూచి, భర్తృవచనంబుల నామెకు విన్నవించి, సం
ప్రీతిగ వహ్ని కాహుతిగ వ్రేల్చెను లంకను కోటపేటలన్;
భీతిఁ దొరంగి చంపె మన వీరుల శత్రునిబర్హణార్హులన్. 32

క॥ గణుతించి చూడ దూతలు
గణనీయులుగారు, గాని కపి యొక్కడె మా
రణ మొనరింపన్ గలిగెను
రణకుశలుల శూరులైన రాక్షసవరులన్. 33

క॥ అటువంటి కోఁతి మూకను
గుటిలుఁడు రాముండు గూర్చి క్రొవ్వున నన్నే
నిటలాక్ష వర బలాన్వితు
డిటవునఁ దాకంగ నంబుధినిఁ జేరె నకో! 34

క॥ చారుల వలనన్ వింటిని
పారావారంబుఁ దాటు ప్రావీణ్యమ్మున్
దారియు నెఱుఁగక కోఁతులు
వారణపై నిలిచియున్న వారట చింతన్. 35

ఆ॥ సచివులార! మీరు చక్కఁగా యోచించి
చేయఁదగిన పనినిఁ జెప్పవలయుఁ
బ్రజల సుఖము మనకు వాంఛనీయంబయ్యు
మగఁటిమినిఁ దొరంగి మనుట తగదు. 36

గీ॥ అన్న పలికిన పల్కుల నాలకించి
వినయ ఫణితిని నుడివె విభీషణుండు
ఘోర దుఃఖాంబుధినిఁ గూల్చు క్రూరరణము
చేయఁదగిన కారణమున్నఁ జేయనగును. 37

క॥ మగనాలిపై మరుల్గొని
పగఁగొని వచ్చితివి మనుజ వానరతతితో
నెగడదు సౌఖ్యము; నీకిది
తగవా? యోచింపుమయ్య ధర్మ విచారా! 38

క॥ పదునాల్గువేల బిరుదులఁ
గదనంబునఁ ద్రుంచె దండకావని లోనన్
బెదరని రాముం డొక్కడె
విదళించున్ రేపు మనల విక్రమ మెలయున్. 39

క॥ విలసితగతి నిల ధర్మము
వెలయింపఁగ దలఁచి యాది విష్ణువె నరుఁడై
వెలసెను; సఖ్యము చేయుము
వల దాతని తోడి పోరు ప్రతిభాశాలీ! 40

క॥ కాన నొసంగుము సీతను
మానవపతి కీవె; యతని మన్నన వేడం
గానగు, నా మాటలు విని
దానవకుల నాశనంబుఁ దప్పింపుమయా! 41

వ॥ ఈ వాక్యంబులు విని. 42

క॥ వదనంబు జేవురింపఁగ
రదనంబుల గీటుకొనుచు రావణుఁ డలుకన్
బెదవినిఁ గఱచుచు, ధాత్రినిఁ
బదింబదిగఁ దన్ని పలికెఁ బరుషవచస్సుల్. 43

క॥ పరుల గుణంబుల మెచ్చుచు
గరువపుఁ బలుకులను బలికి గఱపెదు నీతిన్
బరుఁ డెంతటి బలుఁడైనను
మరణింపక పోడు నాదు మార్గణ తతిచేన్. 44

ఉ॥ దాయవుగాని నీవనుఁగు తమ్ముడవే? నను దూఱనౌనె? నా
దాయతె నన్ను మెచ్చ సురధామము గొంటిని మేలు మేలనన్;
బాయని భక్తిచే భవుని పర్వత మట్టిటులూఁచి యెత్తితిన్.
జేయెనె సీత నాపతిగఁ జెండనె రాముని ఖండనంబునన్. 45

మంజరి॥
అని యిట్లు కోపాన నఱచు నగ్రజుని భీ
భీషణున్ గాంచి విభీషణుం డనియె. 46

ఉ॥ పోరుకు గారణం బరయఁ బూతచరిత్రను భర్తృ దేవతం
గోరి మదాతిరేకమునఁ గొంకక తెచ్చుటె గానిపించెడిన్;
జారతకై దురంబున ప్రజన్ బలిసేయుట దేమి న్యాయమో
శూరుడ వీవు పాలితుల శోకము నీకు శుభంబు గూర్చునా? 47

ఉ॥ రాము చెఱన్ జనించిన తిరస్కృతిఁ దీర్ప దృఢప్రతిజ్ఞులై
నేమముతోడఁ జేరి రట నీరధి దాటఁ గృతప్రయత్నులై
స్వాములు రామలక్ష్మణు లవారితి శౌర్యులు; వారి నోర్వగా
లేమని విన్నవించెద నిలింపుల నోర్చిన కీర్తిఁ గాంచియున్. 48

మంజరి॥
కావున నగ్రజా! కావింపు సంధి
భావింప వేఱొండు భద్రపథంబుఁ
గానంగ నేరము, కాకుత్స్థవరుఁడు
మాననీయుఁడు నిన్ను మన్నించు" ననుచుఁ
బలికిన పలుకులు ములుకులై నాట
నాగ్రహోదగ్రుఁడైనట్టి రావణుఁడు। 49

క॥ చుఱ చుఱఁ దమ్మునిఁ గని "యో
నెఱవాదీ నీవు నాకు నీతులు గఱపన్
బఱతెంచితి వటరా! నీ
యుఱుఁ దఱిగెద నాదు చంద్రహాసము చేతన్. 50

వ॥ అని యార్చి. 51

క॥ ముడివోడ కన్బొమ లొక్కట,
బెడిదంబుగఁ దిట్టి కోప వివశత భ్రాతన్
బొడువంబో మంత్రులు పని
వడి హస్తమ్ములను మోడ్చి పలికిరిటు వెసన్. 52

కII "తమ్ముని\u0c01 జంపం దగునే?
నెమ్మని నీ మేలుఁగోరి నీతిని జెప్పన్;
గొమ్మను విడువక నీ రా
జ్యమ్మును బోకడను బెట్టుటది సరసంబే?" 53

మంజరిII

అనిచెప్ప శాంతించి యసురవిభుండు
తమ్మునిం బురివీడి పొమ్మని చెప్పె,
అంత విభీషణుం డా లంక వీడి
మంత్రులు వెంటరా మకరాలయంపు
టావలి గట్టును నంబర వీథిఁ
జేరెను వానరుల్ చేరి చూడంగ. 54

గీII మేరు శిఖరోన్నతుండును; మెఱపు వంటి
తేజమున విభీషణుఁడొప్ప దివి పథమున;
జలధి గట్టున కపులతో నిలచి యున్న
వానరాధిపుఁ డాతనిన్ బార జూచె. 55

ఆII ఆకసమున నిలచి యసురుండు వలికెను
రావణానుజుండ - రామభద్రు
లోకపాలు సర్వలోక శరణ్యుని
శరణు గోరువాడ శిరము వంచి. 56

వII ఆ విషయమును కపిరాజు శ్రీరామచంద్రులకు విన్నవింప; 57

కII తనవారిని\u0c01 గని రాముఁడు
చనవున వచియించె "రాత్రిచరపతి తమ్ముం
డెనయఁగ నీతం, డితనికి
మన మాశ్రయ మీయఁ దగునె మత్సఖులారా!" 58

ఉ॥ అంతఁ గపిప్రభుండు కమలాప్త తనూజుఁడు ధర్మసూక్ష్మమున్
స్వాంతము నందు నిర్ణయము సల్పెను-దానవనాథు తమ్మునిం
జెంతకుఁ జేర్పఁగాఁ గలుగు చిక్కుల నూహ యొనర్చి గొంకు నొ
క్కింతయు లేక యిట్లు పలికెన్ రఘురామునితోఁ బ్రియంబునన్

క॥ "రావణుని తమ్ముఁ డీతఁడు
కావందగ దితని, దెగడఁ గావలె వీనిన్,
గావలపు జాతి వీరిది,
దేవా, గుట్టెఱుఁగ నరుగు దెంచె నిచటికిన్. 60

క॥ రక్కసి కొలమునఁ బుట్టిన
యిక్కుటిలుని నమ్మవచ్చునే? తన యన్నన్
దక్కన తక్కరి మనలన్
నిక్కముగా వీడకుండునే రఘునాథా!" 61

మంజరి॥
అని యిట్లు పల్కెడి యర్కకుమారు
ప్రియమార వీక్షించి పిలిచి మారుతిని
రాముండు బల్కె కరం బనురక్తి
"హనుమ! వచింపు నీయభిమతం" బనిన
కైమోడ్చి పలికెను కరువలి సుతుఁడు
"రాక్షసుఁ డీతండు రావణానుజుఁడు." 62

చ॥ అయినను వీని తత్త్వము మహాత్మ! యెఱుంగుదు సుంత; నన్ను ధు
ర్ణయమునఁ జంపఁగా మొదల రావణుఁ డిచ్చిన యప్పు డీతఁడే
నయమున నడ్డగించి, యిది న్యాయముగాదని బోధసేసెఁ; నా
రయుగ నితండు సత్పథచ రప్రవణుం డని నాకుఁదోఁచెడున్.

క॥ అరిసోదరుఁ డైనను సా
దరమున శరణం బొసంగఁ దగుఁ, బగతునిలో
నెరసులఁ దెలియం దగును ర
ణరంగమున నీతని వలనన్ గార్యజ్ఞా! 64

క॥ మొలవదె? గంజాయి కెలనఁ
దులసి మొలక, దాని వలన దొసఁగు గలుగునే?
తులువతనం బొనరించినఁ
బలు వరుసలు వాలఁగొట్టి పంపమె వీనిన్? 65

గీ॥ యుక్తి యుతమౌఁ గపీశ్వర సూక్తి తతిని
ప్రజ్ఞ చిప్పిల్లు పవనజు పలుకుఁ బడిని
వినిన శ్రీరామ భద్రుండు ఘనుఁడు వలికె
ప్రణత వరదుండు శరణార్థి బాంధవుండు. 66

క॥ శరణంబుఁ గోరి వచ్చిన
విరోధి నేన్ బ్రోచి గారవింపఁగ వలయున్;
కరుణించెద రావణుడేన్
శరణం బర్థించెనేని పవిత్ర కుమారా! 67

క॥ కరములు మొగిడిచి యొకపరి
శరణమనిన నఖిల భూతసంతతి కిలలో
వెఱపుడిపి యభయ మిచ్చెద
తరణిసుతా! యదియె నాది ధర్మ మెఱుగుమా! 68

ఉ॥ కావున నీతనిం గరుణఁ గావఁ దలంచితిఁ జేరఁ దీసి సు
గ్రీవ! సమాదరించి హితు రీతిని మన్ననఁజేసి ప్రీతితో
నీవిటు దెమ్ము, వానరుల కేర్పడఁ జెప్పుము నామతమ్ము, నీ
వీవసుధన్ జరింపవలె నెప్పుడు దీనజనాభిమానివై. 69

వ॥ దాశరథి యీవిధముగా నాదేశింపఁగా సుగ్రీవుండు, 70

క॥ అల్లంత నిలిచి యిచ్చటి
బల్లిదుల ప్రసంగములను బాగుగ వినుచున్
బెల్లు విచికిత్సతో గం
పిల్లెడు శరణార్థి యగు విభీషణుఁ జేరెన్. 71

క॥ భ్రాంతుఁడయి యున్న రాక్షసు
చెంతకుఁ జని సూర్యసుతుఁడు చెలికారముతో
వంత దొలఁగించి రాముని
చెంతకుఁ గొనిరా నతండు శ్రీరామునకున్. 72

క॥ కరములు మోడిచి పలికెను
శరణార్థుల రక్షకుడవు; జగతికి నీవే
శరణము - పత్నిని మిత్రుల
పరిత్యజించితిని ధనము; పాలించుము నన్. 73

ఆ॥ అభయమిచ్చె రాముఁ డా విభీషణునకు
అతని సాధుచరిత మాకళించి
నిన్ను నాదు తమ్ముని వలెఁ జూచెదనని
కౌఁగిలించి చెప్పెఁ గరుణఁ దొలఁక. 74

క॥ భారత దేశపు దక్షిణ
తీరము గంభీర వార్నిధి తటమ్మిది - నే
వారధి నెటు నిర్మింతున్
నీరధిపై ననుచు వగచి నిట్టూర్పులతోన్. 75

క॥ సికతాతలమునఁ దిరుగుచుఁ
బ్రకంపితాత్ముఁడయి రామభద్రుం డుండన్
నికటము సేరి విభీషణుఁ
డకలంకమ్మైన మార్గ మమరం జెప్పెన్. 76

మంజరి॥
"రఘువరా! వార్ధినిఁ బ్రార్థింపు మీవు,
దశముఖు నగరికి దారి నిమ్మనుము,
నీరధి నీకోర్కె నిరసింప లేఁడు;
మన్నింపగలడు నీమాట సాగరుఁడు."
అని విభీషణుఁడు నెయ్యం బారఁ జెప్ప
పురుషోత్తముఁడు రాఘవుఁడు సమ్మతించి
దర్భల శయనించి తలఁకని దీక్షఁ
గంధినిఁ బ్రార్థించెఁ గడవంగ గోరి
అల్లుఁడే యర్థించెనని గర్వమూని
మిడిసిపాటున మేరమీఱెను జలధి. 77

ఉ॥ హారి తరంగ సంచయము లాయత బాహువు లట్లు దోప; వి
స్ఫార వినీల వారి రుచి సంహనన ద్యుతిగాఁ దలిర్పగా,
సారెకు వీచికల్ విఱుగు చప్పుడు హుంకృతి భంగినొప్పగా
వారిధి ఘోర రాక్షసుని వైఖరిఁ దోచెను రామమూర్తికిన్. 78

క॥ నను లెక్కింపక పొంగునె?
వననిధి దానవుని మాడ్కి వైళమ దీనిన్
వనహీనము సేయనె యని
గొనయము మ్రోగించె నస్త్రకోవిదుఁ డలుకన్. 79

గీ॥ భూనభోంతరమున గుణధ్వాన మడరి
దిక్కుహరములఁ జొచ్చి ప్రతిధ్వనింప
మూల ముట్టుగ బెగడి గగ్గోలు జెంది
అచల భావంబు వహియించె ప్రాణి కోటి. 80

గీ॥ లోనఁగల జంతు వితతి కల్లోల మొంది
పైకిఁ దేలెను గుండియల్ వగిలి చచ్చి-
తనదు హోరును మించిన ధ్వానము విని
యదరిపడి రాము నరసె రత్నాకరుండు. 81

ఉ॥ సాల మహోన్నతాంగుని, విశాల భయానక రక్తనేత్రునిన్
నీలపయోధరోజ్జ్వలుని, నిర్భర తేజుని, పీనవక్షు, ను
ద్వేల చలద్గుణస్వనిత విస్ఫుట కార్ముకదండ నీరదా
భీలుని రామభద్రుఁ గని బెగ్గిలె సాగరుఁ డగ్గలమ్ముగాన్. 82

క॥ గడగడ వడఁకుచు దొర్లుచుఁ
గడుభీతి సముద్రుఁ డలల కరములఁ గడిఁగెన్
బెడిదముగఁ జూచు నల్లుని
అడుగుం దమ్ములను భక్తి యచ్చు పడంగన్. 83

క॥ నను నీ వింకించుటకై
ధనువునఁ గూర్చెదవె యమ్మ? తరఁగల రొదలో.
విననైతి నీదు మాటను
వననిధి నగు నేను నీకు పథమీగలనా? 84

గీ॥ అరయ నీసృష్టి కంతయు నాద్యమైన
పంచ భూతముల్ మర్యాద బాయకుండఁ
బరగు చుండును; నేను స్వభావ గుణమ
తిక్రమింప నణగు జగతి క్రమంబు. 85

ఆ॥ దారి నీకొసంగ దళసరినా? కాను;
బలుచనైన మేనఁ బరఁగు వాఁడ
గట్టి సేతు వొకటి కట్టింపుమీ నీవు
కట్టఁ గలిగి నట్టి కపులు గలరు. 86

క॥ చేతులు మొగిడిచి నతుఁడై
కాతరుఁడై కంధి సెప్పఁ గాకుత్థ్స విభుం
డాతఁడు సెప్పిన తీరున
సేతువుఁ గట్టంగఁ గపులఁ జెచ్చెరఁ బనిచెన్. 87

ఉ॥ వారధిఁగట్ట వానరులు వార్నిధిపై గుమిఁగూడి జట్లుగాఁ
జేరి సుదూరమున్ సరకు సేయక పోయి ప్రహృష్టచిత్తులై
భూరుహ భూధరంబులను బూని పెకల్చి కడింది లావునన్
నీరధి లోన వైవఁ; గడునేర్పున నీలుఁడు గట్టె సేతువున్. 88

క॥ తడి యిసుకను బడి దొర్లుచు
నుడుత యొకటి దూఁకి త్రుళ్ళి యుత్సాహమునన్
వడిఁ గట్టిన వారధిపైఁ
బొడమిన నెఱియల నెల్లఁ బూనికఁ బూడ్చెన్. 89

గేయము॥
జగత్కంటకుని సంహరించుటకు
జగదుద్ధారకు జతనంబులకున్
సాయ మొనర్చెను జంతుజాలములు
సేవ యొనర్చిన చిక్రోడంబును
గాంచి దాశరథి కడు మోదంబున
దాని శరీరముఁ దడవెను మెల్లగ
ఆ మహనీయుని యంగుళి చారలు
ధవళిమ నూనెను దాని తనువునన్. 90

ఆ॥ ప్రయ్యలయ్యెఁ గడలి, వానరసేనలు
చలము బలము నూని సాహసమున
బండలను బిగించి పటువైన వారధిఁ
గట్టి లంకఁ జేరు కౌతుకమున, 91

గేయము॥
వడి వడి నడచుచు వారధి మీఁదన్
గడచెను గడలినిఁ గపి సైన్యంబుల్
లంకను జేరిన ప్లవగసేన ని
శ్శంకముగాఁ బురి సరిహద్దులలో
వారక విడిసి విహార మొనర్చెను
వారినిఁ గనఁగా బంక్తి కంధరుఁడు
కోట కొమ్ముపై కెక్కి చూడగా
నీటుగ సారణు డతనికి దెల్పెను.
వేఱు వేఱుగా విశదముగాఁ గపి
వీరవరుల గుణుతింపఁ జేసి, శ్రీ
రామలక్ష్మణులఁ జూపి వారి యభి
రామ రూపముల వర్ణన సలిపెను. 92

క॥ నిర్మల మేఘ శ్యాముని
కార్ముక ధరుఁ బీనవక్షుఁ గనుమా రామున్
ధర్మమ్మునువీడఁ, డాతని
ధర్మమె రక్షించు ధర్మ తత్పరు నతనిన్. 93

గీ॥ సర్వలక్షణముల రామచంద్రుఁ బోలి
అతనినే ఛాయగా నెప్పు డనుసరించు
తప్త కాంచనవర్ణుఁ, గోదండపాణి
శత్రుజన భయంకరుని లక్ష్మణునిఁ గనుము. 94

క॥ అన్నకు నీడగు నీతం
డన్ని విధంబులను గాని, యతికోపి యితం
డెన్నఁగ, నీతని మార్కొని
వెన్నులు జూపింప నట్టి వీరులు గలరే"? 95

ద్విII అరివీరులం గూర్చి యతి విపులముగ
సారణుం డీరీతిc జక్కcగాc జెప్ప
కపిసైన్యములc గాంచి కలcతను జెంది
సాధ్వి జానకి ధృఢసంకల్ప మణప
రాముని యత్నంబు రాపాడc జేయ
రావణుం డొక కుతంత్రంబును బన్నె. 96

## శ్రీరామ మాయాశిరో వృత్తాంతము

ఉII రాముని రత్నకుండల విరాజిత మస్తము రక్తసిక్తమై
వ్యోమము నుండి నాధుని వియోగమునం దపియించుచున్న త
ద్భామిని ధారుణీ తనయ పాదసమీపము నందు వ్రాలె; శ్రీ
రాముని చాపమున్ బడియె భ్రాజిత ఛర్మరుచిం జెలంగుచున్.

చII అవనిజ చూచునంతనె, నిజాధిపు మస్తక మగ్రభూమిపై,
రవరవ విన్బడెన్ దనుజరావ మిటుల్ కడుc గర్వశూలమై;
"రవికులజాతు మస్తకము రాల్చితి వెచ్చటరా దురాత్మ! పో
యి వెదకి తెమ్ము వేగ దనుజేంద్రుని ముంగలc బెట్టగా వలెన్"

గీII అంత దివినుండి భువి మీcది కసుర్c డొకcడు
దూకి రాముని శిరమును దొట్రు వడుచుc
గొంచుc బరువిడు నంతలోc గువలయాక్షి
గాంచె వచ్చెడి రావణుc గపట చిత్తు. 99

కII అసురపతినిc గనుcగొని యా
యసురుcడు ముందుంచె శిరము నతవినయమునన్
గసినూని శిరము గాంచుచు
నసురేంద్రుcడు దనుజు నడిగె నత్యాసక్తిన్. 100

క॥ కల తెఱఁగు విన్నవింపుము
కలుషాత్ముండైన రాము కంఠమ్ము నిటుల్
బలిమినిఁ గరవాలంబున
విలుంఠన మొనర్చి నట్టి వీరుం డెవఁడో? 101

క॥ అంతట నసురుఁడు సెప్పెను
"పంతంబున రక్కసేంద్రుఁడు బాహాపటిమన్
సంతమసములోఁ గపులఁ గృ
తాంతునిఁ జేరంగఁ బొడిచి రంబుధి యవలన్. 102

గీ॥ రాత్రి హాయిగ నిదురించు రాము గళము
వాయిధార బ్రహస్తుఁ డుద్భటుఁడు గోయ
గపులు రాముని చావును గాంచి వెఱచి
చెట్టు పుట్టకు నొకఁడుగాఁ జెదరినారు." 103

వ॥ ఈ వర్తమానము వినిన సీతతోఁ బంక్తివదనుం డిట్లనియె. 104

మత్తకోకిల॥
"కాంత! నీవిటకంటె రాముని
కంత మియ్యది, యింక నీ
కాంతుఁడే యరుదెంచి నిన్నిట
గాంచుతే యను భ్రాంతినో
యింతి! వీడి మదంతికంబున
నింపు మీరఁ జరింపుమా,
చింతలోఁ బడి చెట్టు నీడను
జెల్వునిం దలపోయుచున్
బంతమూని వసింపఁ జచ్చిన
ప్రాణనాథుఁడు వచ్చునా?
కంతు బారికిఁ జిక్కి నీయెడ
గాటమౌ తమి నిల్పితిన్

వంత వీడి లతాంగిరో! నను
బాహు బంధితుఁ జేయుమా!
సంతసంబున జీవితంబును
సార్థకం బొనరింపుమా! 105

మ॥ రమణీ! నా రమణీయ గానకళచే రంజిల్లగా జేసితిన్
హిమశైలాధిపు కూర్మి యల్లుని శివున్; నిండైన నా తేజమున్
గమనీయం బగు విగ్రహంబుఁ గని కన్యల్ వేనవేల్ ప్రేమ వి
భ్రమహేలన్ నను గూడ గోరుదురు, రా రాపిళ్ళతో, స్పర్థతో.106

గీ॥ అట్టి నను నీవు సామాన్యుఁడని తలంచి
ఆదరింపక పోవు టన్యాయ మతివ!
కోరి వచ్చితి మనసిచ్చి కూర్మి మీర
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుటే తెచ్చు మెప్పు. 107

గీ॥ వలపు పిచ్చి నిటుల్ వాఁడు వెలువరించె,
రాము నర్ధాంగి సీతమ్మ ప్రాణకాంతు
శిరము నక్కునఁ జేరిచి చింతఁ గుమిలెఁ
గనులఁ గన్నీరు కాల్వలు గట్టి పాఱ. 108

వ॥ జానకీదేవి యిట్లు విలపించె. 109

గీ॥ "విలకాంచవు ప్రియతమా! యేల నన్నుఁ
బృచ్ఛ సేయవు? నీవెంట విపినములకు
సంచరింపఁగ వచ్చిన చాననయ్య!
తప్పు నాదెస లేదయ్య! ధర్మమూర్తి. 110

గీ॥ చిఱుత ప్రాయంబు నందె నీచిత్త మలర
చెంతఁ జేరిన చెలిని నన్ వంత ముంచి
వీడఁ దగునయ్య? న్యాయమా? విధుని వీడి
చంద్రికలు సాగనేర్చునే? సారసాక్ష! 111

గీ॥ రాక్షసాధమ! రావణా! రామచంద్రుఁ
డవనిఁ బాసిన నేనెట్లు భువిని నిల్తు?
చంపుమా! నన్నుఁ గుటిలుఁడా! సత్వరమున
జీవితేశుని వెన్నంటి పోవుదాన." 112

గీ॥ అనుచు గుండెలు బగులంగ నతివ యేడ్వ
కరఁగ లేదయ్యె రావణు కటికి యెడద,
అంతలో నొక్క సైనికుం డరుగు దెంచి
వానిఁ గొనిపోయె నెద్దియో వార్తఁ జెప్పి. 113

ఆ॥ మాయమయ్యె నంత మనుజేంద్రు శిరము ద
త్కార్ముకంబు సీత గాంచు చుండ
సరమ వచ్చి చెప్పె జానకి గన్నది
సర్వ మసుర విభుని జాలమనుచు. 114

వ॥ మఱియు సరమ యిట్లనియె. 115

క॥ అమ్మా! నీపతి కపిసై
న్యమ్ములతో వచ్చి విడిసి, యాహవమునకై
రమ్మనె దశకంథరునిన్
నెమ్మది నుండుము శుభంబు నీకగు లలనా! 116

ద్వి॥ ఈ మాటల న్విని యిందీవరాక్షి
కౌతుకంబున నుండె కలఁతను వీడి; 117

గేయము॥

మునుకొని వచ్చిన వనచర తుటుముల
ఘనుడౌ రాముని కార్ముక ధారినిఁ
గని దశకంఠుఁడు కదన మొనర్పన్
నిశ్చయింపగా కొలువు దీరెను

సభాసదుల గని కోపము తోనె
"మానవు డొక్కడు దానవ పతితో
పోరొనరింపగ పొగరున వచ్చెను.
యుద్ధము నొనర్చి బుద్ధి సెప్పవలె
సిద్ధము గండని" చెలగి చెప్పగా
మాల్యవంతుడనె మఘవారిన్ గని
"రాము డల్పుడని రావణ తలచకు 118

ద్వి॥ పదునాల్గు వేల క్రవ్యాద వీరులను
ఒక్కడే యనిలోన జక్కాడి నిలచె
కోతి యొక్కటి వచ్చి కూల్చె నీపురిని
భగ్న మొనర్చెను నగ్ని కర్పించె
పంచభూతములు నీ పలుకు పాటించె
నానాడు - ఈనాడు హోవడి కలిగె
కావున రావణా! కల్యాణి సీత
నా రాఘవున కిచ్చి యభయంబు గనుము"
అని మాల్యవంతుడు మనవి సేయుంగ
పంక్తివదనండు రేగి పలికె నీరీతి
"పగవాని శౌర్యంబు పొగడుట తగదు
తగవాడ బోకుమా తాత నీవిచట. 119

ఆ॥ పద్మహీనమైన పద్మ జానకిని నేం
బట్టి తెచ్చినాడ; వదల లేను,
రాఘవునకు వెఱచి; రణరంగ మందు నే
మఘవు గెలిచినాడ మనుజు డెంత. 120

క॥ మరణంబు వాంఛనీయం
బరికరముల నావహమున, నసురపతిని; నా
కరయుగ స్వభావ దోషము
దురతిక్రమ మెటుల విడతుఁ దోయజనేత్రన్. 121

మంజరి॥
అట రామచంద్రుఁ డాహవ భూమియందు
మంతనం బొనరించి మంత్రులఁ గూడి
అంగదుఁ బంపించె నసురేంద్రు కడకు
రాయబార మొనర్ప; రాజిల్లు శక్తి
యుక్తితో వానర యువరాజు పోయి
రక్షఃపురమ్మున రావణుఁ జూచి
కొలువుఁ గూటంబునఁ బలికె నీరీతి. 122

క॥ "నాలుగు సంద్రంబులలోఁ
దేలికగా నిన్ను ముంచి దిగవిడిచిన యా
వాలిసుతుండను నే, నీ
పాలికి రఘురాముఁ డంప వచ్చిన వాడన్. 123

గీ॥ కార్తవీర్యుండు నినునొంచెఁ గదనమందు
అతని గూల్చెను భార్గవుం డాహవమున
అట్టి భృగురాము గర్వమ్ము నడఁచినట్టి
రామచంద్రుని దూతను రావణ! విను. 124

వ॥ మహాత్ముండగు శ్రీరామచంద్రుఁ డిట్లని సందేశం బంపె. 125

శా॥ ఓరీరావణ! దుష్టచిత్త! కపటో ద్యోగంబునన్ నా సతిన్
సారాచారను, మైథిలిన్, విమల, నిస్సాహాయ్య; నీచుండవై
బీరంబేది హరించినట్టి నిను నే వేధింపగా వచ్చితిన్
రారా యుద్ధమొనర్ప; లేని యెడలనన్ మన్నింప నర్థింపుమా.

కII అసువులు వాయక మున్నే
అసురులు నీకనుల యెదుట ననిలో నీతోఁ
బసచెడి తూలక మున్నే
నసిగా జనకజ నొసంగి శరణ మ్మనుమీ! 127

మంజరిII
అని యంగదుఁడు సాహసాంకుఁడు పలుకఁ
బ్రబల కోపమునూని రావణుం డనియె. 128

కII "పట్టుండు వీనిఁ జావం
గొట్టుం డీతని శవంబుఁ గొనిపొండీ! చూ
పెట్టంగ నరాధములకుఁ
బట్టెడు గతిఁ దెలుప నాదు పగతుర కనిలోన్. 129

వII అంగదుడు తన్ను బంధింప వలయునన్న రక్కసుల యుద్య
మము గాంచి. 130

కII వచ్చిన రాక్షస వీరులఁ
జిచ్చుఱ పిడుగట్లుఁ జీల్చి చెంగున నెగిరెన్
రెచ్చిన కోపంబున వాఁ
డచ్చెరువుగ భవనశిఖర మవనికిఁ దన్నెన్. 131

కII రక్కెస దుముదార్ధొరలకుఁ
జిక్కక వాలంబు నూని చిక్కన వారిన్
జక్కాడి చేరె నంగదుఁ
డుక్కు మిగిలి రామచంద్రుఁ డుండిన యెడకున్. 132

మంజరిII
జరిగిన దంతయు సొంతంబు గాను
వాలిపుత్రుఁడు చెప్పె పౌరుష మలర,

రణము తప్పదటంచు రాముఁడు తలఁచి
అని యొనరింపఁగ నాయత్తపడఁగ
కపినాథునకుఁ జెప్పెఁ గాకుత్థ్సవిభుఁడు
అంతట లంకలో నా దశాననుఁడు
సమర సన్నాహంబుఁ జక్కఁగాఁ జేసి
పంపె రాక్షసులను భండనమునకు. 133

గీ॥ రాక్షసులు వృక్షచరులు పరాక్రమమున
జయము కాంక్షించి సంగర స్థలమునందుఁ
గదిసి పోరాడ రక్తంపు నదులుపారె,
గఱిక కొయ్యలవలె దేలె నెఱులు, మెయిలు. 134

గీ॥ కదన భూమిని రక్తంపు గర్దమమున
మునిఁగి కోఁతులు, రక్కసుల్ పుడమి కడుపుఁ
జీల్చుకొని వచ్చినట్లు దోచెను గడంగి
గడు భయంకరమయ్యె సంగ్రామ సీమ. 135

ఉ॥ మెఱసెడి కత్తులన్ గలిగి మేచక దీధితిఁ గ్రాలు మేనులన్
వఱలిరి వారి వాహముల భంగి పలాశన యోధు లార్భటిన్
ఉఱుకుచు వారిపై ప్లవఁగు లొప్పిరి గోదుమరంగు మైపసన్;
జుఱుకున వీచుచున్ సుడులు చుట్టుచుఁ బర్వు ప్రభంజనోద్ధతిన్

క॥ ఈవిధి సంకుల సమరము
గావించెడి కపులముందుఁ గ్రవ్యాదులు భీ
త్యావిష్టులై పరుగిడం
జేవఁ దొఱఁగి, కాంచి యింద్రజిత్తరుదెంచెన్. 137

ఉ॥ చెలియలి కట్టవోలె హరిజిత్తు చలమ్మున నిల్చి, భీతిమై
పలపలఁ బారు రక్కసులఁ బారకుఁ డోడకుఁ డంచు, నేనిదే
తలపడువాఁడ, శత్రువుల దర్పమడంతును రండు రండనన్
దొలఁగిన భీతి రాక్షసులు దూకిరి కోఁతుల మీఁది కేపునన్. 138

గీ॥ కట్టతెగిన ప్రవాహంబు గతినిఁ గపులు
పర్వులిడ నింద్రజిత్తుని పరుషమైన
నారసంబుల కోర్వక, వారినిఁ గని
రావణిని మార్కొనెను వేగ రఘువరుండు. 139

ఉ॥ అంతట రామచంద్రుఁడు మహాశని భీకర మార్గణంబులన్
గంతలు సేసి రావణి ప్రగాఢపుఁ బొందళమున్ గృతాంతుఁడై
యంత మొనర్ప నెంచి తన యగ్గి శరమ్మును వేయఁబోవ దు
ర్దాంత చమత్కృతిన్ నెఱపి రావణి నింగికి లేచె మాయమై. 140

క॥ డాగె నొగి మేఘనాదుఁడు
బాగుగ నంబరమునందు ప్రబలోద్ధురుఁడై
నాగాస్త్రంబునఁ గట్టెను
నాగాయుతబలుల ధరణినాథాత్మజులన్. 141

గీ॥ మూర్ఛ మునిగిన భూపాలపుత్రులఁ గని
చచ్చిరని యెంచి రావణి సంబరమునఁ
బంక్తికంధరు కడకేగి పలికె రామ
లక్ష్మణులు సంగరంబున లయమయిరని. 142

గీ॥ అంత రావణుఁ డత్యంత హర్ష మొదవఁ
బుష్పకంబున సీతను బుచ్చెఁ జూడ
మగని మృతకాయము ననుంగు మఱది శవము
శోక పరితప్త చిత్తయై చూచె నెదుట. 143

ద్వి॥ కన్నుల బాష్పముల్ గ్రమ్మ జారంగఁ
దిన్నఁగ నిట్లనె నన్నులమిన్న. 144

ఉ॥ నే నెడఁబాసి ప్రాణవిభునిన్ వసియించితి వత్సరం బిటన్
దానవ పట్టణంబున సదా భయమందుచు నార్తినొంది, యీ
మానవనాథుఁ డిచ్చటికి మానక వచ్చును నన్నుఁ బొందు, నీ
దానవవంశ నాశనము దప్పక చేయునటన్న యాశతోన్, 145

మ॥ అకలంకోజ్జ్వల విక్రమార్కుఁడవు, రుద్రాదిత్య సంకాశ ది
వ్యకళాకాంతి విరాజమానుఁడవు-శౌర్యస్ఫూర్తిమ ద్వాహినీ
సకలాభీల ఖరాది ముష్కర దిధక్షా వీతిహోత్రుండ, వీ
మకరావాసము దాఁటి వచ్చి యిట నీమాడ్కిన్ మృతిం బొందితే.

ఉ॥ కాల మహాబ్ధి దుస్తరము కాలునికైనను గాని, నమ్మఁగా
జాలను నాదు కన్నుల-యశస్సు చిరాయురుపేతులైన ధీ
శాలులు రామలక్ష్మణులు సత్యపరాక్రములంచు నెందఱో
కాలవిదుల్ వచించి, రవికల్లలె? యీల్గిరె రామలక్ష్మణుల్! 147

గీ॥ ఆసలన్నియు నడియాసలాయె నిచట
నన్నుఁగని లాక్షణికు లలనాడు చెప్పి
నట్టి వాక్యంబు లెల్ల వమ్మాయె నౌర!
యనుచు దుఃఖించు జానకిం గనియెఁ ద్రిజట. 148

గీ॥ నీవు శుభలక్షణాంగివి; నిరుపమాన
దివ్య తేజోవిశేషవు. భవ్యమూర్తి
వి, విలపింపఁ దగునటమ్మ! విధవతనము
నిన్నుఁ జెందదు నామాట నిజము తల్లి! 149

క॥ పతిహీనలు కాలిడ నీ
గతిఁ గదలదు పుష్పకంబు, కావున సీతా
పతి బ్రదికి యున్నవాఁడు క
లతను దొరంగి కనుమా తలంకక తరుణీ! 150

క॥ *కళ మునిఁగిన రాకొమరుల
కళవీసము వీడలేదు, కపుల దళంబుల్
కళవళపడ వరయ సుమం
గళీ! విచారమును వదలి కనుమా శాంతిన్. 151

ద్వి॥ అని సాంత్వనము వల్కి యా విమానమును
మరలించుకొని పోయె సరగున త్రిజట
నాగాస్త్ర బద్ధులౌ నరపతి సుతుల
ఖగపతి గనుఁగొని గగనంబు నుండి
ధరణీ తలమునకుఁ బరువిడి వచ్చె;
వైనతేయునిఁ గాంచి పాములు పరుగు
లంకించె రాసుతులను వీడి వేగ,
మూర్చాలసుల మేలు ముదముతోఁ దడవి
ఖగరాజు ప్రీతితో గాయముల్ మాన్పెఁ
దన్నెఱిగించక తార్క్ష్యుండు సనియె,
సంతసంబునఁ గపుల్ జయజయ ధ్వనుల
సల్పు నారవము రాక్షస రాజపురిని
భయజనకం బయి బ్రాకె నుద్ధతిని. 152

ఉ॥ ఉపరి తలంబునం బరఁగు నుద్ధత మేఘరవంబుఁ బోలుచున్
విపుల పయోధి వీచికల భీషణ ఘోష నతిక్రమించుచున్
గపుల ప్రమోద గర్జన లకాండము బర్వెను నాల్గుదిక్కులన్
రిపుల మనోదృఢత్వమును వ్రీలఁగఁ జొచ్చెను మాటిమాటికిన్.

ద్వి॥ ఆరావమును విని యసురాధిపుండు
అద్రిచరులఁ జంప నసురులం బంపె. 154

---

*కళ = మూర్ఛ.

క॥ పోయిన రాక్షసవీరులు
మాయావులు శౌర్యధనులు మగఁటిమి మిగులన్
మాయారణ మొనరించియుఁ
గాయములన్ వీడి చనిరి కాలుని పురికిన్. 155

గీ॥ పవనపుత్రుండు ధూమ్రాక్షుఁ బట్టి చంపె
అంగదుఁడు వజ్రదంష్ట్రుని హతమొనర్చె
హనుమ గెడపె నకంపను నశ్రమమున
నీలుచేతఁ బ్రహస్తుండు దూలి పడియె. 156

గీ॥ తరుచరులు శౌర్యమున నిశాచరుల నణపఁ
జావ మిగిలిన రక్కసుల్ సంభ్రమమున
వెఱపుతోఁ బర్వులెత్తిరి వెన్నుఁ జూపి
దశముఖునిఁ గన్గొని తమ దుర్దశను దెలుప. 157

ఉ॥ అంత 'గృతాంతు కైవడి భయంకరుఁడై కనులెఱ్ఱఁజేసి శి
ఖింతును గోఁతి మూకలను జిందరవందరఁ జేసి చెండి నే
నంత మొనర్తు మానవుల నల్పుల నంచు సురారిపోయె న
త్యంత మదంబునన్ దనుజులార్భటితో వెనువెంట నేగఁగన్. 158

క॥ అద్రి సమానాకారుల
రౌద్రారుణ నేత్రకలిత రక్షోవరు ల
క్షుద్రు లడర, భూతావృత
రుద్రునివలె పంక్తిముఖుఁడు రూక్షేక్షణుఁడై. 159

క॥ తత్తడులఁ బూన్చి సొరిది వి
యత్తలమును ఱెక్కొమంటు నరదంబున నా
యత్తపడి దనుజ నాథుఁడు
♦తత్తబడలు గొలిచిరాగ ధాత్రి చలింపన్. 160

♦ తత్తబడ = పరివారము

వ॥ రణరంగము కరుగు దెంచిన. 161

క॥ పన్నగ సమబాహుద్వయుఁ
డున్నత విస్తృత సముద్వ దూర్జిత వక్షుం
డెన్నికఁ గన్న బిరుద ని
ర్భిన్నుఁడు శ్రీరఘువరుఁడు విభీషణు నడిఁగెన్. 162

చ॥ వివిధములౌ పతాకములు వేనకు వేలు సుతీక్ష్ణ శూలముల్
రవి కిరణ జ్వలత్కవచ రాజిత వీరభటుల్ మదేభముల్
జవన తురంగముల్ మెఱయు శస్త్రము లున్నతమౌ రథంబులున్
రవరవ రావముల్ గలిగి రాక్షస సైన్యము వచ్చుఁ గాంచుమా!

చ॥ మెఱికల వంటి రక్కసుల మేనులు కాఱు మొయిళ్ల వోలె, భా
స్కర కిరణాళిచేఁ గవచ కాంతులు తీగలు వారి ప్రాకుచున్
మెఱుపుల లీల; నొప్పుధర, మిక్కిలి నొత్తిన శంఖారావముల్
ఉఱుముల రీతిఁ గర్జలిడ నుబ్బుచు వాహిని వచ్చుఁ గాంచుమా!

గీ॥ నీల జీమూత సంఘంబు నింగివీడి
యవనిఁ గప్పఁగఁ బఱతెంచి నటులఁ దోఁచు
నట్టి యీ సైన్య మందలి యరుల వీరు
లెవరొ? చెప్పు విభీషణా! యేర్పరించి. 165

మంజరి॥

అనిసేయ వచ్చెడి యరి బలంబులను
విశదీకరించె విభీషణుం డిటుల. 166

క॥ ఉదయార్క బింబ సదృశము
వదనము; మదవారణమ్ము వాహనము శిరం
బదరింపఁ దన బరువునకుఁ;
గదనమునకు వచ్చువాఁ డకంపనుఁడు నృపా! 167

గీ॥ సంజ మబ్బులు గప్పిన శైలము వలె
రత్నభూషావిరాజియై ప్రాస మూని;
శింజితంబులు సెలఁ గంగ శీఘ్ర గతినిఁ
బర్వు తురగమున పిశాచి వచ్చుఁ గనుమ. 168

క॥ నగ శృంగంబులఁ దెగగొ
ట్టఁగలట్టి తరస్వి; విస్ఫుట ధ్వజ కాంతుల్
ధగధగ వెలుగుచు నుండ స
రగున నరాంతకుఁడు వచ్చు రాఘవ కంటె! 169

ఉ॥ ఆకసమంటు కేతనము నందు మృగేంద్రము కాంతు లీనఁగాఁ
బాక విరోధి కార్ముకము భాతి శరాసన మొప్ప, నుద్భటా
నేక పదంతలీలఁ బురణించెడి కోరల తీరుమీఱ, ఘో
రాకృతి యింద్రజిత్తు సమరాంగణ భూమిని జేర వచ్చెడిన్. 170

గీ॥ మేరుపర్వత సమమైన మేనుఁ గలిగి
రథమునందున్న ధన్విని రామ! కనుమ,
సాటిలేనట్టి కడుమేటి చాపగుణము
మ్రోయఁజేయు నతం డతికాయుఁ డధిప! 171

చ॥ పొడమెడి సూర్యబింబమును బోలెడి యెఱ్ఱని యక్షిగోళముల్
వెడద ముఖంబునన్ వెలుఁగ; వేమఱు గర్జనజేయుచుం గడుం
గడు మదదంతి వాహనపు ఘంటలు ఘల్లని మ్రోఁగు చుండఁగాఁ
గడుకొని వచ్చు రక్కసునిఁ గాంచుము దాశరథీ! మహోదరున్.

క॥ మిఱుమిట్లు గొలుపు శూలము
గరమున ధరియించి కొండకంటెను ఘనమౌ
మొరయెత్తిన వృషభముపైఁ
దిరముగఁ గూర్చుండి వచ్చు త్రిశిరునిఁగనుమా! 173

కII జెండాపై నహి మెఱయన్
భండన కండూభరమునఁ బలుమాఱులు కో
దండ గుణధ్వనిఁ జేసెడి
కొండకు దీటైనవాఁడు కుంభుం డతఁడే! 174

కII రక్కసులమూక కంతకుఁ
టెక్కమగు నికుంభుఁ డతఁడె డీకొనఁ బరిఘం
బుక్కునఁ గనకమున మణుల్
జెక్కనది గ్రహించి వచ్చుఁ జెలఁగుచుఁ గనుమా! 175

సీII ఎత్తైన రథముపై నెగిరెడి బావుటా
విన్నేటి వీచులన్ వియ్యమాడ,
బహువిధగతులచేఁ బరువెత్తు వాజులు
సప్తాశ్వముల నెకసక్కమాడ
వెండిదండములపై వెల్ల ఛత్రములతో
నరదంబు వలిమల హాస్యమాడ
కనక కిరీటముల్ గ్రాలు శిరంబులు
మేరుశృంగంబుల మేలమాడ,

ఆII కాలకంఠు చిచ్చు కంటితోఁ గుంకుమ
కాంతి నొప్పు భ్రుకుటి కయ్యమాడ
కపులు తోక ముడిచి కడు భీతిఁ బయిలోడ
రావణుండు వచ్చు రణ మొనర్ప. 176

ఉII ఇంద్ర కుబేరులన్ గెలిచె నీతఁడు దోర్బల శక్తియుక్తిచేఁ
జంద్రకళాధరున్ గొలిచి శస్త్రము లస్త్రములున్ బలంబు ని
స్తంద్రత సేకరించుకొని, ధాతను గూర్చి సమాధి సాహితీ
సాంద్రముగా నమానముగ సల్పెఁ దపంబుఁ గొనెన్ వరంబులన్.

గీ॥ దైవవర చోదితుం డయి ధరను దివిని
విక్రమంబున గెల్చె నవక్రలీల,
నిపుడు దైవోపహతుఁ డయ్యె నినకులేశ!
పరమసాధ్విని( జెఱవట్టి, ప్రాలు నింక. 178

వ॥ అని విభీషణుండు దనుజేంద్రుని వర్ణించెను. 179

మ॥ వటభూమీరుహ విస్తృతోన్నతుని; గర్వస్ఫూర్తి మద్వక్షునిన్;
నిటలాక్షారుణ తీక్ష్ణ వీక్షణ సమోన్మేషోల్ల సల్లోచనున్
స్ఫుట కాలాంబుద దీర్ఘ దేహుని; సముద్భూతోగ్ర తేజోనిధిన్
కుటిలున్, రావణు, రామచంద్రుఁడు గనెన్ గ్రోధంబు
పెల్లుబ్బగన్. 180

చ॥ దనుజుని భీకరాకృతుని దర్పము రాముఁడు గాంచి యిట్లనెన్
"గన దరుణాంశు దీధితి నికాయ వికస్వర విక్రముండు వై
రినివహరుద్రుఁ డెవ్వఁ డెదిరింపగ నోపును వీని? జానకిన్
గొనిన యఘమ్మె యీతని కగున్ మృతిహేతువు; వీడనిన్ దెగున్.

క॥ ఈ పాపాత్ముం డిప్పుడు
నాపాలన్ బడెను; తీవ్ర నారాచములన్
దూపిల్లఁ జేసి వీనిన్
రూపఱగ నొనర్తు నాదు రుష సమయంగన్. 182

క॥ సీతాహరణోద్భూత
స్ఫీత మదీయోగ్రకోపశిఖి నణగు నిదే
పాతకి! స్త్రీ చోరుల కీ
భూతలమున వీని బ్రదుకు మూదల యగుతన్. 183

వ॥ అని శ్రీరామచంద్రమూర్తి క్రోధంబున, 184

కII నక్తంచరాధమున్ గని
రక్తారుణనేత్రుఁ డగుచు రౌద్ర జ్వాలల్
వ్యక్తముగా రోసంబున
దిక్తటములు వ్రీల గుణము దిగిచెఁ గడిమిమై. 185

## రావణుని యుద్ధము

కII భీకర తిమింగలము ర
త్నాకరమున్ జొచ్చి కలఁచినట్టుల కీశా
నీకినిని క్షోభపెట్టెను
రాకాసుల ఱేఁడు శస్త్రరాజి విసరుచున్. 186

కII జ్వలనాస్త్రంబులఁ జిమ్ముచుఁ
దిలకింపఁగరాని దీప్తి దివురు నిశాటున్
గలహాసక్తుని బెట్టిదుఁ
దలఁపడె సుగ్రీవుఁ డధికదర్ప మెలర్పన్. 187

కII ఉదియగొని వే దశాస్యున
కెదురొడ్డన్ గొండకొమ్ము నినసుతుఁడు - గడుం
బదనైన కొమ్ముతో రిపు
నెదిరించెడి ఖడ్గమృగము హేళిదలిర్పన్. 188

చII తునియ లొనర్చె శృంగమును, దూలఁగ వానరరాజు నేసె, రెం
డు నిశిత సాయకంబుల ఘనుండు దశాస్యుఁడు; దక్షు నాతనిన్
గని రఘురాముఁ డాతనిని గ్రన్నన మార్కొనఁ బోవ లక్ష్మణుం
డనియె 'మహాత్మ', నాకు సెలవైన రణంబును నేనొనర్చెదన్.

కII కావరమునఁ గనుఁగానని
రావణు దండింప నెంప ప్రమదింపఁగ, నీ
సేవకుఁడ నేన చాలుదు
ధీవర నన్ననుపుమయ్య! దీవించి వెసన్. 190

కII శాతాంబకముల మృత్యువు
వాతను ద్రోయుదును బంక్తి వదనునిఁ; గపులన్
భీతి విముక్తులఁ జేసెదఁ
బ్రీతినిఁ గూర్చెదను, మిత్ర వితతికి నీకున్. 191

కII అని పలికెడి తమ్మునిఁ గని
ఇనవంశశ్రేష్టుఁ డనియె, 'హీనుండని యీ
దనుజేంద్రునిఁ దలపకుఁ బొం
దెను ధాతవరంబు లితఁడు, తెంపరి యనిలోన్. 192

కII పోమ్మితనితోఁ బోరిఁ జ
యమ్మున్ గొను మరయు మతని యాయువు పట్టుల్
వమ్మొనరింపుము రిపుజత
నమ్ముల నీలోపములఁ గనన్ దలఁచినచోన్. 193

గీII రావణుని మార్గ్మనం బోవ రయమునఁ జను
లక్ష్మణుని కాంజనేయుండు శ్లాఘ్యలీలఁ
బలికె "దాసుడ నున్నాడ వలదు మీకు
శ్రమయని వచించి రాక్షసప్రభుని దాఁకె. 194

వII అట్టియెడ హనుమద్రావణులు. 195

కII ఒండొరుల బలముఁ జూపి ప్ర
చండగతిం జేయి సాచి చఱచు కొనిరి, వే
దండంబుల గతి పెనఁగిరి
బండలఁ బిండిగ నొనర్చు ప్రహరణములతోన్. 196

కII అనిలాత్మజు పిడిగ్రుద్దుల
ధనదానుజుఁ డఁడగి పడియె ధరపై; వెనువెం
టనె లేచి పొడిచె ముష్టిని
హనుమను, వాఁడదరి కూలె నద్రివలె నిలన్. 197

క॥ నీలుఁడు గని మారుతి దశ
కాలునివలె కోపగించి క్రవ్యాదునిపై
వాలమున విసరె నొక పెను
శైలంబును, రావణుండు సదిమెను దానిన్. 198

క॥ అది గని నీలుఁడు దశముఖుఁ
డదవద యగునట్లు విసరె నద్రుల శిలలన్
జదలంటు వాని తెక్కెము
నదటునఁ గుప్పించి చేరె హ్రస్వం బగుచున్. 199

క॥ పలువిధముల నీలునిఁ బ
ట్టలేక వింశతికరుఁడు త్రుటాలున సంధిం
చి లగువు మెఱయఁగ వైచె న
నలాస్త్రమున్ బడియెఁ దట్టుకునన్ నీలుఁ డిలన్. 200

గీ॥ కపులు బడెడి పాటుఁ గనుఁగొని సౌమిత్రి
కన్నులందుఁ గినుక గడలు కొనఁగ
విల్లుఁ జేతఁబూని వేడిఫేలుపు రీతిఁ
గదిసెఁ బంక్తిముఖునిఁ గదనభూమి. 201

వ॥ తనతోఁ బోరవచ్చిన లక్ష్మణుం గాంచి దశముఖుం డిట్లనియె. 202

మ॥ అని నాతో నొనరింతువే బుడుత! నీయజ్ఞాన మేమందు, వ
జ్రిని, దిక్కుంగల నిర్జరావళుల నేఁ జెండాడుటే కాదు; చ
క్రిని వైకుంఠములో విదిల్చితిని నా కెంగేలఁ దర్జించి; శూ
లి నివాసాద్రిఁ బెకల్చి యెత్తితినిఁ గేళీకందుక క్రీడమై. 203

గీ॥ అట్టి నాతోడఁ బోరు సేయంగ నీవు
వచ్చినాఁడవు నిన్నిదే వ్రక్కలింతుఁ
దీవ్ర నారాచముల నంచుఁ దివిరి వాఁడు
గుణము మ్రోగించె నహితుల గుండె లదుర. 204

వ॥ లక్ష్మణుండు వాని బెదరింపులకు వెఱవ కిట్లనియె. 205

క॥ పాపఁడ నేనని పలికితి
వేపాటిదొ నీదు పటిమ యెఱిఁగింపుమురా
నీ పాపఫలము పండన్
నా పాలం బడితి వీవు నయవంచకుఁడా! 206

ఉ॥ బాలిశ! త్రుంచివైతు నిను పారక నిల్వుమటంచు బాణముల్
వైళమ లక్ష్మణుండు విడువన్ దశకంఠుఁడు వానిఁ ద్రుంచినన్
గోలను గోలఁ గొట్టుకొని క్రొమ్మిడుగు ల్లెగయంగ నప్పుడా
యాలపు నేల తోచె నమరావళి దృష్టికి హోమ కుండమై. 207

పంచచామరము॥
సమీకమందు నిల్చి పోరు శౌర్యశాలి లక్ష్మణున్
సమగ్రమైన శస్త్రవిద్య సొరుగన్న నేర్పరిన్
ప్రమోదమంద కాంచి మెచ్చి పంక్తికంఠరుండు తీ
వ్రమౌ పయోజగర్భ దత్త బాణమేసె వానిపై. 208

క॥ కులిశ హతమైన శైలము
వలె శ్రీరామానుజుండు వసుమతిపై మూ
ర్ఛిలె; వానిని వింశతికరుఁ
డెల్లమిని బాహువులఁ బట్టి యెత్తఁగ నూనెన్. 209

క॥ ఆ లక్ష్మణు బలువెట్టిదొ?
కైలాసము బట్టి యూచి కరముల కేళీ
లీలం దాల్చిన లావరి
కూలఁబడెను వాని నెత్తి కొనఁగా లేమిన్. 210

క॥ రావణుని యత్నముం గని
పావని పరువిడుచు వచ్చి బలమున ముష్టిన్
దీవరమున ప్రహరించెను
రావణు - నాతండు నల్ల గ్రక్కఁగ నచటన్. 211

గీ॥ లక్ష్మణుని మారుత సుతుండు లాఘవమున
హస్తముల నూని గొనిపోయె నర్కవంశ
శుక్తి ముక్తాఫలంబున్న చోటి కనుజుఁ
గాంచి రాముండు మిక్కిలి కలఁత నొందె. 212

క॥ అమ్మ హృదయంబునం జొర
పొమ్మసిలిన తమ్ము నరయు చుట్టు కొనివ క్రో
ధమ్మునఁ గసి దీర్చుకొనన్
ముమ్మరమగు దీక్ష శాత్రవునిపై కరుగన్. 213

క॥ త్వరపడెడి రామభద్రుని
గరువలి సుతుఁ డరసి పలికెఁ "గనఁగా, దశకం
ధరుఁడు రథి, మీరు నామూ
పురము నధిష్ఠించి యుద్ధ మొనరింప దగున్. 214

వ॥ హనుమంతుని యీ మతిసాచివ్యము నంగీకరించి. 215

ఉ॥ అంతట రామచంద్రుఁడు మహామతిమంతుని మారుతాత్మజున్
సంతస మొప్పఁగాంచి విలసద్గతి నాతని మూపు నెక్కి నా
గాంతకు నెక్కివచ్చిన జనార్దనుఁడో యనఁ గానిపించె న
త్యంతిక దివ్య దీప్తి సముదంచితుఁడై దశకంఠుఁ దృష్టికిన్. 216

ఉ॥ రాముని దివ్యతేజము; పరాక్రమ భీకరమైన రూపమున్
వేమఱు కర్ణరంధ్రములు వ్రీలఁగఁ జేయు గుణస్వనంబు సు
త్రామవిరోధి మానసము తల్లడిలంగను జేసి వానిలో
నేమియొ చెప్పరాని బలహీనత కార్కొనఁ జేసె పెల్లుగాన్. 217

ఉ॥ "బాపురె! యేమి యీతని ప్రభావము నా హృదయంబు నందెదో
యోపఁగరాని సంచలన ముద్భవ మొందెను, దేహమంతయుం
దాపభరంబుచే నవశతం బొలుపేదెను, శక్తిజాఱె, నే
నీపగిదిం జలించుటకు హేతువు కాలపు వైపరీత్యమా! 218

చ॥ అయినను సంగరాంగణము నందుఁ జలింపక నిల్చి పోరెదన్
జయమొ పరాజయంబొ విధి శాసన మెట్టులొ యట్టులౌను? ని
ర్భయముగ మేటి నిర్జరులఁ బారఁగ ద్రోలి తమేయశక్తి; దు
ర్జయుఁడను గావునన్ నరుని రాముని సంశయమేల గెల్చెదన్.

వ॥ అని నిశ్చయించి పంక్తికంథరుడు ధైర్యంబుఁ జిక్కఁబట్టి
ధనుష్టంకారంబుఁ గావించె. 220

గీ॥ సాత్వికం బైన తేజస్వి సవిధమందుఁ
దామస రజోగుణోద్భాసి దర్పయుతుఁడు
నిలిచి నెక్కొనఁగలఁడె? యీ నిఖిల జగము
సాత్వికవ్యక్తి వైష్ణ వాశ్రయము గాదె? 221

వ॥ శ్రీరామచంద్రుడు రావణునిగాంచి యిట్లనెను.

ఉ॥ కంటినిఁ బంక్తికంఠ! నిను గండలు క్రొవ్విన దుర్మదాంధ! నీ
తుంటరి వర్తనంబునకు దుర్నయవృత్తి కిదే సమాప్తి- నీ
దంటతనంబుఁ జూపుటకుఁ దాల్పుము చాపము, పిక్కటిల్లు ము
క్కంటి శరాగ్ని మించెడి ప్రకాండములన్ నినుగాల్చి మాడ్చెదన్.

ఉ॥ కామము నీ వివేకమును గ్రమ్మ మదోల్లసనమ్ము దిమ్మనన్
భామల భర్తృదేవతలఁ బట్టిన పాపము రూపుమాపెరా
నీమముతో శ్రమాధికత నీవు గడించిన పున్నెమంతయున్;
ధీమస మేల కేల్మోడువు; దెళ్ళఁగ జేయుదు విక్రమించినన్,

క॥ కొరడాదెబ్బల వోలెన్
నరపతి పలుకులు చురుక్కున దనుజ వృషభున్
సరగునఁ దాకఁగ నాతఁడు
పెఱిగెన్ రక్తంబు మేనఁ బింపిళ్ళాడన్. 224

ఉ॥ తన్నొక మర్త్యుఁ డత్యధిక దర్పమునం గని తూలనాడ, వాఁ
డెన్నఁగరాని క్రోధమున నీక్షణ మాలిక లెఱ్ఱవారఁగాఁ
బన్నగరాట్ఫణాళి వలె పంక్తిముఖంబులు పూత్కరింపఁగాఁ
గ్రన్ననఁ జిమ్మె నమ్ములను రామునిపై నతి భీకరమ్ముగాన్.225

ఉ॥ వచ్చెడి వాడి బాణముల వైళమ త్రుంచుచుఁ, జండకాండముల్
క్రచ్చఱ రావణాసురుని కాయము గాడఁగ వెల్వరించుచున్
బెచ్చుగ రేఁగి రాముఁ డరిభీకరుఁ డొప్పఁగ; శోణితప్రభల్
పిచ్చిలఁగా దశాననుఁడు వెల్వడెఁ బూచిన కింశుకంబుగాన్.226

క॥ చూపులు మున్నో! పొంగిన
కోపంబె మున్నొ! చాప గుణముక్తములో
తూపులె మున్నో! తెలియఁగ
నోపక రిచ్చవడి కనిరి యుద్ధమును సురల్. 227

క॥ తల్లడపడి దివిజుల్ మఱి
పెల్లుబికెడి కోపమునఁ గపివరుల్ గన, న
త్యుల్లాసంబునఁ బోరిరి,
జల్లులవలె నంపగములు చయ్యనఁ గురియన్. 228

ఉ॥ తూలిపడెన్ రథాంగములు తుత్తుమురై చెడి నుగ్గునూచయై,
కూలెను పక్షముల్ దెగిన కొండల కైవడి దంతిసంతతుల్,
సోలెను వాజిరాజములు స్రుక్కి తరంగము లట్లు ధాత్రిపై,
వ్రాలె పలాశి సైన్యములు రాముని తీవ్ర శరాగ్ని ఘాటికిన్. 229

సీ॥ భగ్న భర్మ కిరీట భాసుర శకలమ్ము
చిన్నారి జాబిల్లి చెన్ను సూప,
సంయుత మూర్ధజస్రవ దుదుస్రమవారి
గంగ జాల్వారిన కరణిఁ దోప,

రక్తారుణద్యుతి రంజిత మలికమ్ము
చిచ్చఱకంటి యచ్చెరువు నీన,
చినిఁగి చీలికలైన కనకోత్తరీయంబు
పాపజన్నిదపు శోభను వెలార్ప.

గీ॥ రక్తాసిక్తాంతరీయ మార్ద్రిగజచర్మ
సల్లలిత కాంతులను విస్తరిల్లఁ జేయ
రామ బాణాగ్ని తప్తుండు రావణుండు
కాలకంఠుని వలెఁ గ్రాలెఁ గదనభూమి. 230

క॥ నరపతి రావణుపయి నొక
శరమున్ భీకరము వజ్రసమమున్ విడువన్
గిరగిరఁ దిరుగుచు నాతఁడు
సరీసృపము వోలెఁ బడెను సరవిన్ ధరపై. 231

క॥ కరుణాంతరంగుఁడై కను
చు రావణుని రాఘవుండు సువిమల ఫణితిన్
సరళగతిన్ వచియించెను;
విరోధులను గూడ గౌరవింతురు పెద్దల్. 232

చ॥ అలసితి వీవు దానవ కులాగ్రణి! యాహవ రంగమందు నీ
మెలకువ నీదు విక్రమము మెచ్చితి; నింటికిఁ బోయి రేయి నీ
నెలవున సేదదీరి కడు నెమ్మది ప్రొద్దున రమ్ము; పొమ్ము; నీ
బలము పరాక్రమమ్మును బ్రభావము సర్వము జేపుఁ జూచెదన్.

క॥ మానవపతి మాటన్ విని
దానవపతి తరలెఁ జేరెఁ దన మందిరమున్
హీనస్థితి తన కొదవన్
మానప్రాణములు క్రుంగి మగఁటిమి పొలియన్. 234

కII ధృతిఁ దొరఁగి దానవేంద్రుం
డతిదుఃఖము నొంది కుమిలె, "నవనీసుతకై
మతిమాలి చరించితి, దు
ర్గతి బొందితి నొసటి వ్రాలు గడవం దరమే?" 23

మంజరీ ద్విపదII
అని కడుశోకించి యసురేశ్వరుండు
మనుజేశ్వరునిఁ బట్టి మదమణంపఁగను
గాఢనిద్రాసక్తుఁ గదన భీషణునిఁ
గుంభకర్ణుని మేలుకొలుపఁగాఁ బంచెఁ
బలువురు భటులను, వారు యత్నమ్ము
పొనరించి మేల్కొల్పి పొలదిండి కపుడు
నిండుగా మాంసశోణితములఁ దృప్తిఁ
జేసి, రావణు నానఁజెప్పిన యంతఁ
గుంభకర్ణుఁడు వోయి కొలువున్న సోద
రునిఁ గని మ్రొక్కి కూర్చుండిన తమ్ము
ప్రేమమ్ముతోఁ జూచి వెఱవని మాన
వాధముల తెఱగు నతివిస్తరముగఁ
జెప్పి యుద్ధమునకుఁ జెలఁగి పొమ్మనియె
అన్న దుర్నీతిని హర్షింప లేక
అన్న వాక్యంబుల కడ్డు చెప్పంగ
లేక, పోర నరిగె వీకతో నతఁడు
అతని యెత్తైన యద్భుతాకార
మీక్షించి రఘువరుం డీరీతి ననియె. 236

వII విభీషణా! 237

క॥ రవిబింబ మావరించెన్
దివి భువి సంధించె; నసిత దీధితులు దిశా
నివహము గ్రమ్మగ నిచ్చటి
కవతరిలెన్ గాలమేఘమా యిది? చెపుమా! 238

గీ॥ లంకయే రూపమెత్తి యీవంక వచ్చె
నో; మహాకాలుఁ డిట కంపెనో? మహోగ్ర
శక్తిని మనల నణఁపఁగా శౌర్యపటిమ
ధాత్రి చలియింప నడచు నీదైత్యు డెవఁడు? 239

ఉ॥ మిన్నును మన్ను నేకముగ మేచక దేహమొనర్చెఁ, గన్నులన్
గన్నులు విస్ఫులింగములఁ గ్రక్కెడు; జిహ్వక యగ్నికీలకల్
గ్రన్నన వెల్వరించెడు; జగమ్మున నిట్టి భయంకరాకృతిన్
మున్నెపుడేనిఁ గంటిమె? యముండును బెగ్గిలు వీనిఁ గాంచినన్.

ఉ॥ నాలుకఁ జాపి మక్షికల నల్వున మర్కట వీరవాహినీ
జాలములన్ గ్రసించె, బల శౌర్యనిధుల్ మనవైపువార లీ
పాలను నోటిలోఁ బడిరి, పాఱిరి కొందఱు భీతి - వీని ని
ర్మూలము సేయు మార్గము నెఱుంగుటయే మన కర్జ మియ్యెడన్. 242

వ॥ నావిని విభీషణుం డిట్లనియె.

## కుంభకర్ణుని వృత్తాంతము

చ॥ అనుపమ విక్రమ క్రమము నద్రి సమున్నత దేహమున్ విరో
ధి నిచయ హృద్విదారణ నదీష్ణు భయంకర సింహనాదమున్
దనరగ వచ్చు నితడు గదా! నుతి కెక్కిన కుంభకర్ణు డీ
యన దశకంఠు తమ్ముఁడు మదగ్రజు డుగ్రుడటం చెరుంగుమా.

ఆ॥ కుంభకర్ణునిఁ గడు క్రూర కృత్యములకు
జగము లెల్ల జడిసి; జలజ భవుని
శరణు జొరగ నతడు శాపంబు నిచ్చెను
నిరవధిక సుషుప్తి బరఁగు మనుచు. 244

క॥ నలువ యొసంగిన శాపము
వలన నితడు గాఢ నిద్రఁ బడ; రావణుఁడు
మ్మలికముతో బ్రహ్మను ని
మ్మల దచ్ఛాపావసానమును బ్రార్థించెన్. 245

శా॥ బాలుండీతడు, నీదు పౌత్రుడు, మహా బాహా బలప్రౌఢి నీ
నేలన్ వీరులు సాటి లేరితనికిన్ గీర్వాణు లీర్ష్యాళువుల్
వ్యాలోలాత్ములు, మోపి యుందు రభిశాపంబుల్ వెసన్ వీనిపై;
నాలింపన్ దగు నాదుప్రార్థనము దేవా వీని మన్నింపుమీ. 246

గీ॥ కరుణతో గావు మీతని కమల గర్భ
నిదుర మేల్కాన్పు కాల వినిర్ణయంబుఁ
జేయ దగునయ్య లేకున్నఁ జెట్టు వోలె
చలన రహితుడు గానుండు నెలవు నందె. 247

ద్వి॥ రావణుం డీరీతి బ్రోవఁ బ్రార్థింప
గరుణతో నిట్లనె కమలాసనుండు. 248

క॥ నెలలారున కొక దినమున
మెలకువ నొందును భుజింప, మిగిలిన దినముల్
తెలివినిఁ గోల్పడి సుప్తిని
♦ ములుగు నఁజేయుండు వీఁడు ముజ్జగములలోన్. 249

---

♦ ములుగు = మూలుగు

క॥ ఈ రీతిఁ గమల గర్భుని
కారుణ్యము చేత వెలయఁ గలిగిన బలియుం
డీరేడు లోకముల నని
వారణ శౌర్యంబుతోడ వరలుచు నుండున్. 250

క॥ చేవ సెడి రాక్షసేంద్రుం
డీ వీరుని నిద్రలేపె, సీతని కిచటన్
జావన్ గాలము దాపుర
మై వచ్చు నధిక జవమున నాశ్రిత వరదా; 251

వ॥ కుంభకర్ణుని వృత్తాంతమును రామభద్రునితో విభీషణుఁడీ విధ
ముగా వివరించు నంతలో. 252

ఉ॥ వచ్చెడి కుంభకర్ణుని నవార్యబలోద్ధతుఁ జూచి వానరుల్
హెచ్చెడి భీతితోఁ బరుగులెత్తుటఁ గాంచిన యర్కసూతి తా
నచ్చల మూని యెల్లరు నహాయన మార్కొనెఁ గుంభకర్ణునిన్
బొచ్చెము లేని విక్రమ విభూషితునిన్ దశకంత కల్పునిన్. 253

మ॥ కృతహస్తున్ గపిలోక వల్లభుని సుగ్రీవున్ రణోదగ్రు ను
ద్ధతమౌ పద్ధతి ముష్టి ఘాతముల చేతన్ మూర్ఛితున్ జేసి, యా
తత హర్షమ్మునఁ జంకఁ బెట్టుకొనె మాద్యత్కుంభకర్ణుండు, దుః
ఖితులై కీశులుఁ దుష్టులై దనుజులున్ గీపెట్ట జేపెట్టఁగాన్. 254

మ॥ విజయోత్సాహ మెలర్ప వచ్చెడి మహావీరాగ్రణిం గాంచి పే
ర్చి జయధ్వానము సేసి చల్లిరి పువుల్ ప్రీతిం బురస్త్రీలు, అ
ర్కజుఁ డప్పూజడితోడఁ దేరి, వినె లంకాస్త్రీల జేజే ధ్వనుల్;
నిజశక్తిన్ సురవైరి ముక్కు చెవులం ద్రెంచెన్ మహోద్రిక్తుఁడై.

ఆ॥ కక్కసమునఁ గుంభకర్ణుని రక్కి, తద్
ఘన భుజంబు మీఁద గాలు మోపి
బంతివోలె నెగిరి వానర సైన్యంబుఁ
జేరె నర్కసుతుఁడు చెంగలించి. 256

మంజరి॥
కదనానఁ బట్టిన కపిశేనిఁ జూపి
అన్నకు విజయంబు విన్నవింపఁగను
చను కుంభకర్ణుఁడు చయ్యన మరలి
తరలె యుద్ధమునకుఁ ధైర్యము నూని -
దలపని రీతిగాఁ దరుచరుఁ డుఱికి
పోవఁగఁ దన చెవి ముక్కులఁ గొఱికి. 257

క॥ చెల్లెలి నెల్లిద పఱచినఁ
గల్లరులను జంపఁ బోయి కడకిట్లైతిన్
డుల్లెను నాముక్కు జెవుల్
చెల్లరె, యితరులకుఁ జూపఁ జెల్లునె ముఖమున్. 258

క॥ ఉండఁదగ దిచట నిఁక నే
ఖండన మొనరింపఁ బోదు, బాణావళిచేఁ
జెండెద మానవ వానర
తండంబుల నాదు బలము దర్పం బెలయన్. 259

చ॥ అను దృఢ నిశ్చయం బెనయ నాతఁడు గండర గండఁ డయ్యు బో
రనఁ దన ముక్కునన్ జెవుల రక్తము గారఁగ నస్తమించు న
ర్కుని యరుణాంశు కాంతిని నిరోధము సేసి వెలుంగు గొప్ప నీ
ల నగము భాతి నొప్పుచుఁ బలంబులు రాఁజనె యుద్ధభూమికిన్.

వ॥ అతఁడు కదనరంగమున. 261

మహాస్రగ్ధర॥
కరముల్ సాచున్ గ్రహించున్ గపులను నములున్; గౌశలం
బారఁగాఁ దో
మరముల్ వైచున్ గపీశుల్ మగఁటిమి వదలం బారగా భీతితో; వే
మఱు పాదంబుల్ విదుల్చున్ మలఁగొని యణఁగన్
మర్కటంబుల్! ధరన్ ధూ
ళి రహిన్ గీశుల్ గడున్ సోలి నిలువక ప్రచారింపఁగా
పూత్కరించున్. 262

క॥ ఓడక నిలువుఁ డటంచున్
బోడిమి సెడి పాఱుకపుల మొగ్గరమునకై
తోడుకొని, కుంభకర్ణున్
* మేడమున విభీషణుండు నేర్పునఁ దాకెన్. 263

గీ॥ తనకుఁ బ్రతిరూపమై నట్టి తమ్మునిఁ గని
అగ్రగామియై నిలిచిన యనుజునిఁ గని
పలికెఁ గుంభకర్ణుఁడు మృదు భాషణముల
“తగదు తమ్ముఁడా! నాతోడఁ దగ వొనర్ప, 264

క॥ తగ వెఱఁగి నీవు పలుకన్
బగవాని వటంచు నమ్మి పంక్తిముఖుఁడు నిన్
దెగవిడచెఁ గానఁ దక్కటు!
తగువగు మార్గంబు; జిక్కెఁ దగులములందున్, 265

గీ॥ అగ్రజుని వీడ లేక నే ననుసరించి
పోరవచ్చితి; నేఁ బొందఁ బోవు ఫలము
తెలియు తమ్ముఁడా! నాదారిఁ దొలఁగి చనుము
రాక్షస కులంబునకు నీవె రక్షకుఁడవు. 266

* మేడము = యుద్ధము.

కII "రాముఁడు శ్రీమద్విష్ణుఁడు;
రామామణి జనక తనయ రమయే సుమ్మీ,
భూమిని సాధు చరిత్రుల
నేమగ వారుదయమంది రోటమి మాదే!." 267

గీII అన్న పల్కిన యీ పల్కు లాలకించి
అశ్రువులు చెక్కిళులఁ జార నవనతాన
నుండయి విభీషణుండు కనుల్ దుడిచి కొ
ని కరములు మోడ్చి పోరు సేయక తొలంగె. 268

గీII తొలఁగి చను విభీషణుఁగని, దోర్బలమునఁ
ద్రుళ్ళిపడు కుంభకర్ణుని త్రుళ్ళడంప,
రాముఁ డెక్కిడి క్రూర నారాచములను
రక్కసునిపైన గుప్పె నరాతు లదుర. 269

చII జలధర నీలదేహు కర చాప వినిర్గత బాణ జాలముల్
పలపలఁ బోయి యుద్భట బలస్ఫుట భూరి శరీర యష్టితోఁ
జెలఁగెడి రావణానుజునిఁ జీల్చి లోన నణంగెఁ జప్పునన్
జలజల వానజల్లు వడి సాగరు కుక్షి నణంగు చాడ్పునన్. 270

గీII వీర రాఘవ కార్ముకోద్ధారితములు
మొక్కవో నట్టి యుక్కుటమ్ములు విపక్షు
వజ్ర సమమైన మేనునం బట్టు వడియె
ఇను మయస్కాంతమును దాకి యిమిడినట్లు. 271

కII వమ్మయి పోవం బటు బా
ణమ్ములు రక్కసుని యెడల నరపతి సూనుం
డమ్ము నొకటి యసురుని పెను
రొమ్మున నాటంగ నేసె రోషం బెలయన్. 272

క॥ బరిగోల వోలె బాణము
చరచరఁ గనలింప మేను, సంక్షుభితుండై
పరువెత్తె రాము జెనకన్
గరమున గద నెత్తి కుంభకర్ణుం డలుకన్. 273

క॥ హాహా కారంబులు కపి
వాహినిలోఁ జెలఁగెఁ బంక్తివదనుని యనుజుం
డాహవ భూమిని రాముని
సాహసమునఁ జంపఁబోవ సరభస వృత్తిన్. 274

శా॥ కాలవ్యాళము బోలు వానికరమున్ ఖండించె శ్రీరాముఁ డా
ఖేలంబైన సమీర బాణమున నుద్వేల ప్రతాపంబుతో
నేలన్ వ్రాలఁగ నాకరంబు వడిఁగొన్నెత్తుర్ జడిం జిమ్ముచున్
గూలం బారిరి రాక్షసుల్ గపులు దిక్కుల్ వట్టి దిగ్భ్రాంతులై.

క॥ గదయున్న కరము ద్రెళ్ళగ
మదకరి వలెఁ జెలఁగి వాఁడు మాఱుం గేలం
బదరి మహోన్నత వృక్షము
నదటునఁ గొని తాకె రాము నసురాంతకునిన్. 276

క॥ ఎత్తిన రెండవ చేతినిఁ
దుత్తునియలు సేసి త్రుంచెఁ ద్రుటిలో రాముం
డుత్తమ కాండంబులతోఁ
దత్తరపడి డిల్లవోయి దనుజులు సూడన్. 277

క॥ చెండఁబడ రెండు కరములు
కొండవలెన్ నిలచి వాఁడు క్రోధారుణనే
త్రుండై రామునిఁ గ్రుమ్మగ
గుండెలలో బొమిడికంపు కొనతో దూకెన్. 278

కII తలవాల్చి భీకరంబుగఁ
జలమునఁ దనపైకి వచ్చు సాహసికు మెడన్
మెలకువతో రఘురాముం
డలఁతినిఁ దునుమాడె నంత కాస్త్రము చేతన్. 279

కII ధరణిని నెత్తుటఁ దడుపుచుఁ
బురిలో నున్నతపు సౌధముల శిఖరములన్
ధరఁ బడఁ ద్రోయుచు దనుజుని
శిరం బడఁగె జలధిలోనఁ జెండొవ వోలెన్. 280

కII తలఁ దొరఁగి యసుర దేహము
చలమునఁ బరుగిడుచు రక్తసారం బింకన్
బలము చెడి ప్రాణవాయువు
తెలలఁగ భువి మీఁదఁ గూలె నేనుగు పోలెన్. 281

మంజరిII
అనుజుని మరణంబు విని రావణుండు
కూలెను దుఃఖానఁ గూలంకషనొగి
దరిఁ గూలి కూలెడి తరువు పోడిమిని
పరిజనముల్ చేసిన పరిచర్యఁ దేఱి
చింతించె నాతండు శిరమును వాల్చి. 282

కII చచ్చిరి తమ్ములు, బంధులు;
చచ్చిరి కడుఁ గూర్చు సఖులు శౌర్యధురీణుల్
చచ్చిరి పుత్రులు కటకట
చచ్చితి నే బ్రదికియుంటి; సర్వ మడంగెన్. 283

కII అని కుమిలెడి దనుజేంద్రునిఁ
గని యతికాయుండు పలికె, కదనం బందున్
దనుజాధిప గెలు పోటమిఁ
గనవలె నొక్కటను వీడఁ గావలె చింతన్. 284

క॥ పంపుము కదన క్షోణికి
వెంపరలాడెదను గపుల విక్రమ లీలన్
జంపెద రిపులన్ జీల్చెద
శంపాద్యుతి మబ్బుఁ జీల్చు చందం బెనయన్. 285

వ॥ దనుజేంద్రు నానతి దేవాంతక, నరాంతకులు, అతికాయ త్రిశిరులు, మహోదర మహాపార్శ్వులు, సముచితబలంబులతోఁ గదన తలంబున కరిగిరి, అవ్వీరులు. 286

ఉ॥ అందఱు శౌర్యవంతులు, మదాంధులు, మాయలు బన్న నేర్పరుల్
అందఱు శస్త్రవేత్తలు దురాత్ములు సంగర పాండితీధనుల్
అందఱు శత్రుఘాతకు లహర్పతి తుల్య విభాసముజ్జ్వలుల్
అందఱు దేవకిన్నరుల యక్షులఁ దున్మిన వీరు లారయన్. 287

గీ॥ అస్తగిరిఁ జేరబోయెడి యరుణుని వలె
తీవ్ర తేజం బెలర్ప రాత్రిం చరాళి
వానరుల నుక్కడంపంగఁ బలువిధముల
అస్త్ర శస్త్రంబుల ధరించి యరిగి రనికి. 288

క॥ వారిదములన్ బలాకా
వారంబులు బార్లుదీరు వైఖరి మీఱన్
ఘోరాకృతులగు రాక్షస
వీరుల హస్తముల శస్త్ర వితతులు గ్రాలెన్. 289

వ॥ సంకుల సమరంబుల. 290

గీ॥ రాక్షసులఁ బట్టి కొట్టిరి రాక్షసులను
కపివరుల విక్రమంబున గదనమందు;
వానరులఁ బట్టి చదిమిరి వానరులను
రక్కసులు శౌర్య మేపార రణమునందు. 291

ఉ॥ అంత నరాంతకుండు దనుజాధిప సూనుఁడు సొచ్చెఁ గీశసే
నాంతరభూమి నొక్క జవనాశ్వము నెక్కి భయంకరమ్ముగాఁ
జెంతకు వచ్చు వానరులఁ జించుచుఁ జీల్చుచుఁ బొల్చె సాగరా
భ్యంతర వర్తియై జలచరాళి హరించు తిమింగిలంబు నాన్. 292

క॥ ప్రాసముచే నాయసురుఁడు
రోసంబునఁ గపులఁ జెండి రూపఱ జేయన్
ప్రాసమును గాంచి కీశులు
వేసటతోఁ బర్వులిడిరి విహ్వలమతులై. 293

క॥ అంగదుఁడు వానిఁ జుట్టిఁ ద
రంగమువలెఁ బ్రాసమున్ గరంబులఁ బట్టెన్
భంగమొనర్చెన్ ద్రొమ్మన
అంగిలిఁ బగులంగ వాని నఱచేఁ జఱచెన్. 294

మంజరి॥
అనుజుని మరణమ్ము గని మహోదరుఁడు
కాల నాగము రీతిఁ గనలుచుఁ దాకె
వారణారూఢుఁడై వాలి కొమరుని
దేవాంతకుండు ప్రతీకారమెన్ని
పరిఘముం గొని తాకెఁ బ్లవగేశు సుతుని. 295

క॥ పదరెడి యశ్వంబులతో
నుదయార్క ద్యుతుల నీనుచున్న రథమునన్
విదళింప వాలి పుత్రునిఁ
బొదివెను త్రిశిరుండు పొగరు పొంపిరి పోవన్. 296

క॥ క్రమ్మగ మూవు రసురులొ
కు్రమ్మడి యంగదునిఁ గూల్చ ఘూర్ణిల్లుచు మే
ఘమ్ములు గప్పిన కులశై
లమ్ము పగిదిఁ గపివరుఁడు చెలంగెన్ బలిమిన్. 297

క॥ హనుమ గని వాలిపుత్రుని
ఘనులగు రక్కసులు పెలుచఁ గ్రమ్ముచు నుండన్
జనె వాని సాయమునకై
యనలునకును దోడు పడెడి యనిలుని లీలన్. 298

వ॥ హనుమంతునకు సహాయంబుగా నీలుండు చని మహోదర
త్రిశిరుల మార్కొనె. 299

ఉ॥ పరిఘము గొన్న రాక్షసుఁడు వాయు తనూజుని మార్కొనెన్, హరిన్
గరి కడు నల్కతోఁ బొదువఁ గాఁజను ఠీవిని రేవ యేర్పడన్;
సరగున వాయుపుత్రుఁడు నిశాచరు స్కంధము నెక్కి వాని ని
ష్ఠురముగ ముష్టితోఁ బొడిచె శూలి గజాసురు మోదినట్లుగన్. 300

క॥ తల పగిలి నల్లజారఁగ
జలజలఁ, బలువరుసలూడి జల్లున రాలన్
దెలివిఁ దొఱఁగి ధరఁ గూలెను
పలాశి; పక్షములు దెగిన పర్వతము వలెన్. 301

క॥ ఒక వైపునఁ ద్రిశిరుఁడు వే
ఱొక వైపు మహోదరుండు హుంకారములన్
బ్రకటించిరి తమ క్రోధము;
నికారణము సేయఁ బొదువ నీలునిఁ బెలుచన్. 302

క॥ జడి వానలోనఁ జిక్కొని
మెడ వంచిన కోడె మాడ్కి మిన్నక నీలుం
డెడఁగనక నిల్చియును వే
తొడరెను శైలంబుఁ దాల్చి త్రుంపఁగ నరులన్. 303

క॥ భూమీరుహములు నిండిన
భూమీధర మేయు బంతివోలెను నీలుం
డామకొని మహోదరుపై;
నా మనుజాసనుఁడు గూలె నఱచుచు ధరపైఁ, 304

క॥ మారుతి త్రిశిరుని మార్కొని
ధారాధర మతని హస్త తలమునఁ జారన్
దోరపు ముష్టిన్ బొడిచెను
ఆ రక్తాశనుని శిరము లసిఁ గొని నఱికెన్. 305

గీ॥ కాంచన కిరీట శోభిత కర్ణకుండ
లమణి కాంతి భాసురములు రక్త నేత్ర
విలసితములు త్రిశిరములు పృథివిఁ బడియె,
తళుకు లీనెడి యుల్కల త్రయము వోలె. 306

వ॥ మహాపార్శ్వుం డీమిత్ర దుర్మరణములఁ గాంచి. 307

ఉ॥ చండశితాగ్రము ల్గలిగి, శాత్రవ మస్త విదారణంబు చే
నెండిన రక్తమాంసముల నెఱ్ఱని కాంతుల నొప్పుచుండి; వే
దండ శిరంబులం బగులఁ దాకెడి వ్రేగున హేమ పట్టముల్
నిండుగఁ గ్రాలు పెన్గదను; నేర్పునఁ దాలిచి తాఁకెఁ గోఁతులన్.

క॥ కాలాగ్ని కాఱడవులన్
గాలుచు రహి రక్కసుండు కపి వాహినులన్
జీలిచి చెండఁగ; రేఁగుచుఁ
దూలిన రుధిరమ్ము మంటతో సరితూగెన్. 309

క॥ గర్వమునఁ గ్రాలు రాక్షసు
నోర్వక కపివరులు బాఱ నొక్కొక దిశకున్
పర్వతసముఁడగు ఋషభుం
డుర్విగదల దూకి వాని నురమున మోదెన్. 310

క॥ చఱపున కాగక వ్రాలిన
కఱకు నిశాచరుని చేతి గదఁగొని ఋషభుం
డఱిముఱి వడ రాత్రిచరులు
తఱిఁగని పగులంగ వ్రేసె దైత్యుని శిరమున్. 311

మ॥ ద్యుతిమన్మూర్తులు విక్రమాన్వితు లసాధ్యుల్ యుద్ధవేదు ల్మహా
మతిమంతుల్ ఘనశౌర్యవంతు లుదయన్మార్తాండ తేజస్వు లు
న్నత భూభృత్సమ దేహులైన తనయున్నల్ సచ్చుటన్ గన్న వా
డతికాయుం డతి తీవ్రశోకహతుఁడై యావేశ మేపారఁగన్. 312

క॥ ఆ యతికాయుం డెక్కెను
వేయి దివాకరుల పగిది వెలుఁగు రథంబున్;
సాయకముల వడి గుప్పెను
కాయంబులు తూట్లు వడఁగఁ గపి వాహినిపై. 313

క॥ నడగొండ వోలె దనుజుఁడు
కదలు కొనెడి శౌర్య పటిమఁ గడువడిఁ దొడరన్
గడు భీతినిఁ గపి సేనలు
గడగడ వడకుచును బాఱె కావుఁడటంచున్. 314

వ॥ శ్రీరామచంద్రమూర్తి రణరంగంబున నవక్రమ విక్రమ మెలార్చు
నతికాయుంగని విభీషణున కిట్లనియె. 315

క॥ దశదిశలఁ గాంతిఁ జిమ్మెడి
నిశిత శరంబుల వెలార్చి నెగడెడి తేజ
స్వి శమనుని శౌర్యమున నీ
పిశితాశనుఁ డొప్పెడిన్ విభీషణ! యెవఁడో! 316

వ॥ అతికాయునిం గూర్చి శ్రీరామునితో విభీషణుం డిట్లనియె. 317

ఉ॥ రావణ ధాన్యమాలినుల ప్రాగ్భవ పుణ్యఫలంబు, పోరునన్
రావణు నంతవాఁ డతి పరాక్రమ వంతుడు, బ్రహ్మదేవ సం
భావితుఁడై గ్రహించెను దివాకర దీప్తి యుతంబు నీ రథం
బీ విలసత్తనుత్రము నహీన బలాఢ్యుఁ డితండు రాఘవా! 318

గీ|| తొల్లి దిక్పాలకుల నెల్లఁ దొలఁగఁ దఱిమె
భీకరాయోధన మొనర్చి, బెట్టిదుఁడని
యులుకుదురు దేవతలు వీని పలుకు విన్న
ఇతని బాహుబలాశ్రితం బీపురంబు. 319

వ|| అని విభీషణుండు వచించు నంతలో. 320

క|| క్షితిఁ బక్వతాళ ఫలముల
గతిఁ గంఠమ్ములను వీడి కపుల శిరమ్ముల్
పతనంబయ్యె ధనుర్ధరుఁ
డతికాయుండ స్త్రములను హాళహాళి వైవన్. 321

క|| చీకాకు పఱచిఁ గపులను
రాకాసి యుదగ్రలీల రఘురామునితో
ఢీకొన నెంచి వచించెన్
రా! కయ్యంబిమ్ము నాకు రఘుకుల తిలకా! 322

ఉ|| పోరును గోరు వీరుని ప్రమోదముతోఁ గని రాఘవుండు, తూ
ణీరము నుండి మార్గణము నెట్టనఁ దీయ్యఁగఁ బోవ లక్ష్మణుం
డారసి పల్కె నిప్పగిది "యగ్రజ యీతని రూపుమాపఁగాఁ
బోరుట కేన చాలుదును బుచ్చుము" నన్నన రాముఁ డీకొనెన్.

క|| తనతోఁ బోరాడఁగ ని
ల్చిన లక్ష్మణునిఁ గని పోలిచి యతని దేహం
బును దన యతికాయముతో
దనుజుండు పలికె, "బుడుతఁడ! తగదిట నిలువన్. 324

క|| హిమవత్పర్వత మైనను,
క్షమయైనన్ గగనమైన సాగర మైనన్
సమయునురా! బాలక, నా
అమేయమైనట్టి యాశు గాగ్నికి బలియై." 325

వ॥ అతికాయుని యీ పరుష వచనంబులకు సౌమిత్రి యిట్లనియె.

క॥ ఆకార సామ్యమేలా?
పోకిరివై త్రుళ్ళఁ బోకు మూర్ఖుఁడ; యిపుడే
నీ కొండ వంటి దేహము
నా కణకు ములుకులఁ దునిఁగి నాశము నొందున్. 327

క॥ బాలుండ గానురా! నీ
పాలిటఁ గాలుండ, నీదు ప్రాణము గొందున్;
జాలింపుము నీ జల్పము
నీలావును జూప రమ్ము నేరుపు మీఱన్. 328

క॥ బాలుఁడు వామనుఁడే తన
కాలన్ గడు సత్త్వవంతుఁ గ్రవ్యాదు బలిన్
నేలకుఁ ద్రొక్కెను లీలన్
జాలుదు నినుఁ గూల నేయ సంగర మందున్. 329

క॥ సౌమిత్రి పోటు మాటలు
ఆమిష భోజనునిఁ దాకి యదవద సేయన్
దీమసమున నతికాయుఁడు
వేమఱు మ్రోగించె గుణము, విసరెన్ గోలల్. 330

క॥ పగఁగొనిన నాగ పంక్తుల
వగ రక్తాశనుని విల్లు వదలిన యిషువుల్
తెగటార్పఁ బోయె లక్ష్మణు,
ఖగాస్త్రమున వాని నతఁడు ఖండించె వెసన్. 331

శా॥ పాకారి స్వరు తుల్యముఁ భయదమున్ బ్రహ్మాండ భాండంబులన్
సాకల్యంబుగ వ్రీలఁ జేయు శరమున్ సంధించి చాపంబునం
దాకర్ణాంతము మౌర్వి లాగి రణవిద్యా పాటవం బేర్పడన్
డాకన్ లక్ష్మణుఁ డేసె శాత్రవు లలాటం బుగ్రతన్ జీల్పగాన్.

క॥ అతివేగమ్మునఁ జని, య
ప్రతిహతమగు నాశరంబు రక్తాశను ఫా
లతలము సొచ్చి గదుల వి
సుతమౌ శిలపైని పాము తీరున నొప్పెన్. 333

క॥ "మెచ్చితి నీవ్రే" టని వాఁ
డచ్చెరు వొదవించు నట్టి యంబకములతో
వ్రచ్చెను లక్ష్మణు నురమును
వెచ్చని రుధిరమ్ము వెడలి పృథివిన్ బాఱన్. 334

క॥ సౌమిత్రి యోర్చుకొని యా
ప్రామిడిపై నపుడు వైచె బ్రహ్మాస్త్రంబున్
భీమం బది తల ద్రుంచెన్
భూమినిఁ బడెఁ బిడుగు వడిన భూరుహము వలెన్. 335

మంజరి॥
ఘనులగు నసురులు కాలుని పురికిఁ
జని రని విని దనుజపతి చింతింపఁ
గని మేఘనాదుండు కలగుండు వడక
తండ్రితో నిట్లనె ధైర్యమేపార. 336

క॥ తండ్రీ చింతింపకుమీ?
కొండ్రాళ్ళను బ్రాకు కోఁతి గుంపు తలల నా
తీండ్రపు ములుకులఁ బగులును
వేండ్రంబున బండలదిరి వ్రీలెడి పగిదిన్. 337

మంజరి॥
అని పల్కి తండ్రికి నాహ్లాద మొసఁగి
చతురంగ బలముతో సంగ్రామమునకు
అరి బలంబులఁ జొచ్చి హత మొనరింప
ఇంద్రజిత్తరిగె నహీన బలుండు. 338

క॥ ధవళచ్ఛత్రరథంబున
దివిజారి సుతుండు నీలదేహ ద్యుతితో
దివిపై వెలిఁగెడి రజనీ
ధవు మండలము వలె గాంచఁ దగి యొప్పెఁ గడున్. 339

మంజరి॥
రావణి సంగ్రామ రంగంబు నందు
వలయంబుగా యోధ వరులను దీర్చి
మధ్య భాగమున హోమాగ్ని రగిల్చి
కృష్ణాజమును వేల్చి యాక్రియ ననియె. 340

శా॥ పొండీ దానవ యోధులార! యిపుడే పోరాడఁగాఁ; గీశులన్
జెండుండీ గద తోమరంబులను నిశ్శేషంబుగా, నేను మీ
దండన్ నిల్చి యదృశ్యమూర్తి నగుచున్ ధ్వంసంబుఁ గావింతు నొ
క్కండన్ మానవ మాత్రులన్ గులిశ సంకాశాస్త్ర పుంజంబులన్.

మంజరి॥
అని రాత్రిచరసేన నని సేయఁ బనిచి
మేఘనాదుం డంత మేఘాల డాగి
అరిసైన్యముల మీద నంప వర్షమ్ము
కడువడిఁ గురిపించెఁ దడఁబడఁ గపులు. 342

సీ॥ దైత్యుని ఢీకొని తలపడు కపి శిరో
నారికేళఫలమ్ము నలిగి పడియె,
అసురునిన్ బలియుఁడై హతమార్చు వానరు
బాహార్గళంబులు భగ్న మయ్యె,
రక్కసు మధ్యంబు ద్రుక్కించు కీశుని
యూరు కాండ ద్వయి యూడి పడియె,
ప్రత్యర్థి యురమును బ్రహరించు ప్లవగుని
వక్షశ్శిలాస్థలి పగిలి పడియె.

గీ॥ రాక్షసుని వైవ భూమీధరమ్ము నూపు
అద్రిచరు వీపు చిలువ విహ్వలతఁ బడియెఁ,
గన్నులకుఁ గానుపింపని గగన చారి
రావణి ధనుర్విముక్త నారాచములకు. 343

క॥ అజుఁ డిచ్చిన వరబలమున
రజనీచరుఁ డడ్డు లేక రణరంగమునన్
విజయము సేకొనె, నరులకు
నిజరూపము మఱుగు పఱచి నింగిని దిరిగెన్. 344

గేయము॥

రావణి వైచెను బ్రహ్మాస్త్రంబున్
దాని ధాకకున్ దల్లడిల్లుచున్
వానర శూరులు మానవ వీరులు
శక్తి హీనులై శవముల రీతిని
వసుధను వ్రాలిరి; వారినిఁ గనుఁగొని
యింద్రజిత్తు పిత కెలమి ఘటిల్లఁగ
విన్నవించెఁ దన విక్రమ క్రమము
అజు నస్త్రంబున నరు లడంగిరని;
బ్రహ్మాస్త్రమునకు వ్రాలక నిల్చిరి
ముప్వురు యోధులు మూఁడగ్నులవలె
వినయవంతుఁడౌ విభీషణుండున్
సత్యవంతుఁడౌ జాంబవంతుఁడున్
అతిబలాఢ్యుఁడౌ అనిలపుత్రుఁడున్
జాంబవంతు మతిసాచివ్యమునన్
మారుతి దెచ్చెను మందుల కొండను
దాని వాసనల్ దగిలినంతనే. 345

సీ॥ మూర్ఛిల్లి పడియున్న మొనగాండ్రు లేచిరి
క్షతగాత్రు లక్షతగాత్రులైరి
అసువులు వాసిన హరులు జీవించిరి
కపిసేన ఘూర్ణిల్లెఁ గంధిరీతి
అంతట సామీరి యద్రినిఁ జేర్చెను
నెలవునకుం గడు నేర్పుమీర
సంతసంబునఁ బొంగు సైన్యసముద్రమున్
బరికించి పలికెను ప్లవఁగ రాజు

గీ॥ రాక్షసపురంబుఁ జొత్తి మీరాత్రి యందు
కాగడాల్గొని; హర్మ్యముల్ గాల్చి, రాత్రి
చరుల గగ్గోలొనర్చిన, సరభసమున
దశముఖుం డరుదెంచు యుద్ధంబు సేయ. 346

ఆ॥ వచ్చి నట్టి దనుజ వల్లభుం బరిమార్తు
మనిన; రామచంద్రు నానతి మెయి
దివ్వెటీలను గొని తేజస్వులైన వా
నరులు లంకఁ జొచ్చినారు కడిమి. 347

వ॥ కపులదాడి నెఱుక సేయ. 348

మ॥ దనుజారాతి రఘూద్వహుండు ఘనకోదండంబునన్ నారి గూ
ర్చి నగోద్భేదన వజ్రతుల్యమయి యర్చిష్కీలలం గ్రక్కు చి
క్కని బాణమ్మునఁ బంక్తి కంధరు మహాగారాగ్రమున్ డొల్ల నే
సె నితాంతంబగు తన్మహాధ్వని గలంచెన్ దానవానీకమున్. 349

ఆ॥ కాగడాలు పట్టి కపిసేన రాక్షస
పురము జొచ్చి హర్మ్య పుంజ మెల్లఁ
దగులఁ బెట్టి; అడ్డు తగిలిన దైత్యుల
బృందములను మట్టుఁ బెట్టి రెలమి. 350

ఉ॥ ముంగురు లొత్తి, ఫాలమును మూర్కొని, చెక్కుల ముద్దులాడి, క
న్నుంగవఁ దాకి, క్రీ వెదవినొక్కి, గళంబు నొకింత మీటి, చ
న్నుంగవ నూని, పొక్కిలి నినున్నఁగఁ జక్కిలిగింత వెట్టి, యు
త్తుంగ నితంబ యుగ్మమును దోయిటఁ బట్టి తెమల్చి, క్రిందికిన్
వంగి, కటి ప్రదేశమును బాహువులన్ బలుమాఱు చుట్టి, పై
కొంగునులాగి, ప్రేయసినిఁ గోపము దీర్పఁగ వేడు భర్తరీ
తిం గననయ్యె నగ్ని; పలుతీరుల, శయ్యల వీడిపాఱు దై
త్యాంగనలన్ విభీత హరిణాక్షుల వెన్బడి యంటి మాటికిన్. 351

గేయము॥

వెలి చవుల మరఁగిన
విభుఁడు వేఁకువనరా
తగవాడి రక్కఁచుఁ
దరుము గయ్యాళిగా
మంటలు వెన్వెంటె
మనుజాశనులు పర్వ. 352

గీ॥ మిడుఁగుఱులు చిమ్మ కణములు మింటినంటి
యతివిశాల పయోధిలోఁ బ్రతిఫలింపఁ
గాంచనయ్యెను భువి దివి గాఢ మైన
ప్రళయ కాలాగ్ని కౌఁగిట తగిలి నట్లు. 353

మ॥ తన యంతఃపుర దేహళీ స్థలమునన్ దర్పించి కీలాళి పై
ల్లున గర్జింపఁగ దైత్య వాహినులు కల్లోలంబు సెందన్ గనెన్
దనుజోత్తంసుఁడు క్రుద్ధుఁడై పనిచె యుద్ధం బుద్ధతిం జేయఁ గుం
భ నికుంభాది నిశాచ రోత్తముల సంవర్తార్క తేజస్వులన్. 354

సీ॥ కంపను గంతానఁ గాలూని కడతేర్చె
నంగదుం డాజి భయంకరుండు,
యూపాక్షుఁ బొడిచేసె నురమునఁ బ్రహరించి
మైందుం డరాతి సంహారకుండు,
శోణితాక్షునిఁ బట్టి సున్నంబుఁ గావించె
ద్వివిదుండు విక్రమ పవిధరుండు
చంపె నికుంభుని సాహసంబునఁ బట్టి
వాయుజుం డరివీర భంజనుండు.

గీ॥ కుంభు నవలీల ధరణినిఁ గూల్చి చంపె
సూర్యపుత్రుండు శత్రు నిషూదనుండు
ఔర! కపులచేఁ గ్రివ్యాదు లణఁగి పడిరి
కాలగతి నాప శక్యమే శూలికైన. 355

క॥ తరుచరుల మొఱఁకు గరముల
నరి భీకరులైన యసురు లణఁగన్ విని యా
సురరిపుఁడు దుఃఖ నిహతుఁడు
ఖరసుతు మకరాక్షు ననిపెఁ గదనంబునకున్. 356

మ॥ మద విస్ఫూర్జిత రక్తనేత్రుఁడు లసన్మత్తేభయానుండు శౌ
ర్య దినేశ ప్రతిమానుఁ డుద్ధతుఁడు, దివ్యాస్త్రాగ్రసారాఢ్యుఁ డం
బుద గర్జారవతుల్య హుంకృతులతోఁ బోరాడఁగా నేగెఁ బే
రుదుటొప్పన్ మకరాక్షుఁ డాహవ జిగీషోత్సాహ సంరంభియై. 357

మ॥ కనియెన్ దైత్యుఁడు, సంగరస్థలమునన్ గంభీరు, కోదండ పా
ణిని, సాలోన్నతునిన్, మనోహరుని, ప్రోన్మీలాంబుజాతాస్యునిన్,
ఘనునిన్, దుర్జన భర్జనున్, రుచిర మేఘస్నిగ్ధ నీలాచ్ఛ మూ
ర్తిని, సింహేంద్రనిభావలగ్ను, సుమనస్తేజోనిధిన్, రామునిన్. 358

క॥ తన తండ్రిని వధియించిన
అనుపమ కోదండ కుశలు నరిభీకరునిం
గనుఁగొని శ్రీరఘు రామునిఁ
గనలుచు మకరాక్షుఁ డేసెఁ గాండ శ్రేణిన్.

క॥ దనుజుం డేసిన కోలలఁ
దునిమెను రఘురాముఁ డంపతుటముల నాయెా
ధనమునుఁ గని రచ్చెరువున
దనుజులు వానరులు మఱచి తమవైరములన్.

మంజరి॥
కడు ప్రొద్దు నీరీతిఁ గదనంబు జరిగె
రాముని తీవ్ర నారాచ పంక్తులను
గడి కండలయ్యెను గ్రవ్యాదు మేను
అంతట దనుజారి యసురుని మీఁద
అనిలాస్త్రమును వైచె నద్భుత లీల.

చ॥ గొనయము వీడి మార్గణ మకుంత గతిం జని దైత్య కంతలు
తన మొనరింపఁ బుట్టిన పెఠాల్మను శబ్దము జ్యారవంబుతో
బెనుపరి నాల్గుదిగ్గుహలఁ బెల్చనఁ బర్వి ప్రతిధ్వనింపఁగా
దనుజుల దర్పముల్ సడలె ధైర్యము హెచ్చెను వానరాళికిఁ

క॥ మకరాక్షుని మరణము విని
వికాసముఁ దొఱంగి కలఁగు విహ్వాలుఁ దండ్రిన్
బ్రకటిత బలుండు దశముఖు
ని కుమారుం డూరడించె నెవ్వగ దీఱన్.

క॥ రక్కసుల బలములం గొని
గ్రక్కునఁజనె నింద్రజిత్తు కదనంబునకున్
జక్కాడెఁ గఱకు టమ్ముల
నక్కజముగఁ గీశబలము నరిభీకరుఁడై.

కII క్రిందఁబడి యొగురుచుండం
జిందెడి రక్తమునఁ గపుల శిరముల సరముల్
జెండొవలఁ బుడమి చేడియ
అందముగా బంతులాడి నట్టులఁ దోఁచెన్. 365

ఉII వాని శరాగ్ని కీలలకు వానర వాహిని యింకు చుండ, రా
మానుజుఁ డోర్వలేక వరుణాస్త్రమునన్ శమియింపఁ జేసి, వ
జ్రానల తుల్య మార్గణము రావణిపైఁ బఱపంగ నెక్కడన్
గానఁగ రాక యాకసము నందుఁ జరించెను వాఁడదృశ్యుఁడై.

కII ఈ రీతి మేఘనాదుఁడు
వీరుఁడు సౌమిత్రి తీవ్ర విశిఖంబులకున్
దూరముగాఁ జరియించుచు
మారణ మొనరించెఁ గపుల మార్గణతతిచేన్. 367

మంజరిII
సౌమిత్రి యసురునిన్ సమయింపఁ జేయ
బ్రహ్మాస్త్రమును దీయఁ బరికించి వాఁడు
వైరుల హృదయముల్ వ్రక్కలు సేయ
జాల మొక్కటిఁ బన్నె సమరాంగణమున
కృతక భూమీసుతాకృతి నిల్పి యచట
ప్లవగు లందఱు వినఁ బలికె నీరీతి. 368

కII ఏ సుందరాంగి కొఱకై
రోసంబునఁ బోరొనర్చి రూపఱ నున్నా
రీసున సంగ్రామస్థలి
నాసుందరి నిపుడె పట్టి హతమొనరింతున్. 369

మ॥ అని యాధూర్తుఁడు లాగి హస్తమున మాయా జానకిన్ ధూళినోం
దిన హేమాంగిని బాష్పజాల కలుషాంధీ భూతఁ దాఁ బట్టి కో
ప్వాను; ఘోరాసిని వ్రేసె దేహము శిరంబున్ భూమిపైఁ డుల్లగా
ననిలాకంపిత పద్మమో యనఁ దదీ యాస్యంబు గాన్పింపగాన్.

క॥ ఆ రాక్షస కృత్యంబును
ధీరుఁడు పవనజుఁడు గాంచి తీరని వగ బా
ష్పారుణ నేత్రుండగుచుం
జేరంజనె రాఘవునకుఁ జెప్పఁగ వార్తన్. 371

క॥ రామునకు వాయుపుత్త్రుఁడు
భూమిజ కంఠమును బంక్తిముఖ పుత్రుండౌ
గాముల యోచింపక రణ
భూమినిఁ ద్రుంచెనని రాఘవునకుం దెలుపన్. 372

క॥ సీతా! యని వాపోవుచు
వాతూలహతాబ్ధి భంగి వ్యాలోలుండై
యాతండు దుఃఖభాగుఁడు
భూతలమున వ్రాలి మూర్ఛ మునిఁగె వివశుఁడై. 373

క॥ అన్న శిరం బొడి నిడుకొని
విన్నదనం బాననమును బెనఁగొన భరవౌ
కన్నీట నన్న మొగమును
గ్రన్ననఁ గడుగుచు సుమిత్ర కన్నకొడుకు కనెన్. 374

క॥ మతిమాలిన ముదుకని యా
లి తంత్రమునఁ జిక్కి వెంగలి తనమున వనిన్
వెతలంబడితివి, మాయురె
సతిఁ బ్రాణాధికను జనకజను బాసితివే! 375

ఉ॥ ధర్మమటంచు వీడితివి తండ్రికి లోఁబడి నీదు రాజ్యమున్;
ధర్మము తండ్రిదౌనె? తన దారకుఁ బ్రీతిగ, నామె బిడ్డకై;
నిర్మల మానసున్ నిను వనిన్ వసియింపగఁ జేయు కార్యమే
ధర్మము? నీదు కర్మ ఫలితంబులె రాఘవ యిట్టి కష్టముల్?

ఉ॥ అర్థపతిన్ జయించి, కని నట్టి లతాంగులఁ బల్మిఁ బట్టి కే
ళ్యర్థము రావణుండు మను నభ్యుదయోన్నతి ధర్మబాహ్యుఁడై;
వ్యర్థము ధర్మమార్గమని వాకొను నీ సుఖహీన జీవితం;
బర్థ విహీనుఁ డారయ నిరర్థక జీవియటంచుఁ దోఁచెడిన్. 377

వ॥ ఈ విధంబున బలికి. 378

క॥ తాలిమినిఁ దూలి లక్ష్మణుఁ
డోలాడెను శోక జలధి నుద్వేగముతో,
మేలుకొని రామచంద్రుఁడు
గోలున విలపించెఁ దనదు కూరిమి సతికై. 379

మంజరి॥
అతిలోక లావణ్య యవనిజ గొఱకు
మతిమాలి విలపించు మంగళాంగులను
పంక్తికంఠుని భ్రాత పరికించి పలికెఁ
జింతవీడుఁడు మీరు, సీతమ్మ యిచట
మరణింప లేదయ్య మహనీయులార!
నామాట నమ్ముడీ నరవరులార! 380

క॥ మాయావి మేఘనాదుఁడు
మాయా జానకినిఁ జంపి మఖ మొనరింపన్
దాయలగు వారి కన్నుల
మాయఁగ సమకట్టె; దుఃఖమును వీడవలెన్. 381

చ॥ కుటిలుఁడు మేఘనాదుఁడు నికుంభిల యందొక పెద్దజన్నమున్
బటుతర దీక్షఁ జేయు జతనంబది కూడిన దుర్జయుండగున్
దిటవుగలట్టి వారతని దీక్షను భంగ మొనర్పగావలెన్
దటుకునఁ దత్ప్రయత్నము నొనర్పుము భానుకులప్రదీపకా. 382

క॥ రాముండీ పలుకులలో
సామంజస్యము గ్రహించి సమరోద్దండున్
సౌమిత్రినిఁ గపిసైన్యము
నామఖము నశింపఁజేయ నంపె రయమునన్. 383

క॥ కలగొను నల్లని మేనులు
జ్వలించు నిశితాయుధముల సంగడి చేతన్
తిలతండుల రాశివలెన్
జెలంగు రాకస బలంబుఁ జేరి తరుచరుల్. 384

క॥ చొచ్చిరి రక్కసి మూకల
వ్రచ్చిరి వైరుల శిరముల వజ్రసమములౌ
నిచ్చలమగు పిడికిళ్ళను
గ్రచ్చఱ రాకసులు బాఱఁ గలకల రొదతోన్. 385

క॥ చండకిరణుండు తమముల
తండములన్ జీల్చు నట్లుదగ్ర శరములన్
జెండాడెను లక్ష్మణుఁడు
ద్దండుఁడు రేద్రిమ్మరింద్ర దండును గ్రుటిలోన్. 386

క॥ అనిలో రాకసు లణఁగన్
గని రావణి స్వీయ హోమ కార్యము చెడఁగా
వనరుచు వడి తా వెడలెన్
వనాంధకారంబు నుండి వచ్చు రవి వలెన్. 387

మ॥ ఘన కాలాంబుద వర్షధార పగిదిన్ గ్రవ్యాద కోదండ ము
క్త నిశాతాంబక పంక్తి పర్వఁ గపి యూథం బెల్లఁ బాఱెన్ వెసన్
దిననాథుండు మయూఖ మాలికల సందీప్తిన్ బ్రపంచించు నో
జను సౌమిత్రి కనత్కలంబములచే సైరించె నా బాణముల్.388

క॥ దనుజుండు గను మొఱంగెను
గనుపింపక లక్ష్మణాశుగ వితానపు ధా
టి నెదుర్కొన లేక, ప్రభం
జనాహతి కదృశ్యమైన జలధరము వలెన్. 389

క॥ అటు కనఁబడి, యిటు కనఁబడి
పటు బాణచయమ్ము గుప్పి బాహాప్రౌఢిన్
జటిలమ్ముగఁ గపిసేనన్,
అటమట మొనరించె నసురుఁ డరుల జతనముల్. 390

మంజరి॥
అంతట సౌమిత్రి అసురమాయలకు
విసిగి వేసరి కూర్చి వింటినిఁ దూపు
గుణి నిల్పి యరిపై నకుంఠిత దీక్ష
నాన పెట్టె నిటుల నన్నను దలఁచి. 391

క॥ సరి లేని శౌర్యవంతుఁడు
నిరతము సత్యమును బల్కు నిశ్చల ధర్మా
చరణుండు రాముఁడయినన్
శరమిది రావణి శిరంబుఁ జయ్యనఁ ద్రుంచున్. 392

వ॥ ఈ పవిత్రాక్షరము లుచ్చరించి ప్రయోగించినంత. 393

ఉ॥ ఆ నిశితాంబకంబు మహిమాన్విత రాఘవ దివ్య శౌర్య దీ
ప్తానల చండ దీధితిని ధర్మగుణ ప్రభవ ప్రభావమున్
బూనిక నాని, రావణుని పుత్రుని కంఠము నుత్తరించె, త
త్సైనికులెల్ల దిక్కులకుఁ దత్తఱపాటునఁ బాఱిపోవగన్. 394

గీ॥ కన్న కొమరుని మృతివార్త కర్ణశూల
మై, హృదయ విదారకమై, మహాశని వలెఁ
దగుల, దశకంఠుఁ డార్చుచు ధరను వ్రాలె
పిడుగు పాటున కడఁగిన వృక్షము వలె. 395

ఆ॥ మిత్తి వాతఁ బడెను మేఘనాదుండను
చెడ్డ వార్త ప్రాకెఁ జిచ్చువోలె
అవరచిన రీతి నంతఃపురం బెల్ల
నావటించి యఱచి యఱచి యేడ్చె. 396

వ॥ మండోదరీ రావణు లిట్లు పుత్రునికై విలపించిరి. 397

గీ॥ తనయ! నినుఁ గన్న దాదిగా దైత్య వంశ
మేపు జూపెను లక్ష్మి సమృద్ధమగుచు
రాక్షస కులంబునకు నీ పరాక్రమంబు
మేటి కవచంబుఁగా నుండె మేఘనాద! 398

గీ॥ దిక్కు లేలెడి నిర్జరుల్ దిక్కు లేక
వెన్నుఁ జూపిరి కన్నయ్య! నిన్నుఁ గాంచి
దేహమంతయుఁ గనులుగా దేవనాథుఁ
డెపుడు జాగ్రత్త తో నుండు నెంచి నిన్ను. 399

గీ॥ అట్టి నిను మానవుం డొకండు డక్రమమునఁ
జంపె నను మాట నమ్మను స్వయముగా న
నంతుఁడే వచ్చి నిన్నొర్చెనని తలంతు
దాచి తన తేజమును నరోత్తముని యందు. 400

ఉ॥ మండెడి స్నేహ బిందువుల మాలలు దివ్వెల నుండి రాలు న
ట్లుండెను బంక్తి కంధరుని యుజ్వలమౌ నయనాంచలంబు లం
దుండి స్రవించు నశ్రులు; మహోగ్రపు శోకము రూపమెత్తి న
ట్లుండెను పుత్ర దుఃఖమున కోర్వని రాక్షస నాథుఁ డయ్యెడన్.

గీ॥ పంక్తి ముఖు శోకాశ్రువుల్ పలుచఁ బడియెఁ
దనయ మరణ ప్రతీకార దావ వహ్ని
శిఖలు చెలరేగె నాతనిఁ జిత్తమందు;
అగ్ని పర్వత తుల్యుఁడై యాతఁ డొప్పె. 402

క॥ గానుగ దిరుగు విధంబున
దానవపతి పండ్లు గీట దశదిశ లదరెన్
వానివిధముఁ జూడన్ దై
త్యానీకమె దాగె నతి భయార్తిన్ దెసలన్. 403

క॥ తన కంటె తేజుఁ గలిగిన
వినుత పరాక్రముని చావు పిశితాశనులన్
అనలము వలెఁ గనలింపఁగ
దనుజాంగన లేడ్వఁ వినియె దశముఖుఁడు వగన్. 404

క॥ నిందించిరి శూర్పణఖను
నిందించిరి పంక్తిముఖుని నిజసుతులు పతుల్
మ్రందుటకుఁ గారణంబని
గుందుచు రక్కసులు కుప్పఁ గూలిరి నేలన్. 405

క॥ అనుపమ శస్త్రాస్త్రములన్
ధనువును కవచమును బ్రహ్మదత్తమ్మును దా
ల్చెను రావణుండు వేచనె
దనుజారిని రామచంద్రుఁ దాకఁగ ననిలోన్. 406

క॥ రవి బింబ ముడిగెఁ దేజము,
భువిపై నల్దిక్కులందుఁ ఘొదమెను దిమిరం,
బవని చలించెను, నక్కలు
పవలఱచెను, రావణుఁడు బవరమున కరుగన్. 407

క॥ పెను దుర్నిమిత్తములఁ గను
గొనియున్ రావణుఁడు పోయెఁ గొంకక; నని జొ
చ్చెను బరసైన్యంబుల ప్ర
చ్చెను నారాచమ్ములఁ గపిశిరముల పెలుచన్. 408

గీ॥ కపి శిరః కోరకమ్ముల కంఠమాల
నందముగ వైచె నవనికి నసుర నేత
అర్ధ చంద్రాంబకమ్ముల నలఁతిఁ గోసి
క్రూర నారాచముల తోడఁ గూర్చి కట్టి. 409

ఉ॥ రావణుఁ డేసె తామస శరంబు విధాతృ వర ప్రదానమున్
బావక కీల సంకలిత భవ్య గభస్తి సముజ్జ్వలంబు, భీ
త్యావహ మద్భుతంబును మహాశని పాటవ విస్ఫుటంబు, సు
గ్రీవుని వానర ధ్వజినికిన్ బహునష్టము గల్గె దానిచేన్. 410

ఉ॥ మండెడి మంటిలో దుమికి మాడెడి మక్షిక రాశివోలె, మా
ర్తాండ మయూఖ మాలికల తాకిడి కోర్వని కల్వలట్లు, వే
దండ పదాహతిం గలఁగు తామర డిగ్గియ భంగి నొప్పె ను
ద్దండుని పంక్తి కంధరుని ఘాటికి నోర్వని కీశ వాహినుల్. 411

క॥ విఱిగి వెఱచి పాఱు కపుల
పరాక్రమ విభాసి రామ భద్రుఁడు గాంచెన్
బరుగిడకుఁ డోడకుండని
తరు చరులను హెచ్చరించి, దాఁకె దశముఖున్. 412

క॥ జలధరము పగిది రావణుఁ
డలుగుల రఘువరుని మీఁద నద్భుత శక్తిన్
బలపలఁ గురియింపఁగఁ గీ
లలఁ గ్రక్కు ములుకుల గుప్పి రాముం డణఁచెన్. 413

కII నాగముల చాలు వోలెను
బాగుగఁ బఱతెంచు బాణ పంక్తుల దైత్యుం
డాగక వైవన్ రాముఁడు
డేగలఁ బోలెడి శరముల డిందఁగఁ జేసెన్. 414

గీII ప్రళయ కాలంబు నందుఁ బ్రభంజనుండు
కాలమేఘాలఁ గలసి వికారలీల
భూ నభోంతరాళమ్ములఁ బొదవి నట్లు
రామ రావణ తీవ్ర శరంబు లొప్పె. 415

కII వేసవి నినకర మహిమన్
గాసారాంబువులు దఱుఁగు కైవడి, నరయన్
వీసర వోయె నిశాచర
కీశ చమూతతులు బాణ కీలిత తనులై. 416

వII విరూపాక్ష మహోదరులను సుగ్రీవుండు హతమార్చె, మహా పార్శ్వుని యంగదుండు మట్టువెట్టె, అంత సంధ్యా సమయ మాసన్నం బయ్యె. 417

ఉII సంగర కేళిలో భువిని శాత్రవ సంగతి సేని, దివ్య భో
గాంగనలన్, మనః ప్రియుల నక్కునఁ జేర్చుట కేగు వీర యో
ధాంగ విలిప్త శోణిత మహర్పతి నంటఁగఁ దన్ని వృత్తికై
పొంగెడి పశ్చిమాంబుధిని మున్గె ననన్ రవి గ్రుంకె నయ్యెడన్.

వII తరుచర నిశాచరులు రాత్రియం దని నుజ్జగించి మరు దినంబు సంగరం బారంభించిరి. మఱునాటి యుద్ధంబున పంక్తి కంధరుండు. 419

మII తన పుత్రున్ బొరిగొన్న వీరుని సుమిత్రాపుత్రు నీక్షించి, తా
గొనయమ్మున్ జెవిదాక లాగి విడిచెన్ గ్రూరాంబక శ్రేణి; భం
డన పాండిత్య మెలర్ప లక్ష్మణుఁ డనూన ప్రక్రియన్ దూపులన్
దునియల్ చేసెను; రావణా సురునకున్ రోషంబు గాఢంబుగాన్.

మంజరి॥

పరియుద్ధులై వారు శస్త్రాస్త్రములను
ఒండొరుపైఁ గుప్పి యుసురులం గొనఁగ
సాటి లేనట్టి యచంచల దీక్ష
యుద్ధంబు గావించి రుద్రేక మడర. 421

మ॥ మయ మాయా కలితమ్ము; వజ్రమయముఁన్ మార్తాండరుక్ బంధుర
మ్ము; యమాద్యష్ట దిగీశ పాటన వినిర్మూలమ్ము; లోకత్రయీ
భయ సంధాయకమున్; దురాసదము, దుర్వారమ్మునౌ శక్తినిన్
రయమారన్ దశకంధరుండు బలుపెన్ రామానుజుం గూల్పఁగన్

గీ॥ నిప్పుఁ గ్రక్కుచు సౌమిత్రినిన్ వధింప
సత్వరంబుగ వచ్చెడి శక్తినిఁ గని
సత్య సంధుండు రాముండు స్వస్తి గోరి
యాన వెట్టెను తమ్ముని యసువు లోమ. 423

గీ॥ అప్రతిహతంబు భీషణంబైన శక్తి
చొచ్చె సౌమిత్రి హృదయుంబు; క్రుంకి యతఁడు
మూర్ఛ నందెను శోణితం బురలి పాఱ
రాముఁ డడలె సౌమిత్రి దుర్దశను గాంచి. 424

ఉ॥ ధారుణి రాజ్యసంపదలఁ దండ్రి నిమిత్తము వీడు నప్పుడున్,
క్రూర విరాధు హస్తములఁ గుందెడి సీతను గాంచు నప్పుడున్,
గూరిమి పత్ని జాడఁ గనఁ గ్రుమ్మరు నప్పుడు, నిట్టి శోకమున్
నేరను తమ్ముఁడా! బ్రదుక నేర్తునె? నీవు వినా జగంబునన్. 425

క॥ వేవురు భార్యల సఖులను
గావలసిన భంగిఁ బొంద గానగు నలఁతిన్
నీ వంటి తోడఁ బుట్టువు
నీ విశ్వము నందుఁ బొంద నేర్తునె? తండ్రీ! 426

గీ॥ మాటి మాటికి నిట్టూర్చు మనుజ పతిని
దీన భావంబుతోఁ గుందు దీన బంధు
నిం గనుచు సుషేణుం డనె నీరజాక్ష!
శాంతి నందుము సౌమిత్రి చావలేదు. 427

మంజరి॥
శ్రీరాముఁ డంతట చింతను వీడి
పలికె నీరీతిని బౌరుషం బెలయ. 428

ఉ॥ వానరులార! లక్ష్మణుని భద్రముగా నిటఁ గాఁచి యుండుఁడీ!
మానవ వైరినిన్ దురభిమానుని; దుర్మదు, దుష్ట చిత్తునిన్
దానవ నాథు నిప్పుడె వినాశ మొనర్చెద; విశ్వమంగళ
శ్రీ నలినాక్షి మోము వికసింపఁగఁ జేసెదఁ బాపెదన్ జెఱన్. 429

క॥ అని కోదండము గొని చనె
జనపతి సూనుండు రామ చంద్రుఁడు క్రోధం
బునఁ గనులు కావి నూనఁగ
దనుజేంద్రుని పీచ మణచి ధ్వంస మొనర్పన్. 430

క॥ లెక్కింప రాని ములుకుల
నొక్కుమ్మడి రామచంద్రుఁ డుద్రేకమునన్
గ్రుక్కెను దశముఖు మేనన్,
గ్రక్కెను రక్తంబు వాఁడు కదనము వీడెన్. 431

మంజరి॥
ఖండన స్థలి వీడి పంక్తికంధరుఁడు
వెనుఁ జూపి పరువెత్త భీతాత్ముఁ డగుచుఁ
జెచ్చెరఁ దమ్ముని౦ జేరంగ వచ్చె
రాముండు శోక వారాశిమగ్నుండు -

తన వంశజుల దైన్యదశఁ గాంచ లేక
భానుండు గ్రుంకెను బడమటి దిశను -
పంపి సుషేణుండు పవనజున్ వేగ
నోషధీ శైలంబు నొనరఁ దెప్పించి
సౌమిత్రి గాయమున్ సరగున మాన్పి
ఆనందమును గూర్చె నచటి యందఱకు -
అట లంకలో రావణాసురుఁ డలిఁగి
తన కష్టమూలంబు ధాత్రిజ యనుచు
వధి యింపఁ బోయెడి వానిని నిలిపి
మందోదరీ దేవి మగనితో ననియె. 432

ఉ॥ అంటినఁ గందు నట్టి మృదులాంగిని, మంగళ దేవతా సమన్
పంటవలంతి, పట్టినిఁ బ్రభాకర దీప్తియుతన్ బవిత్ర - నీ
వంటి యశోధనుండు శివభక్తుఁడు, పాపపు దృష్టి వెట్టి క
న్గొంటయుఁ దాకి తెచ్చుటయు గొప్ప యఘం, బవురా వధింతువా?

ఉ॥ భావి శుభమ్ము నారయక వంశము నాశము సేయఁ బోకు, పూ
దీవియ వంటి సీతను వధింపకు, నాపలు కాలకించి, నీ
తీవరమైన శౌర్యమును దెంపును శాత్రవుపై వెలార్పుమా!
యీవిట సేద దీరి యని కేగుమ, రేపకడన్, మనోహరా! 434

గేయము॥

అని మందోదరి యసురాధిపునకు
మెత్తని మాటల మేవడి దెలిపెను
అంతట రావణుఁ డంతిపురమ్మున
కరిగెను దనసతి యనుసరింపఁగా. 435

మంజరి॥

రాతిరి యంతయు రావణబ్రహ్మ,
మెత్తని పాన్పుపై నత్తమిల్లియును

కలఁతతోఁ గడపెను గను మూయకుండ
తన మనోవీథిలోఁ దారసిల్లినవి
తొల్లి తాఁజేసిన దుశ్చేష్టితమ్ము
లెల్లను బ్రోవయి యెదలింప ధృతిని
మంగళ వాద్యముల్ మ్రోయుచుండ
దశదిశల్ పర్విన తన యశఃకాంతి
వంధిమాగధు లభివర్ణించు చుండ
కడు రేపకడ లేచి క్రవ్యాద విభుఁడు
కాల కంఠునిఁ గొల్చి కదనాన కరిగె
అసుర బలంబు తన్నాదు కొనంగ. 436

సీ॥ వీరభద్రునిఁ బట్టి వెగడుఁ జేయఁ గలట్టి
రక్కసి తెట్టువ ప్రక్కఁ గొలువ
దిగ్గజంబులనైన ధిక్కార మొనరించు
వారణ పంక్తులు బలసి వెలయ,
ఉచ్చైశ్రవము నేని యుల్లసం బాడెడి
జవనాశ్వముల చాలు తవిలి పఱవ
అరుణుని యరదమ్ము నపహాస్యముం జేయు
నున్నత స్యందన యూథ మొలయ.

ఆ॥ దశ కిరీట కాంతిచ్ఛటల్ దిశలఁ బర్వ
వివిధ శస్త్రాస్త్రములఁ దాల్చి విక్రమమున
పంక్తికంఠుండు సనుదెంచెఁ బవరమునకు
నెలమి నరుల వానరులను గెలువఁ గోరి. 437

గేయము॥

పయోధర దేహరుచిన్ జనుదెంచెడి
పంక్తికంఠునిఁ బొడుపన్

లయానల కీలలఁ జిమ్మెడి తీక్ష్ణపు
నారసంబుల పెలుచన్
రయాన విభాకర తేజుఁడు శ్రీరఘు
రామచంద్రుఁడు విసరెన్
భయానఁ బలాశనపంక్తులు దిక్కుల
పక్షులట్లు పరుగిడన్. 438

కII బోరనఁ బరువిడు రాక్షస
శూరుల హెచ్చరికఁ జేసి సురరిపుఁ డలుకన్
ధీరతఁ దాకెను రాముని
క్రూరపు నారాచములను రువ్వుచు వీకన్. 439

సీII ఉప్పొంగు జలధిని నుఱుకు తరంగముల్
చెలియలి కట్టపైఁ జెదరి నటుల,
ప్రళయ వేగంబునఁ బర్వు ప్రకంపనుం
డచలంబు ముంగల నణఁగి నటుల,
పెటపెట ధ్వనులతోఁ బెఱిఁగెడి కార్చిచ్చు
అంబుదాంతికమున నారి నటుల
మేఘగర్జన తోడ మెఱయుచు దూకెడి
అశని విశ్వంభర నడఁగి నటుల.

గీII వింశతి కరుండు పొంగుచు వేగమలర
వేయు శస్త్రాస్త్ర నివహముల్ వేలు వేలు
రామచంద్రుని దివ్యశౌర్యంబు ముందు
సత్త్వహీనంబులై వ్రాలె సంచలించి. 440

కII ధరపై నిలిచిని రాఘవు
డరదంబున రావణుండు నసమాహవమున్
సరగున సేయఁగఁ గన్గొని
సురపతి రామునకు బంపె సూతున్ దేరున్. 441

సీ॥ కాంచన కింకిణీ కలిత ధ్వజంబుతో
మగరాలు చెక్కిన నొగల తోడ
వెండి దండములపై వెల్ల ఛత్రములతో
రంగుల మెఱయు చిత్రముల తోడ
అత్యున్నతంబయి యాకసంబంటెడి
బంగారు శిఖరంపు ప్రభల తోడ
నిశిత శస్త్రంబుల నిర్మల కాంతితో
మణిభూషణంబుల మహిమ తోడ.

గీ॥ వెలయు హాటక రథము విన్వీధి నుండి
బాల భాస్కరు దీధితుల్ గ్రాలుచుండ
దిగెను రాముని ముంగల దివ్య దీప్తిఁ
గాంచ నెల్లరు విస్మయాకలితు లగుచు. 442

తే॥ అరదమును డిగ్గి మాతలి యంజలించి
వినయమునఁ జెప్పె రాముని వీనులలర
రథము నంపెను మఘవుండు రామచంద్ర,
పంక్తి కంధరుతో నాహవంబు నెరప. 443

వ॥ శ్రీరామచంద్రమూర్తి యరదంబు నధివసించి రావణుని
మార్కొనెను. 444

క॥ ఇరువది కరములఁ రావణుఁ
డురు బాణంబులను గుప్ప, నుగ్రారుణ వి
స్ఫురి తేక్షణుఁడై రాముఁడు
శరధారలఁ బరపెఁ బెలుచ శాత్రవు మీఁదన్. 445

క॥ సరియోధులు నరదానవు
లరమరికలు లేక పోరి రాహవభూమిన్
దిరమగు జిగీష తోడన్
సురలబ్బుర మొంది నిల్చి చూడఁ జదలునన్. 446

గీ॥ రావణుని మించె ననిలోన రఘువరుండు
సత్యసంధుఁడు సత్పథ చరితుఁడౌట
వృద్ధిఁ బొందెను రాముని విక్రమంబు
తఱుగఁ జొచ్చెను దైత్యుని ధైర్య పటిమ. 447

క॥ భల్లమ్మున రాముఁడు రిపు
విల్లును దునుమాడి, వేఱు వింటిని దనుజుం
డల్లనఁ గొను నంతటిలోఁ
బెల్లునఁ గురిపించె నంపవెల్లి నతనిపై. 448

క॥ జడిలోఁ జిక్కొని బడలిన
మిడిమేలపు కోడె మాడ్కి మిన్నక నిలిచెన్
వడబడుచుఁ బంక్తివదనుం
డొడలున రాఘవుని యమ్ము లొత్తుగ దూరన్. 449

ఉ॥ వానినిఁ గాంచి దాశరథి వక్కొను హాసము మోమునన్ మెఱుం
గీన, "విరించి దత్త వర దృప్తుఁడవై యెపుడేని యెద్దియేన్
నేనొనరింప వచ్చునని యింతిని దొంగిలి తెచ్చినట్టి నీ
మానము ప్రాణమున్ బిలుకు మార్తును శాతశరాళి, దుర్మతీ!

క॥ కోదండము గొని పోరుము
నీదండల వెలయు బలము నెఱిఁ జూపుమురా!
నాదండ నీవు నిల్తువె?
వేదండము హరి పదమున విఱిగి సురుగదే." 451

క॥ ఈ పలుకులు రావణు నెదఁ
గోపము రగిలింప మేని కోలల వీకన్
వేపెరికి, రాము మేనునఁ
దాపించెను విశిఖవృష్టి దర్పోద్ధతుఁడై. 452

క॥ ఘనుఁడైన రామచంద్రుఁడు
మనుజాశను మార్గణములు మన్ననఁ గలియన్
దునుముచు, ముమ్మొన భల్లం
బున వాని లలాట భాగమును భేదించెన్. 453

మంజరి॥

దశకంధరుండు దోర్దర్ప బంధురుఁడు
అగ్రహోదగ్రుఁడౌ అర్కాన్వయమణి
మార్గణ జ్వాలలో మాడి మసియగు
నని వాని సారథి అరదమ్ము ద్రిప్పె
రక్షో విభుని ప్రాణ రక్షణ సేయ.
రణభూమిఁ బాసి యారథము దవ్వరుగఁ
దేఱిన దివిజారి తేరి గతిఁ గని
నిట్టూర్చి సారథిన్ నిందించె నిటుల
"నల్లవో! దుష్టాత్మ! నా యాన లేక
ఖండన స్థలివీడి పఱతెంచ నౌనె
నరుని నారసముల నవయుచు నేను
వెను చూపితి నటన్న వెడగు పల్కులను
శాత్రవుల్ పలుకంగ సైరింప వలయు
తలవంపులాయె నీ తెలివి తక్కువకు
సారథీ నీవును శత్రు పక్షమును
జేరినావా నిన్నుఁ జెండుదున్ జెనటి"
అని మండిపడినట్టి అసురేశుఁ గాంచి
సారథి యొప్పుగాఁ జల్లగాఁ బలికె
రణమున డస్సిన రథికి విశ్రాంతి
నొసఁగుట నా ధర్మమో మహనీయ
చేయు మాహవమును సేదఁ దీర్చుకొని

నీ ముందు నిలుచునే కామారి యైన?"
అని విన్నవించి యాతని నూఱడించె;
రాచ నగరుఁ జేరె రథ మింతలోన,
రణ రంగమందున్న రఘుకులేశ్వరుని
యంతికమ్మున కగస్త్య మహర్షి వచ్చి
వీర రాఘవు యుద్ధ విజయమున్ గోరి
ఆదిత్య హృదయమ్ము నా మహాత్మునకు
నుపదేశమొనరించి యుత్సాహ మిచ్చి
అంతర్హితుండయ్యె నచ్చోటినుండి.
శ్రీరామచంద్రుఁ డాశ్రిత వత్సలుండు
ఆదిత్య హృదయమ్ము నతి దీక్ష నూని
ముమ్మారు జపియించి మ్రొక్కి సూర్యునకు
స్తుతియించె రవినిటుల్ సురుచిరోక్తులను. 454

కంద, గీతి, గర్భ చంపకమాల॥
హరి, వసువర్ణభా, అజ, వి
హాయసవీథి విహార, హంస అ
ర్క, రుచిరరుక్, ఖగా, తపన,
కాంతినిధీ, కవి, ద్వాదశాత్మ, శ్రీ
కర, రసపోషణా, దివిజ
కల్ప, సితచ్ఛవిదేహా, మిత్ర, భా
స్కర, సవితా, రవీ, భగ, త్వ
షాంపతి, పూష, గభస్తి భూషణా! 455

గర్భకందము॥
వసువర్ణభా, అజ, విహా
యసవీథి విహార, హంస, అర్క, రుచిరరుక్
రసపోషణా, దివిజక
ల్ప, సితచ్ఛవిదేహా, మిత్ర భాస్కర, సవితా! 456

గర్భ తేటగీతి॥

అజ, విహాయసవీథి విహార, హంస,
తపన, కాంతినిధీ, కవి, ద్వాదశాత్మ
దివిజకల్ప, సితచ్ఛవిదేహ, మిత్ర
భగ, త్విషాంపతి, పూష, గభస్తిభూష! 457

మంజరి॥

మనుజేశు ప్రార్థన మన్నించి యర్కు
డంతరిక్షమ్మున నతి దీప్తి నిలిచి
ఆశీర్వదించె నీకగు జయమ్మనుచు
నంతలో రావణుం డరుదెంచె ననికి. 458

క॥ నీలాభ్రరుచిరదేహుని,
బాలార్కద్యుతి మహస్కు, బలియుని, రామున్,
కాలుని గన నంపెదనని
బాలిశుఁడు పలాశి పఱపె బాణశ్రేణిన్. 459

శా॥ క్షోణీభార నివారణ వ్రతుఁడు, రక్షోవైరి, దృక్కోణముల్
శోణోద్భాసిత రేఖలీన, కినుకన్; శూలాంబకానీక మ
క్షీణ ప్రౌఢిని, శాత్రవుల్ గలఁగ వేసెన్ బూని దోర్లీలమై
శ్రేణుల్ గట్టిన దైత్య బాణతతి నిశ్శేషంబు గావించుచున్. 460

మంజరి॥

రామ రావణులు పరాక్రమ లీల
పవలు రాత్రి యనక తవిలి ఖండనము
కడు భయంకరముగ నేడు దినములు
జయ లక్ష్మి పాణికై సలిపిరి రహిని
శిత శిలీముఖమున శ్రీ రఘువరుఁడు
క్రవ్యాదు కంఠంబు ఖండించి వైచె. 461

గీ॥ హాటక కిరీట శోభిత హారి రత్న
కుండలోద్భాసమానంబు, ఘుసృణ శోణ
వీక్షణాభీల నిశిత దంష్ట్రా క్షతాధ
ర శిఖరోన్నతమైన శిరంబు గూలె. 462

ఆ॥ కూలు నంతలోన గొంతుపై మొలకెత్తె
అట్టి శిరమె యొకటి యద్భుతముగ
దానినిఁ గని విస్మయాన శ్రీరాముండు
ద్రుంచె మార్గణమున రోష మెలయ. 463

క॥ వేసెడి బాణము గళమును
గోసెడి పడిలోన నొండు గ్రొంగ్రొత్త శిరం
బాసితమై మొండెంబున
భాసిల్లుచునుండె; పంక్తిపతనము తొలయన్. 464

గీ॥ రామ కోదండ ముక్త నారాచ మారు
తహత వింశతి శాఖాయుత వట భూరు
హమ్ము రాల్చెను రక్త పల్లాయ తాంచి
తోత్తమాంగ ఫలావళి నుర్వి మీఁద. 465

వ॥ శ్రీరామచంద్రుఁ డప్పుడు మాతలిచేఁ బ్రబోధితుండయి. 466

ఉ॥ సింగము గంధసింధువును జీల్చెడి చెన్నునఁ జూచి రావణున్
నింగినిఁ వెల్గు భాస్కరుని నిశ్చల దీక్షను బ్రస్తుతించి, వే
సింగిణి యందు మార్గణము సేర్చి, జపించి పితామహాస్త్రమున్
జెంగను మ్రోతతో వదలె రివ్వున రాముఁడు గూల్ప రావణున్.

చ॥ జలధి ప్రభంజనోద్ధతిని సంక్షుభితంబయి మ్రోయు రీతి; ను
జ్జ్వలమగు కీలలన్ దపను వర్తుల బింబము గక్కునట్లు; వె
గ్గలపు రుషన్ ఫణీంద్రము నికామ రయంబున దూకు కైవడిన్;
దలఁపును మించు ధాటిని విధాతృ మహాస్త్రము సొచ్చె రావణున్.

ఆ॥ పిడుగు పడినఁ బగులు పెనుకొండ చాడ్పున
పద్మయోని శస్త్ర పాటవమున
రావణుండు చీలి రక్తంబుఁ గ్రక్కుచు
అవని మీఁదఁ గూలె నసువు లెడలి. 469

క॥ కంపించు నట్టి ధాత్రియుఁ
గంపించెడి సాగరుండు గాష్ఠల్ శాంతిన్
బొంపిరిమై గనఁ గలిగిరి
తెంపరి యగు పంక్తి ముఖుఁడు దిగ్గన వ్రాలన్. 470

మంజరి॥
అకలంక చారిత్రుఁడగు విభీషణుఁడు
కాంచి యగ్రజు చావు కన్నీరు జార
విహ్వలుఁడై విలపించె నీరీతి
"అన్నరో! నామాట లలనాడు నీవు
మన్నించి సీత నీ మహనీయ మూర్తి
కొసఁగి యున్నట్లైన నసువుల నిట్లు
పాసెడి గతి నీకుఁ బట్టునా చెప్పుమ!"
అంతలో రావణు నంతఃపురాంగ
నలు తమ పతి యసువులు గోలుపోయె
నను వార్త విని శోకహతలై చలించి, 471

సీ॥ పడివేయు పదములు తడఁబడి తొట్రిల
జీరాడు కుచ్చెళ్ళు చేతఁ బట్టి,
చేలాంచలమ్ములు నేలపైఁ జొర్లాడ
వేణికల్ వీపున వీడి చెదర,
ఊరుపు గాడ్పుల నున్నతోరోజము
లూర్ముల వోలె పై కుబికి తటుగ.

కన్నీటి వరదలు మున్నీటి వలెఁ బొంగ
దుఃఖార్ణవంబునఁ దూలి పడుచు,

ఆ॥ మిట్టఁబడ్డ మీలు గొట్టాడి నట్టుల
నెదలు మోదు కొనుచు నదవదలయి
రాజసమ్ము మఱచి రాణి వాసపు వారు
పట్టు తెరలు ద్రోచిఁ పరువు లిడిరి. 472

క॥ కనుఁగొని రమణుని తనువును
రణభూమిని దనుజనాథు రమణులు దీనా
ననులై మూఁగిరి ప్రాణే
శుని దేహము చుట్టుఁ బూల జొంపముల వలెన్. 473

సీ॥ ముకుళించిన కనుల ముగుద యొక్కతె దాకి
కను విప్పి ననుఁ గనుఁ గొనుము యనును,
ఘన దక్షిణ కరమ్ము కలికి యొక్కతె పట్టి
కైదండ నొసఁగుమీ కాంతుఁడ యను,
ధూళిఁ గప్పిన మోముఁ దుడుచుచు నొక లేమ
మోవి ముద్దాడుమా భూవర యను,
విస్తృతోరస్థలిన్ వెలఁది యొక్కతె జేరి
యక్కునఁ జేర్చుమా యధిప యనును

గీ॥ శిరము నొక్కతె యొడినుంచి చింత నొందు
పాదములఁ బట్టి యొక్కతె పలవరించు
ఓపఁ గారాని శోకాబ్ధి నురియు చుండి
మతి చలించి చరించిరి మగువ లచట. 474

మంజరి॥
అంత మండోదరి యన్నులమిన్న
విలపించె నీరీతిఁ దలఁచి ప్రాణేశు. 475

ఉ॥ హా మహనీయమూర్తి! దరహాస మనోహర వక్త్ర! సుందరాం
గా! మదదంతి బాహు సమహస్త! సురార్చిత పాదపద్మ! ది
వ్యామర సుందరీ హృదయ హారి! గిరీశ వరప్రసాద లా
భా! మనుజుం డొకండు నిను ద్రచ్చుటఁ గాలపు వైపరీత్యమౌ.

గీ॥ ఏ శిరంబుల నుపహార మిచ్చి భవుని
వరములను బొందినాఁడ వాశిరము లకట
ధాత్రిపైఁ బడ గ్రద్దలు తన్ను చుండె
కర్మఫల మెంత వారైనఁ గడవఁ గలరె? 477

ఉ॥ అచ్చపు టంద చందముల నచ్చెరు విచ్చు విలాస లీలలన్
అచ్చపలాక్షి భూమిసుత నన్ని విధంబుల మించు సుందరుల్
ముచ్చటఁగొల్పు కామినులు మోహన మూర్తులు; ముందు నిల్చి నీ
మెచ్చును గోర లెక్కఁడక మిత్తినిఁ గోరితి వౌర క్రొత్తకై! 478

క॥ కులమున గుణమున సొబగున
సలలితమగు పలుకుఁ బడులఁ జతురిమను మనం
బలరించు వర్తనమునం
దలఁచితివా సీత నాకుఁ దక్కువ యనుచున్. 479

తే॥ అనుపమ పతివ్రతామణి యవని పుత్రి!
ఆమె నలనాడు కామివై యంటి తెచ్చి
భస్మమై పోని నీ తపోబలము గాంచి
యబ్బురంబున మెచ్చరె! యమర వరులు. 480

ఉ॥ కంటికి ఱెప్ప వోలె మము గాఁచితి వీవు మనోజ్ఞమూర్తి! నీ
వెంట విమాన యానమున విశ్వము నెల్ల విహార వాటిగాఁ
గంటిమి, సర్వ సౌఖ్యములఁ గంటిమి, కోర్కెలు దీర, నేడు మ
మ్మొంటరులన్ బొనర్చి దివి కొక్కఁడవే చన న్యాయమా ప్రభూ!

చ॥ పరమ పవిత్రమూర్తులను, భాసుర సద్గుణ సచ్చరిత్రలన్
నిరుపమ సత్తపస్వినుల, నిర్మల మూర్తుల, నిశ్చలాత్మలన్
జెఱచిన పాపకృత్యములచే, భవదీయ తపః ఫలంబు; ని
ష్ఠురముగ నాశమాయె, రిపు సూదన! కూలితి వీవు మర్త్యుచేన్.

క॥ ఇంద్రాదుల గెలిచితి వీ
వింద్రియముల గెలిచి తొల్లి; యంత మిషను నా
యింద్రియములె గెలిచెను నిన్
ద్రుంచింపంబడితి వౌర మనుజుని చేతన్. 483

మంజరి॥
పతికినై యారీతిఁ బలవించు చుండి
యంతికంబున నున్న యా విభీషణునిఁ
గాంచి మందోదరి కనలుచుఁ బలికె
కినుకమైఁ గందోయి కెంపుల నీన. 484

క॥ ఎదఁబగుల నేడ్చు విధవల
రొదతో నిండిన పురంబు రోయక తీవిన్
గదనమునఁ బరుల బలమునఁ
బదిలంబుగఁ గొన్న కతనఁ బాలింతువులే. 485

క॥ ఏలెను నాపతి సుఖముల
కాలయమగు లంక నమిత హర్షోత్కర్షన్
ఏలుము శ్మశాన వాటికఁ
బోలిన లంకాపురంబు మోదంబదరన్. 486

క॥ చిన్నప్పటి నుండియు నిను
మన్నాథుఁడు మేల్మిఁ గూర్మి మన్నించెనుగా
అన్న పయి యాసు చేతన్
మన్ననఁ గలిపితి వయారె మాన్యపు లంకన్. 487

క॥ అని విలపించుచు వ్రాలెన్
దనుజేశ్వర రక్త సిక్త తనువున; సతియొ
ప్పెను సంధ్యారుణ మేఘం
బున మెఱయు మెఱుంగు దీవ పోలపము దోపన్. 488

వ॥ ఈరీతిఁ బొగిలెడి యింతులఁ గాంచి
శ్రీరామచంద్రుఁ డాశ్రిత వత్సలుండు
పలికె విభీషణుం బాటించి చూచి
శోక వారాశిలో స్రుక్కు కామినుల
పతి వియోగమ్మునఁ బలవించు సతుల
నొప్పైన పలుకుల నోదార్పు మయ్య! 489

చ॥ ధరను దివంబునన్ గెలిచె దాయలఁ; భీతులఁ జేసె మిత్రులన్;
బరమ విశిష్ట వీరమరణంబును గాంచెను రావణుండు; నీ
వరమర లేక చేయఁదగు నాతనికి వపరక్రియల్; వెసన్
మరణము తోడ వైరములు మాయును దానవ వంశ భూషణా.

వ॥ ఇట్లు శ్రీరామ చంద్రమూర్తి చేఁ బ్రబోధింపఁబడి, యంతఃపురాం
గనల నోదార్చి, యన్నకు దహన సంస్కారాదుల విభీషణుండు
నిర్వహించె. 491

మంజరి॥
అంత శ్రీరఘురాముఁడా విభీషణుని
అసురాధి నేతగా నభిషిక్తుఁ జేసి
ఆదరం బొప్పఁగ నాశీర్వదించె
తదనంతరంబు దైత్యశ్రేష్ఠుఁ గాంచి
శ్రీరామచంద్రుండు జెప్పె నీరీతి;
"మణిమయ భూషణ మండితన్ జేసి
చీనాంబరములఁ గైసేసి జానకిని

సంగ్రామ భూమికి సరగున దెమ్ము"
చని విభీషణుఁ డిది సాధ్వికిఁ జెప్ప
ఆమాటలన్నియు నార్తితోఁ బలికె
"పతి నీ స్వరూపానఁ బరికింప వలయు
తడవు సేయఁగ నోప ధవుఁ గాంచవలయు,"
అసురాధిపుండనె "నమ్మరో! నీవు
పతి యానఁ బ్రీతితోఁ బాలింపు మమ్మ
ఆలస్యమును జేయ నతఁ డోపఁ డనియె
ఆపల్కులను విని యవనిజ తలచె. 492

కII "దనుజుని యశోక వనమునఁ
గనులను బ్రాణముల నిల్పి కడు దుఃఖమునన్
మనుచుండిన యర్ధాంగినిఁ
గననొప్పదొ? వచ్చి చూడఁ గరుణానిధికిన్. 493

గీII పవనజుఁడు జెప్పి యున్న నేఁబడిన పాట్లు
వచ్చి యుండును వేగ నా వల్లభుండు
కాని - తెలిసియె నాదశఁ గాంచలేక
నాదు దీనాకృతి నిటు లానతి నొసఁగెనో." 494

కII చింతాకులాంతరంగను
సంతాప వికంపమాన సారంగాక్షిన్
వంతలఁ గొందలపడు సీ
మంతిని నొప్పగ పలాశిఁ మగువలు దీర్చన్. 495

సీII వక్రాలకంబుల వంకరల్ హెచ్చెను
క్రొత్తగా దువ్వి కూర్చుటను జేసి,
దుమ్ముఁ గ్రమ్మినయట్టి నెమ్మేని యందంబు
బహుళమై తనరె నాప్లావలబ్ధి,

చీనాంబరము దాల్పఁ జెలువం బడరి మొప్పె
మాసిన పుట్టంబుఁ ద్రోసి పుచ్చి,
బంగారు నగలను శృంగారముగఁ దాల్చ
భూషణ రహితకుఁ బొలప మమరె,

గీ॥ దిద్ది తీర్చిన జానకీదేవి సొబగు
పులు గడిగి నట్టి ముత్తెంపు మురువు నొప్పెఁ
దన మనః కాంతుఁ గనబోవు తమిని సాధ్వి
చెలువునకు; వింతకాంతులు చెలఁగె నపుడు. 496

క॥ కైసేఁతల మాటొందియు
రాసుత వత్సరము క్రూర రాక్షస పురిలో
ఊసరిలన్ వేసారన్
గాసిల్లిన మేనటంచుఁ గానఁగ నయ్యెన్. 497

క॥ మెలకువ మెయి రఘురాముని
నెలవునకున్ సీత వచ్చి నిలువఁగఁ బ్రేమన్
దిలకించెను సీతాపతి
తెలి కనుగవ యందు నరుణ దీధితి పొడమన్. 498

ఉ॥ కంటిని నా ప్రియాంగనను గన్నుల కింపుగ నంచు హర్షమున్;
ఒంటరియై యశోకవని నుండెను నీమె యటంచు దైన్యమున్;
తుంటరి రాక్షసాధముని దుర్మతి నీమెను కామవృత్తిచే
నంటగ యంచు రోషమును నక్షులఁ గ్రమ్మె క్రమ క్రమంబునన్.

క॥ హర్షము దైన్యము రోషము
ఘర్షణ వడ హృదయమందు, కాకుత్స్థుఁడు సా
మర్షంబునఁ బలికెను; ను
త్కర్షను వాంఛించు కపులు తల్లడ మందన్. 500

క॥ ఒంటరివై నీవుండన్
గొంటరి రాక్షసుఁడు నిన్ను గొనిపోవఁగ నా
దంటతనం బేర్పడ, ఆ
తుంటరితోఁ బోరొనర్చి త్రుంచితి నతనిన్. 501

క॥ చెలువను బట్టిన తులువను
బలమునఁ గదనంబు నందు భంజింపనిచో
నెలిద మ్మొందెద నని నేఁ
బొలియించితి వాని నాదు పోడిమిఁ జూపన్. 502

చ॥ కడు బలవంతుఁడై శివు నగంబును దోర్బల మొప్పు నుద్ధతిన్
దడదడ లాడ నూచిన విధాతృ కులోద్భవుఁడైన వాని కీ
పుడమిని నన్యకాంతలను ముట్టిన బట్టెడి శిక్ష నేను నే
ర్పడఁ గను జాటి చూపితిని; బాపినిఁ ద్రుంచితి సంగరంబునన్.

ఉ॥ దైవము చెట్టఁ జేసినను ధైర్యము వీడక నిబ్బరంబునన్
దీవరమైన పౌరుష మనీషల శక్తి వెలార్చి నేను మై
త్రీవశులైన వానర వరిష్ఠుల సాయము గొన్నవాఁడనై
రావణునిన్ దురాసదుని వ్రచ్చితి నా భుజశక్తిఁ జూపితిన్. 504

ఉ॥ ఇక్కడ, నొక్క యేడసురు నింట వసించిన దాని నిన్ను నే
నక్కున మక్కువన్ నిలుప నాఱడి నొందనె లోక మందు, నీ
చక్కఁదనంబు మామక విచక్షణతన్ హరియింపఁ బోదు, నీ
దిక్కెట నున్నదో చనుము! దీరెను నావగ వీనిఁ ద్రుంచుటన్.505

క॥ కూరిమినిఁ గోరి రాగా
నేరని నేరములు సూపి నిష్ఠుర ఫణితిన్
దూరెడు భర్తను గని యా
నీరజలోచన చలించె నెవ్వగ గదురన్. 506

మంజరి॥

పదిమందిలో నిట్లు పరుషముల్ వలుక
పతిదేవునిం గాంచి పలికె సీతమ్మ
గద్గద కంఠియై కన్నీరు గార
కనువారి హృదయముల్ గరఁగి జాల్వార. 507

ఉ॥ ఏనొక నీచగాఁ దలఁతువే, యిటు బల్కఁగ న్యాయ మౌనె? నా
మానస మీవెఱుంగవె? రమానిలయమ్ములు, సౌఖ్యవిభ్రమ
స్థానములౌ నగళ్ళు విడి ఛాయవలెన్ నిను వెంటనంటితిన్
కాననసీమ నీచరణ కంజయుగమ్ము భజింపనేగదా? 508

ఉ॥ రక్కసు నింట వత్సరము కాయిడి నొందితి, నాకుఁ జిక్కులే
రక్కస లెక్కడించి, రనురాగముతో నిట నుండ లేదు, నా
మక్కువఁ గోరి రావణుఁడు మానగు పల్కుల సంస్తుతించినన్
దక్కువఁ జేసి పల్కితిని ధర్మము దప్పక సంచరించితిన్. 509

మంజరి॥

తగువైన రీతి యా తరళాక్షి పలుక
ప్లవగులు రాము భావంబుల పట్ల
దమ యసమ్మతి నభివ్యక్తంబు సేయు
పరుషంపు దృక్కులు, ప్రసరింపఁ జేయ
క్ష్మానందనను జూచి మనుజేశ్వరుండు
దయవీడి పలికెను దారుణంబుగను. 510

పంచచామరము॥

వసించినావు వత్సరంబు పంక్తికంఠు తోటలో
స్పృశింప నోప నిన్నుఁ బొమ్మదేల మారు వల్కెదో?
హసింపఁగా బ్రజల్ సహింప; నార్తిమై ఫలంబు లే
దు, సంగఁడీని వీరు నొందుఁ దోయజాక్షి చూడుమా! 511

గీ॥ రక్కసుని కొంప వసియింప నొక్క యేడు
నీదు చరితంబు గూర్చి సందేహ మబల
కలక కన్నులు దీపవు కాంతి నెటుల
బాధ నొందునొ నినుగని బాధ వడుదు. 512

క॥ కన్నులఁ గెంపులు గదురన్
గన్నీరు ప్రభూత రోష కాలాగ్ని శిఖన్
సన్న మొనరింపఁగన్ వి
ద్వన్నుత సౌశీల్య సీత పలికెను వగతోన్. 512

ఉ॥ వసుమతి మానవుల్ దురిత వర్తనులై యెవి సల్పుచుందు, రా
దొసఁగులఁ జూచు సాక్షులు విధుండును సూర్యుఁడు పంచ
భూతముల్
నిసియు నహస్సు నాత్మయుఁ జలింపని ధర్మువు, మానవాళికి
చ్చు సుఖము దుఃఖమున్ దగిన చొప్పున మంచికిఁ జెడ్డకున్ నృపా!

ఉ॥ మాటల పోటునన్ మగఁడు మానస మంతయుఁ దూట్లొనర్చె, మో
మోట మొకింతలేక, యిఁక మోదముతో బ్రదుకంగలేను. నా
బాట యెదో వచింతు విను పావకుఁ జొత్తు, రగుల్పు మగ్ని, ని
చ్చోటనె, యో మరంది! విభుఁ జూచుచుః బ్రాణములన్
ద్యజించెదన్.” 515

క॥ నరపతి సమ్మతిఁ జూపులఁ
బరికించి సుమిత్ర సూతి వగచేఁ గన్నీ
రురలంగఁ జితినిఁ బేర్చెను
నిరుక్తినిఁ గపుల్ గనంగ నిశ్చేష్టితులై. 516

క॥ పతికిఁ బ్రదక్షిణ మొనరిచె
నతయై పాదాబ్జములను నర్మిలి దనరన్
నుతియించె రామచంద్రునిఁ
జితి యెక్కెను మాననీయ చెందొవ శోభన్. 517

కII ఎండిన కాష్ఠంబులతో
మండెడి చితి నడుమ నున్న మానవతి నభో
మండల విధు రేఖ వలెన్,
నిండిన చూపఱకు దోచి నెఱపెన్ వెఱగున్. 518

వII జనకరాజ పుత్రి యిట్లనియె. 519

కII సతి యగుదు నేని, నిరతము
పతి నామ ధ్యాన పరమ పావని నేనిన్
హితుఁడై వాయు సఖుం డ
గ్ని తత్ క్షణం బోము నన్ను నెట్టిక సీలన్. 520

ఆII సాధ్వి నగుదు నేని; సద్గుణి రాముండు
పూరుషోత్తముండు, పూర్ణచంద్ర
నిభ శుభాననుండు నెలకొని నామదిఁ
బాయకుండు నేని వహ్ని యోము." 521

కII అని పలుక ననల మడఁగె న
వనీసుత జనించి నటులఁ బావకు నందుం
గనువిందై కనిపించెను
ఘనులు సురులు భువికి దిగిరి కమలాసనుతోన్. 522

కII నిచ్చలు పతినిఁ దలంచెడి
సచ్చరితను శంకఁ జేయ సరిగాదనుచున్
వచ్చిన నిలింపు లందఱు
మెచ్చుకొనిరి మేదినీజ మేలిమి నడతన్. 523

మంజరిII
అంజలి బద్ధుల నవనతాననుల
విరహాగ్ని కీలికావృత మానసులను

జానకీ రాముల జలజాసనుండు
ప్రీతితోఁ గని పల్కె మృదుభాషణముల. 524

గీ॥ మాధవుఁడ వీవు మహనీయ; మంగళాంగి
జానకీదేవి శ్రీలక్ష్మి; వానరు లమ
రాంశ జాతులు, పాప భారా నతాంగి
యైన ధర నుద్ధరించితి రయ్య! మీరు. 525

క॥ అమ్మా! శోకింపకుమా!
యిమ్మాడ్కిని నీదు భర్త యీభువి కెల్లన్
నెమ్మిన నీ పాతివ్ర
త్యమ్మును జాటించి ప్రత్యయమ్మును గూర్చెన్. 526

మంజరి॥
తలవాల్చి నిలిచిన జలజాక్షి కరము
ప్రియముతో నసలుండు పృథ్వీశు కొసఁగె
విమలాంబరంబునన్ వెలి మబ్బువోలె
ధవళాక్షి విలసిల్లె ధవుని పార్శ్వమున,
ఆదరంబున వారి నాశీర్వదించి
అమరగణమ్ము లదృశ్యంబయి చనిరి
కాకుత్స్థ తిలకుండు కపులతోఁ గూడి
పుష్పకా రూఢుఁడై పోయె వేగముగ
గడువులో భరతునిఁ గలిసికొనంగఁ
బోయెడి దారిలో మున్నుఁ దాగనిన
వింతలఁ జెప్పెను విభుఁడు తొయ్యలికి
సేతువున్ జూపించి చెప్పె నీరీతి. 527

క॥ కనుమదె, వారధి, నీలుఁడ
తి నేర్పునఁ గపులు శిలాతతిని వేయం గ
ట్టెను, దీనిపయిం గపి వా
హినితోఁ జేరితిని లంక నిభ నిభగమనా! 528

క॥ ఈ రీతిని రఘురాముఁడు
దారినిఁ గల వింత లెల్ల ధాత్రీ సుతకుం
గూరిమినిఁ జూపి చెప్పుచుఁ
జేరెను గిష్కింధఁ గపుల చిత్తము లలరన్. 529

క॥ అట నిలిపి పుష్పకంబును
గుటిలాలక సీత సెప్పఁ గోఁతి పొలఁతులన్
దిటవగు విమానమం దా
దటఁ గొని పయనించె రామ ధరణిపుఁడు వడిన్. 530

వ॥ మగుడ శ్రీరామచంద్రమూర్తి మార్గమందలి విశేషముల
సీతమ్మకుఁ జూపించుచు నిట్లనియె. 531

క॥ శంపాలతాంగి! కనుమా
పంపాకాసార మిద్ది, ఫలభూరుహముల్
సంపన్న గృహస్థులవలెఁ
దెంపునఁ బాంథుల బుభుక్షఁ దీర్చున్ సతమున్. 532

క॥ కనుమ శబరీ కుటీరము
జనని వలెం బ్రీతితోడఁ జవిగల పండ్లన్
దినిపించెను మాచే నా
మనుజాంగన దివినిఁ జేరె మాహత్మ్యమునన్. 533

క॥ కడుపునఁ గన్నొక్కటి, యా
కడుపున దంష్ట్రా కరాళ గహ్వర సమమై
నిడుపగు జిహ్వను జెలఁగిన
వెడవక్త్రు కబంధు మేము విఱిచితి మిచటన్. 534

క॥ తనకొఱకై ఘోరములౌ
వనములఁ బడరాని పాట్లు పడినట్టి ప్రియుం
గనుఁగొని జలరుహలోచన
అనువున స్పృశియించి చూపె ననురాగమ్మున్. 535

మంజరి॥

శ్రీరామచంద్రుఁడు సీతకుఁ జూపె
మార్గమధ్యంబున మఱువంగరాని
అటవీస్థలంబుల, ననుభవంబులను
వీనుల విందుగా విశదీకరించె,
ఆకాశమున దండకాటవిం గడచి
వారు చేరిరి భరద్వాజాశ్రమమ్ము
రామాగమనమ్ము భరతునకుఁ దెలియ
నధిక మోదంబున నతఁడేగుదెంచె
రథగజాశ్వములతో రాణువ తోడ
తల్లులు మువ్వురు తన వెంట రాగ
వచ్చిన తమ్ముని భరతునిఁ గాంచి
అక్కున గదియించె నర్కాన్వయుండు
మోకరిల్లెను ప్రీతి ముగురు తల్లులకు;
ముని యానతినిఁ బొంది భూనాథుఁడేగి
రాజ్య భారమ్మును రహి దాల్చినాఁడు;
భూషణాంబరముల భూవిభుండిచ్చె
క్రవ్యాదవిభునకుఁ గపుల కందఱకు
సన్మాన మొనరించె సంతసం బెలయ
కిష్కింధ కరిగిరి కీశులు వేడ్క
లంకేశుఁ డేగెను లంకకుఁ ప్రీతి
శ్రీరామచంద్రుండు చేసె రాజ్యమ్ము
పదికాలముల పాటు ప్రజలు సుఖింప,
రామ రాజ్యమ్మని ప్రజ కొనియాడ,
ధర్మము, న్యాయమ్ము ధరణిని వఱల
ఆరాజు పాలన నందఱు సములె
బలహీనుఁడైనను బలవంతుఁడైన

ధనహీనుఁ డైనను ధనవంతుఁడైన
తప్పుఁజేసినవాఁడు దండింపఁబడెను,
వర్ణవిభేదంబు బ్రతుకులన్ లేదు
వర్ణభేదంబులు వఱలె చిత్రముల
వేష భాషలయందు వివిధ కావ్యముల.
పనిబాటఁ జేయుచు బ్రతికిరి ప్రజలు
కూడు గుడ్డలకునై కుములలేదెవరు
మంచి పెంపారెను మానవు లందు,
విద్యాధికత తోడ వినయంబు పెఱిఁగె
నీతితో మనుజుఁడు నెగడుట వలన
నిర్భీకుఁడై మనె నిశ్చల వృత్తి,
ప్రతిభా సమగ్రుఁడై భాసిల్లినాఁడు
చైతన్యమూర్తియై చెలఁగి యొప్పారె,
అధికారు లందఱు నధిపు నానతిని
దలఁదాల్చి మసలిరి, ధనము నార్జింప,
న్యాయ విక్రయమును జేయంగ లేదు.
ప్రజల యభిమతమ్ము పాటింపఁబడెను,
చెప్పెడి నీతియే చేయంగఁ బడెను,
ప్రజల మిత్రుండయి భాసిల్లె రాజు,
సుస్థిర శాంతితో శోభిల్లె ధాత్రి. 536

— ఫలశ్రుతి —

కII వ్రాసిన, చదివిన, వినినను
భాసుర శ్రీరామచంద్ర పావన గాథన్
వీసరఁ బోవును బాపము
లాసుకృతుల కబ్బును పురుషార్థంబు లొగిన్.

ఓం తత్ సత్

చ॥ పటుతర రామభక్తి పరివర్ధిత సత్వుఁడు; దుగ్గిశెట్టి వేం
కట రమణాభిదుండు; గుణగణ్యుఁడు; సింహపురీనివాసి; యు
త్కట కవితా కుతూహల వికస్వర మానసుఁడై రచించె, ము
చ్చట లొలుకన్ రఘూద్వహుని చారు చరిత్రము యుద్ధకాండమున్

ఓం తత్ సత్



## నివేదన

ఉ॥ జాను తెనుంగు కబ్బము రసస్ఫురితంబుగ, భావ వీచికా
నూన పరిస్ఫుటంబుగ, వినూత్నముగా విరచింప నోడియున్
మానవ రూప మెత్తిన రమాధవ మంగళమూర్తి; నీకథన్
బూనికమై రచించితిని ముగ్ధుఁడ నైతిని నీ ప్రవృత్తికిన్.

మత్తకోకిల॥
ఉక్తులన్ సుమనోహరంబుగ
నూర్జితంబుగఁ దీర్పఁగా
శక్తి నాయెడ లేక యున్నను
శంఖ చక్రగదాధరా!
భక్తిచే రచియించి నాడను
పావనంబగు నీకథా
సక్తిచే; నఘముక్తి నాకిడి
శాంతి నాకొన గూర్పుమా.

క॥ నీపాదాబ్జమ్ములపై
నీ పుష్పము నుంచి నాడ నృవకుల మౌళీ!
ఓపికతో నన్నోముము
నాపాపములన్ హరించి నరనుత చరితా!

క॥ ఈరచన రామచంద్రా
నీరసమయ్యును ధరిత్రి నిలుచును; యుష్మత్
సారకథాశ్రయమయి; శిల
నీరూపము నొంది పూజనీయము గాదే?

రమణీయ రామాయణము

సర్వము సమాప్తము.

శ్రీ

# రమణీయ రామాయణము
# ఉత్తరకాండము

## విన్నపము

భక్తిమై ప్రపత్తిమై భవత్ పదంబుఁ గొల్చు నే
వ్యక్తి నైనఁ బ్రోచు నట్టి వ్రతి పవిత్ర రామ! నే
రక్తి నూని నీప్రజానురంజకత్వ దీక్ష కా
సక్తి నీకృతిన్ మృదూక్తి సంతరించితిన్ ప్రభూ.

భవదీ యాప్రతిమాన రూపకళలన్
భాసిల్లుచున్ రాలు పొం
దవె? అర్చాసుమ ధూప దీపముల ని
త్యం బప్రమేయా! అటుల్
భవమున్ దాటఁగ నే రచించినది, దీ
వ్యద్భావ సంపూర్ణ సం
స్తవపాత్రం బిది, దీని నాంధ్రుల శిరో
ధార్యంబుఁ గావింపుమా!

## మనవి

చదువరులన్ రసజ్ఞులను
సన్నుతిఁ జేయుచు విన్నవింతు, నా
హృదయమునందు వెల్గు మను
జేంద్రుని రాముని భక్తిభావనన్
ముదమున వాక్ప్రసూనములఁ
బూజ నొనర్చితి నే నిదంకృతిన్
సదయత మీరు దీనిని బ్ర
సన్న మనస్కత నాదరింపుఁడీ!

పూవులలోని దేనియును
బూనిక మక్షిక తెచ్చి తెట్టెలో
నేవిధి దాచునో యటులె
యింపగు రామకథామరందమున్
బావనమైన యీకృతిని
భద్రమొనర్చితిఁ బెల్లుపల్కులన్;
గోవిదులార! మీరలును
గ్రోలి నను జరితార్థుఁ జేయుఁడీ!

## భవభూతి స్తుతి

కరుణకుఁ దావలంబయిన
కమ్మని కబ్బము, రామచంద్రు న
త్తర చరితమ్ము నే సుకవి
తల్లజుఁ డప్రతిమానభావనన్
దిరిసెన పూవురేకులకు
దీటగు మెత్తని దేవభాషలో
హరువుగఁగూర్చె ముచ్చటగ
నా భవభూతికి నా సమస్కృతుల్.

## గురు ప్రశంస

సరసకవి సాహిత్య రత్న : శ్రీ మోచర్ల రామకృష్ణయ్య.

ఉన్నతమైన విగ్రహము,
సుల్లసితాస్యము, సౌమనస్యమున్
వెన్నెలఁ జిమ్ము విస్మితము,
విస్ఫుట సాత్త్విక సామరస్యమున్
దిన్నని వల్లకీస్వనము
తీరున హాయినిఁగొల్పు కంఠమున్
నిన్నుఁదలంపఁజేయు ధర
నోర్వలిడిగ్గిన దివ్యమూర్తిగన్.

జవసత్వాహ్వాయపక్షయుగ్మకముతో
ఛందస్సమిచ్చిన వై
భవ భావాంబర వీధులందు విహరిం
పంగోరు వర్ధిష్ణు శి
ష్యవరుల్ గాంతురు సాధుకావ్యరచనా
సామర్థ్య సౌలభ్యముల్
భవదీఁయ ప్రతిభా ప్రబోధకలనన్
వాత్సల్యా వారాంనిధీ!

చిక్కని చక్కనౌ పసలు
జిల్కెడి జానుతెనుంగు కూర్పులన్
నెక్కొనఁజేసి, కైత హవ
ణింపఁగఁ జేసెడి కౌశలమ్ము, స
మ్యక్కలనన్ సుసంస్కృత స
మాస సముచ్చయ శోభితాకృతుల్

బెక్కు కృతుల్ రచించిన కు
    లీన మనీషివరున్, సదస్యులన్
జొక్కఁగఁజేయు భాసుర వ
    చో విభవుం, డనురాగ విస్ఫుర
ద్దృక్కులఁ గావ్యకృల్లతల
    కెంతయుఁ బ్రోదినొసంగు మాన్యునిన్
మక్కువరూపుఁగొన్న కవి
    మండను, సన్నుతసాహితీప్రభున్
దిక్కులఁ బర్వఁజేయు గణ
    నీయ సుధీమణి, మద్గురున్ యశో
భాక్కును, రామకృష్ణ కవి
    వర్యుని, మోచరలాన్వయేందునిన్
నిక్కపు గౌరవాకలన
    నే స్మరియించి, రచింపఁ బూనితిం
దక్కక కోసలేంద్రు చరి
    తంబును నుత్తరరాఘవమ్ము, పెం
పెక్కిన భక్తిభావమున
    నీకృతి నారయుఁ డాంధ్రు లాస్తికుల్.

ఇట్లు
కావ్యకర్త
దుగ్గిశెట్టి వేంకటరమణయ్య.

# రమణీయ రామాయణము
# ఉత్తర కాండము

## పూర్వాభాష్యము

అత్యంతోదాత్తమగు శ్రీ సీతారాముల చరితము జగద్విఖ్యాతము, దానికి అక్షరరమ్యత నాపాదించిన మహనీయుఁడు 'మధుమయ ఫణితీ నాం మార్గదర్శీ, అను ప్రశంసకు పాత్రుఁడైన మహర్షి వాల్మీకి. వాల్మీకి రామాయణము సప్తకాండ సంశోభితము. షట్కాండాని తధోత్తరమ్' అన్న సూచన ననుసరించియే మహావీరచరితమును ఉత్తర రామ చరితమును భవభూతి రచించినాఁడు.

రసమయమైన రామకథ యెందఱనో ఆకర్షించినది. కవులు బహు భంగుల రామకథను ప్రబంధములుగా, నాటకములుగా వెలయించిరి. ఇంకను రామాయణములు వెల్వడుచునే యున్నవి. రామచరితమును పూర్వులు పూర్ణముగా వర్ణించిరిగదా యని దానిని విడిచినచో శ్రీరాముని వంటి గుణగరిష్ఠుఁడు - నాయకుఁడు కాఁదగినవాఁడు మఱియొక్కఁ డున్నాఁడా?

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితం
గుణైరేతావద్భిః జగతి పునరన్యోజయతి కః? (మురారి)

రమణీయరామాయణ కర్తలగు శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య గారి కావ్యమున ఉత్తర రామచరిత్రమును రసవత్తర ఫణితిలో నిబంధించి యున్నారు.

కావ్యారంభమున శ్రీరామచంద్రుఁడు 'శ్రీ సీతామహిళామతిన్ సతతమున్ జెల్వారు శృంగారిగా, 'వాసింగన్న ప్రజానురంజన సమజ్ఞా మాధురీహారిగా ఉల్లేఖింపఁబడుట గుర్తించితిమేని, ఈ యుపక్రమము ఉత్తర రాఘవోదంతమునకు సూచ్యార్థసూచన యని పొడకట్టును.

రామభద్రుఁడు సీతాహృదయ సామ్రాజ్యమునకు పట్టభద్రుఁడు. ప్రాణేశ్వరి ప్రశంసకుఁ బాత్రమైన చిత్తరువును దిద్ది తీర్పగల్గిన సిద్ధ హస్తుఁడు-ఈ చిత్రపట సందర్శన ఘట్టముం జదువునపుడు శకుంతల చిత్తరువుం దీర్చిన కాళిదాసుని దుష్యంతుఁడు మనకు జ్ఞప్తికి రాక మానఁడు.

తాను లిఖించిన యా లేఖ్యములోని జానకి నామెకుంజూపి 'సూర్యరశ్మి సోకి సొబగురంగులనీను మెట్టుజాలు నీట మెఱయునీదు, పాలరంగు మేను పర్జన్యువింటితో నలరు వెల్లమొయిలు నతకరించు" అని శ్రీరామచంద్రుఁ డభివర్ణింపఁగా, ప్రాణేశ్వరుని చిత్రకళాప్రావీణ్యమును జానకి సరస్వతీ మనోహరిరాగమున గానమొనర్చినది. రఘు రాముఁడప్పుడు;

నీ గేయపు మృదు మంత్రం
బీ గీచిన చిత్రమునకు నిచ్చెను ప్రాణం
బో గీత కళాధుని; స
ర్వాగమ శాస్త్రనుతవు కలభాషిణి వీవే!

అని తన మనోహారిణి గానకలావైశారద్యమును కీర్తించినాఁడు. ఈ సందర్భమునందలి సీతారాముల పరస్పర ప్రణయవాక్ చమత్కార మాధురి సుమనోమనోహరము.

"అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వ వస్థా సుయ
ద్విశ్రామో హృదయస్య యత్రజరసా యస్మి న్నహార్యోరసః
కాలే నావరణాత్యయా త్పరిణతే యత్ప్రేమ సారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే"

అను భవభూతి సుప్రసిద్ధశ్లోకమున నుగ్గడింపఁబడిన ఉదాత్త దాంపత్య తత్త్వము ఈ కావ్యమునందలి యీ క్రింది పద్యమున హృద్యముగా అవతరించినది.

"దాంపత్యంబు వయస్సునన్ వలపునెత్తావుల్ గుబాళించుఁ గ
ప్రంపున్ వీడ్యముపోల్కి, మేనులొకటై రంజిల్లు సంశ్లేష సౌ
ఖ్యంపున్ డోలల, వార్ధకంబెలయ నవ్యక్తాను రాగార్ద్రతన్
సొంపుల్ గూర్చును సాహచర్యసుషమాస్తోక ప్రభాపూర్ణతన్"

శ్లో : "ఉత్పత్తి పరిపూతాయాః కి మస్యాః పావనాంతరైః
తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్య త శ్శుద్ధి మర్హతః

అను శ్లోకమునకు ఛాయానువాదమైన యీ కావ్యమునందలి పద్య మిదిగో

"పుట్టుక చేఁ బావనతను నిట్టలముగఁ బొందినట్టి నెట్టికసీలన్
ముట్టిన, 'తీర్థజలంబులయట్టుల నగ్నియుఁ బవిత్రుఁడై
యలరారెన్"

హనుమంతుని ప్రస్తావము వచ్చినప్పుడు శ్రీరాముఁడు సీతాదేవితో

"నమ్మినబంటు నాకు, గపినాధునకుం గడుఁగూర్చుమంత్రి, శౌ
ర్యమ్మున కిమ్ము, మిత్రవిజయ ప్రతిభాసముదీర్ణమూర్తి, క
ర్ణమ్ములకింపు నింపు మధురంబగు మాటలయందు మేటి, యు
ద్ధమ్మున రుద్రుఁ డీతనికితండె జగమ్మున సాటి జానకీ!"

అని యభినందించుటలో అంజనేయుని రుద్రాంశమును కవి చదువరులకు పరిచయమొనర్చినాఁడు.

"మీ రమణీయరూపమున మేలుగ వెల్గెడి దివ్యశోభ వి
స్ఫారితనేత్రలై కని ప్రజల్ పరమాత్ముఁడె మేనుదాల్చి, మా
యూరఁ జరింపవచ్చెనని యబ్బురపుందమి గుంపు గుంపులై,
చేరి మిమున్ బ్రమోదమునఁ జిత్తములర్పణ సల్పిచూడరే!

యని సీతాదేవి తన్ను! గీర్తించుట నామోదింపని శ్రీరాముఁడు

చాలునుజాలు నీనుడులచాతురి, నన్ మహనీయుఁగా నిటుల్
మేలములాడఁగాఁ దగునె? మిన్నునుదాకునె మన్ను గాలిలోఁ
దేలియు? నన్ను నీవిపుడు దేవునిగాఁ దలఁపన్ సహింతునే!
నేలఁజరించు మానవుని నిల్పెదువే పరమాత్మ పీఠిపై?

అని ప్రేయసిని మందలించి

"నాలోన లేనిశక్తులు జేలా, యూహింపఁబోకు, పృథివీశుఁడనై,
పాలింతు ధార్మికుఁడనై, పాలితుల శుభంబెనాకుఁ బరమశుభంబో

అను పల్కులలోఁ దన జీవితలక్ష్యము నభివ్యక్తి మొనర్చినాఁడు. ఈసందర్భమున "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం" అని పలికిన శ్రీరామమూర్తి మనస్మృతిపథమునకు వచ్చును.

ఈ కావ్యమున సూర్యోదయవర్ణనములుగల పద్యములు మూడు ఘట్టములం దుండున్నవి.

"రంగన్నవరతికేళ్యాలింగనభంగములు బ్రతుకులీలల మొదలుల్
మంగళకైశిక వృత్తుల సంగీతము సన్నబర్వె జగములనెల్లన్"
(వ. 88)

ఈ పద్యములోని భావము రానున్న సీతారాముల వియోగమును సూచించుచున్నది.

"కనరండో గృహమేధులార, నయరక్షా దక్షులారా, పృథ
గ్జననిందన్ విని రాజు సాధ్విని ప్రజాసంప్రీతికై కాన కుం
బనుచున్, నేరమదేమొ మీరడుగరా? పాటింతురా యిట్టి చే
తను, లేతెండను రీతిఁగూసె ద్విజ సంతానమ్ము లొక్కుమ్మడిన్.
(వ. 119)

ఉషఃకాల పక్షికుల కలకలములు ఎట్లు వినవచ్చినవి? రాముని సీతా బహిష్కారము ద్విజ సంఘములకు దుస్సహమైన సంఘటన

మగుటచే ఇంతదారుణకృత్యము జరుగుచున్నను, మీరింకను శయనించి యున్నారా, లెండు అని జనమును నిదురలేపుచున్నవో యన్నట్లు వినవచ్చినవట.

"చీఁకటి చీర జార, నునుసిగ్గున నిల్చిన భూవధూటికిన్
బ్రాకట కాంతి తంతువుల బంగరు టంచుల యంబరంబు వే
జోక దలిర్ప నిచ్చినటు, సూర్యుఁడు నిర్మలకాంతిరేఖలన్
లోకములెల్లఁగప్పి తనరున్ దననామము సార్థకంబుగాన్."
(ప. 266)

"ఈ మహి నిండియున్న తమమింకెడు నట్లొనరించు రీతిగాఁ
దామరపూల తంపరల దాగిన లక్ష్మిని వెల్వరింపఁగాఁ
గోమల కాంతులన్ గమల కుట్మలముల్ వికసింపఁజేయ, శో
భామల దివ్యమౌ కిసలయారుణ సూర్యకరాళి చూపడున్."
(ప. 267)

తమకుఁ బ్రాప్తించిన యపవాద తిమిరము నుండి సీతారాములు వెల్వడి పునస్సంయోగ ప్రకాశము నొందఁబోవుటను కవి యీ సూర్యోదయ వర్ణనమున సూచించుచున్నాడు.

'రాజ్యలక్ష్మి నిరాకృతరాఘవునకు తల్లినానాఁడు-దూరస్థురాలనేఁడు
శ్లాఘ్యరాజ్యరమాభోగలాలసునకు-ఏకపత్నీవ్రతంబననిట్టిదేమొ?'
(ప. 146)

తన జీవితమున శ్రీరాముడనుష్ఠించిన వ్రత మెద్దియో, దాని తత్త్వమేమో తాను సరిగా అర్థము చేసికొన్నదో - లేదో - 'దాని రహస్యమిదియే నటయ్యా, మఱఁదీ, చెప్పుము' అని లక్ష్మణుని సీతాదేవి యడుగుచున్నది. అనాఁడు అయోధ్యా రాజ్యలక్ష్మి నిరాకరించినప్పుడు ఆయనకు

నేనొక్కతెనే భార్యను ఈనాఁడు నేను బహిష్కృతనై దూరస్థురాల నైనందున, ఇప్పుడాయనకు రాజ్యలక్ష్మి యొక్కతెయే భార్య. ఒక్క భార్యతో సంసారము చేయుటయే ఆయన వ్రతముఁగాబోలు! శ్రీరామ హృదయ కావ్యరసగ్రహణ పారీణమైన రమణీయ వ్యాఖ్యానముగదా యిది!

అచ్చపు నీలిమబ్బు దివిజాధిపురంగుల వింటి నిగ్గుచే
ముచ్చటఁగొల్పు - దానిని ప్రమోదముననగని నెమ్మిమైపురిన్
విచ్చి నటించు - వారిదము వేడ్క నొసంగును గంకణంబులన్,
మెచ్చిన ఉచ్చనీచతలు మేరలుగావు సుహృజ్జనాళికిన్. (ప.129)

ఈ పద్యమునందలి కంకణ శబ్ద శ్లేషలోఁగల సారస్యము సహృదయులకు హృదయైక వేద్యము.

కరుణరసస్ఫోరకములైన యీ క్రింది పద్యములు పఠితల హృదయములను ద్రవింపఁజేయును.

"అచ్చటికేగి చెప్పుము శ్రియః పతితో రఘురామమూర్తితో
నిచ్చట దుర్గమాటవిని హేళికులంబున కోపలేని పెన్
మచ్చను గూర్చినట్టి లలనన్ విడివచ్చితినంచు,ఁ బెండ్లిలోఁ
జిచ్చును జుట్టినప్పుడు వచించిన పల్కులుగూలెఁ జిచ్చునన్.
(ప. 147)

"నను విడనాడనంచు అలనాఁడు హుతాశను ముందు-చేత చే
యిని గొని చెప్పినట్టి పలుకేమయి పోయె, వచింపుమయ్య, మీ
రనుపమ సత్యశీలురుగదా, కనగోరుదురే ప్రశస్తి యి
ట్లినకుల భూషణుల్? సతులకిట్టి గతుల్ గలిగింతురా పతుల్!
(ప. 151

శ్రీ సీతారాముల విరహమును చక్కగ నుద్దీపిత మొనర్చు జనశ్రుతి 'ఏకోరసః కరుణ ఏవ' అని సిద్ధాంతీకరించినదే. శ్రీ రమణయ్యగారు శ్రీరామ విరహమును కరుణరసోదంచితముగ వర్ణించి పాఠకుల హృదయము హరించిరి. ఈ ఘట్టమున శ్రీరామచంద్రమూర్తి అర్ధాంగి యెడ తనకు గల యపూర్వానురాగమును వ్యక్తమొనర్చును.

## లవకుశులంగని లక్ష్మణుఁడు

'రూపములారయన్ రఘువరుండలపించెడు, వీరి చూపులన్
దీపితమాయె మావదినె దేజము, చొక్కపు మేని నిగ్గులోఁ
గాపురమున్న వేకమయి కన్నుల కింపొనఁ గూర్చు భూమిపు
త్రీ పరిపూత రాఘవవరిష్ఠ సముజ్జ్వల మంగళాకృతుల్

అని తలపోసి 'మునికొమరులార, శ్రీరామమూర్తి రుచిరమైన మీకంఠ నిస్వనం బాలకించి, మిమ్ముఁగొని రమ్మటంచు బంపించినాఁడు నన్ను మీచెంతకో చిన్నియన్నలార!' యని పల్కఁగా లవకుశులు రామానుజు ననుగమించిరట. ఈ సందర్భమున రామానుజుఁడు ఆచార్య విధి నిర్వహించినట్లున్నది. "ఆచార్యవాన్ పురుషోవేద" అను ఉపనిషత్సూక్తి ననుసరించి జీవేశ్వరులకు ఘటకుఁడు ఆచార్యుఁడే కదా!

## ఈ కావ్యమునఁ గథాపర్యవసానము మంగళాంతము.

"తిమిరావృత నత కమలిని
విమలార్కద్యుతులు సోకి విరిసిన లీలన్
రమణుంగూడిన జానకి
ప్రమదపరీతాత్మయయ్యెఁ బతి దృక్తతిచేన్."

రమణీయ రామాయణమునందలి యీ యుత్తర రాఘవము సర్వథా రమణీయము, 'సరసకవి' వరివస్యాసమేధిత కవితా సారస్యము గల వేంకటరమణకవి సువర్ణలేఖిని మనోజ్ఞ సాహిత్య స్రవంతిని వెల యించి, ఇతోఽధికముగా సహృదయ హృదయారామములయం దానం దాంకురముల విరియజేయునుగాక!

ఇట్లు
బుధజనవశంవదుఁడు
కె. ఎస్. రామానుజాచార్యులు,
సంస్కృతాంధ్ర సాహిత్యోపన్యాసకుఁడు,
వేదసంస్కృత కళాశాల, - నెల్లూరు.
12-9-1975.

—O—

# సమీక్ష

శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు,
గూడూరు.

విశ్వశ్రేయః కావ్య మ్మని ఆర్యోక్తి కావ్యములో వాల్మీకి కృత రామాయణ మాదికావ్య మనియేకాక అప్రతిమానకావ్యమని కూడ వాసికెక్కినది. కవితా సౌందర్యమున దానినిమించిన కృతిరాజము నభూతో నభవిష్యతి. అందలి ప్రత్యక్షరము మహాపాతకనాశన మని అతులితభక్తి భావముతో మనపెద్దలు రామాయణ ముపాసించిరి.

మన పూర్వులేగాదు; అధునిక యుగమున సంస్కృతవాఙ్మయ మును సమగ్రముగ పరిశోధించిన పాశ్చాత్త్య విద్వద్వర్యులు సైతము రామాయణ ప్రభావమును వేనోళ్ళ గొనియాడిరి. ప్రఖ్యాతపండితుఁడగు మేగ్డొనాల్డు:

"No work of world literature has ever produced so profound an influence on the life and thought of the people as the Ramayana" అని వాల్మీకికృతిని ప్రశంసించెను. ఇట్టి ప్రశంస లెన్నో యున్నవి.

అంత యుత్కృష్టమైనది గావుననే ఆదికావ్యమునందలి దివ్య కథ సంస్కృతమునను, దేశభాషలందును గద్యపద్య తదుభయాత్మక ప్రబంధములుగా, దృశ్యకావ్యములుగా వివిధరీతుల వేవురుకవులచే సంతరింపబడినది. రామకథాప్రధానమగు వాఙ్మయము దినదినాభి వృద్ధి నొందినది. నేటికిని భక్తి సంపన్నమైన భావముతో భగవద్దత్తమైన కవితాశక్తిని ఆ భగవత్కథా కథనమునకే వినియోగించుకవులు మన దేశమున పలువురుగలరు. అట్టి కవులలో ఒక కవిరాజశేఖరుడు రచించిన కావ్యరాజమే ఈ రమణీయ రామాయణము.

కవితల్లజులగు శ్రీ దుగ్గిసెట్టి వేంకటరమణయ్యగారు ఇతః పూర్వము రమణీయ రామాయణమను పేరుతో షట్కాండములను మహా ప్రబంధముగ రచించి సహృదయుల ప్రశంసలకు పాత్రులయిరి. రఘూత్తముని యుత్తర చరితమును గూడ సూక్తులదీర్ప చిత్రము చిగిరించి ప్రస్తుత మీమలి రామాయణ కావ్యమును సరససమ్మాన్యముగా రమారమి మున్నూరు పద్యములలో వెలయించిరి.

రావణుని సంహరించి జానకిని గొనితెచ్చిన రామచంద్రుడు కోసల రాజ్య మేలుచుండ ప్రతికుటుంబము మూడుపూ లారుకాయలుగా వర్ధిల్లెను. ప్రతిమానవుడు తృప్తి వహించెను. హేమంతముగడచి వసంతము వచ్చినది రాము డొకనాడు సీతాసమేతుడై యుద్యానమునకు బోవును. దంపతులు యథేచ్ఛముగా వనవిహారము సల్పి సుఖ సుధా వారాశి దేలుదురు, రాణివాసమున నుండియు మైథిలి అరణ్యావాసము నందుబలె తానే నాథున కన్నిసేవలు చేయ నెంచును.

జానకి గర్భవతియైనది. నిండుచూలాలైన సతికి ప్రీతి ఘటింప నెంచి రాముఁడొకనాటి యపరాహ్ణమున నామెతో తమ గతచరిత్ర చిత్రించియున్న చంద్రశాల కేగును. చిత్రగతవిశేషముల నెల్ల జూచుచు సతీపతులు అమందానంద మొందుదురు. "స్వామీ! కట్టుబాట్లులేని నాటి మన కాననవాసమే చెప్పరానిసొంపు చేకూర్చినది. మరల నేనట్టి యిమ్ము నే యిచ్చగింతు" నని సీతయనగా "పచ్చనైన ప్రకృతిలో నివసించు నాటిసుఖము లిచ్చ పెట్టు గలుగును" అని రాముడు పలుకును. శూర్పణఖావృత్తాంతమునకు చిత్రములను జూచుసరికి సీత దప్పినది. తదుపరి చిత్రములన్ను రేపు చూతములెమ్మని చెప్పి రాము డామెను శయనాగారమునకు పంపును.

ప్రజల మనోవృత్తు లరయుటకై రామప్రేషితుడైన చారుడు చాకివాడకు జని మాఱురూపములలోనున్న రక్కసులగు రజకదంపతుల

(శూర్పణఖయే రజకి) కలహమును గాంచును. సీతాశీలమును తూల నాడు రజకుని పలుకులు వినును.

మఱునాడు సీతారాములు చిత్రశాల కరిగి మిగిలిన చిత్రములను తిలకింతురు. పతినానుకొని సీత నిదురించును. ఆ సమయమున చారు డరుదెంచి చాకివాడలో జరిగిన సంగతి రాముని చెవిని వైచును. అతడు తల్లడిల్లి పిమ్మట లక్ష్మణుని బిలిచి జానకిని కానలలో విడిచిరమ్మని శాసించును.

"వనములఁ జూడవలెనన్న మీవాంఛ దీర్చుటకై అగ్రజుడు మిమ్మడవికి తోడ్కొని పొమ్మనినాడు" అని పలికి లక్ష్మణుడు సీత నరణ్యమునకు గొంపోవును. అచట "అమ్మా! రాముడు నిర్దయాత్ముడై నిన్నడవిపాలుజేయు మని యానతిచ్చె" నని లక్ష్మణుడు జరిగిన వృత్తాంత మామెకు తెలుపును. సీత నేలగూలి ఎట్లో తెప్పరిల్లుకొని తన దుర్దశకై వగచును. సౌమిత్రి యామె నోదార్చి సాకేతపురి కరుగును.

రామతిరస్కృతనగు నాకీబ్రదు కెందుకని సీత తనజీవముల గంగా జీవనముల గలుపబోవ్వతఱి వాల్మీకి చనుదెంచి "తల్లీ! నన్ను కన్న తండ్రిగా దలంపుము, నాయాశ్రమమున నిలువుము" అని పలికి యామెను నిజాశ్రమమునకు గొనిపోవును. అక్కడ సీతావియుక్తుడగు రామదేవుడు చింతా వివశుడై రాహుగ్రస్తుడగు రవివలె పరిపరివిధముల వగలంబొగులును.

సీత కిరువురుకొడుకు లుదయింతురు. మహర్షి వారికి కుశలవులని పేరుపెట్టి షడ్విధసంస్కారములు గావించి వివిధ విద్యాపారంగతుల గావించును. వాల్మీకి మక్కువతో మాధుర్యమొలుకవ్రాసిన రామాయణ గాథను బాలురిరువురు కంఠస్థము గావించుకొని క్రమకంఠములతో గాన మొనర్తురు. అది విని సీత చింతావిహ్వల యగును.

ఒకనాడు కుశలవులు రామచంద్రుని జూడగోరి వాల్మీకి యనుమతితో అయోధ్యకేగి వీధులలో శ్రవణపేయముగా రామగాథ నాలపింతురు. రాముడా సంగీతము విని వివశుడై చెంతకు బిలిపించుకొని వారుపాడిన రమణీయ రామాయణ ఘట్టములు విని యానందించును. వారి రూపరేఖలలో పలుకులలో సీత పోలికలు గని ఆ కుమారులను గుండెకు హత్తుకొని యనిర్వచనీయమగు హాయిననుభవించుచు "నాయనలారా? మీకీపాట నెవరు నేర్పిరి? మీతలిదండ్రులెవరు?" అని యడుగును. "మేము వాల్మీకియొద్ద రామాయణగాథ నేర్చుకొంటిమి. మాకు తల్లి దర్శనమేగాని తండ్రిదర్శన మిప్పటికి లేదు" అని వారు చెప్పుదురు.

మఱునాడు రాము డనుజులు, కుశలవులు, పౌరులు వెంటరాగా వాల్మీకి మహర్షి యాశ్రమమునకు బోవును. "రామచంద్రా! వీరు నీ కొమరులు. జానకిని నాచెంతకుజేర్చి కాపాడితి" నని ముని పలుకును. ఇంతలో కవలు పరుగిడిపోయి తల్లిని తండ్రి చెంగటకు గొని వత్తురు. సీతా రాము లిరువురు చేతనారహితులై రాతిబొమ్మలరీతి నిలుతురు. అప్పుడు పౌరు లేకకంఠమున—

"ఒక్కని కైపుఁగూతలకు నమ్మలికంగొని పుణ్యమూర్తికిన్
తక్కువసేయగా దగునె? తక్కినపౌరులు లెక్క కెక్కరా?
మక్కువమాకు మీయెడల మందరపర్వతమంత కల్గు; నే
డిక్కమలాయతాక్షిని గ్రహింపుడు కూర్పుడుమాకు మోదమున్"

అని కోరుదురు. రాముడు సతిని చేపట్టును. కుమారులను గ్రుచ్చి కౌగిలించుకొనును. విమలార్కద్యుతిచే విరిసిన కమలినివలె జానకి రమణునిగూడి ప్రమదపరీతాత్మ యగును.

ఇందలికథ యిది. ఇది జగత్ప్రసిద్ధము, పలువురుకవులు పలురీతుల కల్పనముతో వాల్మీకిముని ప్రోక్తగాథ నలంకరించిరి. ఔచిత్యనముకు

భంగమేర్పడని విధమున ఎన్ని కల్పనములైన చేయవచ్చునని యాలంకారికుల సిద్ధాంతము. ఉక్తివైచిత్ర్యమే కావ్యనవ్యత్వమునకు కారణమని చెప్పుచు దృష్టపూర్వములైన యర్థములే కావ్యమున రసపరిగ్రహణముచే మధుమాసమున వృక్షములవలె క్రొంగ్రొత్తలై శోభిల్లునని ధ్వనికారుడు -

"దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవద్రుమాః"

అని నుడివెను.

ప్రకృతకృతిగూడ ఆయా గ్రంథములలోని సముచిత ఘట్టములందలి సారమును గైకొని కూర్పబడినదని కవి యిట్లు తెల్పియున్నాడు.

"పూవులలోని తేనియను బూనిక మక్షికతెచ్చి తెట్టెలో
నేవిధి దాచునో యటులె యింపగు రామకథామరందమున్
బావనమైన యీకృతిని భద్రమొనర్చితి తెల్గుపల్కులన్"

ముఖ్యముగా నిందలి చిత్రదర్శన వృత్తాంతము సుప్రసిద్ధ సంస్కృత నాటకము ఉత్తర రామచరితమునుండి స్వీకరింపఁబడినది. దీనిని భవభూతి సుమనోమనోహరరీతి రచించి "ఉత్తరేరామచరితే భవభూతి ర్విశిష్యతే" అన్న ప్రఖ్యాతి వడసెను. కాళిదాసు రఘువంశమున సీతారాముల చిత్ర దర్శన వృత్తాంతము నొకేయొక శ్లోకమున సూచనాప్రాయముగ నిట్లు నిర్దేశించెను—

"తయోర్యథా ప్రార్థిత మిన్ద్రియార్థా
నాసేదుషోః సద్మసు చిత్రవత్సు
ప్రాప్తాని దుఃఖాన్యపి దండకేషు
సంచిన్త్యమానాని సుఖాన్యభూవన్" 14 - 25

ఉత్తరరామచరితమున నీవృత్తాంత మొకయంకమునకు సరిపడునంత పెంపుదలపొంది ప్రతిభాశాలియగు భవభూతిచే రసవత్తరముగా

చిత్రింపబడినది. శ్రీ రమణయ్యగారు దీనిని వలసినంత పరిగ్రహించి కొలదిమార్పులతో నించుమించు నేబది పద్యగద్య గేయములలో తీర్చిదిద్దిరి.

భవభూతి కృతిలో సౌమిత్రి వెంటనుండి సీతారాములకు చిత్ర ములనుజూపి విశేషము లుగ్గడించినట్లు గలదు. ఇందు అటువలెగాక జానకీరాములు స్వయముగనే చిత్రదర్శనము గావింతురు. తద్దర్శనావ సరమున ఇందలి శ్రీరాముడు అనురాగపరవశుడై సీతాభామిని పెదవులను పుడుకును. చిగురాకువాతెర నొక్కును. ఆమె నక్కున గదించుకొనును. లక్ష్మణుడు చెంతనున్నచో ఇట్టి శృంగారచేష్టలకు వీలుండదుగదా! అందుకే ఈమార్పు.

ఉత్తరరామ చరితమున చిత్రదర్శనవృత్తాంత మొకేదినమున జరిగినట్లుండ ఇక్కడ రెండుదినములు ప్రవర్తిల్లినట్లు వర్ణింపబడినది. అది దృశ్యకావ్యముగనుక నొకయంకమున ఏకాహచరితమైన వృత్తమునే ఘటింపదగును. 'ఏకాహచరిత్రప్రతిపాదకః అంకః' అని లాక్షణికులు. అవృత్తాంతమును రెండంకములవఱకు పొడిగింపవలసిన అవశ్యకము అందులేదు. ఇది శ్రవ్య కావ్యము. సప్రయోజనమగుచో మార్పు చేయ దగినదే. భవభూతి రచనలోలేని మాయారజకి(శూర్పణఖ) వృత్తాంతము సందర్భోచితముగా మధ్యలో ప్రవేశపెట్టుటకే ఈమార్పు గావింపం బడినది. అందువలననే శూర్పణఖా వృత్తాంతముగల చిత్రముతో తొలి నాటి చిత్రదర్శనము సమాప్తమైనది. తన శోకభాజన చరిత్రమున కాస్పదమైన ఆ చుప్పనాతిబొమ్మను జూచి కలంతనొందిన జానకి కడమ చిత్రముల చూడజాలక డస్సె ననుటయు సమంజసమేగదా!

అందును ఇందును జృంభకాస్త్రోదయచిత్రముతోనే చిత్రదర్శన మారంభ మగును. భవభూతి నాటకమందలి కొన్ని చిత్రఘట్టము లిందు పేర్కొన బడకపోయినను అందులేని అహల్యావృత్తాంతాదు

లిందు చోటుచేసికొన్నవి. రాముడు స్వయముగా వ్రాసిన సీతారూపపట మామెకు జూపుట, ఆయన చిత్రలేఖన వైదగ్ధ్యము నామె శ్లాఘించుట వంటిఘట్టములు కల్పితములై కృతికి రమణీయత నాపాదించుచున్నవి.

కావ్యవస్తువేగాక ఈ ఘట్టమున కొన్నిభావములు సహితము భవభూతినుండి పరిగ్రహింపబడినవి. ఉత్తర రామచరితమున హుతాశన శుద్ధిపర్యంతము సీతాచరిత్రము చిత్రింపఁబడినదని రాముడు విని యిట్లనెను :

"ఉత్పత్తి పరిపూతాయాః కిమస్యాః పావనాంతరైః ?
తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్యత శ్శుద్ధి మర్హతః

పుట్టుకతోనే పవిత్రురాలైన సీతకు పావనాంతరములచే నేమి ప్రయోజనము? తీర్థజలము, అగ్ని ఇతర పదార్థములచే శుద్ధి నపేక్షింపవుగదా! - అని.

అచ్చట పవిత్రతా విషయమున తీర్థోదకముతోను, అగ్నితోను సీతకు పోలిక చెప్పబడినది. ప్రకృత కావ్యములో ఈభావ మిట్లు మార్చబడినది.

"పుట్టుకచేఁ బావనతను
నిట్టలపుగఁ బొందినట్టి నెట్టిక సీలన్
ముట్టిన దీర్థజలంబుల
యట్టుల నగ్నియు బవిత్రుడై యలరారెన్"

వహ్నితీర్థోకములకే పవిత్రత నాపాదింపగలది సీతయని చెప్పుటచే ఆమె పావనత్వము మూలగ్రంథమునకంటె నిందు గొప్పగా కీర్తింపబడినట్లైనది.

మఱియు ఈక్రింది పద్యములసామ్యము జూడుడు :

"పతనవిరళప్రాంతోన్మీల న్మనోహరకుట్మలై
ర్దశనకుసుమై ర్ముగ్ధాలోకం శిశు ర్దధతీ ముఖమ్
లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయై రకృతిమ విభ్రమై
రకృతమధురై రంబానాం మే కుతూహల మంగళైః

— ఉత్తర 1-20

"ననమొనఁబోలు పల్వరుస, నల్లనిముంగురులున్, స్తనద్వయీ
వినమితమధ్యవల్లి, నునువెన్నెలహాయినిగూర్చు మైపసల్,
వనజమునేలు కన్గవ, విలాససముజ్జ్వలభవ్యమూర్తి, నీ
యనుపమముగ్ధరూపము మదంబలు గాంచిరి కౌతుకమ్మునన్"

ఈపద్యము పై సంస్కృతపద్యమునకు కేవల మనువాదముగాక అందలి కొన్ని భావములను మాత్రము గ్రహించి మఱికొన్నింటిని చేర్చుకొని కమనీయముగా సాగినది.

ఈక్రిందివాని సామ్యమున ఇతోధికమగు సన్నిహితత్వము గోచరించుచున్నది.

"అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మి న్నహార్యో రసః
కాలేనా వరణాత్యయా త్పరిణతే యత్ప్రేమసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే"

— ఉత్తర 1-39

"దాంపత్యంబు వయస్సునన్ వలపునెత్తావుల్ గుబాళించు గ
ర్వంపున్ విద్యముపోల్కి మేను లొకలై రంజిల్లు సంశ్లేషసౌ
ఖ్యంపున్‌డోలల వార్ధకం బెలయ నవ్యక్తానురాగార్ద్రతన్
సొంపుల్ గూర్చును సాహచర్యసుషమాస్తోక ప్రభాపూర్ణతన్"

భవభూతినాటక మింతగా నభిమానించి తనరచన కాధారము గావించు కొనుటచే ఈకవివతంసుడు కృత్యాదిని ఆమహాకవికి నమస్కృతు లర్పించి కృతజ్ఞతను ప్రకటించుకొనెను.

సీతాదేవిని లక్ష్మణు డడవిలో దిగవిడుచు ఘట్టమున కరుణ రసము చక్కగా పోషింపబడినది. పతిచే పరిత్యక్తనైతినని యెఱింగి చింతాక్రాంతయైన జానకి పలుకులలో రాముని యేకపత్నీవ్రత మిట్లు వ్యాఖ్యానింపబడినది :

"రాజ్యలక్ష్మినిరాకృతరాఘవునకు
అలి నానాడు: దూరస్థురాల నేడు
శ్లాఘ్యరాజ్యరమాభోగలాలసునకు
ఏకపత్నీవ్రతం బన నిట్టిదేమొ"?

ఈమాటలు సూటిగా సహృదయులహృదయములలోనికి చొచ్చు కొని పోవుచున్నవి. ఇంచుమించుగ నిట్టిభావమే ప్రకారాంతరమున రఘువంశమున కాననగును.

"ఉపస్థితాం పూర్వ మపాస్యలక్ష్మీం
వనం మయా సార్థ మసి ప్రపన్నః
తదాస్పదంప్రాప్యతయాఽతిరోషాత్
సోఢాస్మినత్వద్భవనే వసన్తీ" రఘు 14-63

— మున్ను చెంతకువచ్చిన లక్ష్మిని త్యజించి నాతో వనమున కేగితివి. అందుచే నీయింటనున్న నన్నిప్పుడు లక్ష్మి రోషాతిరేకమున సహింపజాలకపోయెను అని.

"ప్రాప్తమయినలక్ష్మిని విడనాడి నాతో నాడు కాననమునకేగితివి" అన్న కాళిదాసుని సీతపలుకులలో "అనాడు నేనంతగా నీకిష్టమై యుంటిని" అన్న భావమున్నది.

"రాజ్యలక్ష్మిచే నిరాకరింపబడిన రాఘవున కానాడు నే నాలి నైతిని" అన్ని రమణకవీంద్రుని జానకిమాటలలో "నాడును నీవా మెచే నిరాకరింపబడియే నాపై ప్రీతిజూపితివిగాబోలు" అన్న నిష్ఠురోక్తి ద్యోతక మగుచున్నది. రెండుభావములందును దేనికది కమ్మగా నుండుట గమనింపదగియున్నది.

"తతోఽభిషఙ్గానిలవిప్రవిద్ధా
ప్రభ్రశ్యమానా భరణప్రసూనా
స్వమూర్తిలాభప్రకృతిం ధరిత్రీం
లతేవసీతా సహసా జగామ. రఘు 14-45

పై భావమునే శ్రీరమణయ్యగారు —

"పెనుగాలి పెకలింప పెనకువవీడ
పుడమినివ్రాలిన పూవల్లి యామె"

అని సంగ్రహించిరి.

"చెలమలయందు నీరములు చిప్పిలుచొప్పున సీతకన్నులన్
జలములు నిండు" 285

అను పద్యమున "త్వామాలిఖ్యప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయామ్" అను మేఘసందేశపద్యభావ మొకంత స్పృశింపబడినది. అందు యక్షునకు ధాతురాగచిత్రితపత్నీదర్శనము ఇందు సీత కెదుట నున్న పతిదర్శనము నేత్రము లశ్రుభరితము లగుటచేతనే నిరోధింప బడినవి.

వాల్మీకిచే నాదరింపబడినసీత గంగాతరంగిణింజూచి

"బృందారకవందిత! యో
మందాకిని! వల్లభునకు మాన్యనగు నటుల్
నందనుల గాంచితేనిన్
కుందమ్ములమాలనేను గూర్చి భజింతున్" అని నుడువును.

ఈపలుకులు దిఙ్నాగుని కుందమాలనుండి పరిగ్రహింపబడినవి.

సీత కుందమాలలో నిట్లనును.

''గంగా మవలోక్య అంజలిం బధ్వా —

భగవతి భాగీరథి! యదిస్వస్తినా (సుఖేన - అని పాఠాంతరము)

గర్భ మభినివర్తయామి, తదా తవ దినేదినే స్వహస్త

గ్రథితయా కుందమాలయా ఉపహారం కరిష్యామి'' అని.

ఈకుందములమాలకు ఆనాటకకథలో ప్రత్యేకప్రాధాన్యమున్నది. అందుచే ఆకృతికి కుందమాల అనుపేరు సార్థకమైనది. తత్ప్రాధాన్యమును గుర్తించియే శ్రీ దుగ్గిసెట్టి దాని నిట ప్రస్తావించి దిఙ్నాగాచార్యునెడ తమగౌరవము ప్రదర్శించిరి.

ప్రాక్తనకృతుల నాదర్శముగా చేకొని రచన సాగించినను 'శంబుకవధ'వంటి ఘట్టమునిందు పరిత్యజించుటచే అటు రామునిశీలమునకే గాక ఇటు కావ్యమునకును గౌరవము పెరిగినది.

రాముని విరహావస్థను వర్ణించుపట్టున కవిచూపిననేర్పు శ్లాఘ్యము. అది వర్షాకాలము. రాముడు వియోగతప్తుడు. అతనిచిత్తమున జానకిని గూర్చిన స్మృతులు కొల్లలుగా తలసూపినవి. అతలపులకు కవి యొసగిన ఉపమాన మెంతకాలోచితమో పరికింపుడు.

కల్లోలితమగు సరసిన్

పెల్లున చెలరేగు చేప పిండటు సీతా

వల్లభుహృదయంబున హవ

ణిల్లె సతీస్మృతినివహము నెవ్వగ గదురన్ —

మరియు నీఘట్టమున —

''సలలితవైభవంబున నిశాగగనాంగణచంద్రరేఖపై

...................ప్రసన్నభవన్ముఖమున్ స్మరించెదన్''

''దండకలోని గౌతమిని తాన మొనర్చి జలార్ద్రచేలవై

.................. నయనాత్మకదృశ్యము సంస్మరించెదన్,,

'స్మరించెదన్' 'సంస్మరించెదన్' అను క్రియలతో ఘటింపబడిన 187, 191 వంటిపద్యములు బిల్హణీయమందలి పద్ధియములను సంస్మరింపజేయుచున్నవి.

''నవ్వులఁ జిల్కరించు నయనమ్ములవాడు (144) వంటి పద్యములు "నల్లనివాడు పద్మనయనంబులవాడు" వంటి పోతనరచనను, "భూమిసుతన్ విదేహనరపుంగవపోషిత (157) వంటివి "వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి" వంటి తిక్కన రచనలను, "భార్యలన్, లూలామాలపు చాకికూఁతలకిలన్ భూపుల్ విసర్జింతురే (113) వంటిపద్యములు ధూర్జటిపోకడలను జ్ఞప్తికెలయించుచు ప్రాచీన సంస్కృతాంధ్రభాషాద్వయకావ్యసముచ్చయమం దీయనకుగల ప్రగాఢమైన చౌరవను వెల్లడించుచున్నవి.

సూర్యోదయ మిందు మూడు సందర్భములలో వర్ణింపబడినది. ఒకే పద్యమున జగచ్చక్షునిరాకను వర్ణించిన ఘట్ట మెంతహృద్యమో చూడుడు :

"పక్షులు గుంపులై యెగసి బారులుదీరె విహాయసంబునన్
కుక్షులు నింపు కోర్కె మెయి; కొక్కొరొకోయని కూసెకోళ్ళు ప
ద్మాక్షులు విప్పినవ్వె కమలాకరపంక్తులు వచ్చె నాజగ
చ్చక్షువు పూర్వపర్వతతుషారతురంగముపై రయంబునన్" 84

సంక్షిప్తార్థాభిధాయకమగు నిట్టివర్ణనములను సంక్షేపగుణభూషితములని యాలంకారికులు చెప్పిరి.

సంక్షిప్తార్థాభిధానం యత్తత్ సంక్షేపః ప్రకీర్త్యతే
— ప్రతాపరుద్రీయం

దీర్ఘసమాసములకు తావీక సందర్భోచిత సంస్కృతాంధ్రపద ప్రయోగములచే నలరుచు రమణీయరామాయణము శ్రవణసుభగముగానున్నది.

"అడఁకువగల వారయి ప్రే
ముడి పెంపారంగ మగలపొత్తును విడకే
నడపిరి తమ కాపురముల
పడఁతులు సీతావిభుండు పాలించు తఱిన్"

పై పద్యమున అచ్చతెనుగు పదములకూర్పు ముచ్చట గొల్పు చున్నది.

"ఆవాడ నొకచాకి యాలినిఁబట్టి
యుతుకుచునుండె నాయువిద యేడ్వంగ"

'ఉతుకు' క్రియాప్రయోగము శ్రీ దుగ్గిసెట్టి నైజాణతనమున కొక మచ్చుతునక.

"పక్కవిడిచియెప్పు డెక్కడి కెళ్ళిందొ
పగుచుక్క విరిసె వింటిమీఁద
గడ్డిపఱక తెన్ని గుడ్డల కంటాయి
తెత్తుమఁడ యిపుడు తొంగిచూచు"

"సిలుప, సిలుపు చేయి నీల్గెద వేలరా?
ముక్కుమూసుగప్రావి మొద్దునిదుర
గుఱ్ఱుపెట్టకొట్ట నానంతసేపు నే
బొమ్మలాట చూడఁబోతి మగఁడ!"

చాకలిజంటకొట్లాటలోని జానపదకవితాసౌంగధ్యము సహృదయ హృదయావర్జకము.

"విలువిడిన నీలోత్పల
ములపలెఁ గవలు పరువెత్తి భూమిజ కెలమిన్
దెలిపిరి తల్లీ! మాపిత
నిలిచెను తాతయ్యచెంత నినుఁ గాంచుటకై"

నీలోత్పలములు పంచబాణునిసాయకములు. సమ్మోహన కరములు. వియోగవిధురజీవితము గడపుచున్న సీతారాములకు పునస్సమాగమసౌఖ్య సంధాయకులు కుశలవు లగుచున్నారు. కాన వీరికి నీలోత్పలసామ్యము చాలరుచిరము.

రామచంద్రుఁడు ముఱికిపేటలను నిర్మూలించి క్రొత్తగా కొమరైన యిండ్లు తీర్చినా డనుట సమకాలికసాంఘిక జీవనమునకు, నేటి ప్రభుత్వపు మేలిచేతలకు ద్యోతకము. ఇట్టి విశేషము లెన్నో ఈరచనలో కొల్లగా గలవు. ఈయన నిస్సందేహముగ గొప్పకవి; చాల గొప్పకవి.

భవాంబుధి దాటుటకై ఈకావ్యము రచించితినని ఈకవీశ్వరుడు తెలుపుకొనెను. పాఠకులుగూడ ఇట్టి రచనలను శ్రద్ధాభక్తులతో పఠించిరేని భవాబ్ధి దాటగలరనుటకు సంశయములేదు.

"కవిః కరోతి కావ్యాని లాల యత్యుత్తమోజనః
తరుః ప్రసూతే పుష్పాణి వాయుర్వహతి సౌరభం"

చ॥ పటుతరకల్పనంబు రసవద్రచనాగరిమంబెలర్ప సం
కటహరణంబు రామకథ కమ్మగ వ్రాసిన దుగ్గిశెట్టి వేం
కటరమణాభిధాను గణకప్రవరున్ కవిరాజశేఖరున్
నిటలతటాక్షభక్తిపరు నీతినిధాను నెదం గదించెన్.

క॥ వాచాశేషఫణీంద్రుఁడు
మోచర్లకవీశు శిష్యముఖ్యుఁడు ధిషణా
వాచస్పతి రమణాఖ్యుఁడు
మోచుత శరదిందుకుందముక్తాయశమున్

స్వస్తి.

గూడూరు. 1-10-1975. ముదివర్తి కొండమాచార్యులు.



# రమణీయ రామాయణము

# ఉత్తరకాండము

## అవతారిక

శా॥ శ్రీసీతామహిళామతిన్ సతతముంజెల్వారు శృంగారికిన్,
వాసింగన్న ప్రజానురంజనసమజ్ఞామాధురీహారికిన్,
దాసుల్సల్పిన పాపరాసులను విధ్వంసించు విన్నాణికిన్,
నే సాష్టాంగనమస్కృతుల్ నెఱపుదున్ నిత్యంబు మోక్షార్థినై. 1

క॥ ముత్తినిడు రాఘవేంద్రుని
ఉత్తరచరితమ్ముగూడ సూక్తులఁ దీర్పన్
జిత్తము చిగిరించె, ఫలా
యత్తంబగుగాత మామహాత్ము కృపాప్తిన్. 2

గీ॥ అణిముత్యాలహారమ్ము లవలఁద్రోచి,
మంచుమలపట్టి రుద్రాక్షమాలఁబట్టి
నట్లు, క్రౌంజిగిరచనమ్ము లవలఁబెట్టి
దేవ, ప్రాఁబలుకుబడికృతిం దీనిఁగొనుము. 3

ఉ॥ దారులుగాఁచి, తెర్వరుల దారుణబాధల పాలొనర్చు సం
స్కారవిహీనుఁ డుద్ధతుఁడు సాత్వికుఁడై, రఘురామనామమం
త్రోరుమహత్త్వరక్తి, నమరోక్తులఁ గావ్యము వ్రాసి, ముక్తికిన్
దారినిఁదీర్చె; నట్టి జడదారినిఁ గొల్చెద పుట్టపుట్టువున్. 4

క॥ మెత్తని తెలుఁగుంబలుకులు
చిత్తము రంజింప, రసము చిప్పిలునటు మేల్
పొత్తములు మనకిడిన కవి
సత్తములకుఁ గేల్మొగిడ్చి స్తవమొనరింతున్. 5

ఉ॥ కొంచెపుఁ దొంటిపున్నెమునఁగూడిన మత్కవితాసుధారసో
దంచితవల్లికిన్ బొడమి, ప్లోధము గూర్చు తలంపుఁబూల ని
ర్మించిన పద్యమాలఁ గొనుమీ రఘువల్లభ! దీనబాంధవా!
సంచితపాపహారి! జనసమ్మతపాలక! సత్యవర్తనా! 6

క॥ దండితనిర్జరవైరికి,
మండిత సురపతి కిరీటమణి దీప్తునకున్
పండిత సంభావితునకు
ఖండిత ఖండేందుమౌళి ఘనచాపునకున్. 7

వ॥ సమర్పితంబుగా నేఁజేయఁబూనిన యుత్తరరామాయణ కథా
క్రమంబెట్టిదనిన; 8

## కథాప్రారంభము

క॥ శ్రీవైదేహీకోమల
భావాంబుజభానుమూర్తి! భాస్వత్కీర్తీ!
గ్రావప్రాణదచరణా!
దేవా! శ్రీరామమూర్తి! దివ్యస్ఫూర్తీ! 9

క॥ శ్రీసుకుమారతనులతా
వాసిత చాంపేయగంధ బంధుర దేహా!
వాసవముఖ సురసేవిత!
దాసజనత్రాసహరణ! దశరథరామా! 10

గీ॥ రావణునిఁ ద్రుంచి జానకీదేవిఁ గొనిన
రామచంద్రుండు కోసలరాజ్యమేలు
కాలమున మూఁడుపూ లారుకాయ లగుచుఁ
బ్రతికుటుంబము వర్థిల్లె - పరిఢవిల్లె. 11

సీ॥ మిడిమిడియెండలు - మిన్నంటుకొనుసుళ్ళు
బీడైనపొలములు, పాడుగుళ్ళు
పంటల, నిండ్లను, పాడొనరించెడి
గాలివానలు, వడగండ్లపాటు,
పుడమి జడధిసేయ పొంగిపారెడు నదుల్
చీకాకుపఱచు కార్చిచ్చుగములు
అధికారశక్తిచే నార్జనఁజేయు దో
పిడితెక్కలీండ్రును, బిచ్చగాండ్రు.

గీ॥ దేశమున కప్రతిష్ఠ సాధించువారు
కలికమునకేని జగమునఁ గానఁబడరు,
శాంతిసౌఖ్యప్రదమ్ముగా సంప్రదాయ
బద్ధముగ రామచంద్రుఁడే ల్బడిపొనర్ప॥ 12

ఉ॥ శ్రీపతి మానవాకృతి ధరిత్రికిఁబాలకమూర్తి, కావునన్
బాపవిదూరులై ప్రజలు పార్థివునింబలె సత్యధర్మ ని
ష్ఠాపరులై ప్రతిష్ఠఁ గనఁజాలిరి; పొందిరి పూరుషార్థములో
లోపములేని ధాత్రి సురలోకము మించదె మంచిపాలనన్! 13

చ॥ మనుజుఁడు తృప్తుఁడాయె, మనుమార్గము మన్ననకెక్కినట్లుగా
జనహితరీతి యోచనలు చక్కఁగసల్పెను, పల్కులందు మె
త్తన, విధిపాలనంబున సదా చలియింపని నిశ్చలత్వముం
గనెను, మనీషి సజ్జనుఁడుగాఁ బొలుపారెను రామపాలనన్. 14

కII అడకువఁగల వారయి ప్రే,
ముడి పెంపారంగ, మగలపొత్తును విడకే
నడపిరి తమకాపురముల
పడఁతులు, సీతావిభుండు పాలించుతఱిన్. 15

## హేమంతము :

ఉII వెచ్చని యెండలన్ జుఱుకు విచ్చెను లేశము, మంచుముత్తెముల్
బచ్చని గడ్డిపై మొలచి వజ్రిభనుస్సుహొరంగు లీనెడున్,
గచ్చులు విచ్చి గుమ్మడులఁగాలు విరుల్ తరుణార్కరశ్మితో
నిచ్చకపూడె, గాలము వహించెఁ దుషారపుటుత్తరీయమున్. 16

## వసంతవర్ణనము :

చII చిఱుచలిజారెఁ జెమ్మటల చిత్తడి మేనులఁబర్వె, క్రొన్ననల్
దరువులఁబ్రాకెఁ దెమ్మెరలుదారె, సువాసనగూరె, విశ్వమం
దరి సుమనోహరంబుగఁ బదంబుఁగదల్ప వసంతమందుఁజం
దురుఁడు దిగంగణంబుల వినూతనశోభ వెలార్చె నామెకై. 17

## సీతారాములు వసంతమునఁ బూఁదోఁట కరుగుట :

సీII పౌళిని మెఱసెడి మణికిరీటము- లోని
సద్గుణపుంజమ్ముఁ జాటిచెప్ప,
సన్నని పెదవులు - తిన్నని నాసిక
దృఢమైన భావమ్ము దేటపఱుప,
అమలినతేజము, హరినీలకాంతు లి
ప్రతిమానుఁ డితఁడని వ్యాఖ్యసేయ,
తెల్లదామరపూలఁ దెగడెడి కనుదోయి
నిర్మలహృదయంపు నీటుఁదెలుప,

ఆ॥ దేవవిభుని రాచఠీవి నిగారింప,
ప్రజలు తన్నుఁ గాంచి ప్రస్తుతింప,
ఉవిదఁగూడి రాముఁ డుద్యానమునకుఁ దా
నొక్కనాఁడు రథమునెక్కి తరలె॥ 18

ఉ॥ పలుచని పట్టుపచ్చడపు బంగరుపోగులయంచు గాలికిన్
జిలిబిలిచిందులాడ, కమనీయదరస్మిత మాననంబునన్
మిలమిలమేలమాడ తొలిమించును మించిన కాఱుమబ్బునా
అలరులతోటకేఁగె వసుధాత్మజసంగతి రాముఁ డామనిన్. 19

ఉ॥ బారులుదీరి సౌధములపైఁ గమలాస్యలు గల్వకన్నులన్
శ్రీరఘురాముదర్శనము సేయఁగ; దృఙ్ముకురంబులందు గం
భీరతదీయమూర్తి ప్రతిబింబితమాయెను, దమ్మితోరణన్
గూరిన కల్వపూల రఘుకుంజరుచిత్రము లుంచిరో యనన్* 20

క॥ బిత్తరితో హరిజన, ప్రజ
మొత్తము పుడమీనినటుల మోదం బెలయన్
జిత్తరుపులవలె నిలిచిరి,
చిత్తంబుల నప్పనంబు సేసిన రీతిన్. 21

ఉ॥ మావులు లేఁజివుళ్ళ నవమంజుమరీచికలన్ వెలార్పఁ, బూఁ
దీవెలు కమ్మతెమ్మెరల తెప్పలు జిమ్మఁగ, దేంట్లు ధూమరే
ఖావళిలీలఁ బైకెగురఁ, గానఁగనాయె; వసంతలక్ష్మి, సీ
తావరవర్ణనీమణికిఁ దత్ప్రతి కారతిఁబట్టిరో యనన్. 22

---

* చ॥ జలజమువంకలన్ గలువజంటల నిల్పి తదంతరంబులన్
విలసితరామచిత్రములఁ బెట్టిన తోరణపంక్తి చాడ్పునన్
బలిసెను, బుండరీకవదనల్ నయనోత్పలబింబదర్పణం
బుల రఘురామునిం గని ప్రమోదభరంబున నిల్వ రథ్యలన్

కః మలయానిలుఁ డాతోటం
గల పూవులఁగోసి తెచ్చి, కమలాక్షుపదం
బులఁ బూజించినటుల్ జల
జల రాలెను విరులు రాము చరణమ్ములపై 23

శాః రాజీవానన పాణిపంకజము శ్రీరాముండు హస్తంబునన్
దేజంబార గ్రహించి వారణగతిన్ దృక్పర్వమున్ సల్పఁగా
నాజంటంగని మెచ్చినట్టి కరు లొయ్యన్ దొండముల్ సాచి, యం
భోజమ్ముల్ గొని ఘీంకరించెను, శుభంబు త్స్వచ్ఛందంబునన్.

కః పూదీవెల, జొంపముల వి
నోదించుచుఁ గొలఁకుల న్మునుంగుచుఁ గుసుమా
మోదము లానుచు, శుకపిక
నాదములన్ వినుచు వారు నడయాడి రొగిన్. 25

మంజరిః
ఈరీతి దంపతు లింపుపెంపార
స్వారస్య భాసుర వనవిహారములఁ
గడపిరి కాలమ్ము - విడుమరలేని
సుఖసుధావారాశి - సురుచిరుల్లాస
భోగడోలికలయుం దూగిరివేడ్క
వారికిఁ దీయనై బ్రదుకులు వఱలె. 26

సీః పసుపాడఁజను వేళ వైదేహి, పనటినిఁ
బెనిమిటిదోవతిఁ బిడువ వెదకు,
మధురభక్ష్యములపై మమతను విడనాడి
కందమూలములనే కాంత గోరు,
పతిచెంతఁ గూర్చుండి పద్దింప యత్నించుఁ
బరిచారికలసేవఁ బఱ్ఱతి దొఱఁగు,
పట్టుసెజ్జనుగూడఁ బతిబాహుదండమే
దిండయి యున్కియె తెఱవగోరు,

గీ॥ రమణి యలవాటు కలిమి నరణ్యవాస
సన్నిహితసాహచర్యంబు నెన్నుచుండు,
రాణివాసాన నుండియుఁ బ్రమద వనుల
నున్నయటు నాథు సేవింప నూహసేయు, 27

వ॥ ఇటులఁ గొంతకాలమ్ము గడచిన తదనంతరంబు 28

ఉ॥ మానుషరూపియైన వనమాలి సుమానుషకేళిఁ దేలఁగన్
జానకి మంగళాంగి, దొలిసంజ ప్రభాకరునిం, బవిత్ర గం
గానది కార్తికేయుని, ధనంజయునిన్ శమి, నబ్ధివేల రా
కానలినారిఁ దాల్చిన ప్రకారమునం దొలిచూలు దాలిచెన్. 29

ఉ॥ శ్రీరఘురామచంద్రుని విశిష్ట కళామయ దివ్యతేజమున్
ధారుణిపుత్రి దాల్ప రజతచ్ఛవి బ్రాఁకెను మేనఁ బూర్వది
క్కారజమార భాస్కరు సహస్సునఁ దాల్పఁగఁ గాంతిపుంజములో
జారుతరంబుగాఁగఁ గడలన్ బ్రవహించిన సంచు మించగన్.30

గీ॥ నిండుచూలాలు సీతకు నెమ్మిఁగూర్ప
రాముఁ డామెతో నొక యపరాహ్ణమందు
నిజచరిత్ర చిత్రమ్ముల నిలిపినట్టి
చంద్రశాలను బరికింపఁ జనెను బ్రీతి. 31

మంజరి॥
జీవకళలఁ జిల్కు చిత్రమ్ము లరసి
జృంభకాస్త్రోదయచిత్రముం జూపి
శ్రీరామచంద్రుండు సీతతో ననియె
"సవనరక్షార్థమై చనువేళ మాకుఁ
గౌశికుం డీయస్త్రగణముల నొసఁగె
తులలేని తపములఁ దొల్లింటిమునులు

పొందినా రీయస్త్రములను బూఁబోణి!
వారి తేజములచే వఱలు నీయస్త్ర
ములు మనసంతతి పొందు లతాంగి!”
అనిపల్క నవనిజ యంజలిన్ జేసె,
ప్రక్కన భాసిల్లు పటమును జూపి
తలయూఁచి పలికెను ధాత్రిజ యిట్లు — 32

ఉ॥ అబ్బురమైన దృశ్యము, త్వదంఘ్రులు సోకిన బండనుండి తాఁ
గొబ్బున గౌతమప్రమద క్రొవ్విరిదీవియ సోయగంబునన్
ప్రబ్బిన తేకువన్ విరియఁబారుట, చూపెను శిల్పి చూడుఁడీ
మబ్బుల మాటు మాని నవమంజుతటిల్లత జాఱినట్లుగాన్. 33

గేయము॥
ఈచిత్రమును జిత్తగింపుఁడీ!
ఈశునివింటిని ద్రుంచు దృశ్యమిది॥ 34

క॥ నీలోత్పలదళ కాంతి
శ్రీ లలిత మనోజ్ఞమూర్తి శితికంఠుని విల్
లీలన్ ద్రుంచెడి దృశ్యము
నా లోచనరంగభూమి నాట్యమొనర్చెన్. 35

గేయము॥
రమణి పలుకులకు రాముం డలరి
పుడికి పెదవులను పలికెనిట్టులన్ 36

క॥ అలనాడు సిగ్గుబరువునఁ
దలవాలిచి నేలఁజూచు తరలాక్షి యెటుల్
దిలకించెనొ నా రూపము,
తలసూపెనొ సతికి కనులు తలనలుగడలన్. 37

చ॥ ననమొనఁబోలు పల్వరుస, నల్లని ముంగురులున్ స్తనద్వయీ
వినమితమధ్యవల్లి, నునువెన్నెల హాయిని గూర్చు మైపసల్,
వనజము నేలు కన్గవ, విలాస సముజ్వల భవ్యమూర్తి, నీ
యనుపమ ముగ్ధరూపము, మదంబలు గాంచిరి కౌతుకమ్మునన్.

గీ॥ సర్వమంగళచిహ్నంబు లుర్విమీఁదఁ
జూప నిల్చిన గట్టురాచూలిఁబోలు
సహజసుందరమైన నీచక్కఁదనము
కలికి! నాతల్లులకుఁ గూర్చెఁగడుముదమ్ము. 39

మంజరి॥
ఆమాటల న్విని యంబుజాతాక్షి
చిఱునవ్వు మోమునఁ జెలఁగి చెల్వారఁ
బలికెను మెల్లనఁ బద్మాక్షుఁగాంచి
"వినవయ్య నాసామి విన్న వించెదను
మిముఁగని నాతండ్రి మేనును మఱచె" 40

ఉ॥ నీలనభోవిభాసిరుచి నీదృఢగాత్రమునన్ రహింపఁ బ్రో
న్మీలన సుందరంబులయి నీకనుదమ్ములు తళ్కులీనగా
శ్రీలసమాన సత్త్వనిబరీస విభూతి భవత్స్వరూపమున్
దోలగమున్ బొనర్చ నమితోత్సుకతన్ జనకుండు నిన్గనెన్. 41

చ॥ కలువలసామి బింబమును గ్రమ్మిన నీలపయోదరేఖలై
యలకలు తావకాస్యమున నల్లలనాడఁగ, మోవిమోసలన్
తొలకరి మించువల్లివలెఁ ద్రుళ్ళిన మీచిఱునవ్వుఁ గాంచి- నిన్
దలఁచెను నాయనుంగుపిత నాతిలకద్యుతి తావలంబుగాన్. 42

ఉ॥ మీ రమణీయ రూపమున మేలుగ వెల్గెడి దివ్యశోభ, వి
స్ఫారితనేత్రులై కని ప్రజల్ పరమాత్ముఁడె మేనుదాల్చి, మా
యూరఁ జరింపవచ్చె నని యుబ్బరపుందమి గుంపుగుంపులై
చేరి మిమున్ బ్రమోదమునఁ జిత్తము లర్పణసల్పి చూడరే? 43

క॥ సలిసదళమ్మునఁ గదలెడి
జలకణముంబోలు మనము శాంతిని బొందున్
గలఁగక మీ సవిధంబున,
తలమే మీశక్తిఁదెలియ దాక్షిణ్యనిధీ! 44

గేయము॥
అన్నువపల్కుల సన్నుతిఁజేసెడి
అన్నునుగని యనె నధిపుఁడిటుల్
క్రొన్ననదీవియ కోరి పూయఁగా
చెన్నులుచిందుట చిత్రమటే॥ 45

ఉ॥ చాలునుజాలు నీనుడులచాతురి, నన్మహనీయుగా నిటుల్
మేలములాడఁగాఁ దగునె? మిన్నునుదాకునెమన్ను గాలిలో
దేలియు? నన్ను నీవిటులఁ దేవునిగాఁ దలఁపన్ సహింతునే?
నేలనుద్రొక్కుమానవుని నిల్పుదువే పరమాత్మపీఠిపై? 46

క॥ నాలోన లేనిశక్తులు
బేలా! యూహింపఁబోకు, పృథివీశుఁడనై
పాలింతు ధార్మికుఁడనై,
పాలితులశుభంబె నాకుఁబరమశుభంబౌ. 47

మంజరి॥
ఇందీవరాననుం డింపుగాఁబల్కి
మందస్మితంబున మగువ యిట్లనియె — 48

చ॥ అటుగను మత్రిమౌనివరు నాశ్రమ సీమకు నేగుదారిలోఁ
జిటిపొటివానతెమ్మెరలఁ జిందఱవందఱగాఁగఁ జెంతనొం
డుటజమునందు నిల్చి కడునుబ్బున గొబ్బునఁబర్వు మబ్బులన్
గటగటనొందుచున్ మనము గాంచు విధంబు ముదంబుఁగొల్పెడిన్

మంజరి॥
శ్రీరాముఁ డాచెంతఁజిత్రమ్మునఁ గల
పర్ణశాలం జూపి వర్ణించెనిటుల 50

మ॥ కనుమా చెంగట, నాకుటింటి నదె వంకంబాఱు గోదావరిన్
ఘనమౌ ప్రస్రవణాచలంబదియె, తత్కాంతారభాగంబునన్
మనదాంపత్యము నిత్యనూత్నమయి యానందప్రదంబాయె నే
మనివర్ణింపఁగనేర్తునో చెలియ! రమ్యంబైన యాప్రొద్దులన్. 51

ఉ॥ ఉన్నతనిశ్చలాద్రియది, యుగ్రతపంబొనరించు మౌనిగా;
నన్నువ పూవుఁదీవియల నొఁదలఁదాల్చిన గున్నమామిడుల్
దిన్నని కన్నెగుంపులుగఁ; దేజునఁ బాఱునదీజలంబు లా
కన్నెల వన్నెపావడల క్రమపు టంచులుగాఁ గనంబడున్. 52

వ॥ జానకీ! మల్లిఖితంబయిన నొక్క చిత్రంబుఁ జూపెదనిటు చూడుము(అని తానురహస్యముగనుంచిన చిత్రమును జూపెను)

గీ॥ సూర్యరశ్మి సోకి సొబగురంగుల నీను
మెట్టు జాలు నీట మెఱయ నీదు
పాలరంగుమేను పర్ణస్యవింటితో
నలరు వెల్లమొయిలు నతకరించు. 54

వ॥ ఔరా! ఎంతయందముగానున్నది. మీరింతటివారని నాకుఁ దెలియదుగదా; 55

సరస్వతీమనోహరి రాగము
గేయము॥
ఎంత వింత గొల్పె నీచిత్రము
ఎంత నేర్పు మీలోనున్నది? ॥ఎంత॥
చెంతనుండి యెఱుంగనైతిని
సుంత మీకళాసృష్టి నోప్రియా! ॥ఎంత॥

చిత్రమాయె నౌర! చిత్రమారయన్!
నేత్రపర్వరమణీయంబిదియె
ఇంతప్రీతిపాత్రంబనైతినని
ఎంత సంతసంబాయె ప్రాణపతీ! ॥ఎంత॥ 56

శ్రీరా: చెలీ! నీ పొగడ్తల కేమిలే! 57

క॥ నీ గేయపు మృదుమంత్రం
బీ గీచిన చిత్రమునకు నిచ్చెను ప్రాణం
బో గీతకళాధుని, స
ర్వాగమశాస్త్రనుతపు కలభాషిణి వీవే! 58

ఉ॥ మబ్బులచాలు మింటిపయి మంద్రరవం బొనరింప, నేలపై
నుబ్బి మయూరముల్ సురుచి రోజ్వలనాట్యముసల్పినట్లు, నీ
యుబ్బురపున్ గళధ్వని మ దంతరమంటిన యంత, సౌఖ్యముల్
జుబ్బునచూలు లాడితిని జొక్కితి నీయుపగూహనంబులన్. 59

గేయము॥
ధవునిపలుకులకు నవనిజ యలరెన్, మృదుహాసంబునఁ
బెదవులు విడివడ తీయఁగనొడివెన్ 60

ఆ॥ కట్టుబాట్లులేని కానన వాసమ్ము
సంతతమ్ము నీదు సవిధమందు
చెప్పరానిసొంపుఁ జేకూర్చె, మరల నే
నిచ్చగింతు నట్టియిమ్ము స్వామి! 61

మంజరి॥
సంతసంబునఁ బల్కు సాధ్విని గాంచి
శ్రీరాముఁ డీరీతి జెలువతో ననియె — 62

ఉ॥ అచ్చటనున్న యాల్మగల యాలనపాలన, పండువెన్నెలన్
ముచ్చటలున్ రహః ప్రణయముల్ గిరిశైవలినీ విహారముల్
నిచ్చలు పచ్చనౌ ప్రకృతినిన్ వసియించు సుఖంబులట్టు, లె
ట్లిచ్చటఁగ్గలునే సఖి! మహీపతి వృత్తము క్లేశయుక్తమౌ॥ 63

మంజరి॥
ఇట్లాడుప్రాణేశు నెమ్మితోఁ గనుచు
మేలము ల్పచరించె మెలఁత యీరీతి॥ 64

క॥ ఆచక్కియఁ గాంచుము స్వా
మీ! చక్కని చుక్కయొకతె మేలుహొయలుతో
నాచెఱకువిలుతు గెలువన్
నీ చక్కందనము పొందు నేర్పునఁ గోరున్. 65

క॥ నా పాలిటి శాపమ్మీ
చూపోపని చుప్పనాతి; సురరిపు హృతనై
యోపని సిలుఁగులఁ జిక్కితి
ఈపడఁతికి సాటి పుడమి నెందుఁ గలుగునే? 66

మంజరి॥
జరిగిన శోకభాజనచరిత్రమ్ము
స్మృతిపథమునఁ బడ మెలపు చిత్రములఁ
బరికించి డస్సిన పడఁతి నిద్రింప
పడుకటింటికి రామభద్రుండు పంపె
మిగిలిన చిత్రాల మేలుగా రేపు
చూచెదమని చెప్పి శుభ్రాంశుముఖికి. 67

## మాయారజకి వృత్తాంతము

మంజరి॥
పుట్టింటి సిరులెల్ల నట్టేటఁ గలిపి,
తనకోర్కెఁ దీర్చని మనుజనాయకుని

పచ్చని బ్రతుకును రచ్చలఁ బెట్ట
రజకిరూపమున శూర్పణఖ రాఘవుని
రాజ్యమునం గాపురము పొనరించె;
క్రవ్యాదుఁడగు చాకి కాంతుడు గాఁగ. 68

సీ॥ ప్రజల మనోవృత్తిఁ బరికించి యేలుటే
ప్రభుధర్మమని యెంచి రఘువరుండు
పలువుర చారుల నలుదిక్కులకుఁ బంపె
విన్నది కన్నది విన్నవింప,
చారుల నొక్కండు చాకివాడకుఁ జనె
వానినిఁ గాంచి క్రవ్యాదయుగము
కపట కలహమునఁ గలకల మొనరింపఁ
గని రాజభటుఁడనె "కాట్లకుక్క

గీ॥ ల వలె మీరు పోట్లాడ వలసిన కార
ణంబు విశదపఱుపుఁడు పుణ్యజనులార,
రామరాజ్యంబునన్ మీరు రక్కసీంద్ర
పోలె నీతివిహీనులై పోరఁ దగునె? 69

మంజరి॥
మాయలమారులు మానవరిపువు
లదనిదే యని యెంచి పదరి రీరీతి 70

ఆ॥ పక్క విడిచి యెప్పు డెక్కడికెళ్ళిందొ?
వేగుచుక్క విరిసె వింటి మీఁద
గడ్డి పరక తెచ్చె గుడ్డల కంటాయి
తొత్తుముండ యిపుడు తొంగిచూచు॥ 71

గేయము॥
అని యా చాకలి
ఆ జవరాలిని

కొప్పుఁబట్టుకొని
కూలఁ దోయఁగా
అతి కోపంబున
అతివ యఱచె నిటు. 72

ఆ॥ నిలుపు నిలుపు చేయి నీకైద వేలరా?
ముక్కు మునుఁగ ద్రావి మొద్దు నిదుర
గుఱ్ఱు నీవు కొట్ట, కూసంతసేపు నే
బొమ్మలాటఁ జూడఁబోతి మగఁడ॥ 73

గేయము॥
నిలువ లేక కూర్చుంటిని
గులకనేల గ్రుచ్చుకొనఁగ
చెత్త పఱచి చతికిలితిని
చెత్త గుడ్డకంటె, నిందు
చెడ్డ తప్పు చెప్పరా? 74

ఉరిమి యురిమి చూచెదేల?
ఉరికి యురికి దూకెదేల? 75

సీతమ్మ సాక్షిగా
నా తప్పు లేదురా!
వాతప్పు లాడుటల్
రోతరా మగఁడా! 76

అని విన్నపము సేయుచు
అలి సిగఁబట్టి
తన్నఁబోవుచు వాడు
తగిలిట్టు లనియెఁ; 77

రక్కసు కొంపలో
నొక్కయే డున్నట్టి
చుక్కంటి యాలిపై
మక్కువన్ మానక
పక్కకుఁ జేర్పంగ
తిక్కరామయ్యనా? 78

ఎక్కువగ వాగకుము
మక్కలిఱుఁగన్ బొడుతు
అని వాఁడు దూకనా
అబల యిటులనెను. 79

ఉ॥ చీటికి మాటికిన్ మిగిలి చిందులుద్రొక్కను, ద్రాగి మత్తుచేఁ
గాటులకుక్కవోలె నను కాట్లను వేయును, కొట్టిరక్క, బా
హాటముగా పిఱుందఁజను నట్టిటు తారెడి యల్పుటాంద్రతో
నేటికి ఈమగండు, మను వేటికి; జచ్చిన నాకు మేలగున్. 80

గేయము॥

అని నెటికలన్ విఱిచి
చనె నాపాలంతి
పుస్తెలను మగవాని
మోముపై విసరి
"ఆత్మాభిమానులు
అబలలే యైన
పలుగాకి మగవాని
తులువతన మోర్తురే"
అని పలుకీతుల
అచటి జనమనిరి. 81

ఆ॥ వారు కయ్యమాడి ధారుణీపుత్రిని
సాటిలేని మేటి సతినిఁ బట్టి
కడుపు మంట లార కేకర్కసవృత్తిని
తూలనాడ వినెను దుర్ముఖుండు. 82

గీ॥ శివశివా! యెట్టి చెడువార్త చెవినిఁబడెను,
ఎటుల నపదూఱు రాముని కెఱుక సేయ
గలనటం చని, దుఃఖంబు గడలు కొనఁగ
నరిగె చారుండు తనయింటి కల్లనల్ల 83

## సూర్యోదయము

ఉ॥ పక్షులు గుంపులై యెగసి బారులుదీరె విహాయసంబునన్
గుక్షులు నింపుకోర్కె మెయి; కొక్కొరొకో యని కూసెఁ గోళ్ళు ప
ద్మాక్షులు విప్పి నవ్వె కమలాకరపంక్తులు, వచ్చె నాజగ
చ్చక్షువు పూర్వపర్వతతుషారతురంగముపై రయంబునన్. 84

వ॥ అప్పుడు వైతాళికులు. 85

కవిరాజవిరాజితము॥
జయజయ దైత్యవిదారణకారణ
జన్మ, ధరాతనయారమణా!
జయజయ భానుకులాంబుధిచంద్రమ,
సన్నుతసత్త్వగుణాభరణా!
జయజయ నిర్జరమస్తకమండిత
చారుకిరీటలసచ్చరణా!
జయజయ సర్వజగత్ పరిపాలన!
సాంద్రవిశాలయశస్స్ఫురణా! 86

కII దిననాథుని రథరశ్ములు
గగనాయెను పూర్వశైలకంధరసీమన్
జననాయక, మేల్కొమ్మా;
అనుపమహౌ యర్ఘ్యవేళ యంతికమయ్యెన్ 87

కII రంగన్నవరతికేళ్యా
లింగన భంగములు బ్రదుకు లీలల మొదలుల్
మంగళ కైశికవృత్తుల
సంగీతము సన్నబర్వె జగముల నెల్లన్, 88

మంజరిII
మిహిమేలు కొలుపుల మేల్మిరావములఁ
గనువిచ్చి కనుగొనెన్ గమలేక్షణుండు
తనపాదములఁ దాకు జనక నందినిని
మేలముల్ పచరించె మెలఁతతో నిటుల
"నల్లవో, సీతమ్మ నల్లనివాని
పాదముల్ బట్ట నీబ్రదుకిట్టులాయె
రానుతవయ్యు నరణ్యసీమలను
కష్టముల్ పడితివి కల్యాణి నీవు"
అని పల్కు నాథుని యధరయుగ్మంబు
నును పెదవుల మూసి కనుల ముద్దాడి
ఈరీతి పల్కుట యింపుగా దనుచు
చిఱుకోపమునఁ జూచెఁ జిగురాకుబోఁడి
కాల్యకృత్యము దీర్చి కాకుత్స్థవిభుఁడు
చిత్రశాలకు నేగె సీతను గూడి,
ఒక పటంబును జూపి యువిద యిట్లనియెII 89

క॥ అది యేమిచిత్ర? మచ్చట
చదలున జడిబడ్డ యట్లు స్వామీ! కన్నీ
రుదుటున జాఱెను మీకున్
బదరి శిలలు నీరు గార్చె పరికించి మిమున్ 90

చ॥ వనమున నన్నుఁబాసి వలవంతను గూర్కొని వంక వంకలన్
ననుఁ గని భ్రాంతిమై పిలిచి, నన్ వడిఁబట్టఁగఁబోయి, లేమికిన్
గనులు జలంబుగాఱు తపనన్ విలపించెడి మిమ్ముగాంచి, యే
డ్చెను గరుణార్ద్రయై ప్రకృతి చిత్తము పల్లటిలన్ మనోహరా! 91

క॥ వలవల యేడ్చెడి ననుఁ గని
చలియింపక మీరు నింద సలుపఁగ లంకన్
దలచితి మీయెడ కఠినో
పలమని మృదువైన మీదు వలపెఱుఁగమిచేన్. 92

మంజరి॥
ఆ మాటలన్ విని యర్కాన్వయుండు
సీతమ్మ చిగురాకు వాతెర నొక్కి
సజలనయనములఁ జక్కఁగాఁ దుడిచి
అక్కున గదియించి మక్కువ మీఱ
మెత్తని నుడువుల మెలఁతతో ననియె॥ 93

క॥ శిరమునఁ జెన్నులు చిందెడి
విరిదండను నిప్పులందు విసరిన లీలన్
విరిబోణి! నిను బవిత్రను
బరుసంబునఁ దూలనాడి వైచితి వహ్నిన్. 94

క॥ నిర్మలచరితా వినుమా!
ధర్మవునన్ జీవితములఁ దప్పక వడుపన్
గర్మము లొనర్పవలె ఈ
మర్మము మనమెఱిఁగి యిలను మన నేర్పవలెన్. 95

క॥ పుట్టుకచేఁ బావనతను
నిట్టలముగఁ బొందినట్టి నెట్టికసీలన్
ముట్టిన; దీర్ఘజలంబుల
యట్టుల, నగ్నియుఁ బవిత్రుఁడై యలరారెన్ 96

గేయము॥
సురుచిరాంగి చూడు మటుల
ఉన్నతాంగు నుగ్రతేజు
ఉదధి దాట నుఱుకు వాని 97

గీ॥ కాళు లొకచోటఁ బెట్టని గాడ్పు వలన
నంజనాదేవి పొందిన యనుఁగు బిడ్డ
జగము చుట్టంబునకుఁ గూర్చు ఛాత్రుఁడు మన
శోకవార్ధిని గడపిన జోగితండు. 98

ఉ॥ నమ్మినబంటు నాకు, గపి నాథునకుం గడుఁ గూర్చుమంత్రి శౌ
ర్యమ్మున కిమ్ము, మిత్ర విజయ ప్రతిభా సముదీర్ణ మూర్తి, క
ర్ణమ్ముల కింపు నింపు మధురంబగు మాటలయందు మేటి, యు
ద్ధమ్మున రుద్రుఁ డీతని కితండె జగమ్మున సాటి జానకీ! 99

చ॥ ఎలమిని గొల్పు చిత్తరువులే కనుపండువు సేసె, పూర్వగా
థల వెలికీడ్చి, చిత్తమును దత్తఱమందఁగఁజేసె, గాన-నీ
తల నిటు వాల్చి నాహృదయ తల్పమునన్ శ్రమఁదీర్చుకొమ్మ; ఉ
త్పలదళశీతమార్దవనిధానములంగన, నీదు స్పర్శనల్. 100

ఉ॥ నీ మధురస్వరమ్ము, రమణీమణి! తీయని రాగమాలికల్
నామది కాహళిన్ బలుకు నవ్యవిధంబుల నింపుఁ గూర్చు, నీ
శ్యామల సస్మితానన విసర్పిత సాంద్రసుధేందు చంద్రికా
స్తోమము రాజ్యభారభవ దుఃఖ తమిస్ర వినాశనంబగున్. 101

ఉ॥ ప్రణయతపస్వినీ! మధుర భావధునీ! స్మితపూర్వభాషిణీ
మణిఘృణిమాలికారుచిర మంగళరూపిణి! హంసగామినీ!
ప్రణుతికిఁ బాత్రముల్ సుమి భవన్మహనీయములైన వర్తనల్
గుణవతి! నీ చరిత్రమునకున్ సరిరాగలదెద్ది యిద్ధరన్ 102

శా॥ దాంపత్యంబు వయస్సునన్ వలపు నెత్తావుల్ గుబాళించు గ
ప్రంపున్ వీడ్యము పోల్కి, మేను లోకలై రంజిల్లు సంశ్లేష సౌ
ఖ్యంపున్ డోలల, వార్ధకం బెలయ నవ్యక్తానురాగార్ద్రతన్
సొంపుల్ గూర్చును, సాహచర్యసుషమాస్తోకప్రభాపూర్ణతన్. 103

మంజరి॥
చిఱునవ్వు నవ్వుచు సీతమ్మ పలికె
"నాస్వామి! తగునయ్య నన్నిటుల్ వొగడ
మీపాదదాసితో మేలముల్ దగునె?
తిరమైన మీప్రేమ తీరు నోవరము"
అని యామె పతి నానుకొని నిదురించె
అంతలో దుర్ముఖుం డరుదెంచి చెప్పె
పురిలోని వింతలఁ బొల్లుపోకుండ 104

చ॥ అతులితమౌ సుఖమ్ము సఁగు నంతిపురమ్మును, భూవిభుత్వమున్
బితమని యానఁ బో విడిచి పీడితసాధుజనాభిరక్షకై
వెతల సహించినావు రఘువీర! భవత్పరిపాలితప్రజా
వితతికి దుష్ప్రవర్తన లభించునె? చీఁకటులున్నె రశ్మిలోన్ 105

మంజరి॥
అయినను నొక కీడ్ద రథము లున్నారు
వారి ప్రల్లదములు సైరింపవలయు"
అని చారుఁడు వచింప మనుజేంద్రుఁ డడిగె
విన్నది కన్నది వివరింపు మనుచు

జానకి నట వీడి చనియె రాముండు
చారుండు వెంటరా వేఱొండు గదికి
అంతట వాఁడిట్లు వంతతో నొడివె
"మురికిపేటలను నిర్మూలింప మీరు
క్రొఁత్తగాఁ దీర్చిన కొమరైన యిండ్లఁ
బరికించుచును రాత్రి పర్యటించితిని
అవాడ నొక చాకి యాలినిఁ బట్టి
యుతుకుచు నుండె నాయువిద యేడ్వంగ
ఇరుగు పొరుగువార లిదియేమి యనక
గుంపులు గూడి రా సొంపును గనుచు"
అని వేఁగు చిత్రించె నారాత్రి కథను
వికలిత చిత్తుఁడై వినె నృపాలుండు,
చనియె నానతిఁగొని చారుండు వేగ 106

చ॥ ప్రజలకుఁ బ్రీతిఁ గూర్చు పరిపాలనదక్షుఁడు రామచంద్రుఁడ
క్క్రజపడె; తన్నుగూర్చి యొక కష్టచరిత్రుఁడు గాఱులాడఁగా,
నిజసతిఁ బుణ్యవృత్తను వినిర్మలమూర్తిని సాహసంబునన్
రజకుఁడు రచ్చలో నిలిచి రట్టొనరింపఁ గలంగె నెంతయున్107

గీ॥ ఇలఁ బ్రజామార్గ దర్శిగా నేల నిచ్చు
దీక్షఁ గైకొన్న దుర్జనశిక్షకునకు
వారి యపదూఱు ములుకుగా దూఱి, నాతఁ
డుప్పెనం గూలు తెప్పఁగాఁ గుప్పగూలె॥ 108

గీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి సతిని
నిష్కళంకను, బూతను, నిరపరాధ
నడవులకుఁ బంప వలయునే యవనిభర్త
యైన కతమున నని యాతఁ డావటిల్లు 109

ఆ॥ తన్నుఁ బ్రజలు దూఱ, ధరనేలె ననెడి దు
ష్కీర్తి కన్నుఁ దప్పు సేయ నట్టి
సతిని విడిచె ననెడి సడి సహించుట మేల
టంచుఁ దలఁచె రఘుకులాబ్ధివిధుఁడు. 110

చ॥ తలఁచిన యంతనే పిలిచెఁ దమ్ముని లక్ష్మణునిన్ వచించెఁ జా
కలి పలుగాకి వాక్కుల ప్రకారము- కట్టడఁజేసె, సీతఁగా
నల విడనాడి రమ్మని జనశ్రుతి నీఁగఁగ, లక్ష్మణుండు వి
హ్వలుఁడయి కాంచె నగ్రజు మహాత్ము, మహీధవు, చండశాసనున్

క॥ మాఱాడక మ్రాన్పడి నటు
లూరక నిల్చున్న యా గుణోజ్జ్వలు ననఘున్
జేరువకుఁ జేర్చు కొనియెన్
శ్రీరాముఁడు, తమ్ముఁ డపుడు చేడ్పడి పలికెన్. 112

శా॥ ఏ లోపమ్మును జూపి మా వదినె నీ వీరీతి శిక్షించెదో
ఆలోచింపుము కర్మసాక్షికులజా ధ్యక్షా! క్రియాదక్ష, చూ
లాలిన్ బావనశీలఁగోమలిని నేలా త్రోయఁగా; భార్యలన్
లూలామాలపు చాకికూఁతల కిలన్ భూపుల్ విసర్జింతురే! 113

ఉ॥ పావకకీలలన్ దుమికి వాడని సాధ్విని, లోకపావనిన్
దేవత లెల్లరుం గని నుతింపరె? యామె విశుద్ధ వర్తనన్
నీవు గణింప కావిధము నిర్మలమూర్తిని. పూర్ణగర్భిణిన్
హావడి కగ్గమౌ నటు లొనర్చుట నాయమె యెంచి చూడుమా! 114

శా॥ దీనత్రాణపరాయణవ్రతముతో దీపించు సూర్యాన్వయం
బీనా డస్తమయంబు నొందు నని యూహింతున్, ప్రభూ! జానకీ
జానీ! తాలుచు నే మహాత్మ భవదంశప్రస్ఫుటాంకూరమున్
ఆ నారీజనతాశిరోమణి కరణ్యావాసమా క్రమ్మఱన్. 115

గేయము॥

ఆ పలుకులు విని యవనిపుఁ డనియెన్
పగిలెను నాయెద బాధింపకుమా!
విధి బలీయమై వీడఁ జేయు నా
ఏణాక్షిని; నే నేమొనర్తునిఁక. 116

ఉ॥ ఆరని చిచ్చు నాదు హృదయంబునఁ జొచ్చుకొనెం గటా! దురా
చారు సతిన్ హరించిన నృశంసు వధించితి నాడు, నేఁడెటుల్
గాఱులు గూయు నాప్రజలఁ గట్టడఁ జేయగలాడ, హావిధీ!
పోరచి కానలన్ ధరణిపుత్రిని వీడుటె కర్జ మిత్తఱిన్. 117

మంజరి॥

అని ఱేఁడు సౌమిత్రిఁ గని యానతిచ్చె
జనపతి నేను నిన్ శాసించు వాఁడ
ధారుణీతనయను దడయక నీవు
వనసీమలను వీడి వైళమ రమ్ము
అని పల్కి రాఘవుం డరిగె దుఃఖమున
విధినిర్వహణభార విధురుఁడై లక్ష్మ
ణుఁడు వెడలెను సీతను గనుంగొనుటకు
శుద్ధాంతమున నున్న శుభ్రాంశుముఖిని
సౌమిత్రి పరికించి చల్లగాఁ నుడివె
వనములఁ జూచు మీ వాంఛను దీర్ప
అగ్రజుం డుదయాన నడవికి మిమ్ము
గొనిపొమ్మనుచుఁ జెప్పె నని యాత డరిగె
మఱునాడు వేగున ధరణిజన్ గొనుచు
వనసీమలంజేరఁ జనియె సౌమిత్రి. 118

మ॥ కన రండో గృహమేధులార! నయరక్షాదక్షులారా! పృథ
గ్జననిందన్ విని రాజు సాధ్విని ప్రజాసంప్రీతికై కానకుం
బనుచున్, నేరమదేమొ మీ రడుగరా? పాటింతురా యిట్టి చే
తను; లే లెండను రీతిఁ గూసె ద్విజసంతానమ్ము లొక్కుమ్మడిన్

ఆ॥ తనకులమ్ము వాడు, తనవలె దారను
దక్షిమె ననుచు మెచ్చఁ దప్పఁద్రావి
తూలిపడుచుఁ దోచెఁ దూరువుఁగొండపైఁ
జాయ వెలిచి పలుకఁ జాయ మగడు. 120

సీ॥ కోటరమ్ముల వీడి కువకువ రొదలతోఁ
బలపల నెగిరెను బక్షికులము,
తామర పూవుల తల్పంబులన్ వీడి
ఝుమ్మని చెలరేఁగె తుమ్మెద గమి,
గిరిదుర్గముల వీడి ఘీంకారముల తోఁడ
నిలచలింపఁగఁ బర్వె నేన్గు తుటుము
గహ్వరంబుల వీడి గర్జారవంబులు
పలుపుచు వెడలె గ్రోల్పులి బలములు

ఆ॥ న్యాయపాలకుండు నరపతి, అన్యాయ
శీలుఁడై చరించి, సీత నడవి
కనిచె, నతని రాజ్యమును వీడి వేతొండు
వనికి వేగఁ జనెద మనేఁడి రీతి॥ 121

ఆ॥ తెల్లనైన నీర మల్లనఁ బ్రవహించు
గంగ యొడ్డు కడకుఁ గడు రయమునఁ
గుదుపులేని తేరు గొంపోయె వారిని
మినుకులమణి వెలుఁగ మింటి నడుమ. 122

మంజరి॥
ప్రకృతిసౌందర్యమ్ము పడఁతి కనుఁగొని
పరవశించిన భాతి బలికె నీరీతి॥ 123

మ॥ మఱదీ, కాంచుము హ్లాదముం గొలుపు నీమందాకినీప్రాంతమున్
మెఱయుం బచ్చిక బీళ్ళు భూరమణికిన్ మేలైన పుట్టంబుగా
నరుణస్వర్ణమయూఖకాంతిలసితంబై హల్లకాశ్లిష్టమై
యొరిమన్ బాఱెడి స్వచ్ఛమౌ జలము లా యొయ్యారి యొడ్డాణమౌ

గీ॥ మెఱుపుకన్నియ ఎండకన్నెఱుఁగని జవ
రాలు, ధరియించి మేఘంపు మేలి ముసుఁగు
వింట నడయాడఁ బడు శ్రమబిందువితతి
నాఁజినుకు లల్లనల్లన నవని బడియె॥

ఉ॥ తెల్లని తిన్ననౌ యిసుకతిన్నెలు, తీఁగెలువారు నీరముల్
నల్లమడుంగునన్ దళతళల్ పచరించెడి చేఁపలం దినన్
బెల్లునఁ జఱునం దుముకు పిట్టలు, పండిన దోస చేలపై
నల్లల నాడు తుమ్మెద లయారె! విలోకనమోహనంబగున్. 126

క॥ కన్నులపండు వొనర్చెడి
ప్రన్నని యాప్రకృతిశోభ పరికింపఁగ, ని
ష్పన్నంబైన ప్రమోదము
మన్నాథుం డిచట లేమి మ్లానం బాయెన్, 127

ఉ॥ ఆ వనవాస మప్రసపభయంకరమయ్యుఁ బ్రియానురాగసం
భావనచేఁ బ్రమోదభరమంజులమౌచు రహించె నెంతయున్
ఈ వనసీమసోయగము లిన్మడియయ్యు సుఖంబు లేశమౌ
తీవియ వన్నె కెక్కునె పదింబదిగా సహకార శూన్యమై. 128

ఉ॥ అచ్చపు నీలిమబ్బు దివిజాధిపు రంగుల వింటి నిగ్గుచే
ముచ్చట గొల్పు - దానిని ప్రమోదమునన్ గని నెమ్మి మైపురిన్
విచ్చి నటించు - వారిదము వేడ్క నొసంగును కంకణంబులన్
మెచ్చిన ఉచ్చనీచతలు మేరలు గావు సుహృజ్జనాళికిన్. 129

మంజరి॥
వనశోభఁ గాంచుచు వర్ణించు సతినిఁ
గని చెప్పె సౌమిత్రి కలగుండు వడుచు 130

మ॥ వినువీథిన్ హరివింటి వర్ణములచే
వెల్గొందు నీలాభ్రమున్
దన కాప్తుండని నమ్మి నెమ్మి విలస
న్నాట్యం బొనర్పం గనుం
గొని మేఘుం డుమిసెన్ మయూరము పయిన్
గొండాడ కా నృత్యమున్
ఘనుఁ డౌన్నత్యము నొందియున్ బరగుణో
త్కర్షన్ సహింపం డిసీ. 131

సీత : సౌమిత్రీ, ఏటికి నీ యీ విపరీతవ్యాఖ్యానము? 132

లక్ష్మ: అమ్మా, ఏమందును. 133

ఉ॥ ఎన్నఁగరాని ద్రోహము త్వదీశుఁడు నీయెడ సల్పె; నెవ్వఁడో
యెన్నెను మీచరిత్రమును నించుక యంచని; నిర్ద యాత్ముఁడై
ని న్నటవిన్ విసర్జనము నెట్టన సేయఁగ నానతిచ్చె; నా
యన్న; కృతాంతుచేష్టితము నాపఁగ శక్యమె యెంతవాడికిన్. 134

క॥ నీలాంబుద వక్షంబున
లీలన్ విలసిల్లు మెఱపు తేమఁ గనుచుఁ జూ
లాలిన్ నిను, నిర్భరమౌ
జాలిన్, బాష్పముల జార్చు జలబిందువులన్. 135

గీ॥ మఱదిమాటలు చెవిసోక మంజులాంగి
ద్రాకు వలె నిల్చె, చేతనారహిత యగుచు
ఆ వచనభావ మది యంతరాంతరముల
జాఱ ధరఁగూలె నవశయై సత్త్వముడిగి. 136

గీ॥ ఏ విభుని యండదండల నెంచి చిరము
సౌఖ్యమయజీవితంబు తాఁజక్క నెఱపఁ
గలలు గాంచెనొ? యవియెల్లఁ గఱఁగిపోయె
దిక్కులేనట్టు లడవిలోఁ జిక్కె నామె. 137

మంజరి॥
పెనుగాలి పెకలింప పెనఁకువ వీడ
పుడమిని వ్రాలిన పూవల్లియామె. 138

చ॥ అనుపమభోగభాగ్యముల కాకరమైన నృపాలు పుత్రిగా
జననమునొంది, భానుకులసాగరచంద్రు వరించి, లోకపా
వని యని పేరుగాంచిన తపస్విని రట్టువడెన్ గటా! విధా
తృని నియమమ్ము దాట తరమే? ధర నెంతటివారికేనియన్. 139

గేయము॥
వివశయై భూమిజ పృథ్విపై కొఱగెఁ
బచ్చిక యక్కయ్య పట్టు పఱుపయ్యె,
చిగురు చేతులఁ జెట్లు చినుకుల రాల్చె,
తెమ్మెరలేమలు దీర్చెను సేద,
జింకలు మేయక చింతతో నిలిచె,
కోయిలల్ గొంతెత్తి కూసి మేల్కొల్పె,
కలువ కన్నులు విప్పి కాంచె సీతమ్మ
కథముల మోమునఁ గప్పి శోకించు
మహనీయు మాన్యుని మఱది లక్ష్మణునిఁ
గలగుండుపాటుతోఁ బలికె నీరీతి॥ 140

ఉ॥ కన్నులఁగప్పి కాచె ననుఁగాంతుఁడు, కూరిమి తీవ పూయగా
మన్ననఁజేసె నాతఁ డభిమానముతో నను దాల్చి మౌళిపై
మిన్నులుబడ్డచోటఁ బడి మిత్తికిఁ బాలయినట్టి నన్నుఁ గా
చె న్నెనరూని, యట్టిపతిచే నకటా! యిటులైతి నిత్రజిన్. 141

చ॥ తన కులగౌరవమ్ము వసుధాపతిధర్మము నెంచెఁ గాని, భా
ర్యను దనతోడునీడయి యరణ్యములన్ వసియించి, కీడుపా
టును గనినట్టివానిఁ గసటుం గననట్టి కఠోరగర్భగు
ర్విణి వనిపాలొనర్పఁ దగవే? మగవారల చేఁత లిట్టివే? 142

ఉ॥ నాపతి భూపుఁడౌట దిననాథు విధాన తపించి తాను, వి
శ్వోపకృతిన్ బొనర్చెడి ప్రయోగమొనర్చి; ప్రజాప్రమోదశో
భాపరిపూతచిత్తుఁడయి భాసిలు పొంటె నిటుల్ మెలంగెనా?
బాపురె! సూర్యవంశనరపాలకవర్తనముల్ విచిత్రముల్. 143

ఉ॥ నవ్వులు జిల్కరించు నయనంబులవాఁడు, పరీమళంపు మే
ల్పువ్వులవంటి పల్కులఁ బ్రభూతముద మ్మిడువాఁడు నిద్దపౌ
మవ్వపు మేనివాఁడు, గుణ మండనుఁడా రఘువంశశేఖరుం
డవ్విభుఁ డిందు నన్విడిచెనా? యిఁకఁ గ్రమ్మఱ స్వీకరించునా?

క॥ చింతింపకు మో మఱఁదీ!
వంతల బ్రదుకాయెనాది, వనములు నాకా
వంత శ్రమ నిడవు: శ్రీరఘు
కాంతుఁడు నాప్రాణధవుఁడె కడఁద్రోయంగన్. 145

గీ॥ రాజ్యలక్ష్మి నిరాకృత రాఘవునకు
అలి నానాడు దూఁరస్థురాల నేఁడు
శ్లాఘ్యరాజ్యరమా భోగలాలసునకు
ఏకపత్నీ వ్రతంబన నిట్టిదేమొ! 146

ఉ॥ అచ్చటికేఁగి చెప్పుము శ్రియఃపతితో రఘురామమూర్తితో
నిచ్చట దుర్గమాటవిని హేళికులంబున కోపలేని పెన్
మచ్చను గూర్చినట్టి లలనన్ విడి వచ్చితి నంచుఁబెండ్లిలోఁ
జిచ్చును జుట్టి నప్పుడు వచించిన పల్కులు గూలె జిచ్చునన్.

వ॥ అన్నా! సౌమిత్రీ! మీయన్నగారితో నిట్లనుము. 148

ఉ॥ నా యుసు రీవు, నిన్నువిడి నాతనువుండునె? నీదుసేవకై
యే యటవీస్థలాన వసియించితి; నిన్నెటఁ గూడిమాడినా
నో యట నీవులేక పడియుండుట సాధ్యమె? మోడుజీవితం
బాయెను, నిన్నువీడి మనుటా! మనుమార్గమెదో వచింపుమా!148

ఉ॥ దోసిలియొగ్గి పల్కెదను దోసము లేశము లేని నేను, ని
ర్వాసితనైతిఁ; గ్రూరమృగ వాసములైన వనంబులన్ ధరి
త్రీసుత, రాఘవేశ్వరుని దేవి విపత్తుల జీవితాంతమున్
గాసిలునట్లు వ్రాసెనటె కట్టెఁడియైన విధాతృఁ డక్కటా! 150

చ॥ నను విడనాడనంచు, నలనాడు హుతాశను ముందు చేత చే
యినిఁగొని చెప్పినట్టి పలుకేమయిపోయె, వచింపుమయ్యా మీ
రనుపమ సత్యశీలురుగదా? కనఁగోరుదురే ప్రశస్తి యి
ట్లినకులభూషణుల్; సతుల కిట్టిగతుల్ గలిగింతురా పతుల్.

ఉ॥ భర్త మహానుభావుఁడు ప్రభాకరవంశ విభూషణుండు, భ
క్తార్తినివారకుండు, శరణాగతరక్షణదీక్షితుండు, మ
ద్వర్తనశుద్ధి తానెఱిఁగి బాలిశువాక్కుల విశ్వసించె, నే
నోర్తునె? యీతిరస్కృతి వియోగము; జీవితమర్ధహీనమౌ! 152

మంజరి॥
ఈమాటలన్ విని సౌమిత్రి పలికె
తగదమ్మ నీవిట్లు తల్లడమొంద

కాపురంబుండునే కష్టాలు తల్లి!
జీవితాహిత శోక జీమూత వితతి
యాశాపరంజ్యోతి నణఁగారిపోవె?
నీగర్భవాసాన నెలకొని యున్న
చిన్నారి సంతతి సేమమ్ముఁ గోరి
చిఱునవ్వు నవ్వుచు జీవితశేష
కాలమ్ము గడపుమా కన్నీరు విడిచి॥ 158

శా॥ తల్లీ! శ్రీరఘురామచంద్రు హృదయా దర్శంబునన్ నీదు రూ
పెల్లప్డున్ ప్రతిబింబితంబగు, నిజం బీమాట, నీసాహచ
ర్యోల్లాసంబులు లేక ప్రాణముల నెట్లో నిల్పునాతండు, నీ
వుల్లంబందు దృఢత్వమూని మనుమా యుద్వేగమున్ వీడుమా!

మంజరి

అని యామె నోదార్చి యటవిని వీడి
సాకేతనగరికి సౌమిత్రి చనియె॥
అవనిజ శోకభారానత యగుచుఁ
దనలోనఁ దానిట్లు తలపోయఁజొచ్చె. 155

క॥ అష్టైశ్వర్యవిభుత్వో
త్కృష్ట గుణోద్భాసి, భర్త నిచ్చియు నకటా!
స్రష్ట సహింపక నాకీ
కష్టపుదశ నేలవ్రాసె కఠినాత్ముండై? 156

ఉ॥ భూమిసుతన్, విదేహనరపుంగవపోషిత, నత్రిధర్మప
త్ని మహితాభిమానకృత దివ్యపదార్థబహూకృతన్, శుచి
స్వామిశిఖావళీప్రకట సచ్చరితన్‌గద; యిప్పు డక్కటా!
రామపురస్కృతన్ బ్రదుకరా దిఁకఁ జొచ్చెద జాహ్నవీనదిన్.

క॥ అని జానకి గంగాజీ
వనముల జీవంబు వాయ వ్రాలంబోవన్
గని వాల్మీకి తగదనుచు
చనవున నామెకు హితంబు చక్కఁగఁజెప్పెన్. 158

సీ॥ కనుచీఁకటిని నీవు గంగాతటంబున
నిండు చూలాలివి నిలువఁ దగునె?
జీవించుహక్కు నీ జీవితేశుం డిచ్చె
నతిపాపమో యమ్మ ఆత్మహత్య,
ఏలోప మెఱుఁగని నీలోని పాపల
సమయింపఁ దలఁతురే సతులు జగతి?
కడుపులో బిడ్డలు గల్యాణమూర్తులు
భావిసామ్రాజ్యాధిపతులు సుతులు

గీ॥ తల్లిదండ్రుల కీర్తి వర్ధిల్లఁ జేసి
వన్నెఁగూర్తురు భాస్కరవంశమునకు
రమ్మ నిలువుము నాయాశ్రమమ్మునందు
కన్నతండ్రిగఁ దలఁపుము నన్నుఁదల్లి! 159

మంజరి॥
అని పల్కినట్టి యా మునినాథు నరసి
కన్నీరు జాఱ నా కలికి యిట్లనియె. 160

క॥ పువ్వువలె నన్నుఁబుణికిన
అవ్విభుహస్తములె తోఁచె నటవిని నన్నే
గవ్వవలె; ఏమి చెప్పుదు,
నవ్వులపాలాయె బ్రదుకు నయ తత్త్వనిధీ! 161

చ॥ అతిసుకుమారి నగ్నివిను తాద్భుతపూతచరిత్ర భర్తతో
వెతలను బొందినట్టి చెలి విశ్రుతసత్పథగామినీమణిన్
బతి వెడలించె నంతిపురి బాపురె! యెట్టిసహింపరాని దు
ష్కృతమొనరించెనో యని మహీజను లారడిసేయరే ననున్.

ఉ॥ ఈమెకునై రఘూద్వహుఁ డహీనబలుండగు పంక్తికంఠరున్
బ్రామిడు లైన రక్కసులఁబట్టి వధించెను, సర్వదేవతా
స్తోమము సన్నుతుల్ సలుప; దోస మదేమియొనర్చెనో కదా!
యీమెను గానఁ ద్రోసె ననియెన్ని, జనుల్ నను వ్రేలఁజూపరే?

క॥ ఈమాటల నే వినుచున్
భూమినిఁ బ్రదుకంగఁ గలనె? మునిరాణ్మౌళీ!
యేమని పల్కుదు, నాసుతు
"లేమమ్మా! యేడినాన్న? యేడీ" యనినన్. 164

గేయము॥
అడుగడుగున కిట్లవమానమ్ములు
గడపుచు నేఁబ్రదుకున్ గడపుదునా?
మందాకినిఁ బడి మడిసినచో నా
కొందలపాటునకున్ దుది కలుగున్. 165

ద్విపద॥
కడుదుఃఖమున నిట్లు తడఁబడి పలుకు
పడఁతి కూఅటగల్గ జడదారి నొడివె. 166

మత్తకోకిల॥
నిన్ను బంపెను రామచంద్రుఁ డ
నింద్యమూర్తి సతిన్, నినున్
గన్నబిడ్డగ నాదరించెద,
గంటిపాపగఁ గాచెదన్

ఎన్ని జన్మల పున్నెమో యిది
    యేరికబ్బునె తల్లి! నీ
వున్న నాయిలు పావనంబయి
    యుల్లసిల్లదె మైథిలీ! 167

క॥ కల్లోలంపడకుము, నా
యిల్లే కడుఁగూర్చు పుట్టినిల్లని ప్రీతిన్
దల్లీ! భావింపుము; నీ
యుల్లమునన్ శాంతమూని యుండుము సాధ్వీ! 168

చ॥ కమలము దుర్దినంబున వికర్తనదర్శనహీనయయ్యు, ఫు
ల్లముఖియగున్ నిజేశు కర లాలనపైఁ గలయాస, నీవటుల్
రమణు పురానురాగమధురస్మృతి యూఁతగ జీవమూనుమా!
అమలినఁరాగ రశ్మలకు, హద్దగునా జలదాపవాదముల్. 169

ఆ॥ నీకు సేవఁజేయు నిర్మలమూర్తుల
కన్నుఁగవకె నీవు కానఁబడుదు
వితరలోచనముల కీవదృశ్యవె యౌదు
వమ్మ చింతమాని రమ్ము తల్లి! 170

మంజరి॥
అని ముని యాదరంబున నూఱడింప
నంగీకరించె నాయన్నులమిన్న
గంగాతరంగిణిన్ గాంచి యాభంగి
చక్కని ఫణితిని సన్నుతింజేసె॥

ఉ॥ పుట్టితి వాదివిష్ణుపరిపూతపదాంబురుహద్వయంబునన్
మెట్టితి వభ్రకేశు కమనీయకపర్దగృహంబు, పాపులన్
జెట్టల వీతకిల్బిషులఁ జేయు మహాత్మవు, వేధ- నన్ను నీ
గట్టున కెట్లొచేర్చె, ననుకంప వెలార్పుము దేవి! నాపయిన్. 172

కII బృందారకవందిత! యో
మందాకిని వల్లభునకు మాన్యనగునటుల్
నందనుల గాంచితేనిన్
గుందమ్ములమాల నేనుఁ గూర్చి భజింతున్. 173

మంజరిII
గంగమ్మ కీరీతి క్రైమోడ్చి పలికి
వాల్మీకి వెన్నంటి వనజాక్షి చనియె
అర్కాన్వయాబ్దిసుధాంశుఁడు రాముఁ
డకలంకచారిత్ర నవనిజం బాసి
చింతా వశీకృత చేతస్కుఁడగుచు
రాహువు బట్టిన రవిమాడ్కి వనరె. 174

కII నును మెఱపు చెల్మి బాసిన
ఘనువలె రాముండు గ్రాలె కామిని లేమిన్
తనువును సెజ్జను వాల్చును
కనులజలము చెవులు నిండ కళవళ మొందున్. 175

కII కను మూసినఁ గను దెఱచిన
తన జీవిత తరళ రేఖ ధాత్రిజ రూపం
బునుగను బురానుభవములు
మనమున విస్ఫార నతఁడు మనన మొనర్చున్. 176

వII అంతవర్షాకాలమాసన్నమయ్యె 177

చII అమలినదివ్యభావముల కాస్పద మాద్యము మానసంబు, జ్ఞా
నము మఱుగొంద నింద్రియఘనంబగు చీఁకటి ముంచు పోలికన్
ద్యుమణి వినిర్మలాభ్రమునుండియుఁ గాలపయోదశాంబరీ
తిమిరముచేతఁ గప్పఁబడి తీక్ష్ణతఁ గోల్పడె వాన్తకారునన్. 178

కII కల్లోలితమగుసరసిన్
ఝల్లునఁ జెలరేగు చేప పిండటు - సీతా
వల్లభుహృదయంబున హవ
ఝల్లె సతీస్మృతినివహము నెవ్వగ గదురన్. 179

మంజరిII
ఏకాంతమున రాముఁడిందీవరాక్షి
సీతమ్మ చిత్రమ్ము చెంతనిల్పుండి
ఎదలోని శోకంబు పెదవులు దాట
వలపు మల్లడిగొనఁ దలఁచు నీరీతి. 180

## శ్రీరామచంద్రుని విరహము

సీII అమలినజ్యోత్స్నతో నాహ్లాదమొనరించు
రమణీయ శరదంబరంబవీవు,
ఫుల్లహల్లకములన్ మోదంబుఁగూర్చెడి
సలలిత చామకాసార మీవు,
గాసిల్లఁ జేసెడి వేసవి తాపంబు
తొలఁగించు దక్షిణానిలమ వీవు,
మధుమాసవేళల మత్తుగల్పించెడి
వాసనల్ జిమ్మెడి ప్రసవ మీవు.
గీII నాదు సకలేంద్రియంబులు పాదుకొనిన
అనుపమాన కళాధివిన్యాస మీవు,
పెక్కుమాట లవేల నోప్రేమమూర్తి
రాణకెక్కిన నాబహిఃప్రాణ మీవు. 181

చII తలిరుల నిద్దపుందళుకు తామరసంబుల సోయగంబు, వె
న్నెలల మనోహరత్వమును నిర్ఝరిణీజలనిర్మలత్వమున్
లలితపికీరవంబు, కమలాధవు కాంచన కాంతిరేఖయున్
నెలఁతరో! నీస్వరూపమున నిచ్చలు నాకనుభూతమే సుమీ! 182

మ॥ అలనాడో లలనా, దశాననుని సంహారంబుగావించి, ము
ల్కులఁబోల్పుల్కుల నీదు డెందమున కుల్కన్ నొప్పియున్
గొల్పగా!
జ్వలితాగ్నిన్వడిఁజొచ్చి వెల్వడి సతీత్వంబున్ బ్రభావంబు న
గ్గలికన్ నీవు సురల్ నుతింపగ సముద్ఘాటించు టగ్గించెదన్ 183

మ॥ చెలియా నీ చిఱునవ్వు చెల్వమును నీ స్నిగ్ధాధరోద్యద్ద్యుతుల్
విలసన్మంజులతాంతగంధముల బల్మిన్ గెల్చు నిశ్వాసముల్
కలకంఠారవకాకలీమధురసోత్కర్షంబులౌ నీనుతుల్
లలితాంగప్రతిమానరేఖలు ననున్ లాలించు టింకెన్నఁడో! 184

ఉ॥ మల్లెలు కొప్పునం దుఱిమి మక్కువ పిక్కటిలంగఁ గల్కి నీ
వల్లన మందయానమున నాడుచు పాడుచు వచ్చి, నీతనూ
వల్లి మదంగయష్టిఁ బెనవైచి, పదింబది ముద్దొసంగి, నా
యుల్లము నూగఁజేసితి వనూనరసాబ్ధితరంగ డోలలన్. 185

ఆ॥ మండుటెండమాడు మ్రాకు తొల్కరియందు
తెప్పిరిల్లి - పిడుగు దెబ్బఁ దిన్న
యటుల నీ వియోగ మెటులనో గడపితి
నే నెటోర్తు నవధిలేని దీని॥ 186

చ॥ సలలిత వైభవంబున నిశా గగనాంగణ చంద్రరేఖపై
తెలతెలమబ్బుచాలు లతితీవ్రరయంబునఁ బర్వులెత్తగా
మలయసమీరపోతము లమందగతిన్ భవదంశుకంబు, ను
జ్జ్వలముగ రేఁపి కప్పిన ప్రసన్న భవన్ముఖమున్ స్మరించెదన్.

ఉ॥ ఓ రమణీయవిగ్రహ, యనుత్తమరాగ రసస్వరూపిణీ
చారుసమృదూక్తిచాతురి విసారి వివేక విశాల ధర్మరా
శీ, రఘువంశకీర్తికలశీ, పురుహూతుని వింటిమాడ్కి శో
భారుచి వెల్వరించిన ప్రభావతి, నిన్ విడి నే రహింతునే? 188

ఉ॥ శోక తమిస్ర సంక్షుభిత శూన్య మనస్కుఁడనై చలింపగా,
నా కనులన్ మెలంగి తరుణద్యుతి తారకగా వెలింగి, ఆ
శా కిరణంబులన్ బఱపి, శాంతిని గూర్తువు సాధుమూర్తి, సీ
తా! కలకాలమున్ నిలుచు తావకనామము పూతమై భువిన్ 189

చ॥ చిలుకల యాకృతిన్ జివురు చేతులఁదీర్చిన వీడియమ్మునన్
బలుకుల క్రముం జొనిపి, నాకిడి పోడిమి మీఱఁ గమ్మనౌ
వలపులు గ్రుమ్మరించి, యనవద్యసుఖాంబుధి నన్నుఁదేల్చు నీ
చెలువము దూరమాయె, నిఁకసేసెడి దేమి జగాన జానకీ! 190

ఉ॥ దండకలోని గౌతమినిఁ దానమొనర్చి, జలార్ద్రచేలవై
కుండిక నింద నీరుఁగొని గోమెసలార సరోజపాణివై
రెండు భుజాల మీఁద వెదవ్రేలఁగ, నీవల పర్ణశాల వై
పండజయాన, వచ్చు నయనామృతదృశ్యము సంస్మరించెదన్.

క॥ మామక మానస మధుపము
నీ మృదుల ప్రణయ కుసుమ నిరుపమ మకరం
దామృతము నాస్వదింపక
సేమమునన్ నిలువఁగలదె? చిరకాలమిటన్. 192

క॥ నీ నును పలువరసలకున్
జానగు నీయాస్యరుచికి సరిమల్లెల నీ
వేనలి నాఘ్రాణించెడి
మానిత భాగ్యంబు నాకు మరలఁ గలుగునే? 193

క॥ చెలి! నీనిద్దపుఁజెక్కుల
ఫలించు తాటంక వజ్ర భాస్వత్కాంతుల్
తిలకించుచు ముద్దాడుచుఁ
గలవలె జీవితము నేను గడపితిని వనిన్. 194

క॥ అరవిచ్చిన యరవిందముఁ
జిఱునగవున విరియు నీదు జిగురుపెదవి నే
నరయుచు దృఙ్మధు లిహముల
నరణ్యవాస శ్రమంబు నడచితి లలనా! 195

ఆ॥ అస్తమించు తరణి యరుణిమ కీడైన
మురువు జిలుకు నీదు ముద్దు మోము
చూడనోడి నాఁడు వీడుకో లినైతి
బాస దప్పినట్టి మోసగాడ. 196

క॥ నీయెదపూగుత్తుల నెడఁ
బాయక వసియించు మధుర వాసనలను నే
దోయిళులనింపి త్రావక
యే యిలలో బ్రదుకఁగలనె? యిభమదగమనా! 197

గీ॥ సుధను జిల్కెడి నీకల్కి సోయగంబు
వెల్గు రథ్యను విడనాడి విరహదహన
ధూమదోష విషణ్ణుండనై మృగాక్షి
చిమ్మ చీఁకటి ఫుంతలోఁ జిక్కుకొంటి. 198

ఉ॥ నీయెడబాటు నాయెదననింద్యము నిస్తుల బంధురాంధకా
రాయతనంబొనర్చె జెలి, యర్మిలి నీసహధర్మిణీత్వసా
ఖ్యాయతమంజులస్మృతు లహర్నిశ ముజ్జ్వలదీపికాకృతిన్
బాయక పాలజాడవలె భాసిలఁజేయును తత్తమిస్రమున్ 199

చ॥ కుసుమములం ధరించి నవ కోమలగాత్రివి నీవు నిల్వ, నీ
వసుమతి యందచందముల వైభవ ముజ్జ్వలితంబు సేయుచున్
బస యిసుమంత లేని వనవాసము మోదమొనర్చె నాఁడు, నా
రసమయరాజ్యభోగము నిరర్థకమైనది నీవు లేమిచేన్. 200

మ॥ విరిబోణీ! వనవాసవేళ మనమా వింధ్యాటవిన్ గ్రీష్మమం
దరుగంగా, వడసోకి శోషిలిన నీ యాయాసమున్ బాప, నే
దరుమూలంబునఁ జేర్చివీచుచును నీ తాపంబుఁ బోకార్పు; నీ
యురవాల్పూపులు నా కుపాయనములై హాయిన్ బ్రసాదింపవే!

మ॥ సతతధ్యాతసతీస్వరూపుఁడయి యా సప్తాశ్వవంశోదితుం
డతి మోహార్తి నిటుల్ గలంగెను బ్రియాహ్లాదైక సంభావనా
స్మృతి శోకాబ్ధి చలత్తరంగ నికరావృత్తి ప్రభిన్నాత్ముఁడై;
ధృతిఁ గోల్పోవుదు రెట్టిధీరులును ధాత్రిన్ బ్రేయసీదూరులై. 202

ఉ॥ నీరము లేని బావిసరణిన్ ద్యుమణిద్యుతి లేని మిన్నునా,
హారములేని అన్నుగళ మట్టుల, లక్ష్మని బాసినట్టి దై
త్యారివిధమ్మునన్ రఘుకులాంబుధిచంద్రుఁడు తల్లడిల్లె, సీ
తా రమణీ వియోగ పరితాప దవాగ్ని శిఖాప్రదగ్ధుఁడై. 203

క॥ అట మౌని యాకుటింటన్
గుటిలాలక సీత కవల కొమరులఁగనె; వి
స్ఫుటమైన తమ్మి వేగునఁ
బటు మధుప ద్వయిని బయలు పఱచిన భంగిన్. 204

క॥ పుష్పాడి తమ మేనులపయిఁ
గప్పుకొనిన తేఁటిజంట, కలువల సెజ్జన్,
దెప్పున వీడిన వడువున
నొప్పిరి; సీతమ్మకొడుకు లుదయించునెడన్. 205

సీ॥ చిన్నారిచూపులం జెన్నైన నగవులం
జెలువుని నును వన్నె చెలువుఁ గాంచి,
వెడద ఫాలంబుల విచ్చిన కన్నుల
విభుని గాంభీర్యంపు వెలుగు నరసి,

పలుకుల మెలకువం బలువరసల జిగి
ప్రాణనాథు సులక్షణాఢ్యతఁ గని,
జానుమోములను అజానుబాహువులందు
శ్రీరామచంద్రురోచిస్సుఁ జూచి,

గీ॥ కట్టుకొన్నతేని కమనీయమౌ రూపుఁ
గన్నసుతులయందుఁ గని; దినాలు
గడపుచుండె సీత కడివెడు కన్నీళ్ళు
గార్చి రేలుఁబవలు కలఁతఁ గుమిలి॥ 206

వ॥ వాల్మీకిమహర్షి కవలకుఁ గుశలవులని పేరులువెట్టి చౌలోపన
యనాది సంస్కారంబులు సలిపె. 207

ఉ॥ ఆమునిసత్తముండు జనకాత్మజసూనుల దివ్యమూర్తులన్
గోమునఁబెంచె, భూపతులకున్ దగువిద్యలు నీతిశాస్త్రముల్
నీమమెలర్ప నేర్పెను లలిన్ మునివేషముఁదాల్పఁజేసి, శ్రీ
రాముని పూర్వగాథలను రక్తిదలర్పఁగ నేర్పె వారికిన్. 208

క॥ చక్కని రామాయణమున్
మక్కువతో మౌని వ్రాసె మధురిమ తొలుఁకన్
మిక్కిలి ప్రీతిని కుశలవు
లక్కథ పఠియించి పాడి రతికుతుకమునన్. 209

గీ॥ సూర్యచంద్రులట్లు సురుచిరతేజస్వు
లైన కవలు పాడి రద్భుతముగ
రామచంద్రమూర్తి రమణీయ చరితంబు
తపసికృతము సకల ధర్మయుతము. 210

గేయము॥

తనయులు పాడెడి తమచరితమ్మును
తనవియోగమున ధవుఁ డడలినగతి
విని జానకి కడు విలపించెను, గను
గొనల బాష్పములు గడువడి జాఱన్. 211

సీ॥ కొనగోట మీటినఁ గనుల వెల్వడు నీరు
చిటపటమన దీపశిఖను వ్రాలి
వెక్కిల నణుపఁ దాఁగుక్కిళ్ళుమింగఁగఁ
బ్రక్కలఁ జలనమ్ము పరిఢవిల్ల,
నిట్టూరుపుల సెగల్ నెఱయఁ; గూర్చిన విరుల్
వసివాడి వత్తలై వన్నెఁదొరఁగ,
బిడ్డ లమ్మాయని పిలిచినన్ బల్కఁ చోఁ
దడఁబడి గొంతు గద్గదికదాల్ప

గీ॥ ఉర్వీపుత్రిక యెద రేఁగుచుండెఁ దీవ్ర
శోకసాగరపుం బొంగుసుడులు, చెలఁగె
నిస్పృహాగ్నికీలలమాల, నెలఁత హృదయ
భార మాపె యవస్థ వెల్వఱచు చుండె॥ 212

వ॥ అంత హేమంతము తారసిల్లె

ఉ॥ నల్లనిమబ్బుపిండు గగనంబును వీడి వినిష్క్రమింపఁగాఁ
జల్లని జారు వానవడి సద్దణఁగెన్ ; నయనోత్సవాకృతుల్
తెల్లని మేఘమాలికలు తీర్పరులాయె దిగంత పంక్తికిన్
జల్లని గాలిదోలె హరుసంబుగ; జంటలఁనిల్పె సెజ్జలన్. 214

మంజరి॥

ఘనుఁడైన తనవిభు కమనీయ గాథఁ
దన కూర్మి తనయులు జనరంజకముగ

మృదుమధురంబుగ మీటి వల్లకిని
బాడంగవిని సీత పరవశించినది,
అతిపుణ్యమూర్తియౌ యాత్మేశు సేవ
తనకింకరాదని తల్లడిల్లినది,
రాసుతుల్ పాడిరి రామాయణమ్ము
అందలిపాత్రల అనుచితమ్ములను
పరికించి గురువును బ్రశ్నింపఁజొచ్చి,
రామౌని వాల్మీకి యతిశాంతమూర్తి
శిష్యద్వయమనీష చిత్తాన మెచ్చి
యుచితమౌ రీతుల నుత్తరంబిచ్చు-
ఒకనాఁడు కుశలవు లుత్సాహమెసఁగ
వాల్మీకి మౌనికి బ్రణతు లొనర్చి
మృదుమధురోక్తుల మేలుగా ననిరి॥ 215

చ॥ గురువర! రామచంద్రుు, రణకోవిదునిన్ దనతండ్రి కోర్కెమై
అరుదగు రాజ్యసౌఖ్యముల నావలఁద్రోచి, వచింపరాని, దు
ర్భరతరకష్టముల్ గుడిచి రావణుఁద్రుంచిన వీరునిన్, ధరా
వరు, దరిసించు కౌతుకము బర్వె నదేటికొ మామనమ్ములన్.216

చ॥ అని కవలాడఁ జిన్నినగ వాననసీమను మొల్కలెత్తఁగా
మునివలికెన్ "సతిన్ జనకపుత్రిని, గర్భవతిన్, మనస్వినిన్
దనుజకరాళకర్షణపు ధాటికి నిల్చిన నీతిమూర్తి, నొ
ప్పునె? వనసీమకున్ బనుప ముద్దియసుద్దినిఁ దానెఱింగియున్

మంజరి॥

అట్టి భూనాయకు నారయ మీరు
వాంఛించు టుచితమా బాలకులార"
అనిన మౌనినిఁ గని యనెఁ గుశుం డపుడు॥ 218

శా॥ స్వామీ! తండ్రిప్రతిష్ఠ నిల్పుటకు రాజ్యంబున్ విసర్జించె, ని
స్సీమస్వీయపరాక్రమంబున వధించెన్ రావణున్ దుష్టునిన్,
ప్రేమారాధనమూర్తి, భార్యను బ్రజా ప్రీత్యర్థ మై వీడె, శ్రీ
రాముం డల్పుఁడె? త్యాగనీతినిధి ధర్మాత్ముండు, వంద్యుండిలన్

ఉ॥ పంతమెలర్పఁ గైక జనపాలపదంబు హరింప, నీర్ష్య యా
వంతయు లేక కష్టముల పాలయి రాముఁడు కానకేగె, ని
శ్చింతముగా, మునీంద్రుల భజించెను, గోఁతులచేత వార్ధికిన్
వంతెనఁగట్టఁజేసె, నిటువంటిమహాత్ముఁడు దర్శనీయుఁడౌ॥220

సీ॥ కవలయుత్కంఠతఁ గమనించి వాల్మీకి
పలికెను "మీరు వీణెల గొని చనుఁ
డీ! యయోధ్యకుఁ బాడుఁడీ నేను నేర్పిన
రామాయణంబును రథ్యలందు,
మీకొనఁగూడును మిథిలేశుజామాత
అనుపమదర్శనం బంతికమున"
ననిన వా రవనిజ యామోదముం బొంది
వాల్మీకి దీవన వడయఁగలిగి

గీ॥ చని రయోధ్యకు, వీథుల శ్రవణపేయ
ముగ, లయసమన్వితంబుగ, ముక్తకంఠ
ముల రసస్ఫోరకంబుగ, మోహనముగ
నాలపించిరి వేడ్క రామాయణమ్ము. 221

గేయము॥
వినుఁడీ! వినుఁడీ! వీను లలరఁగా
శ్రీపతి సముఁడగు భూపతి చరితము
వీరోదంతము విశదమొనర్తుము,
దశరథుఁడను వసుధావరవర్యున

కుదయించిరి సుతు లుత్తమోత్తములు
నరనుతచరితులు నలువురు పుత్రులు
వారలప్రథముఁడు శ్రీరఘురాముఁడు
కురులు కూఁకటినిఁ గూడని వయసున
యాగరక్షణకు నసురులఁ గూల్చెను-
శిలయై యుండిన లలన యహల్యను
చరణ రజస్సున శాపము వాపెను-
ధూర్జటిచాపముఁ ద్రుటిలోఁద్రుంచెను,
వసుధాతనయను పరిణయమాడెను.
కన్నతండ్రి వాక్పాలనకొఱకై
కరగతమైన యఖండరాజ్యమును
విడిచికైకొనెను విపినావాసము-
మునుల సంకటమ్ముల బాపుటకై
కుటిల రాక్షసుల గుంపులఁ గూల్చెను
సతిని హరించిన జాల్మ రావణుని
చించిచీల్చి రక్షించె జగంబును
అవని మెచ్చఁ బట్టాభిషిక్తుఁడై
ప్రజారంజనమె పరమధర్మమని
విశ్వసించి విడనాడెను బత్నిని
వినుఁడీ! వినుఁడీ! వీనులలరఁగా
రసరాజ్యంబగు రామాయణమును
రమణీయమ్మగు రామాయణమును. 222

క॥ ఈ మాధుర్యనినాదము
పామరులను, బండితులను బరితోషాబ్ధిన్
వేమాఱు ముంచి తేల్చెను
బ్రామినుకుల గీము రాముఁ బ్రవషఁజేసెన్. 223

ఉ॥ సీతను జిత్తమందెపుడు జింతన సేయు రఘూద్వహుండు సం
గీతము నాలకించి పలికెన్ దనతమ్మునిఁబిల్చి యుత్కట
ప్రీతిని గూర్చెఁ గాని వివరింపఁగ శక్యముగాని బాధ యే
దో తలసూపె; గాయకులఁదోడ్కొని రమ్మని పంపెఁ దమ్మునిన్224

గేయము॥

అన్నయానతినూని గుణసంపన్నుఁడగు సౌమిత్రి చనికనెఁ
జిన్నిబాలుర మునికుమారుల సన్నుతాకృతులన్- 225

వ॥ అప్పుడు 226

ఉ॥ రూపము లారయన్ రఘువరున్ దలపించెడు, వీరిచూపులన్
దీపితమాయె మావదినె తేజము, చొక్కపు మేని నిగ్గులో
కాపురమున్న వేకమయి కన్నుల కింపొనఁగూర్చు భూమిపు
త్రీ పరిపూత రాఘవ వరిష్ఠసముజ్జ్వల మంగళాకృతుల్. 227

వ॥ అని సౌమిత్రి భావించి, వారితో నిట్లనియె 228

గీ॥ ముని కొమరులార! శ్రీరామమూర్తి రుచిర
మైన మీకంఠ నిస్వనం బాలకించి
మిమ్ముఁ గొనిర మ్మటంచు బంపించినాఁడు
నన్ను మీచెంత కో చిన్ని యన్నలార! 229

గీ॥ అని పలుక విని యవనిజ తనయు లప్పు
డనుగమించిరి రామానుజుని, రఘూత్త
ముని పవిత్రస్వరూప దర్శన విభూతిఁ
గాంచఁ గలిగిరి, కన్నుల కఱవుఁదీఱ. 230

సీ॥ నింగి రంగారు వినీల కాంతుల రీతి
నెమ్మేని శోభల నెగడు వాఁడు,
కలకల నవ్వెడి కల్వపూవుల లీల
కమనీయ రుచులీను కనుల వాఁడు,

చలువల వెదఁజల్లు చందమామను బోలు
చిఱునవ్వు కాంతులఁ బఱపు వాఁడు,
చీఁకట్లఁ బోకార్చు లోకబాంధవు భంగి
దివ్యతేజఃస్ఫూర్తిఁ దివురు వాఁడు,

గీ॥ విశ్వవిశ్వంభరను జుట్టి వెలయు జలధిఁ
బోలు మోహన గంభీరముద్ర వాఁడు,
పరమపురుషుఁ డితండు మా భాగ్యవశత
గంటిమని రామదేవునిఁ గనిరి కవలు॥ 231

గేయము॥
విస్మితాకృతులైన కవలను
సస్మితంబుగ గాంచి రాముం
డస్మదీయ కథా విధానము
నాలపింపుఁ డనెన్. 232

వ॥ అంత వారిట్లు పాడఁదొడంగిరి. 233

గేయము॥
వాసిఁగాంచిన కోసలంబును
బాసఁదప్పని భానుకులజుఁడు.
దశరథుఁడు పాలించు చుండెను-
కన్నబిడ్డలులేని యాతఁడు
జన్నములఁ గావించి మించెను-
పూర్వపుణ్యపు గరిమ కతమున
పూరుషోత్తముఁ డుద్భవించెను
రాముఁడై కౌసల్య కడుపున- 234

శ్రీరాముఁడు॥
ఇది చిన్ననాటిసంగతి అందరెఱిఁగినదే!
వనవాసవృత్తాంతమును గానమొనర్పుఁడు. 235

గేయము॥

తీయమామిడి గున్నగుబురుల
కోయిలలు గొంతెత్తిపాడన్
సోయగపు మిసమిసల పసతో
సుదతి విహరించెన్. 236

పురుషులకు మోహంబుఁగొల్పెడి
సురుచిరాంగుని రాముఁగని తన
కామితము నెఱిగించి సీతా
భామపై నురిమెన్. 237

తగదు తగదని తగవు నుడివిన
సుగుణధాముని రామచంద్రుని
వలపునన్ శూర్పణఖ పైకొని
కలియఁ గాంక్షించెన్ 238

వలపుఁ జిమ్ముచుఁ గలియుఁగోరెడి
తలిదుఁబోఁడినిఁ దన్నువలదను
కతము సీతని ఆమె నప్పుడె
హతము గావించన్ 239

పంతమున సీతమ్మపైఁబడు
వింత జంతను జుప్పనాతిని
మిత్రకులమణి తమ్ముఁడగు సౌ
మిత్రి శిక్షించెన్ 240

క॥ అవమానజన్య మన్యువు
దవశిఖివలె దేహమంత దగ్ధమొనర్పన్
రవరవ రక్కసి పఱవన్
భవపదహత శమన వాహనముఁ బురుడించెన్. 241

సౌమిత్రి : బాలకులారా! మఱియొక ఘట్టమును గానము సేయుఁడు.

కుశలవులు: గేయము॥

నీలాంబరమునఁ గాలాభ్రముపై
మెఱసెఁడు శశివలెఁ దరువుల చాయన్
నల్లని మోమునఁ దెల్ల ముంగురులు
సొబగులు నెగడఁగ శబరి కనంబడె; 243

రమణీయ రూపుల రామలక్ష్మణుల
వెడద కన్నులు విప్పి వీక్షించె శబరి
వారిదము జడివాన వర్షించినట్లు
లానందబాష్పము లామె వర్షించె
నాకాంక్షతోఁ గూయు కేకియో యనఁగ
గొంతెత్తి రాసుతులఁ గోర్కెమైఁ బిలిచె 244

పాల సంద్రము వీడి పాప సెజ్జను బాసి
తరలి వచ్చితివ కాంతారాంతరము జేర
దిరిసెన పూవులన్ దొరయు నీచరణముల్
రామయ్య మిగుల గాసిల్లియుండును గాన
ఒత్తెదను మెల్లఁగా నోజగద్రక్షకా! 245

కన్నుఁదమ్ములు రెండు కళదప్పి యున్నయవి
తనువల్లి యంతయును వసివాడి యున్నయది. 246

ఒడలు సేద దీర మీర
లిచట విశ్రమింపుడయ్యా!
చిగురుటాకు శయ్య నిపుడె
చిత్త మలర గూర్చినాను. 247

జలజలః బారెడి సెలయే రిదియే
తాపము దీరన్ తాన మాడుఁడీ!
ఆఁకలి దీరఁగ నడవి పండ్లిడుదు
నారగింపుఁడీ యరమర మానుఁడు. 248

మంజరి॥
అలసటఁదీర నాయర్క వంశజులు
జాల్వారు సెలయేట జలకంబులాడి
చిగురాకు మెత్తనుజేర; నాశబరి.
పండ్లను రుచిచూచి భక్షింప నిచ్చి
వేర్వేరు చవులను విశదీకరించె॥ 249

శబరిః గేయము॥
పచ్చని యీపండిదిగో సామీ!
మచ్చిక మెయి మీరారగింపుఁడీ! 250

బంగరు రంగీను గుజ్జు
పసందైన దిది తినుఁడీ! 251

చిలుక కొఱికిన జామపండిది
పొలుపుగా మీరిప్డు మెసవుఁడు
దోర మాగిన దోసపండిది
యేరితెచ్చితి నినకులేశా! 252

కొండమీఁది వెలగపండ్లు
పండిన నాగజెముడు పండ్లు
కండఁదీసి తెచ్చినాను
దండిగ తినుఁడయ్యా మీరు!
కాశీరత్నా లివియే
దోసిళ్ళను దెచ్చినాను,

ఇప్ప పూల గుత్తులివే
చప్పరించి మ్రింగ వలయు॥ 253

క॥ తినఁదగిన పనసతొనలివి
కొనగోటన్ దీసి లేత కొబ్బరి తినుడీ
వనజముల తేనె గ్రోలుడు
తనివిని రాకొమరులార; తాపము దీఱున్. 254

క॥ ఈరీతి నమిత భక్తిని
వారల సేవించి శబరి వైకుంఠంబున్
జేరెను దేహమును విడిచి;
శ్రీరామునిఁగొలుచు వారు జీవన్ముక్తుల్. 255

వ॥ కవల గానంబు విని శ్రీరాముం డిట్లు తనలోఁ దలంచెను. 256

చ॥ కవల సురూపరేఖలను గ్రాలెడి మాధురి పూర్వమెన్నఁడో
చవిఁ గొనినట్లు నాదు మదిసంబర మందెను, వీరి పల్కులం
దవతరణంబు గాంచె జనకాత్మజ సార మనోజ్ఞభాషణల్
భువి నిటువంటి పోలికలు పుట్టునె? యచ్చెరువాయె నామదిన్.

ఉ॥ మండెడు వేఁడిగాల్పులకు మాఁడెడి మానిసి మంచినీటితో
నిండిన యేటిపాయఁ గని నిర్భరమోదము నొందు కైవడిన్
గుండెలు పిండు నావలపుఁ గుందుశమించె, వితాకుడిందెఁ బూ
చెండులఁబోలు సోయగపుఁ జిన్నికుమారుల దండనుండఁగన్.

శ్రీరాముడు :
"మునిబాలకులారా! రండు నాచెంగటకు"
(బాలురు చెంతకువత్తురు, వారిని శ్రీరాముఁడు అక్కునకు
గదియించుకొని హాయిననుభవించును) 259

ఉ॥ ఇన్ని దినాల నుండి హృదయేశ్వరి గాత్రసుఖంబు వాసి, ఆ
పన్నుఁడనైన నాకు మునిబాలుర కౌఁగిలి హాయిఁగూర్చె, ని
క్లైన్నఁగరానిమైత్రి జనియింపఁగ నేమికతంబొ! వీరు నా
పున్నెపుఁబంటలైన తలపున్ గలిగించె నిదేమి చోద్యమో. 260

వ॥ నాయనలారా! మీకీపాట నెవ్వరునేర్పిరి. మీతలిదండ్రులెవ్వరు?

కుశలవులు :

మేము వాల్మీకిమునివరేణ్యులయొద్ద నీరామాయణగాథ నేర్చు
కొంటిమి. మాకు తల్లిదర్శనమేకాని, తండ్రిదర్శన మిప్పటిక
లేదాయె. 262

శ్రీరాముడు :

మ॥ అనుపమవర్ణనోజ్జ్వలమునై, రుచిరోక్తుల కాలవాలమై,
జనహిత సాధువృత్త విలసన్మనుమార్గ మహానుభావమై,
యనితరసాధ్యమై రసమయంబయి, యుండువిధానమొప్పఁ బొ
ల్పునఁ గృతిఁదీర్చినట్టి మునిలోకనుతున్ గన నుత్సహించితిన్.

గేయము॥

అన్న యానతి విని యనుజుండు సౌమిత్రి
మఱునాడు వేగున మౌన్యాశ్రమముఁ జేర
యత్నంబుఁ గావించె యానముల్ చేకూర్చె
సరగున రాముఁడు సౌమిత్రి కవలు
వెంటరా వాల్మీకి వీటికిన్ జనియె
భరత శత్రుఘ్నులు పరివారయుతు లౌచు
వెనువెంట నేగగా వీరేగుట నెఱింగి
అనుగమించి రయోధ్య యందలి ప్రజలు
ఉదయించు భానుని ఉజ్జ్వల మూర్తిని
పరికించి పార్థివుఁడు పలికె సౌమిత్రితో. 264

శ్రీరాముడు : లక్ష్మణా! 265

ఉ॥ చీకటి చీర జార నునుసిగ్గున నిల్చిన భూవధూటికిన్
ప్రాకట కాంతితంతువుల బంగరుటంచుల యంబరంబు వే
జోక దలిర్ప నిచ్చినటు; సూర్యుఁడు నిర్మల కాంతిరేఖలన్
లోకములెల్ల గప్పితనరున్ దన నామము సార్థకంబుగాన్. 266

ఉ॥ ఈ మహి నిండియున్న తమమింకెడు నట్లొనరించు రీతిగాఁ
దామరపూల తంపరల దాగిన లక్ష్మిని వెల్వరింపగాఁ
గోమల కాంతులన్ గమల కుట్మలముల్ వికసింపఁ జేయ శో
భామల దివ్యమౌ కిసల యారుణ సూర్యకరాళి చూపడున్. 267

క॥ సెలయేటన్ బసుపాడెడి
జలజాంగన ప్రొద్దుపొడుపు చల్లనిగాలిన్
దలయూపుచు సవితను గని
మిళింద రుతములను బాడు మేల్ గీతములన్. 268

వ॥ సౌమిత్రితో రాముండిటుల ప్రకృతివైచిత్రిన్‌గూర్చి ముచ్చ
టించుచు పరివారముతో వాల్మీకి ఆశ్రమముఁ జేరెను. 269

ప్రభువృత్తము :

ప్రముదితుఁడయి ముని రఘురామ సుద
ర్శన భాగ్యమునం బలికెన్
"దమమునఁ దపమును దమిఁ జేసెడి ప
ద్మము భాస్కరు విస్తృత తే
జమున మనము వికసన మొందఁ సుహా
స శుభాననయైె నటు లా
శ్రమము కళకళ నెసఁగె నీ
వినయోజ్వల దృక్ప్రభ చేతఁ బ్రభూ!" 270

గేయము॥

అరుదగు పలుకుల నాహ్వానించిన
మునితో రఘువరుఁ డనియె నిటుల్. 271

చ॥ మునివర! యీకుమారకులు మోహనమూర్తులు, నాచరిత్ర మీ
రనుపమలీలఁ దీర్చినది హాయిఁగఁ బాడి రయోధ్యరథ్యలన్;
విని, భవదీయమూర్తిఁ గని వేడ్కఁ గృతజ్ఞతఁ దెల్పునట్టి కో
ర్కె నిటకు వచ్చినాఁడ, తిలకింపఁగ బాలుర తల్లిదండ్రులన్.

వాల్మీకి : శ్రీరామచంద్రా! 273

ఉ॥ నీకథ వ్రాసినాఁడ నళినీభవ సూనుఁడు మెచ్చిచెప్పగా;
వాకొనరాని వేదనల పాలయి జానకి జాహ్నవీ నదిన్
దూకఁదలంప గర్భవతి, తొయ్యలి కూరట సంఘటించి నే
నా కమలాక్షిఁ దెచ్చితి మదంతిక సీమకుఁ జేర్చి కాచితిన్. 274

క॥ ఆరసి చూడుము స్వామీ!
సారస నేత్రులను గవల, సౌమ్యాకృతులన్;
వీరే నీకొమరులు నీ
తారామాఖని వినిర్గత మణి వరంబుల్. 275

వ॥ శ్రీరామచంద్రా నీఅర్ధాంగి 276

క॥ పంచేంద్రియములు నీపై
నుంచి బ్రదుకు నెటులో యీడ్చుచున్నది కన్నీ
ర్నించుచు, మించిన వగతో;
మంచున ససిఁదొఱఁగినట్టి మల్లియ లీలన్. 277

చ॥ తన దయలేని వర్తనము దారను జంపెనటన్న నెంజిలిన్
వనరెడి రామచంద్రునకు వాకొనరాని ముదంబుఁగూర్చె నా
ముని పలుకుల్; నిరుత్తుఁడయి మోహముపెంపునఁ గన్నబిడ్డలన్
దనివినిఁ గ్రుచ్చెఁ గౌఁగిట నుదగ్ర వియోగజ తాపమారఁగన్.

క॥ విలువీడిన నీలోత్పల
ములవలెఁ గవలు పరువెత్తి భూమిజ కెలమిన్
దెలిపిరి, తల్లీ! మాపిత
నిలిచెను తాతయ్యచెంత నినుఁ గాంచుటకై. 279

క॥ ఇరుకరముల నాకొమరులు
పరమ ప్రీతిని గ్రహించి పతి చెంగటకున్
దరళాక్షినిఁ గొని తెచ్చిరి
హరువున హవ్యము వహించు నగ్నులవోలెన్. 280

ఉ॥ రాముని యంతరంగమున రాజిలె దౌహృద లక్షణాతిర
మ్యామల మైథిలీ మధుర హాస వికస్వర కాంతిరేఖ, నే
డా మహిళా శిరోమణి మహస్సును గాంచఁగ నిల్చిచూచె శ్రీ
రాముఁడు, శోకతాపహతిర మ్యత బాసిన జానకిన్ గృశన్. 281

చ॥ అలకలు వెల్లనాయె, శరదాగమనంబున నీలి నింగిపైఁ
బలుచనయైన మబ్బువలెఁ వాతెర రక్తిమ మ్లానమాయెఁ, జెం
గలువలఁబోల్ కనుల్ సహజకాంతిఁదొఱంగె, మరాళయానమం
దలి చెలువంబు బాసె వసుధాత్మజకుం బతిఁ బాసియుండుటన్.

ఉ॥ మ్రేగిన కాఱుమేఘముల మేఖలఁదాల్చిన చంద్రరేఖయై
తీగెలు మేళవించియు శ్రుతిన్ వెలయింపఁగలేని వీణయై
రాగములేని భావమధురంబగు గీతికయై హృదీశు సం
యోగములేక నాతి మధురోజ్జ్వలమై సతి దోచె నయ్యెడన్. 283

చ॥ జలజలరాలు ముత్తెముల చాలువలెన్ రఘురాము దేవి క
న్గొలకులనుండి బాష్పఝరి గొబ్బున వెల్వడి భానురశ్మిచే
మిలమిల సప్తవర్ణముల మేల్మిని దిక్కులఁ బర్వఁజేయ, వ
న్నెల రతనాలహారమును నిల్పిన రీతిని దోచె నయ్యెడన్. 284

చ॥ చెలమలయందు నీరములు చిప్పిలుచొప్పున సీతకన్నులన్
జలములు నిండు- రాఘవునిఁ జక్కగఁ గాంచఁగ నెన్నిమార్లు,ఱె
ప్పల నెటు లప్పళించినను వచ్చెడి యశ్రులు నిండిపార్లెడున్
దలఁపుల నున్న స్వామి కనుఁదమ్ముల నిల్వఁ డదేమి చోద్యమో!

మంజరి॥
రాతిబొమ్మ రీతి రాముఁడు రమణి
చేతనారహితులై చేడ్పడి నిలువ
పౌరులు పరికించి పరితాపమొంది
ఈభంగి వచియించి రేకకంఠమున 286

చ॥ ఒక్కని కైపుఁగూతలకు నుమ్మలికంగొని పుణ్యమూర్తికిన్
దక్కువసేయఁగాఁ దగునె? తక్కిన పౌరులు లెక్కకెక్కరా!
మక్కువ మాకు మీయెడల మందరపర్వతమంత కల్గు; నే
డిక్కమలయతాక్షిని గ్రహింపుఁడు, కూర్పుఁడు మాకుమోదమున్

క॥ ఇట్టులఁ బల్కిన పౌరుల
నిట్టలమగు నుడులు దెసలు నిండఁగ సతిఁ జే
పట్టెను; నెనరున రాముఁడు
చిట్టి కుమారులను గ్రుచ్చి చేకొనెఁ బ్రీతిన్. 288

క॥ తిమిరావృత నత కమలిని
విమలార్కద్యుతులు సోకి విరిసిన లీలన్
రమణుం గూడిన జానకి
ప్రమద పరీతాత్మయాయెఁ బత్రిదక్షతిచేన్. 289

మ॥ సవభంగాసురహారి, హారి సుషమా సంపత్కలా సోమ, సో
మవధూ సంస్తుతగోత్ర, గోత్రరిపుసంమాన్య ప్రభాధీర, ధీ
ర విశేషస్తుత శౌర్య, శౌర్యభవ ధైర్య చ్ఛేది బాహుక్రియా
ద్రవిణోత్తంభిత రావణ ప్రమథన ప్రావీణ్య, రామప్రభూ! 290

## ఫలశ్రుతి

ఉ॥ మున్ను ఋషుల్ కవుల్ మనుజబుద్ధిని మంచి యలంకరించు న
ట్లెన్నిన సచ్చరిత్రమిది; యింపుగఁ గూర్చితి; దీని నెవ్వరై
నన్నెనరూని విన్నను మనస్సున నిల్పిన; వారి కబ్బు, నే
బన్నములందు సత్పథము బాయని ప్రజ్ఞ, మనోదృఢత్వమున్. 291

మ॥ విలసద్రామ కథా సుధాంబు నిలయా విర్భూత సేవామృతో
జ్జ్వల పానాభిరతుండ, సారకవితా వ్యాసక్తచిత్తుండ, ని
ర్మల లక్ష్మీప్రియ దుగ్గిశెట్టి నరసింహశ్రేష్ఠికిన్ బుత్రుడన్
లలితాలోకన లోలుడన్ రమణుడన్ లావణ్య లాలిత్యమౌ
తొలి రామాయణమున్ రచించితి సుధీ స్తోమస్తుతి స్ఫారమున్
మలి రామాయణ కావ్యమున్ సరస సన్మాన్యంబు నేవ్రాసితిన్
దళుకుల్ దాల్చిన సంస్కృతాద్భుత పదార్థ ప్రాభవోపేతమున్
బెళుకుల్ చిమ్మెడి మా తెనుంగు నుడులన్ బెంపారు
వాక్పూరమున్. 292

మ॥ తగ భవ్యోత్తర రాఘవేశ్వర చరిత్రంబున్ భవాంభోధి దా
టగనే వ్రాసితి, దుగ్గిశెట్టి రమణుండన్, రామభక్తుండ, భ
ద్రగుడన్ సింహపురీనివాసుడ రసోద్యత్ పూర్వరామాయణ
ప్రగుణాఢ్యుండ నృసింహశెట్టి సుతుడన్ బ్రాహ్మీ కృపాపాత్రుడన్

ఓం తత్ సత్



(0)



## దుగ్గిశెట్టి వేంకటరమణయ్య

వెంకటరామాపురం, నెల్లూరు.

జననం :-

ఏప్రెల్ 1925 - దామరమడుగు,
కోవూరు తాలూకా, నెల్లూరు జిల్లా.

తల్లిదండ్రులు :-

దుగ్గిశెట్టి లక్ష్మితాయారమ్మ - నరసింహంశెట్టి.

విద్యాభ్యాసము :-

బుచ్చిరెడ్డిపాళెం - హైస్కూలు
నెల్లూరు - వి. ఆర్. కాలేజి
మద్రాసు - లయోలా కాలేజి.
C, A. Apprentice - Fraser & Ross - Madras.

రచనలు :-

సుందరకాండము 1971
రమణీయ రామాయణము 1973
రమణీయ రామాయణము - ఉత్తర కాండము 1975
భావవీచికలు
సతీస్మృతి
Audilakshmi
మబ్బుకబ్బము
కల్హారమాల
} 1987

**Price : Rs. 20/-**